UNIVERSITY OF MADRAS.

*Oriental Research Institute*

*Telugu Department Publications No. 3.*

# VISHNUMAYANATAKAM

BY

**RADHAMADHAVA**

**CHINTALAPUDI YALLANARYA**

EDITED BY

K. RAMAKRISHNIAH, M.A.,

*Senior Lecturer and Head of the Department of Telugu,*
*Oriental Research Institute,*
*University of Madras.*



1934.

**PRICE:** **Rs. 2-8-0.**

ప్రాచ్యపరిశోధనాలయాంధ్రశాఖా ప్రచురణములు. 3.

# విష్ణుమాయానాటకము.

రాధామాధవ

చింతలపూడి యల్లనార్యప్రణీతము.

సంపాదకుఁడు

కోరాడ - రామకృష్ణయ్య. ఎం.ఏ.,

ఆంధ్రోపన్యాసకుఁడు, ప్రాచ్యపరిశోధనాలయము, విశ్వకళాపరిషత్తు,

మద్రాసు.



విశ్వకళాపరిషత్తు, మద్రాసు.

---

1934

వెల.] [రూ. 2-8-0.

# ఉపోద్ఘాతము

"విష్ణుమాయానాటక" మనఁ బరగునది షడాశ్వాసములుగల చక్కని ప్రబంధము. పేరునకు నాటకమే కాని వాస్తవముగా నిది దృశ్యప్రబంధము కాదు. విష్ణునిమాయాప్రభావప్రదర్శనరీతులను వర్ణించునదిగావున నిది విష్ణుమాయానాటకమైనది. ఈ ప్రపంచమునంతను బ్రహ్మరుద్రామరాదుల నతిక్రమించిన యనిర్వచనీయ ప్రభావముగల యొక మహాశక్తి, విష్ణుమాయ, నడిపించుచున్నదనియు నద్దాని నేకాంత విష్ణుభక్తిచేఁ గొలిచినవారుగాని ముక్తిఁ బడయ లేరనియుఁ బ్రతిపాదించుటయే దీని ముఖ్యోద్దేశము. దీనిని రచించినవాఁడు 'రాధామాధవ' బిరుదాంకితుఁడగు చింతలపూఁడి యెల్లనార్యుఁడు. 'రాధామాధవ'మను ప్రబంధమును రచించి యద్దానిమూలమున శ్రీకృష్ణదేవరాయల మెప్పువడయఁగల్గుటంజేసి యీతని కీ'రాధామాధవ'బిరుదనామము లభించినది.

శా. రాధామాధవ మచ్యుతాంకితముగాఁ బ్రౌఢక్రియం జెప్పి త
న్మాధుర్యంబునఁ గృష్ణరాయవిభుఁ గర్ణాటేశు మెప్పించి, నా
నాధాతృప్రతిమానసత్కవులలోనన్ భూషణశ్రేణితో
రాధామాధవ నామమందిన జగత్ప్రఖ్యాత చారిత్రుఁడన్."

అని యీతఁడు తన రాధామాధవ ప్రబంధపీఠికలోఁ జెప్పుకొనియున్నాఁడు. రాయల యాస్థానమున మెప్పొందిన విద్వత్కవీశ్వరులలో నొక్కఁడై, యష్టదిగ్గజములని ప్రసిద్ధిగాంచినకవులతో సమానముగ నెన్నఁదగిన మహిమాతిశయము గలవాఁడైనను నీతని గ్రంథము లింతకాలమువఱకు నాంధ్రలోకమునకు లభించి యుండలేదు.

**రాధామాధవకవి కాలము:**—రాయల యవసానకాలమున నీ రాధామాధవకవి యాతని యాస్థానమును జేరియుండుటచేఁ గాఁబోలు నాతఁడు తదాస్థాన కవిగాఁ బరిగణింపఁబడ లేదు. ఈతఁ డాయాస్థానమును బ్రవేశించిన సందర్భమును గూర్చి మాత్రమే కవుల చరిత్రమూలముగా నాంధ్రలోక మింతవఱకెఱింగి యున్నది. ఈతని గ్రంథములనుగూర్చిన ప్రశంసయేమియుఁ గవుల చరిత్రయందు గానరాదు. రాయల యాస్థానమునకు వచ్చిన విద్వత్కవులను బరీక్షించుటకై యాంధ్రకవితాపితామహుఁడే నియమింపఁబడుచువచ్చెననియు, నాతఁడు వారికిఁ గొన్ని సమస్యలనిచ్చి, వారు వానిని పూరించిన రీతినిబట్టి వారి సామర్థ్యమును నిర్ణయించుచుండెననియు, నట్లు పెద్దనార్యునిచే రాయల యాస్థానమునఁ బరీ

క్షింపఁబడినవారిలో నెల్లనార్యుఁ డొకఁ డనియుఁ జెప్పుదురు. ఈతనిఁ బరీక్షించుటకై పెద్దనార్యుఁడు నగరు, తగరు, తొగరు, పగరు, అనువానిని ప్రాసస్థానములందుంచి రామాయణపరముగాఁ బద్యమును జెప్పుమనెనఁట. వెంటనే యతఁడు,

చ. 'నగరు పగాయె, నింక విపినంబుల కేఁగుఁడు, రాజ్యకాంక్షకుం
దగరు కుమారులార'యని తల్లి పగ ల్విగులంగఁ దోఁపఁగాఁ
దొగరున రక్తఁ గట్టి మదిఁ దోఁచక గద్గదఖిన్నకంఠుఁడై
పగరుచుచున్నఁ జూచి రఘువంశవరేణ్యుఁడు తల్లి కిట్లనున్.

అనుపద్యమును చెప్పెనఁట. దీనిని విని సంతసించి యాప్రాసములనే ప్రయోగించి భారత భాగవతపరముగాఁగూడఁ బద్యములను జెప్పుమనఁగా నాతఁ డీక్రింది రెండుపద్యములను జెప్పెనఁట.

చ. తొగరుచి కన్నుదోయిఁ గడుఁ దోఁచఁగఁ గర్ణుఁడు భీమసేనుపైఁ
దగరు ధరాధరంబుపయిఁ దాఁకినభంగినిఁ దాఁకి నొచ్చి తా
పగరుచుచుం బెనం బరుగువాఁడిన నచ్చటి రాజలోకముల్
నగరు సుయోధనాజ్ఞ మది నాటుటఁ జేసి ధరాతలేశ్వరా.

చ. పగరుపుమాత్రమే పరుఁడు పశ్యుఁడు కాఁడు సఖిసఖత్వ మె
న్నగరుడవాహనుంపు మము నాఁ డటు డించుటయెల్ల నుద్ధవా,
తగరని కాక మోహపులతాతనువైన విడంగఁజూతురే
తొగరుచి యోషధీశునకుఁ దోఁపఁగఁ జేయునె పీడనాడఁగన్.

ఇట్లు పరీక్షితుండై పరీక్షాధికారిని మెప్పించిన యచిరకాలముననే యీతఁడు "రాధామాధవకావ్యము" నచ్యుతాంకితముగాఁ జెప్పి తన్మాధుర్యముచేఁ గృష్ణరాయల నాతనియాస్థానమందలి నానాధాత్రప్రతిమానసత్కవుల సమక్షమున మెప్పించి, యాతనివలన భూషణశ్రేణితోఁగూడ 'రాధామాధవ' బిరుదమును బొందినాఁడు. ఇది యంతయుఁ గృష్ణరాయల యంతిమదివసములలో జరిగినదై యుండవలయును. ఈతఁడు రాయల యాస్థానకవులలో నొకఁడను ప్రసిద్ధి కలుగక పోవుటచేతను, ఈతని రెండవ గ్రంథముగాఁ గ్రహింపఁదగియున్న "తారకబ్రహ్మరాజీయము" అచ్యుతదేవరాయల మంత్రివర్గములోఁ జేరిన నంజ తిమ్మయమంత్రి ప్రోత్సాహముచే రచింపఁ బడియుండుటచేతను ఈతఁడు కృష్ణరాయల యవసానకాలమునను, అచ్యుతరాయల రాజ్యారంభకాలమునను గ్రంథరచనము చేయుచునుండినటులు నిశ్చయింపవచ్చును.

తారకబ్రహ్మరాజీయమున నీతఁ డచ్యుతదేవరాయల నీక్రింది పద్యములఁ గీర్తించియున్నాఁడు.

సీ. తనమహోదీప్తిప్రతాపబింబంబు దా
దీపించు భానుమద్బింబమనఁగఁ
దనబాహుదండంబు ధరణిమండలమెత్తు
పన్నగశాయి విభ్రాంతిఁగొలుపఁ
దన(శ)కరాంబుజ కల్పతరు వంగుళులుగాఁగ
పంచశాఖాఖ్యమై ఫలములొసఁగఁ
దన శంఖచక్రాంకితంబైన రూపంబు
హరిమూర్తి నచ్చొత్తినట్లు తెలుపఁ
తే. దనదుబ్రహ్మాండ వీథి కాంకిత (ర్బ)బహిర్వి
హారిసత్కీర్తి నిర్వార సౌర(భ)మున
మూరురాయర గండాంక మోహనుండు
రాజదేవేంద్రుఁ డచ్యుతరాయవిభుఁడు.

సీ. పద్మాప్తరుచి మించు పద్మరాగపు రవి
గూర్చినపతక మక్కునవెలుంగఁ
బసిఁడిబ్రాఁతలఁబచ్చఁ బట్టు పచ్చడ మొన
పరివన్నెమై కటిఁబరిఢవిల్ల
బహురత్నదీప్తులు ప్రసరించు మేలుకు
ళ్లా కిరీటముకంటె జోకగాఁగఁ
గస్తూరికా తిలకము పుష్పమాల్యంబు
మించుతుమ్మెదల కామెత యొనర్ప
తే. దండ నుత్కళ యవనాంధ్రధరణినాథు
లర్థి సేవింప రత్నసింహాసనమునఁ
గొలువు గూర్చుండు కృష్ణుని చెలువుమీఱి
రాయదేవేంద్రుఁ డచ్యుతరాయవిభుఁడు.

ఇట్టి యచ్యుతరాయలయొద్ద నంజతిమ్మయ గ్రంథాసాగ లేఖకుఁడై మంత్రి
రత్నమై యుండెనఁట.

క. ఆరాయలకృప గ్రంథా (గందా)
(చా) సారము వ్రాయుచును గీర్తి సంపాదించ్చు
ధీరగుణాఢ్యుఁడు కందా
సారమునంజరుసు తిమ్మ సచివుఁడు సిరులన్.

చ. తిరువళి(ది) గెల్చి, పాంశ్యసరదేవునిఁ బట్టముఁగట్టి, యుత్కళే
శ్వరుఁ గరుణించి, మ్రొక్కిన సవాయికిఁ దా నభయం బొసంగి, వెం

పరుదుగఁ గీర్తి చేకొనిన యచ్యుతరాయల మంత్రిరత్నమై
తిరమునను‌న్న నంజవిభు తిమ్మరుసుం దగుఁ బ్రస్తుతింపగన్.

వ. అట్టి యీనంజ తిమ్మయమంత్రి యొకనాఁడు అచ్యుతరాయల కొలువుచేసి వచ్చి నిజనివాసభాసుర చంద్రశాలాప్రాంగణమణిమంటపంబున, విజయనగర రాజధానింగల బంధువర్గంబును, విద్వత్కవీంద్రులును, వందిమాగధ గాయక వారకామినీనికరంబును సముచితప్రకారంబున సేవింప సుఖగోష్ఠిం బ్రవర్తింపుచు, నిజస్వామియగు నచ్యుతరాయలు ప్రతిసంవత్సరంబు శ్రీవేంకటేశ్వరునకు సత్కావ్యప్రబంధపుష్పాంజలి సమర్పించుచుఁ గీర్తిసుకృతంబులు నిర్వహించుకొనుచున్నవాఁడు. ఆదనుమతంబున నవ్విభునకు నాకు నభ్యుదయ పరంపరాభివృద్ధియుఁ జతుర్విధ పురుషార్థసిద్ధియుఁ గలుగునట్లుగా నాయిష్టదైవతం బగు శ్రీరామవిభునకు నంకితంబుగా నొక్క పుణ్యప్రబంధంబుఁ జెప్పింపవలయు నని సుహృజ్జనంబుతో నూహించి.

క. రాధారుణాధరో రుప
యోధరకాశ్మీర వర (రస) రసోదయకవితా
మాధుర్యధుర్యు నన్నుఁ
రాధామాధవుని సుకవిరత్నముఁ బిలికెన్.

గీ. పరమహితుఁడవు తారక బ్రహ్మరాజ
మను ప్రబంధంబు నీ చెప్పినది మదాత్మ
నాయకుండగు శ్రీరఘునాయకునకు
నంకితము సేయుమయ్య నా కభిమతముగ.

ఇట్లు నంజతిమ్మయ స్వామికార్యమును, తనహితమును గోరి పలుకుటయు "నీకు నంకిత మొనర్పఁదలంచిన వాఁడ బంధుసంభావన" నని చెప్పి, "యతివరేణ్యుఁడు నారాయణాశ్రమి నుడివిన తారకబ్రహ్మరాజీయము"ను దెనుఁగునఁజెప్పిన దాని నాతని కిష్టముగ నెల్లనార్యుఁడు బ్రహ్మమయుండగు "రామచంద్ర ధాత్రీవర మాళి" కంకితము చేసెను.

దీనినిఁ బట్టి యచ్యుతదేవరాయలు ప్రతిసంవత్సరము నొక సత్కావ్య ప్రబంధమును జెప్పించి తిరుపతివేంకటేశ్వరునకు సమర్పించుచుండెడు వాఁడని తెలియవచ్చుచున్నది.

కృష్ణదేవరాయలయనంతరము రాధామాధవకవి అచ్యుతదేవరాయల యొద్ద మంత్రి వరుఁడై యున్న నంజరసుతిమ్మయ్యయొద్దఁ జేరి యాతని వేడికోలునఁ దానంతకు మున్నే రచించియున్న తారకబ్రహ్మరాజీయమును శ్రీరఘునాయకున కంకిత మొనర్చి యాతని యభీష్టమును నెరవేర్చెను.

ఈ రాధామాధవకవిచే రచింపఁబడిన ప్రబంధములలో నుతియొకటి యీ విష్ణుమాయానాటకము. ఉపలబ్ధములయిన యీ గ్రంథము మాతృకల రెండిటను కృత్యాది పద్యము లేమియు గానరావు, ఈ క్రింది తేఁటగీతితో గ్రంథము ప్రారంభింపఁబడినది.

గీ. భాగవత ముఖ్యుఁడగు శుకబ్రహ్మచేత
భాగవత సత్కథాపర బ్రహ్మవిద్య
యెలమి వినుచుఁ బరీక్షి న్నరేంద్రచంద్రుఁ
డచ్యుతక్రీడ లాత్మ్మ కింపారఁ బలికె."

ఆశ్వాసాంతమునఁ బద్యములు మదనగోపాలుని సంబోధించునవై యున్నవి. గద్యము మాత్రము తక్కిన రెండు గ్రంథములలోని దానిని బోలియే యున్నది.

"ఇది శ్రీమదనగోపాల చరణకమల సేవాధురీణ సత్కళాపారీణ కృష్ణభట్టారకపౌత్ర చింతలపూడికామయ ప్రభుపుత్ర సుకవివర్య రాధామాధవ యెల్లనార్య ప్రణీతంబైన విష్ణుమాయానాటకంబునందు ప్రథమాశ్వాసము."

కాని తారకబ్రహ్మరాజీయము నందలి దానిలో 'సుకవివర్య' అను దానికి బదులు "శుద్ధసారస్వతవిభవ" యనువిశేషణంబు గానవచ్చుచున్నది. "రాధామాధవ యెల్లనార్యప్రణీతంబైన" యనుటకు బదులుగా "శుద్ధసారస్వత విభవరాధామాధవ ప్రణీతంబైన" తారక బ్రహ్మరాజీయంబు అని కలదు. "శుద్ధ సారస్వతవిభవ" యను నాత్మోత్కర్షను చాటుకొను నీవిశేషణమునకుఁ దగినట్లుగా 'రాధామాధవ' ప్రణీతంబైన యనుటచే బిరుదాంకమును మాత్రము వేసికొని స్వీయనామమును బాఱవిడిచిన వాఁడయ్యెను. దీనిని బట్టి యిది యీతని నడిమివయసున నాత్మశ్లాఘా పరుఁడై యున్న కాలమున రచించియుండ నోపునని యూహింపఁదగియున్నది. "కవితామాధుర్య ధుర్యునన్నుఁ రాధామాధవుని సుకవిరత్నముఁ బలికెఁ" అని తిమ్మరుసయ్య తన్నుఁ గూర్చి పలికినట్లు చెప్పుకొన్న రీతినిబట్టి విచారించినను ఇది యీతని నడిమి వయసున రాధామాధవ బిరుదముచే విఱ్ఱవీగుచున్న కాలమును సూచించుచున్నదని తలంపఁదగును.

విష్ణుమాయానాటక మాతనిమనస్సు పరిపక్వముఁజెంది ప్రపంచమంతయు నొక మాయానాటకమను తలంపు పొడసూపిన కాలమున రచింపఁబడెననియు నప్పు డాతని దృష్టిని కథాభాగమునకుఁ గల ప్రాముఖ్యము కృత్యాది విషయమున లేక యుండెననియు నూహింపఁదగియున్నది. రాజులయు, మంత్రులయు నాశ్రయాపేక్ష యప్పు డీతనికి సన్నగిలియుండును కావున కథాభాగము తోడనె

గ్రంథప్రారంభముఁ గావించి యాశ్వాసాంతములందు మాత్రము తనయిష్టదైవమగు మదనగోపాలుని సంబోధించి సంతుష్టిఁజెందెను. ఈ కారణములచేఁ గృత్యాది పద్యములుగలప్రతి దొరకువఱకు నీగ్రంథమున కీతఁడు కృత్యాది రచింపనే లేదని యూహింపవచ్చును.

కృత్యాదిపద్యములు గలప్రతి మనకు దొరకలేదనుటకన్న కృత్యాదిరచనయే చేయఁబడి యుండలేదేమోయని తలంచుటకుఁ గలకారణము మఱియొకటికూడఁ గలదు. ఇప్పటికి లభించిన రెండుప్రతులలోనుగూడ కృత్యాది లేకుండుట యటుండఁగా ఆంధ్రసాహిత్య పరిషత్ప్రతిలోని యాశ్వాసాంత గద్యము ప్రాచ్యలిఖితపుస్తకాలయు ప్రతిలోని దానికంటె భిన్నమై కన్పట్టుచున్నది. దీనినిబట్టి చూచినచో గ్రంథకర్తృత్వమునుగూర్చియే సందేహము బయలుదేరకమానదు. పరిషత్ప్రతిలోని గద్య మిట్లున్నది.

"ఇది శ్రీమదనగోపాల వరప్రసాదలబ్ధ కవితావిలాస భారద్వాజగోత్ర పవిత్ర అయ్యలామాత్యపుత్ర అనంతయ నామధేయ ప్రణీతంబైన విష్ణుమాయా నాటకంబను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము."

ఈగద్యను బట్టిచూడఁగా భారద్వాజగోత్రుఁడును అయ్యలామాత్యపుత్రుఁడును నగు అనంతయ్య యనునాతఁ డీగ్రంథకర్తయని తలంపవలసియున్నది. రాధామాధవకవి గద్యలో గోత్రము లేదు. ఇంటిపేరు చింతలపూఁడి వారనియున్నది. ఈగద్యలో గోత్రము చెప్పబడినదికాని యింటిపేరు లేదు. తండ్రులపేళ్లు భిన్నములై యున్నవి రాధామాధవకవి తాతపేరుకూడఁ జెప్పుకొనియున్నాఁడు. మొత్తముమీఁద వీరిద్దఱు నొక్కరేయనుటకుఁ దగినకారణము లేమియుఁగనంబడవు. ఒక్కఁడేయయి దత్తుఁడగుటచేఁ దండ్రులపేళ్లు భిన్నముగాఁ జెప్పుకొనియె నందమా, యివి భిన్నగ్రంథములు కావు. ఒక్కగ్రంథముయొక్క భిన్నప్రతులలోనే యిట్లాశ్వాసాంతగద్యము భిన్నమయియుండుట యెట్లు సంభవించును? గ్రంథభాగమున మార్పులేమియుఁ గనంబడవు. ఆశ్వాసాంతపద్యములుగూడ రెండుప్రతులలోను సమానములుగనే యున్నవి. కావున నీయనంతయ్యయను నాతఁడెవరో తరువాతి కాలపు సాహసికుఁడు, రాధామాధవ కవి యీగ్రంథమును గృత్యాదిపద్యములు లేకయే రచించుటనుజూచి యాశ్వాసాంత గద్యమును మార్చినంతమాత్రమున గ్రంథమును దన పేర వెలయించుకొనవచ్చునని కాఁబోలును దానువ్రాసికొనిన ప్రతిలో నాశ్వాసాంతముల నీగద్యను జేర్చికొనియుండును. దానినిబట్టి వ్రాసిన ప్రతులలో నీతని పేరుతోఁగూడిన గద్యమే నిలిచియుండుట తటస్థించియుండును. కాని మూలగ్రంథప్రతులుకూడ దేశమునఁ గొన్ని నిలిచియుండుటచే నీ గ్రంథచౌర్యము కొంతకాలమునకైన బయలుపడక తప్పినదికాదు. ఆంధ్రవాఙ్మయ చరి

త్రమున కవులలో పద్యములయొక్కయు, పాదములయొక్కయు, భావముల యొక్కయు చౌర్య ముండినదని చెప్పిన చెప్పవచ్చునుగాని, గ్రంథచౌర్యముండిన ట్లగపడదు. ఇదియే సంపూర్ణ గ్రంథచౌర్యమునకు ప్రథమోదాహరణము కాఁగ లదు. ఇట్టి సాహసకృత్యమునకుఁ దొలుత రాధామాధవకవి కృత్యాదిలేక రచించి యుండుటయే కొంత యవకాశమును గల్పించియుండును. ఎల్లనార్యుఁడే గ్రంథ చౌర్యము చేసినాఁ డనుట కేమియు నవకాశములేదు. ఇందలి యాశ్వాసాంత గద్యముతో నభిన్నంబగు గద్యముగల మఱిరెండు గ్రంథము లాతనివి ప్రసిద్ధములై కనఁబడుచునేయున్నవి గదా. కృష్ణరాయల యాస్థానమున నాతుకవితచే పెద్దన్న గారిని మెప్పించి, రాయలవలన రాధామాధవ కవియను బిరుదమును బొందెనన్న కథయు నాతని ప్రసిద్ధినిఁ జాటుచునేయున్నది. మఱియు, పరమనిష్ఠాగరిష్ఠుఁడగు నొక బ్రాహ్మణుఁ డొకభోయవనిత తగులమునఁ బడుటనుగూర్చి తారక బ్రహ్మ రాజీయమునఁ దెలుపఁబడిన కథవంటి కథయే విష్ణుమాయానాటకమునఁగూడ నంతకంటె రమ్యతరంబుగఁ జెప్పఁబడి యుండుటనుబట్టికూడ నీరెండు గ్రంథములు రచించిన దొక్కఁడేయయి యుండునను వాదమునకు మఱింతబల మేర్పడుచున్నది. దీనినిబట్టి యీవిష్ణుమాయానాటకకర్త 'రాధామాధవకవి' యగు చింతలపూఁడి యెల్లనార్యుఁడేయని ధ్రువపడుచుండుటయేకాక 'అనంతయ్య' గ్రంథచౌర్యము కూడ నువ్యక్తంబగుచున్నది.

**ఆతని వంశము, దేశము:**—రాధామాధవకవి రచించిన గ్రంథములు మూఁడింటిలో మొదటిదగు 'రాధామాధవమున' నీతఁడు తన వంశాదికమునుగూర్చి యీ క్రింది పద్యమునఁ దెలుపుకొని యున్నాఁడు.

సీ. శ్రీవత్సలాంఛన శ్రీముఖాంబుజమున
　　　శ్రీవత్సముని కులశేఖరుండు
ప్రభవించె నామహాభాగువంశాంభోధి
　　　దివ్యరత్నంబుల తెఱఁగుమీఱఁ
బుట్టి రనేకులు పురుషార్థపరులైన
　　　వారు వారలలోన వంశకర్త
వర్ణిత సత్కీర్తి వల్లభుఁ డొప్పారె
　　　నతనికి శ్రీకృష్ణుఁ డవతరించె
గీ. నతనియందుఁ గామ నార్యుండు జన్మించె
నతని కేను లచ్చమాంబయందు
జననమైతి నెల్లనత్కవి చంద్రుండ
సరసహితచకోరసంఘ మలర.

తారకబ్రహ్మరాజీయమున నంజరను తిమ్మయ వంశాభివర్ణనముఁ జేసెనే కాని, స్వీయవంశాదికమునుగూర్చి యేమియుఁ దెలుపుకొనలేదు. కావున రాధామాధవమునందలి యేకైకపద్యమువలన నీతఁడు శ్రీవత్సగోత్రుండనియు, నతని తాత కృష్ణభట్టారకుఁడనియు, తండ్రి కామన్నయనియు, తల్లి లచ్చమాంబ యనియుఁ దెలియవచ్చుచున్నది. ఈవిషయములే యీతనిగ్రంథత్రయమందలి యాశ్వాసాంతగద్యములవలనను నువ్యక్తమగుచున్నవి. వీరియింటిపేరు చింతలపూఁడివారని యాశ్వాసాంతగద్యములఁ బట్టియేకాక రాధామాధవమునందలి యీక్రింది పద్యమునుబట్టియుఁ దెలియుచున్నది.

ఉ. సంతతభావసిద్ధియుత సంస్థితియుం, సనయక్రియాపరి
   క్రాంతియు, సర్వలక్షణవిచారతయుం ఫలియించె, రాధికా
   కాంతుఁడు ప్రసన్నుఁడు గావునఁ బావనమూర్తియైన యీ
   చింతలపూఁడి యెల్లకవిశేఖరుకోమలకావ్యకన్యకున్."

ఈ యింటిపేరు ఈతని నివాసస్థలమగు గ్రామనామముఁ బట్టియే యేర్పడి యుండుననుటకు సందేహము లేదు. ఆంధ్రదేశమున చింతలపూఁడిగ్రామము లనేకము లుండుటచే నీతని వాసస్థానమయిన చింతలపూఁడి యిదియని నిర్ణయించుట సులభసాధ్యము కాదు. కృష్ణాజిల్లా (ఇప్పటి పశ్చిమ గోదావరిజిల్లా) ఏలూరు తాలూకాలో నొక చింతలపూఁడి కలదు. తూర్పు గోదావరిజిల్లా అమలాపుర సమీపమున మఱియొక చింతలపూఁడికలదు. ఈ ప్రాంతములనుండి యీతఁడు రాయల యాస్థానమునకుఁ బోయియుండునా యనున దొక ప్రశ్న. కాని యదియు నసంభవము కాదు. రాజమహేంద్రవరము కొండవీడు మొదలగు స్థలముల రెడ్ల యాస్థాన కవీశ్వరులుగానున్న శ్రీనాథుఁడు మొదలగువారు కర్ణాటాధీశ్వరుని యాస్థానమునకుఁబోయి సత్కారములఁ బడసియుండిరిగదా. గౌతమీతీర భూమిని గూర్చి యీతఁడుచేసిన విశేషవర్ణనమునుబట్టి చూడఁగా నీతఁ డీప్రాంతమువాఁడే యేమో యను సందేహము బలపడుచున్నది. పుండరీకుని చరిత్రమున, నాతఁడు దుర్భిక్షంబుచే నవయు తన బోయయిల్లాలితో నిట్లు పలికినట్లు గలదు.

గీ. పొలఁతి విను పూర్వదక్షిణ భూములెల్ల
   నెపుడు దుర్భిక్షదోషంబు నెఱుఁగవంద్రు
   బహునదీమాతృకలుగాని ప్రతిదినంబు
   దివి నిరీక్షించు దేవమాతృకలు గావు.

సీ. కర్ణాటరాజ్యంబు గంభీరతుంగభ
         ద్రాజలౌఘంబులఁ దఱచు పండు
   ద్రావిడదేశ ముత్తరలోర్మిరమ్యకా
         వేరికాలువల ముక్కారుఁబండుఁ

ద్వైలింగ్యమధ్యభూతలము కృష్ణాగౌత
మీప్రవాహంబుల మిగులఁ బండుఁ
గాళింగమధ్య దిక్ఖండంబు లాంగూల
శారదానదులచేఁ జాలఁబండు
తే. వెండియును జిత్ర మి ట్లనావృష్టియైన
నంబుజాక్షి నభోనభస్యాహ్వయమున
(వర్ష) దర్పమొప్పార గౌతమి దరులుముంపఁ
బార్శ్వములయూళ్లు పదివేలు పండునెపుడు.
సీ. ఏత్రోవఁ జూచిన నేత్రోద్దు సలిలాన్న
సత్రశాలాజనసంభ్రమంబు
లేయూరఁ జూచిన నెల్లధాన్యంబులు
కోరువెట్టెడుప్రజాఘోషణంబు
లేయిల్లుఁ జూచిన నిందిరాకరసంత
తోత్సవతోరణాభ్యుదయరేఖ
లెవ్వరిఁ జూచిన నివ్వటిల్లెడుదయా
దానసౌజన్య విద్యానిరూఢి
తే. యెచటఁ జూచినఁ గనుపండు విందువదన,
నారికేళామ్రపనస పున్నాగముఖ్య
భరిత శృంగార వనపరంపరలచేతఁ
గోరికలుముంచు గౌతమీతీరభూమి.

తే. దివ్యమైతగు గౌతమీ తీరభూమి
భోగమోక్షంబులకు జన్మ భూమినువ్వె
జన్మసంస్కారఫల విశేషంబుగలుగు
వారలకుఁగాని కలుగ ద వ్వసతిసుఖము.

దీనినిఁబట్టి కృష్ణాగౌతమీప్రవాహంబుల మిగులఁ బండు త్రైలింగ్య మధ్యభూతలమునం దీతఁడు జన్మసంస్కార ఫలవిశేషంబుచే వసతిసుఖము ననుభవించియుండెనేమో యని తలంపఁదగియున్నది. మఱియు నైదవయాశ్వాసము లోని నారదునికథకుఁ బ్రధానరంగమగు సర్వవరక్షేత్రముకూడ గోదావరిజిల్లాలోనిదే. దీనిని వర్ణించినరీతియు నాతనికీ దేశమందుగల విశేషాభిమానమును బరిచయమును జాటుచున్న దనవచ్చును. కాని కవులు క్షేత్రమాహాత్మ్యమును వర్ణించుచునే యుందురు. అంతమాత్రమున వా రెద్దానిని వర్ణించిన వా రచ్చోటివారని చెప్పవలసినదేనా యను ప్రశ్న బయలుదేరక మానదు. అట్లు చెప్పుట కవకాశము లేదు. కాని యొక్కొకపుడు స్వదేశమునువిడిచి రాజాదరణముకొఱకై దూర

దేశ మేగి యచ్చట గ్రంథరచన సాగించిన కవి యొకఁడు సహజంబగు స్వదేశాభిమానముచే కథారంగమును స్వీయదేశమున వెలయించి దానిని వర్ణింప దొరకొనుననుటయు నసంభావ్యముకాదు. ఎట్టికవియైనను సామాన్యముగాఁ దనరచనలయందు స్వానుభవమును, స్వాభిమానమును, స్వాభిప్రాయములను గొంతవఱకైనఁ బొందుపఱుపకుండ లేఁడు. ఎంత ప్రతిభావంతుఁడైనను సామాన్యప్రాణివలెనే పరిసరముల ప్రభావమునకు లోనుగాకుండునని తలంచుట కవకాశము లేదు. శ్రీనాథుని కాశీఖండ, భీమఖండాది గ్రంథరచనమును జేపట్టఁ బురికొల్పినది స్వీయదేశస్థక్షేత్రమాహాత్మ్యప్రకటనమే యై యుండుననుట యసంభావ్యముకాదు. శ్రీకృష్ణదేవరాయలు తన కథారంగమును శ్రీవిల్లిపుత్తూరుగాఁ జేసెనేకాని యే బెజవాడయో, శ్రీకాకుళమో, సింహాచలమో చేయలేదు. ఆ కథయట్టి దాతఁడేమిచేయగలఁడందురా, యా కథను గ్రహించుటలోనే యాతని మనఃప్రవృత్తి బయలుపడుచుండుననియుఁ జెప్పవచ్చును. సర్పవరమును రాధామాధవుఁ డెట్లు వర్ణించినాఁడో కనుఁగొనుఁడు.

"నేదిష్ఠదక్షిణాశా
ప్రాదుర్భూతార్ణతుల్య భాగాజలజా
మోదభరితమహామారుత
మాదైత్యారాతిహృదయ మలరఁగఁ జేసెన్.
సవిధప్రాచీనమహా
లవణజలధి ఘుమఘుమితకలధ్వని కెనయై
సవనాస్తుశ్రౌషణ్ముఖ
వివిధరవం బావనమున వీనులఁ దనిపెన్.
అతినిబిడజలదమాలా
ప్రతిమానక్రతుసముత్థ బంధురధూమ
ప్రతతుల గగనం బాచ్ఛా
దితమయ్యెఁ దద్వనమున దివిజులు పొగడన్.

నేదిష్ఠ దక్షిణాశయందు గోదావరీనదీముఖశాఖలలో నొకటగు తుల్యాభాగయు, సవిధ ప్రాచీదిక్కున మహాలవణజలధియుఁ గలిగిన సర్పవరక్షేత్రము ప్రస్తుతము కాకినాడకు సమీపమునఁగల సర్పవరగ్రామమేయనుటకు సందేహము లేదు. ఇప్పటికిని శిథిలమై నిలిచియున్న గొప్ప దేవాలయ మాక్షేత్రముయొక్క గొప్పదనమును చాటుచున్నది. మఱియు క్రతుసముత్థబంధుర ధూమప్రతతులతోఁగూడిన యీతని గోదావరీతీరదేశవర్ణనము నన్నపార్యుని వేఁగిదేశవర్ణనమును దలపించుచున్నది. ఈకారణములచే నీతఁ డిచ్చటివాఁడై యుండునని చెప్పవచ్చును. కాని యొక చిక్కుగలదు. అచ్యుత దేవరాయలయొద్ద మంత్రియై

*"కందాచారము" (Military accounts) వ్రాయుచునుండిన నంజతిమ్మయకు నీతనికి బాంధవ్యమున్నట్లు "అంకిత మొనర్పఁదలఁచినవాఁడ బంధుసంభావన నీకు నిష్టముగ" అను దానినిబట్టి తెలియుచున్నది. నంజతిమ్మయ యెచ్చటి వాఁడో యాతనితో నీనికిఁగల బాంధవ్యమెట్టిదో తెలిసికొనుట కాధార మేమియుఁ గనఁబడకున్నది. కాని బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు వారి మద్రాసు విశ్వవిద్యాల యోపన్యాసములలో, నీ యెల్లయకవిని గూర్చి ప్రశంసించుచు, నీతనిది కడపజిల్లాలో పెన్నానదీ తీరముననున్న చింతలపూఁడి యనియు, నీతని వంశమున నరుసగా నెనిమిది పురుషాంతరముల వఱకు పలువురు కవులుద్భవించిరనియు, నీతనికి నాల్గవ మనుమఁడు సంజీవకవి చంద్రాంగదచరిత్రమును, మూఁడవ మనుమఁడు ఛాయాపతి రాఘవాభ్యుదయమును, ఏఁడవ మనుమఁడు మధురవాణీ విలాసమును రచించిరనియు, నీతనివంశము వారిప్పుడు వెంకటగిరి సంస్థానపండితులై కాదంబరి నాంధ్రీకరించుచుండి రనియుఁ జెప్పియున్నారు. ఆయుపన్యాసములందే యీకవి అచ్యుతరాయలవలన "రాధామాధవ" బిరుదమును బడసెననియు, తారక బ్రహ్మయోగమును సలకముతిమ్మయ మంత్రియగు నంజయకుమారుఁడు తిమ్మయకుఁ గృతియొసఁగెననియుఁ దెలిపిరి. ఈకవి తనరాధామాధవమునందే చెప్పికొన్నట్టియు, వెనుకనుదాహరింపఁబడినట్టియు "రాధామాధవమచ్యుతాంకితముగా" ననుపద్యమునుబట్టి యాబిరుదము నచ్యుతదేవరాయల వలననుండి కాక శ్రీకృష్ణదేవరాయలవలన నుండియే యీతఁడు పడసెనని స్పష్టమగుచున్నది. మఱియు నంజతిమ్మయ అచ్యుతదేవరాయల మంత్రియౌటయే కాక యాతఁడు సలకముతిమ్మయ మంత్రికంటె భిన్నుఁడు. ఈతఁ డచ్యుతదేవరాయలయొద్ద కందాచార లేఖకుఁడు ( Writer of military accounts )ను మంత్రియు నైయుండుటే కాక, వేదశాస్త్ర సర్వ భాషావేత్తయు లిపిజ్ఞుఁడునైన బ్రాహ్మణోత్తముఁడనియు నీక్రింది పద్యమువలనఁ దెలియవచ్చుచున్నది.

"వేద పురాణ శాస్త్రముఖ విద్యలకెల్ల గురుండు, బ్రహ్మవి
ద్యాదృఢబుద్ధి, నేర్పులిపు లన్నియు వ్రాయు సమస్తదేశ భా
షాదు లెఱుంగు స్వామి హితమైన ప్రయోజన మాచరించు నా
నాదిశలం బ్రసిద్ధుఁడగు నంజయతిమ్మనిఁ బోల రెవ్వరున్.

ఈ తిమ్మయయైన నే దేశము వాఁడో నిశ్చయముగాఁ దెలిసినఁగాని, యీతని యెడల "బంధుసంభావన"గల కవియు నెచ్చటి వాఁడో నిశ్చయించుట కవకాశము లేదు. ఒకవేళ నీ బాంధవ్యము సంభావనామాత్రకమే యేమో. పరిచ

* కందాచారము = The native militia; కట్టుబడివాండ్లు, adj, military (C. P. Brown) ఇది హిందుస్థానీపదముగా జెప్పబడినది. 'స్కంధావార' శబ్దభవమైయుండ నోపు.

యాతి రేకమునుబట్టి బంధు సంభావన యీతనికిఁ గలిగియుండవచ్చును. పేరును బట్టి "నంజతిమ్మరను" కన్నడదేశప్రాంతమువాఁడని తలంపవచ్చును. ఈతనితోడి బాంధవ్యము సంభావ్యమే యైనచో నెల్లనయు నా ప్రాంతమువాఁడని యూహింపుట కవకాశము లేకపోదు. కాని రాధామాధవములోని యీ క్రిందిపద్యమున 'మా శ్రీనాథుఁ' అని చెప్పినదానిని బట్టి యీతఁడు శ్రీనాథునితో సమాన దేశీయుఁడనియుఁ దలంపవచ్చును.

సూనాస్త్రప్రమదామదస్ఫురితవక్షోజాత కాఠిన్యముఁ
బూనంజాలు వచోవిలాసముల నేర్పుల్ సూపి కర్ణాటక
క్ష్మానాథేంద్రుడు సభఁ గవిత్వవిజయోత్సాహంబుఁ గైకొన్న మా
శ్రీనాథుఁ గవిసార్వభౌముఁ గొలుతుఁ సేవాంజలుల్ గీల్కొనన్.

ఇఁక శ్రీ రామకృష్ణకవిగారు రాధామాధవకవి కేడవమనుమఁడని చెప్పిన "మధురవాణీ విలాస"కర్తయగు వీరరాఘవకవి యింటిపేరు 'చింతలపల్లి' వారు గాని 'చింతలపూఁడి' వారుగాఁ గనఁబడదు. చింతలపల్లి వీరరాఘవకవి రచించిన 'మధురవాణీ విలాసము' ప్రాచ్యలిఖిత పుస్తకాలయమునఁ గలదు. అందు "ఆహా చింతలపల్లి రాఘవకవీ యాధ్యుండవీ వన్నిటన్."

చెంది విస్తరిల్లెఁ జింతలపల్లివా
రనఁ బ్రసిద్ధమై తదన్వయంబు

అనియే కలదుగాని చింతలపూఁడియని లేదు. చంద్రాంగద చరిత్రకారుని యింటిపేరు తెలియదు. చింతలపల్లివారో, చింతలపూఁడివారో. ఛాయాపతి రాఘవాభ్యుదయము లభ్యముకాలేదు. వెంకటగిరి సంస్థానమున పండితులై యున్న చింతలపల్లివారికిని యీ చింతలపూఁడి యెల్లయకును సంబంధము కలదని చెప్పుటకుఁ దగిన హేతువు కలదేమో తెలియదు. చింతలపూఁడిగ్రామము లనేకము లుండుటచే నీతని నివాసస్థలమగు దానినిగూర్చి యిదమిత్థమని నిర్ణయించుట దుర్ఘటమే యగుచున్నది. కావున సాధనాంతరములచే నీతని వాసస్థలము వేఱు దేశమని నిరూపింపఁబడు నంతవఱకు నీతఁడు గోదావరి కృష్ణా మధ్యదేశము వాఁడని వేఁగిదేశీయుఁడని యూహింతము గాక.

**ఈతనిరచనలు :—** ఈ కవిరచించిన గ్రంథములలో "రాధామాధవ" మనునది యైదాశ్వాసముల ప్రబంధము. ఇది సంస్కృతమున జయదేవకవి రచించిన 'రాధామాధవ' కావ్యము ననుసరించి తెలుగునఁ రచించిన ట్లాకవి చెప్పికొనినాఁడు. సంస్కృతరాధామాధవకృతి కర్త గీతగోవిందమును రచించిన జయదేవ మహాకవియే యై యుండవచ్చును గాని యాకావ్యము లభ్యమగుట లేదు. తెలుఁగు రాధామాధవమున కథ స్వల్పమైనను దానిని విశేష వర్ణనలతోఁ బెంచి

ప్రబంధ ఫక్కి నిరచించి "తనపాృత్సౌధమునఁ దోచి రాధామాధవము చెప్పరా" యని ప్రోత్సహించిన శ్రీకృష్ణున కంకిత మొనర్చెను.

తారకబ్రహ్మరాజీయము శ్రీరామ తారకమంత్రమాహాత్మ్యమునుగూర్చి తెలుపు నైదాశ్వాసముల పద్యకావ్యము.

"యతివరేణ్యుండు నారాయణాశ్రములు మ
హానుభావులు నడిపిరి యాగమాంత
పరిచితంబైన తారక బ్రహ్మరాజ
మఖలసన్మంత్ర తారాఖ్య మైనదాని.
అధీరునిగతిఁ దెనుఁగున
రాధామాధవుఁడు సుకవి రంజిలఁ జెప్పెఁ
వేధోవరముని బుధ గం
గాధర జప్యంబు తారక బ్రహ్మంబున్."

నారాయణాశ్రములు సంస్కృతమునఁ జెప్పిన గ్రంథము నిపుడు లభింప కున్నది. ఇప్పటికి పై పేర్కొనిన సంస్కృతగ్రంథములు రెండును రాధామాధవకవి తెలుఁగు రచనలరూపముననే నిలిచియున్నవని చెప్పవలసియున్నది.

ఇందలి కథ ప్రయాగక్షేత్ర మహిమాభివర్ణనముతోఁ బ్రారంభింపఁబడి నది. అచ్చటనున్న పరాశరమునిశ్రేష్ఠుఁడు వసిష్ఠమహాముని శిష్యుఁడగు వామదేవు నికి తారకబ్రహ్మమంత్ర ప్రభావముఁ జెప్పుచు, నగస్త్యుఁడు లోపాముద్రం గూడి వింధ్యదాటి దక్షిణదేశయాత్ర సలుపుచు రామేశ్వరంబుచేరి యచ్చటఁ జేరిన వాలఖిల్యాది ఋషిమండలమునకు తారకబ్రహ్మోపదేశంబు చేసినరీతి నే తాను నాతని కిద్దాని నుపదేశించెను. రెండవ యాశ్వాసమున మహారాష్ట్రదేశ మును ధర్మధ్వజుఁడను రాజు పాలించుచుండ శ్రోత్రియుఁడగు నొక బ్రాహ్మ ణుఁడు తీర్థయాత్రం బోవుచు దారిలో నొక బోయదాని తగులమునఁబడి, దానినిఁ గొనిపోయి కొంతకాలమునకు రాజాస్థానమునఁ బ్రవేశించి యచ్చట నెంపుడు చిలుక కావించు రామనామ సంకీర్తనమును వినుచు నాబోయదాని భర్తచేఁ దెగ నఱుకఁబడి యసువులంబాసిన కారణమున విష్ణులోకముంబడసెననియునందువలన నే యాధర్మధ్వజుని కాలమునుండియు మహారాష్ట్రదేశీయులు రామనామసంకీర్తన పరాయణులై యున్నవారనియుఁ జెప్పఁబడియున్నది. ఈ కథయందీ సందర్భమున బోయదానితోడి పొందును సమర్థించుచుఁ గవి యాబ్రాహ్మణునిచేఁ బలికించిన పలుకులు తారాశశాంక విజయాదిగ్రంథములయందలి శృంగారరసాతిరేకమును జ్ఞాపకము చేయుచున్నవి.

"కోరిన కోలఁదిని వచ్చిన
జారస్త్రీ సంగమంబు సంసారఫలం

బీరీతి సౌఖ్య మెఱుఁగని
వారలె కాదండ్ర నర్హవాచోయుక్తిన్.

నరకమని చదివిచెప్పిన(యు)
ధరణీపతి దండభయముఁ దగిలించియు మా
న్తురు గాక యధమపురుషులు
హరిహరు లజ్ఞులె రమింపరా పరసతులన్.

పరనారీ సంభోగము
పరమసుఖం బనుచుఁ గాదె పట్టుకొనియె నా
(వా)సరిజగర్భుఁడు కూఁతురు
తరలకతల వ్రాపుడెఱుగఁదలఁపఁగ వెంటన్.

అమరాధీశుఁడు స్వర్గమేలఁడె యహల్యాజారుఁడయ్యుఁ శుచి
త్వముతోడం, బరదార సంగమము విద్వాంసుల్ నివారింపుటల్
తమభార్యల్ నియమ(స్థు)లై సతత లీలాహీనులం బాయు దో
సములం దోసమటంచు నేనెఱుఁగనే సందేహ మిందేటికిన్."

ఇట్లు వాదించి బోయవనిత నింటినుండి లేవఁదీసికొని పోయిన బ్రాహ్మణుఁడు రాజాస్థానమున బోయవాని ఖడ్గమున కెరయై యసువులఁ బాయుసమయమునఁ జిలుక పలుకు రామనామశ్రవణము కారణముగా సద్గతిఁజెందెనను కథ మూలముగా రామనామమాహాత్మ్యమిందు వెల్లడింపఁబడినది. కాని సద్గతికిని సత్ప్రవర్తనమునకును నిందు దెలుపఁబడిన సంబంధము మాత్రము విచారణీయమై యున్నది. స్థలములయు, మంత్రములయుమాహాత్మ్యము లిట్టి కథలతోఁగూడినవే యైయుండుట తఱచుగాఁ గాననగును. కేవలపతితునికి సద్గతిని గల్పించినఁ గాని యా మంత్రముయొక్కగాని స్థలముయొక్కగాని మాహాత్మ్యము బయలువడదని పూర్వు లట్టికథలను కల్పించి యుందురేమో. లేదా పతితుని పశ్చాత్తాపతీవ్రతాఫల మట్టి సద్గతిని కల్పించునని వారి యభిప్రాయమా? ఎట్లయినను మాహాత్మ్యములలోఁ గొంత శృంగారాతిరేకము జారత్వసమర్థనము మొదలగునవి పొడసూపుచుండుట సామాన్యముగాఁ గాననగును. ఇట్లిచ్చట బ్రాహ్మణుని జారస్త్రీసంగమమును సమర్థింపఁజేసిన కవియే తన గ్రంథాంతరమగు 'విష్ణుమాయానాటకమున' నింద్రియ నిగ్రహము సౌమ్యస్వభావము లేక సర్వము దమతోనే యున్నదని విఱ్ఱవీఁగు నహంకారావిష్టచిత్తులగు మహాపురుషులు గూడ నెట్లుపహాస్యముపాలై పోవుదురో చక్కఁగా చూపియున్నాఁడు. ఇందలి శృంగారవర్ణనలు స్వభావపరిశోధనమునకు, ఇంద్రియనిగ్రహ పటుత్వపరీక్షార్థము నుపయోగపడినవే కాని శీలరహితప్రవర్తనను సమర్థించునవిగా లేవు. ఈ గ్రంథమున

కథాసన్నివేశము నతి చమత్కారముగాఁ గూర్పఁబడినది. శ్రీనాథుఁడు హారుని విలాసముల నేర్చి యొక్కచోఁ గూర్చినట్లు యాతఁడును విష్ణునిమహిమాతిశయమును జాటు విలాసములను గొన్నిటి నేర్చి యిందుఁ గూర్చెను. కాని విశేషమేమనఁగా హారవిలాసమునందు వలెఁగాక యిం దీతఁడు విష్ణువిలాస కథల కన్నిటి కొక చక్కని సన్నివేశమును, ప్రణాళికను సమకూర్చెను. ఇది వెనుకటి రెండుగ్రంథములవలె సంస్కృతమూలమున కనువాదము కాదు. అచ్చటచ్చట పురాణాదులఁ బ్రసిద్ధములై యున్న విష్ణుకథలను దెచ్చి గుదిగ్రుచ్చి రచించిన స్వతంత్రగ్రంథము. ప్రపంచమంతయు విష్ణుమాయాశక్తి ప్రకల్పితమనియు, నద్దానిం దెలియక యహంకర్తృత్వాభిమాన ప్రేరితులై బ్రహ్మాది దేవతలును మాయచే వంచితులై తుదకు పశ్చాత్తాపమును బొంది యా విష్ణుమాయకు లోఁబడి యుందురనియు, సత్త్వగుణప్రధానులై యింద్రియ నిగ్రహము కలిగి జ్ఞానవైరాగ్యములను సాధించినను నహంత్వాభిభూతులు కాక ప్రపన్నులై యేకాంత భక్తితో నా విష్ణువు నారాధించినవారుగాని యా విష్ణుమాయ నతిక్రమించి ప్రపంచతత్త్వమును దెలిసి సంసారచక్రమునుండి విముక్తిఁ బడయలేరని తెల్పుటయే యిందు కవి సూచింపఁదలఁచిన పరమార్థము. దీనినే కవి "భాగవత సత్కథ పరబ్రహ్మ విద్య" యని చెప్పినాఁడు. ఇట్టి విద్యను పరీక్షిన్నరేంద్రుఁడు శుకబ్రహ్మవలన వినుచు "వేదసిద్ధాంత రహస్య వేదులగు మహామతులును తద్దివ్య విష్ణుధ్యేయ తేజోరూపంబు తుదిముట్టంగాంచి తదాత్మకంబునం బొందక, త్రివర్గఫలభోగంబు లనుభవించుచు నల్పసుఖానుసారు లగుచుండుటకుఁ గతంబేమియో సంశయవిచ్ఛేదంబుగా నెఱింగింపవే యని" యాతని నడుగుటయు శుకమహర్షి

గీ. అతని నైజతత్త్వమగు తేజమిట్టిది
యతనిగుణము లిట్టి వతనిక్రీడ
లిట్టివని నుతింప నెఱుఁగవు వేద వే
దాంతములును నిశ్చయంబుగాను.

క. కావున నుత్తమ సాత్త్విక
ధీవిభవము గలిగి తదధి దేవతయగు నా
శ్రీవిష్ణుని నతినిర్మల
భావంబున నిలుపవలయు భక్తినిరూఢిన్.

శా. ఈరీతిన్ నిజసాత్త్విక క్రియలతో, నేకాగ్రనిష్ఠన్ మహా
ధీరుండై హరిమూర్తి యాత్మనిడు నాధీమంతుఁ డామూర్తి సం
స్కారం బొప్పఁగ నచ్చునన్ బ్రతిమ యోజం బెందు చందానఁ దే
జోరూపంబున ముక్తుఁడై మెలఁగుఁ జూ క్షోణీతలాధీశ్వరా.

యని చెప్పి,

చ. "కమలదళాక్షుఁ డింతటికిఁ గారణ మా వెడగాని యింద్రజా
లము భువనత్రయంబు సకలక్రియలుం దదభీష్టకేళితం
త్రము లరయంగ నాతని మనంబున కెట్టులు దోఁచె నట్లు వి
శ్వము చరియించు నెవ్వరికి శక్యము స్వేచ్ఛభరంబు పొందఁగన్."

అని మహామాయానాటక సూత్రధారుండగు విష్ణుని దివ్యకేళీకృత్యంబులు బహువిధ విచిత్ర ప్రహ్లాద కారణంబులగుటను దెల్పి విష్ణుస్వరూపుఁడగు శ్రీకృష్ణుని మహిమాతిశయమునుగూర్చి ధర్మనందనునకును వ్యాసమహర్షికిని జరిగిన సంభాషణంబును జెప్పుచుఁ గృష్ణుని విచిత్రకృత్యంబులఁ దడవి వానియాథార్థ్యంబును దెలుపుమని ధర్మజుఁడు వ్యాసు నడిగినట్లును, నీతఁ డాకృష్ణుని ప్రభావంబు వర్ణించి యాతని మాయను భేదింప నెవ్వరికి నలవికాదు. దానం జేసి కృష్ణసాయుజ్యంబు దుర్లభంబు. అహంకార పరులైనవారు మాయాచక్రంబునందు పరిభ్రమింతురు. సకలజనులు ప్రతిభా శౌర్య విద్యాప్రభావంబుల నహంకరించు చుండ్రుగావున ముక్తి వడయనోపరు. అహంకార గ్రంథులై విష్ణుమాయం దిరస్కరించి బ్రహ్మరుద్రాదులు మోసపోయిరి. మేమెంతవారము అని పలికి వారు మోసపోయిన విధమునుగూర్చి చెప్పఁదలఁచిన సందర్భమున, సనకసనందనాదులతోఁగూడి శ్రీకృష్ణుని నర్మసచివుఁడగు గోవిందశర్మ కృష్ణునిపంపున ధర్మజుని యాస్థానమునకు వచ్చుటయు, శ్రీకృష్ణుని కేళి వర్తనములు కథలుగాఁ జేసి కృష్ణుని యంతఃపురస్త్రీలకు వేడుక గల్పించు నా గోవిందశర్మ మూలముగా నావిష్ణు లీలలను ఋషిబృందముతోఁగూడి ధర్మజుఁడు విన్నట్లును చెప్పి యాగోవిందశర్మ చెప్పినట్లె యా విష్ణు లీలలను శుకబ్రహ్మ వివరించి చెప్పెను. తొలుత గోవిందశర్మ స్వీయ వృత్తాంతమును జెప్పుకొనుచు శ్రీకృష్ణుఁడు తన సతులయెడఁ బ్రవర్తించురీతియు, సత్యభామ యసూయాపరత్వము మొదలుగాఁగల విషయములను దెలిపి, కృష్ణుని బహురూపకత్వంబును, ప్రతిమందిర పారిజాత విలసనంబును గారణంబుగా సత్యభామకుఁ గలిగిన కోపమును శాంతింపఁ జేయుటకుగా నాతఁడు "ఇదియంతయుఁ గృష్ణుని మాయావిలాసము. తొల్లి శ్రీమహాలక్ష్మి, ద్రుహిణరుద్రాదులు నీవిభుని మాయానాటకంబున భ్రమసితిరిగిరి. ఆ కథలు చెప్పెద" నని సత్యభామకుఁ జెప్పినకథల నన్నిటిని మరల ధర్మజునొద్దఁ జెప్పఁ దొడంగెను.

"ఆసాధ్వి చిత్తగించుటఁ
జేసి పవిత్రములు నతివిచిత్రంబులునై
భాసిల్లె విష్ణుమాయో
ల్లాసచరిత్రములు విను మిలాతలనాథా!

శ్రీయుతమై విష్ణుమహా
మాయానాటకము నాఁగ మహిఁ వెలసె, మహీ
నాయక తత్కథలన్నియు
నాయతగతి నొక ప్రబంధమై నాచేతన్."

ఇట్లు గోవిందశర్మయే విష్ణుకథలఁగొన్నిటిని "మాయానాటక" మను నొక ప్రబంధముగా రచించెనని, యాతనిచే ధర్మజు నెదుటఁ జెప్పించుట మూలముగా నీ రాధామాధవకవి తా నీప్రబంధమునకు "విష్ణుమాయానాటక" మని పేరు పెట్టుటను సమర్థించుకొనినాఁడు. కథ మాయానాటకమే యైనను, గ్రంథము ప్రబంధమే యని తెల్పుచుఁ దదనుగుణంబుగా రెండవయాశ్వాసమును బ్రబంధ ఫక్కి ననుసరించి, వైకుంఠ పురవర్ణనముతోఁ బ్రారంభించెను. ఈ ప్రబంధమునఁ దొలుత మహాలక్ష్మి విష్ణునితో నెత్తమాడి యందామెకుఁ గలిగిన యోటమివలన భర్తపైఁ గోపించి వైకుంఠపురమునందలి వైభవమున కంతకుఁ దానె కారణమని తలఁచినదగుటచే దాని నుపసంహరించి తుదకు విష్ణునిచే మోసపోయిన తెఱంగును, పిదప బ్రహ్మ తానే జగత్సృష్టికర్తనని గర్వించి మార్కండేయుని హితబోధను వినక సృష్టికార్యము చాలించి తపస్సు చేయఁబోయి విష్ణుమాయచే మోసపోయిన తెఱంగును, అనంతరము శివుఁడు మన్మథుని సంహరించుటచేఁ దా నింద్రియనిగ్రహము కలవాఁడనని గర్వించి విష్ణుని తన మోహినీరూపమును జూప బలవంతపెట్టి దానిచే మోసపోయిన విధంబును, నారదుఁడు విష్ణుమాయను దెలిసికొన్నవారు తనకంటె నెవ్వరు లేరను గర్వముచేఁ దానిం దిరస్కరించి స్త్రీరూపమును బొందించిన విష్ణునిచే మోసపోయిన విధంబును దెలుపుకథ లిందతిచమత్కారముగా వర్ణింపఁబడినవి.

ప్రబంధయుగమున నీకవిస్థానము:—ఇఁక నాంధ్ర వాఙ్మయమునఁ బ్రబంధయుగ మనఁదగిన యీ కృష్ణరాయయుగమం దెల్లనార్యుని రచన యెట్టిస్థానము నాక్రమించునో యించుక పరిశీలింపవలసియున్నది. భాషాంతరీకరణయుగమునందే నన్నెచోడ తిక్కనాదుల రచనాఫక్కియందు మొలకెత్తిన యాంధ్రప్రబంధబీజము కాలక్రమమున నాంధ్రకవుల స్వీయవ్యక్తిత్వ ప్రకటనోద్యోగముతోపాటు పెరుగుచువచ్చి యనేకవిధములఁ బరిణామమును బొంది యాంధ్ర సామ్రాజ్య ధురంధరుఁడగు కృష్ణదేవరాయల ప్రాపున స్వతంత్రముగ బ్రతుకనేర్చి చెట్టుకట్టి శాఖలఁ దొడుగ నారంభించినది. ఆంధ్రకవుల పురాణేతిహాసభాషాంతరీకరణప్రవణత కాలక్రమమున సన్నగిలుచు శ్రీనాథుని కాలమునకు ఖండకావ్య రచనములోనికి దిగి యాంధ్రవ్యక్తిత్వమును వ్యక్తముచేయఁ దొడంగినది. ఖండకావ్యము లేయగునాతని భీమఖండ కాశీఖండాదులు స్వతంత్రగ్రంథములుగనే బయలుదేరినను,

స్కాందపురాణాంతర్గతభాగముల భాషాంతరీకరణము లనునపవాదము వానిని వదలలేదు. దీనిని గ్రహించి యాంధ్రరచనలకు నీయపవాదమును దొలఁగించుటకే శ్రీనాథుఁడు హరవిలాసరచనమును బూని మఱియొకయడుగు ముందుకు వేసినాఁడు. ఈహరవిలాస మొకసంస్కృతగ్రంథమునకు భాషాంతరీకరణమని చెప్పవలనుపడదు. సంస్కృతమున నాపేరుగల గ్రంథమే లేదు. అందలి కథలు పురాణాంతర్గతములగుఁ గాక; అక్కడక్కడ కొన్ని భావములు సంస్కృతగ్రంథములనుండి గ్రహింపఁబడినవై యుండుఁగాక; కొన్ని ఘట్టములయందే కాళిదాసు రచనలో భాషాంతరీకరింపఁబడియే యుండుఁగాక; ఎట్లయినను హరవిలాస మనునది నైషధాదులవలెనే యొక సంస్కృతగ్రంథముయొక్క యాంధ్రీకరణము మాత్రము కాదు. ఆయాగ్రంథములందును, వ్యవహారమునందును బ్రసిద్ధములై యున్న శివుని కథలను గొన్నిటి నేర్చితెచ్చి హరవిలాసమను పేర గుదిగుచ్చినాఁ డీతఁడు. ఇందలి కథలకుఁ బరస్పరసంబంధము అనుక్రమణిక మొదలగునవి లేకపోవుఁగాక; కథలన్నియు శివునిఁగూర్చినవగుటయే యిందలి ముఖ్యవిశేషము. శివుఁడే యీకథలకన్నిటికి నేకత్వమును సమకూర్చినాఁ డనవలయును. ఏమైనను శ్రీనాథుని యీరచన యాంధ్రవాఙ్మయచరిత్రమున నూతనయుగమును బ్రారంభించిన దనవచ్చును. ఆంధ్రవాఙ్మయసుందరి భాషాంతరీకరణశృంఖలములనుండి తప్పించుకొని స్వేచ్ఛను బడసినదయినది. స్వతంత్రరచనకు నూతనమగు నీయూఁత దొరకఁగానే యాంధ్రకవులు భాషాంతరీకరణపద్ధతిని వదలివేసి పురాణాదులనుండి తమ కభిమానపాత్రములగు కథలను గొన్నిటిని గ్రహించి వానినిఁ దమ స్వీయకల్పనలతోఁ బెంచి యేదో విధమున గుదిగ్రుచ్చుటకు మొదలిడిరి. శ్రీనాథుఁడు చూపిన త్రోవనేపోయి కృష్ణదేవరాయ లాంధ్రప్రబంధనిర్మాణమునకు శంకుస్థాపనము చేసినాఁడు. శివకథలా శ్రీనాథునకు రుచింప విష్ణువృత్త మీకృష్ణరాయల నాకర్షించినది. కావున విష్ణుభక్తులకథల నొక ప్రబంధముగఁ జేర్చెను. పెద్దన శ్రోత్రియుఁడు, కర్మఠుఁడు కావున 'మనుసంభవ'ము నాధారముగాఁ జేసికొని కొన్ని పూర్వగాథలను గుదిగుచ్చి గ్రంథమును బెంచినాఁడు. ఈతని వర్ణననైపుణ్యము, స్వభావపోషణశక్తి, శైలీలాలిత్యము మొదలగునవి యీతని నాంధ్రకవితాపితామహునిఁ జేసినవి. మొత్తముమీఁద నీతొలిప్రబంధములలో మూలకథ ముక్తసరియగుటయు నవాంతరకథ లల్లిబిల్లినల్లుకొనుచుండుటయుఁ గారణముగా, మన దృష్టి ప్రధానకథయందు, ప్రధానపురుషులయందు లగ్నము కాకపోయెను. ఈవిషయము నా కాలమునఁ గనిపట్టినవాఁడు ముక్కుతిమ్మనార్యుఁడు. అవాంతరకథలచే చిత్తవిక్షేపము గావింపక యొక్క సరళవిషయము (Simple incident)తోఁ గూడిన చిన్నకథ నొకదానిని గ్రహించి, దానిని చక్కని ప్రబంధముగాఁ దన కల్పనాచాతురిని మెఱయించి తీర్చి దిద్ది, వర్ణనలయందుఁ జిక్కక కథావేగముచే మనదృష్టి నాకర్షించు

నట్లొనర్చి, యాకాలమున నొకక్రొత్త యభిరుచిని కల్పించిన వాఁడయినాఁడు. ఆంధ్రప్రబంధలక్షణములన్నియు నీతనిగ్రంథమున సరియైన పాళ్లఁబడినవన వచ్చును. అట్టి చక్కని సమ్మేళనము కుదురుటచేతనే దీని కట్టి యపూర్వ రామణీయకము కలిగెను. ఆంధ్రప్రబంధపరిణామ క్రమమున నిదియే యుచ్చస్థానమును సూచించుచున్నదని చెప్పవలసియున్నది.

మన యెల్లనార్యుఁడు నీరాయల యాస్థానమున జరుగుచున్న స్వతంత్రాంధ్ర ప్రబంధ నిర్మాణ ప్రయత్నముల నన్నిటిని గమనించుచునే యుండెను. ఇంతకుఁ బూర్వము తాను శ్రీనాథునివలె రాధామాధవాది గ్రంథముల భాషాంతరీకరణోద్యోగమునే కొనసాగించుచుఁ బెద్దనాదుల మన్ననలనుబడసి రాయలను మెప్పించి యాతనివలన బిరుదమునుగూడఁ బొందియున్నాఁడు. కాని సంస్కృతగ్రంథముల యాంధ్రీకరణముతోఁ దృప్తిఁజెందుకాలము గతించిన దనియు, నూతన ప్రబంధయుగము మొలకలు దేరినదనియు నాతఁడు కనిపెట్టెను. శ్రీనాథుని 'హరవిలాస' రచనముకూడ నీతని దృష్టి నాకర్షించినది. హరవిలాసముల కంటె విష్ణువిలాసములు మనోహరములు, చిత్తసమ్మోహనములునగు నని యాతఁడు తలంచెను. కానివీనిని గుదిగ్రుచ్చుట యెట్లు? హరవిలాస కథలనన్నిటిని శ్రీనాథుఁడు తానే యేకరువు పెట్టియున్నాఁడు. తాను నట్లే యీ కథల నేకరువుపెట్టుటా? రాయలును, ఆంధ్రకవితా పితామహుఁడును, ఏమిచేసిరని పరిశీలించి యుండును. మనుచరిత్రమునందలి కథలకన్నిటికిని "మనుసంభవము" తోడి సాక్షాత్సంబంధమేమియుఁ గనఁబడలేదు. "ఆముక్తమాల్యద" లోని మూలకథకు నత్యావశ్యకములుగాని యవాంతరగాథలు విశేషముగనే చేరినవి. కాని వీనియందలి యతుకులు కనఁబడకుండఁ జేయుటకు వీరుపడినపాట్లను గమనించెను. విష్ణుని మాయావిలాసకథలకన్నిటికి నొకవిధమగు నేకీభావమును దానును గుదుర్చుకొనవలసియున్నది. ఈసందర్భమున తిమ్మనార్యుని పారిజాతాపహరణ రచన యీతని భావనాశక్తిని ప్రచోదనము చేసియుండును. పారిజాతాపహరణకథ కావలికథగా (Sequel) దీని నెత్తుకొనినచో విష్ణువిలాసకథలను దానికి గుదిగ్రుచ్చ వచ్చునని యాతఁడు తలంచెను. సత్యామానినీత్వము, తద్గర్వోపశమనము నాధారముగాఁ జేసికొని యీకథలకు దానితో నైక్యాను సంధానము కలుగఁజేసెను. ఈరెండు భాగములకును నడుమ కొలికిపూస కృష్ణుని నర్మసఖుఁడగు గోవిందశర్మ. కృష్ణుని మాయాకేళీరూప కథాసూత్రముచే నీ హారము సుసంబద్ధంబైనది. ఈవిష్ణుమాయాకేళీవర్ణనమునకుఁ దొలిరంగము సత్యాదేవి సమక్షము. ఆమె కీతఁ డాకథాహారము నొసంగి మనఃప్రసాదంబుఁ గలుగఁజేసి యామెవలన పారిజాతమాలికను బహుమానముగాఁ బడసెను. ఈ కథావర్ణనమునకు రెండవ రంగము

ధర్మరాజసభ. సత్యాదేవి యెదుట నీతఁడు వర్ణించిన కథలే యొకప్రబంధమయి విష్ణుమాయానాటకమునాఁగ మహి వెలసినవి. తాను రచింపఁదలఁచిన ప్రబంధము నందు వస్త్వైక్యము సమకూరునను తలంపుతో రాధామాధవ కవి గోవిందశర్మ చేతనే విష్ణుమాయానాటకమను ప్రబంధము నొకదానిని రచింపఁజేసి దానిని ధర్మజు సభలో నేకరువుపెట్టించిన ట్లగపడుచున్నది. ఈ ప్రబంధరూప నాటక మునకుఁ బూర్వరంగమును గల్పించుటలోనే యెల్లనార్యుని ప్రతిభావిశేషము వెల్లడియగుచున్నది. "అనన్య దైవసామాన్య తేజోవిలాసంబుల వెలయు విష్ణుండె పరమపురుషుండని యుపనిషన్మర్మంబులవలనఁ దెలిసిన మహామతులును లోకం బులం బ్రవర్తించు టుడిగి తద్దివ్యవిష్ణుధ్యేయ తేజోరూపంబు తుదిముట్టం గాంచి తదాత్మకంబునుం బొందక త్రివర్గ ఫలభోగంబు లనుభవించు నల్పసుఖాను సారు లగుచుండుటకుఁ గతంబేమియో సంశయవిచ్ఛేదంబుగా నెఱింగింపవే" యని పరీక్షిన్నరేంద్రుండు శుకి బ్రహ్మనడిగిన ప్రశ్నకు సమాధానమే యీప్రబంధ వస్తువు. అనఁగా నీ వుపనిషన్మర్మంబుఁ దెలిసినవాఁడవుగదా యీ తేజోరూపా త్మకుండవుగాక యిట్లు నేలయుని శుకుని బరీక్షిత్తడిగిన ట్లయినది. దాని కాతఁడు బదులుచెప్పుచు వ్యాసప్రశంస కొంత చేసినాఁడు. అతఁడు చెప్పిన సమాధాన మిది! శ్రుతు లనంతములు.

'అం దొక పరమాణ్వంశము
నందైన సకృత్స్కముగఁ దదర్థముఁ దెలియన్
బొందుపడదు వ్యాసమహ
ర్షీంద్రప్రముఖులకునైన, నృపకులతిలకా.'

అని చెప్పి విష్ణు మాయగాఢిమయమును వర్ణించి లక్ష్మీశబ్రహ్మరుద్రాదులే యాతనిమాయ నతిక్రమింపలేక పోయిరని తత్కథోపక్రమణము చేయుచు నాతని తాతయగు ధర్మరాజు సభకు నాతనితోపాటు మనలను గొనిపోయెను. అచ్చట నీప్రశ్నయే మరల బయలుదేరినది. వ్యాసుఁడు ప్రత్యక్షముగ సభలోఁ గూర్చుండియున్నాఁడు.ధర్మజునకు నీసందేహమే పొడమినది. 'మాయావేషధారియై జగంబులు నడుపుచుండు నాతని విలసనంబుగాన లేక భ్రమసి తిరుగు తనఖోంట్లు ముక్తివడయఁ జాలరుగాక; విజ్ఞానదృష్టి నతని మొదలితేజంబుఁ దెలిసి కృతకృత్యు లైన వ్యాసాదులును దత్పరమసాయుజ్యముఁబొందక యుండుటకుఁ గారణంబేమి' యని. దానికి వ్యాసుఁ డిట్లు బదులు చెప్పెను "విష్ణుని మాయాతిమిరంబు జగం బులన్నియుఁగప్పి సకలజనుల నజ్ఞానాంధులఁ గావించును. అతనియందు భక్తి యెక్కించిన పరమభాగవతులకుఁ దక్క నితరుల కద్దాని భేదింప నలవికాదు. అహం కార గ్రంథులై విష్ణుమాయం దిరస్కరించి బ్రహ్మరుద్రాదులే మోసపోయిరి.

మేమెంతవారము." అని వారు మోసపోయినరీతినిఁ దెల్పుకథలను జెప్పనున్న సమయమున హఠాత్తుగా నాకాశమున నొక దివ్యతేజస్సు పొడ సూపుటయు, నంతఁ గృష్ణుని నర్మసఖుఁడగు గోవిందశర్మ మునిబృందములోఁగూడి ద్వారకనుండి కృష్ణునిపంపున నాధర్మజుని సభ కేతెంచుటయు, వ్యాసుఁడు ధర్మజుని సభయందు విష్ణులీలా కథలను జెప్పనున్న సమయంబుననే ద్వారకలో ముని బృందముకూడ నాకథలను వినఁ గుతూహలులై యుండుట తటస్థించుటం జేసి, కృష్ణుఁ డీవిషయమును గనిపట్టి యేకక్రియచే నర్థద్వయమును సాధింప నెంచి, ముఖ్యముగాఁ దానై చెప్పుటగాని, తనయెదుట నవి చెప్పఁబడుటగాని వారించుటకుఁ గాఁబోలు వారి నందఱిని నర్మసఖునితో నిచ్చటికిఁ బంపుటయుఁ దటస్థింపగా నా గోవిందశర్మ స్వీయవృత్తాంతముతోఁ బ్రారంభించి దానిమూలముగా విష్ణుమాయా కథలను జెప్పుటకు వ్యాసాదుల కంటెఁ దనకెక్కుడు యోగ్యత కలదని వ్యక్తము చేయుచుఁ దన ప్రబంధమును వినుపింప మొదలిడునట్లు చేసి యీసమయంబున నీకవి ధర్మనందన సభాసదుల చిత్తంబులు వలెనే మన చిత్తంబులు నాశ్చర్య కౌతూహలంబులచేఁ దహతహలాడుచుండునట్లు చేసెను. వ్యాసుఁడే యాకథలను జెప్పనున్న సమయమున గోవిందశర్మాగమన రూపమగు నవాంతరగాథ నొకదానినిఁ దెచ్చిపెట్టి యీకవి యీసందర్భమునఁ జదువరులకు గాఢమైన చిత్తవ్యాక్షేపమును (Mental suspense) గల్పించినాఁడు. ఈ నూతనగాథ యీ కథాసన్నివేశమునకు వింత సొంపు నాపాదించినది. వ్యాసునికంటెను కృష్ణుని నర్మసఖుఁడును సహచరుఁడునగు గోవిందశర్మ యాతని వింతచర్యలనుగూర్చి చెప్పుట కెంతయు నర్హుఁడుగదా. మఱియు నీతని మూలముగా బయలువడిన పారిజాతమాలికా వృత్తాంతము కృష్ణుని యంతఃపుర చర్యలను, ఆతని మాయావిలాసముల, వెలిపుచ్చుచు లక్ష్మీ బ్రహ్మరుద్ర నారదులనుగూడ నా యారూపముల మోసపుచ్చిన మాయానాటక సూత్రధారుఁ డిప్పు డీకృష్ణరూపముననున్న పరమాత్ముఁడే సుమీ యని ధర్మజాదులకు నచ్చఁజెప్పుటలోఁ బ్రకృతోపయోగముగలదికూడ నైనది.

కథాకథనమున నిట్టి చిత్తవ్యాక్షేపమును గల్పించుటలో నీకవి కసాధారణప్రజ్ఞ కలదు. లక్ష్మీదేవి మాయాలక్ష్మి తపఃప్రకారమును జూచి వెఱఁగందు పట్టునను, ఆకాశవాణి చండదమనుని కథ చెప్పునప్పుడునుగూడ నిట్టి చిత్తవ్యాక్షేపమును గల్పించి యద్భుతరీతిని మన కౌతూహలమును బురికొలుపుచున్నాఁడు. ఇట్టికథల కత్యద్భుతమగు నూతన సన్నివేశమును గల్పించుటచేతను, వర్ణనాంశములను విశేషముగఁ బెంచి కథావేగము కుంటుపడునట్లు చేయక దాని కనువుగ సహజధారాళము మృదుమధురము నగు సరళశైలిలో నీ గ్రంథమును రచించుటచేతను ఈకవి యాకాలపు ప్రబంధరచనా పద్ధతిలో నొక క్రొత్తత్రోవఁ దీసినాఁడని చెప్పవలసియున్నది. మఱియు ననవసర శబ్దాడంబరము

పొంతఁబోక, పాండిత్యప్రకర్షనుజాటు దీర్ఘసమాస గూఢాలంకార కల్పనాదుల యందు విశేష దృష్టి నిడక చమత్కార సన్నివేశములతోఁ గూడిన కథాసందర్భ ములచేఁ జదువరుల కౌతూహలము ననవరతముఁ బురికొల్పుచు సహజగంభీర మగు శైలిని రచించుటలో నీతఁడు పింగళి సూరనార్యునికి దారి జూపిన వాఁ డనవచ్చును.

రచనాపద్ధతి విషయమున శ్రీనాథుని హరవిలాసము, తిమ్మనార్యుని పారి జాతాపహరణముఁ గొంతవఱ కీతనిని ప్రోత్సహించి యుండునని తలంపఁదగి యున్నట్లు, ప్రబంధ వస్తుసంగ్రహణ విషయమున భాగవతము—ప్రాయశః పోతన కృతము—ఈతనికిఁ గొంత సాయపడినదని తలంపవచ్చును. ప్రధానవస్తువగు విష్ణులీలాగాథలనన్నిటిని గురించుచు విషయమున పారిజాతాపహరణ కథా సందర్భమీతని కుపచరించినది. ఇంక నీప్రబంధవస్తు వంతయుఁగూడ భాగవత కథకుఁ దరువాయికథ యనఁదగునని చెప్పటకుఁగల కారణ మిది. శుకయోగివలన నచ్యుతక్రీడల నన్నిటిని వినిన తరువాత నాతనికిఁ గలిగిన సందేహముతోడను, దన్మూలకమగు ప్రశ్నతోడను ఈ గ్రంథము ప్రారంభమగుచున్నది.

"భాగవతముఖ్యుఁడగు శుకబ్రహ్మచేత
భాగవతసత్కథాపరబ్రహ్మ విద్య
నెలమి వినుచు బరీక్షిన్న రేంద్ర చంద్రుఁ
డచ్యుతక్రీడ లాత్మ కింపారఁ బలికె."

విష్ణుండు పరమపురుషుండని యుపనిషన్మర్మంబులవలనఁ దెలిసిన మహామ తులును సర్గస్థితి ప్రళయ వికారాంకలితంబులగు లోకంబులం బ్రవర్తించుటడిగి తదాత్మకంబుఁ బొందక త్రివర్గఫల భోగంబు లనుభవించుచు నల్పసుఖాను సారు లగుచుండుటకుఁ గతంబేమి యని యాప్రశ్న. ఆ భాగవతమునందలి పరీక్షిత్తున కీసందేహము కలిగినదో లేదో కాని, మనయెల్లనార్యుని కిట్టి సందేహము కలిగి యుండును. తన్నివారణోపాయాన్వేషణ కారణముననే యాతఁ డీవిష్ణుమాయా నాటకరచనము నారంభించి యుండునని యూహింపనగును. దీని కొక విధముగ సమాధానము మొదటనే చెప్పినాఁడు.

సాత్వికధీవిభవము గలిగి
"యేకాగ్రనిష్ఠ మహా

ధీరుండై హరిమూర్తి నాత్మనిడు నాధీమంతుఁ డామూర్తి సం
స్కారం బొప్పఁగ సచ్చునట్లు ప్రతిమ యోజం జెందు చందానఁ దే
జోరూపంబున ముక్తుఁడై వెలుఁగును." అని.

ఏ యచ్చులోఁ బోసినవస్తు వారూపమును జెందినట్లు హరిమూర్తి నేకాగ్ర నిష్ఠతో ధ్యానముచేసి వాఁ డాతనిరూపమునే చెందును. "యాదృశీ భావనా యస్య సిద్ధి ర్భవతి తా దృశీ" యనున్యాయంబున ధ్యేయవస్తు స్వరూపమునుబట్టి యొవని ముక్తి వానిచేతులోనే యున్నదని దీనివలన సూచించుచున్నట్లున్నాఁడు. అట్టివాఁడు ముక్తుఁడై తేజోరూపంబున వెలుఁగునట. అనఁగా నాధ్యేయస్వరూపుఁడగు హరియు తేజస్స్వరూపుఁడేయని భావము కాఁబోలును. దీనినిఁబట్టి ముక్తియనునది స్వయం సంపాద్యమేగాని యొకరి కరుణాధీనము కాదన్నట్లగపడుచున్నది. కాని యిట్టిమతి కలుగుట దుర్లభమఁట; కలిగినను వైష్ణవులకే కలుగునఁట.

"అంత సాత్త్విక క్రియయు నంతనిశ్చల
సూక్ష్మదృష్టియును విశుద్ధమతియు
సంభవించు మానసం బన్య మతముల
వాలకున్న పరమవైష్ణవులకు."

అట్టిమనంబు పరమ వైష్ణవులకువలెనే పరమ శైవులకును సంభవింపనే సంభవింపదు కాఁబోలును. ఇచ్చట నిట్లుచెప్పినను కవియొక్క నిరూఢాభిప్రాయము శివకేశవులకు భేదములేదనియే మార్కండేయుని కథాసందర్భమునను దెలియ వచ్చుచున్నది. పరమ శివభక్తుఁడగు మార్కండేయుఁడు విష్ణుగర్భమునఁ బ్రవేశించి యచ్చటి భువనంబులఁ గ్రుమ్మరుచు శివునికొఱకే వెదుకసాఁగెను. అచ్చట శివునిఁ జూచి క్రమ్మఱ యీవలకు వచ్చినపిదప విష్ణువు 'మునీంద్రా, చంద్రశేఖరుం జూచితివే'యని యడిగి 'నీవు వీరశైవుండవు నాయంశభేదంబగు శివునియందభక్తి నలుపు మది మదీయ హితప్రవర్తనం'బని కరుణించిన ట్లీకవి తెలిపియున్నాఁడు. సర్వవాంఛలను విడిచి కేవల మోక్షమునే కోరుచు నత్యంతతీవ్రతపంబునల్పిన చండదమనునికే విష్ణుమాయకు లోఁబడి యాతని యనుగ్రహము కలిగినపిదపఁగాని మోక్ష మబ్బినదికాదఁట. అనఁగా మోక్ష మొకని యనుగ్రహమువలనఁగాని కలుగునదికాదని చెప్పినట్లయినది. కావుననే కవి యిట్లు చెప్పినాఁడు:

"కమలదళాక్షుఁ డింతటికిఁ గారణ మా వెడగాని యింద్ర జా
లము భువనత్రయంబు సకలక్రియలుం దదభీష్టకేళి తం
త్రము లరయంగ నాతనిమనంబున కెట్టులు దోఁచె నట్ల వి
శ్వము జరియించు నెవ్వరికి శక్యము స్వేచ్ఛభరంబు నొందఁగన్.'

ఇట్లు మోక్షమనునది స్వయముగ సంపాదింపఁదగినదా, యొకరిచేఁ గటాక్షింపఁదగినదా యనువిషయమును సమన్వయించుటకే యీతఁడు తంటాలుపడినట్లున్నది. ఎట్లయినను సకృత్స్నముగ "తదర్థము తెలియం బొందుపడదు" అనునదియే యీ కవి స్వీయాభిప్రాయమేమో ? "మీవంటివారుకూడ నేల తదాత్మకంబునుం బొందలే"దను ప్రశ్నకు వారుచెప్పిన ప్రత్యుత్తరమునుబట్టి శుకుఁడు, వ్యాసుఁడునుగూడ తాదాత్మ్యమునుబొంది తేజోరూపంబగు ముక్తిని బడయఁగలిగినవారు గాలేదనియే తెలియవచ్చుచున్నది. దీనినిఁ బట్టి సృష్టితత్త్వము మాయాతత్త్వమును మహామునులని పేరుపెట్టుకొనిన వారికినిగూడ నెఱుకపడలేదనియు, వ్యాసునివలెనే యెవరికిఁ దోఁచినట్లు వారు తెలుపుచుందురనియు, నాకారణముచేతనే నీలోకమున ననేకమతములు బయలుదేరినవనియు, నీజగన్నాటక సూత్రధారుఁడందలిపాత్రల నెటులాడించిన నటులాడవలసినదే కాని స్వేచ్ఛఁ జరింప నెవ్వరికిఁ శక్యముకాదనియు మనకు వ్యక్తపఱచుటయే యీ కవి ముఖ్యాభిప్రాయముగాఁ గనఁబడుచున్నది. ఇది "మమ మాయా దురత్యయా" యను గీతావాక్యానుసారంబై యున్నదనుటకు సందేహము లేదు. దీనికి పరిహారముకూడ నచ్చటనే చెప్పఁబడియున్నదిగదా. "మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే." అని. దీనినిబట్టి కర్మవాదమున కిందు తావు లేన ట్లగపడును. నిశ్చలమగు నేకాంత భక్తితో విష్ణువునే పూజించిన పుండరీక మహామునికిని, ఏకావధాన పరమ యోగాధీన మానసుండై బ్రహ్మరుద్రాదులకుఁగూడ నందరాని ముక్తిని బడసి నిరుప మానానందము నొందుదుననియున్న చండదమునునకును విష్ణువు తనమాయను జూపిగాని ముక్తినీయనని పంతంబువట్టి వారిని దనమాయలోఁ బడవేసెనఁట. పుండరీకుఁడు జగమంతయు మాయాకల్పితమను నారదుని మాటలను విని సంశయగ్రస్తుఁడై మాయను శంకించి దానిని తనకుఁ జూపవలయునని కోరినవాఁడగుటచే నాసంశయమును దీర్చుటకుఁగా విష్ణు వాతనికిఁ దనమాయనుఁ జూపెఁ గాక. చండదమునుఁ దొల్లనన్నను "నాతనియుల్లంబు రాజ్యసంపదల వెల్లి గొలిపి, యావల మోక్షమిత్తునని దివ్యచిత్తంబునఁ దలంప"నేటికో ? కేవల సాత్త్వికవృత్తిం బ్రపన్నుఁడుగాక, విష్ణుమాయం బడక ముక్తివడయుదునని తపం బొనర్ప నేలయుని పరమపురుషునికిని అలుక వ్రెడమెను గాఁబోలు. ఆతఁడు దయామయుండే !

ఇట్లు ప్రతిజ్ఞ వట్టించుటయు నాతఁడాడించిన యాటయే యేమో ? స్వేచ్ఛ జరింప నెవ్వరికి నశక్యంబని శుకుఁడు చెప్పియే యున్నాఁడుగదా! మఱియు నీతఁడు తొలుత రాజ్యసుఖం బనుభవింపవలయునని తలంచెఁగాక. పిదప సనకుని బోధనంబున నది వాంఛింపఁ దగినది కాదని తెలిసికొని, దానినుండి చిత్తవృత్తిని సంపూర్ణముగా మరల్చి మోక్షమునేకోరి ఘోరతపం బొనర్చినను దొలుత నొకసారి రాజ్యభోగ కాంక్ష గలిగినమాత్రముననే యీతనికిఁ గర్మఫలం బనుభవింపక తీరనిదై

యేర్పడినదని చెప్పుదురుగాక. కాని భావమాత్రము చేతనే యనుభవించి తీర వలసిన కర్మఫల మేర్పడుచుండ నాభావముచేతనే దానిని వెంటనే తిరస్కరించి పశ్చాత్తాపమునుబొంది, పూర్వముకంటెఁ దీవ్రంబగు నేకాగ్రబుద్ధితో మోక్షము కోఱకు ఘోరతపంబు సలిపినయపు డామోక్షము తనంతన యాతనికి లభింపఁ గూడదా ? ముత్తముమీఁద కర్మవాదమునకును ప్రవృత్తికిని సంబంధము కుదుర్చుటలో నీచిక్కు లేర్పడుచున్నట్లున్నవి. విష్ణుభక్తులలో నుత్తమ భక్తుఁడగు నారదునికిఁగూడ నీకర్మబాధ తప్పినదికాదు. ఈతఁడు బ్రహ్మరుద్రాదు లెట్లు మోసపోయిరో ప్రత్యక్షముగఁ జూచినవాఁడును, విష్ణుమాయలన్నిటినిఁ దటస్థుఁడై పరికించుచున్నవాఁడును గావున మాయామోహితుఁడు గాకుండు ననుటలో నాశ్చర్యము లేదు. కాని మాయామోహితుఁడనుగానని యాతఁడు విష్ణునొద్దఁజెప్పుకొనిన తోడనే యాతనికిఁ "బురాకృత కర్మశేషం బనుభవింపఁ గారణంబు గలిగె"నఁట. ఆకర్మశేషం బనుభవించుటకుఁగా "మోహామగ్నంబులైన బ్రహ్మాండ మండలం బులలోనఁ దానొక్కరుండును గులాల కీటకంబునుంబోలె భవపంకంబునం బొర యక ప్రవర్తించు" నట్టి యాతఁడును మాయాప్రేరితుఁడై మహీమండలంబున గోదావరీతీరంబునందలి సర్వవరగ్రామమునకు రావలసివచ్చినది. భవపంకంబునం బొరయని యాతని మోసపుచ్చి హఠాత్ప్రాప్తంబైన యాకర్మఫలముఁ గుడు పుటకుఁగా విష్ణువు తాపసవేషమును ధరించి వైకుంఠమునుండి యాయూరికి దిగవలసివచ్చినది. ఈకారణముచే నాసర్వవరగ్రామమునుమాత్రము ముక్తిక్షేత్రమై యప్పటినుండి యిప్పటికిని వెలుఁగొందుచున్నది.

మూఁడవ యాశ్వాసమునందలి మార్కండేయుఁ డహంకారా విష్టుండగు బ్రహ్మకు విష్ణుప్రభావమునుజెప్ప యాతనిఁ బ్రబోధించు సందర్భమునకుఁగూడ భాగవతములోని ద్వాదశ స్కంధమునందలి మార్కండేయుని వృత్తాంతమే దారిచూపి యుండవచ్చును. ఈ కథయు నేపురాణమునందైన దెలుపఁబడి యుండె నేమో తెలియరాదు. కాని యిందీకథయొక్క యెత్తుగడనుబట్టి భాగవతకథ యాతని మనము నంటియుండెనని తలంపఁదగియున్నది. "లోకంబులు కల్పాంత సమయంబునం గబంధమయంబులయి యంధకార బంధురంబులయి యున్నయెడ నేకాకియయి చరించుచు బాలార్క కోటి తేజుండయిన బాలుని హృదయంబు ప్రవేశించి యనేకసహస్ర వత్సరంబులు దిరిగి వటపత్రశాయియగు న యబ్బాలునిఁ గ్రమ్మఱంగనియె"నను భాగవతవచన మిచ్చట మార్కండేయుఁడు బ్రహ్మతోఁ బలికిన యాపలుకులఁ దలఁపించుచున్నది.

" నిన్నగాదు మొన్న నీవు జనించుట
నిపుడు సంభవించె నీజగంబు

V—D

నీవు పుట్టకమున్ను మున్నీటిమీఁద
బాలవటపల్లవంబున బాలమూర్తి
నొంటి బవళించి హరి దివ్యయోగలీలఁ
దన్నుఁదా నాత్మ భావించు చున్నవేళ."

నేనొక్కరుండ నీటిలోనఁ దోడెవ్వరులేక యెల్లెడలఁ జీకాకుపడుచు నీఁదుచు మునుగుచుఁ గ్రుమ్మరుచు నొక్కవలన విపుల మాయాచరిష్ణుఁ విష్ణుఁగని మిన్నుమోచియున్న యమ్మున్నీటిమీఁదఁ దేలియాడు నాముద్దుగద్దరి బాలుం డెవ్వఁడో యని తలంచి డాయంబోయి .. ... ...నోఱుదెఱచిన నేను గిరి గుహా గర్భంబునుంబోని తదభ్యంతరంబుఁ బ్రవేశించి కైలాస వానుండగు నిందు ధరుని దర్శించి."

బోయదాని తగులమునఁబడిన నైష్ఠికుఁడగు బ్రాహ్మణుని కథ యీగ్రంథ మునసేకాక యీతని తారకబ్రహ్మరాజీయముననుగూడఁ గానవచ్చుచున్నది. ఇది యీతని కంతయాదరపాత్రం బెట్లయ్యెనో తెలియదు. బోయువనితయొక్కయు, బోయకుటుంబముతో గోదావరీతీరమునకు బయలుదేరిన పుండరీకునియొక్కయు వర్ణన మతిస్వాభావికమయి యొప్పుచున్నది.

లక్ష్మీనారాయణులు శివపార్వతులను గౌరవించిన విధముఁజూడ రాయల యాస్థానమునందలి రాజమర్యాదలను జూచి కవి యట్లు వర్ణించెనాయని తోఁపక మానదు. "పసిఁడికంబాలువేయింట బాగుమీఱి మరకతోపల సోపానమార్గ మిడిన, పెద్దమొగసాలమేడ సంప్రీతిఁగాంచి," శివుఁడును బార్వతియు వాహనము డిగ్గుటయు, నది విని నారాయణుండు నెదురుగఁ జనుదెంచెనఁట. అప్పుడు

"హరి యంతఃపురినుండి వచ్చుటయు నయ్యైసేవకై యున్నవా
రురువేగంబున వామదేవ శుకముఖ్యుల్ చేరి కాళాంజి యొ
క్కరుఁ డొక్కం డడపం బొకండు నిజఖడ్గంబు న్వహింపంగ నొ
క్కరుఁ డొప్పారఁగఁ బట్టె నుజ్వలత ముక్తాచ్ఛత్ర మగ్రంబునన్."

రాయల యాస్థానమున జరుగు మర్యాదలను అనఁగా నాతఁడు కదలుట తోడనే యయ్యైసేవకై యున్నవా రా తనివెంట కాళాంజి, అడపము, ఖడ్గము, ఛత్రము మొదలగు వానిని బట్టుకొని నడచు నాచారమును వైకుంఠంబున శ్రీకృష్ణునికిఁగూడ నీకవి తగిలించియున్నాఁడు. శివుఁడు నారాయణమూర్తి హజారము నొద్దకుఁ బోవునప్పుడు కవిచే వర్ణింపఁబడిన "పసిఁడికంబాలు వేయింట బాగుమీఱి మరకతోపల సోపాన మార్గమిడిన, పెద్ద మొగసాలమేడ"యు రాయల నగరు యొక్క ప్రతిబింబమే యైయుండవచ్చును. కవులు తమ జీవితములందలి యనుభవ విశేషములను దమగ్రంథములయం దొక్కొకప్పుడు చొనుపుచుందురనుట కిది

యొక నిదర్శనముగా గ్రహింపవచ్చును. బాహ్యవృత్తమును వర్ణించుకవి (Objective poet) యైనను దన దేశకాల స్థితులను స్వానుభవమును మీఱఁ గలఁడనుట యసంభవము గదా!

ఈ యాశ్వాసమునఁ బూబంతియాడుచున్న మోహినీకాంతా వర్ణనము భాగవతమందలి పోతన వర్ణనమును దలఁపించుచున్నది. "ఎలదీగెలు గప్పిన పొన్ననీడ నున్నెక్కిన రత్నవేది నొక యిక్కువఁ జెంపెసలార వేడుకన్."

సీ. "పయ్యెద దిగజాఱఁ బసిఁడి చాయలు దేరు
చనుదోయి ముత్యాలసరము వెలుఁగ
బహుతాడనాయాసభార జాతస్వేద
కణములు గండభాగముల నురల
ననుగతదృష్టి సంహతితోడ సౌరభా
గతమత్తమధుపసంఘములు చెలఁగ
గ్రహణమోక్షణవేళ ఘుళఘుళత్కారపద్మ
మణికాచకంకణ రణన మెసఁగఁ

తే. గంపితోత్కటకటిభార కల్పభూజ
పుష్పములు రాలి దిశలఁ బుష్పాళ్లు చెదరఁ
గ్రీడమై తానె పూబంతి యాడుచున్న
యవ్విలాసినిఁ గనియెఁ జంద్రార్ధమౌళి."

ఈ విలాసినిని పోతన యెట్లు వర్ణించినాఁడో చూడుఁడు :

సీ. ఒకయెల దోఁటలో నొకవీథి నొకనీడఁ
గుచకుంభములమీఁదికొంగు దలఁగఁ
గబరికాబంధంబు గంపింప నుదుటిపైఁ
జికురజాలంబులు సిక్కువడఁగ
ననుమానమై మధ్య మల్లాడఁ జెక్కులఁ
గర్ణకుండలకాంతి గంతు లిడఁగ
నారోహభరమున నడుగులు దడఁబడ
దృగ్దీప్తి సంఘంబు దిశలఁ గప్ప

తే. వామకరమున జాఱిన వలువఁ బట్టి
కనకనూపుర యుగళంబు ఘల్లనంగఁ
గంకణంబులఝుణ ఝుణత్కార మెసఁగ
బంతిచేనాడు ప్రాయంపుటింతిఁ గనియె."

భాగవత కథానుసారముగనే శివుఁడు విష్ణుని మోహినీరూపముచే మోహితుఁడై పట్టంజూచి వంచితుఁడయ్యెనని చెప్పెనే కాని స్కాందపురాణాదులకథ ననుసరించి కుమారోత్పత్తి గలిగిన ట్లీతఁడు చెప్పియుండలేదు. శివునికి జగన్మోహినియందు శాస్తయను కుమారుఁడు గలిగినట్లు స్కాందపురాణమువలనఁ దెలియవచ్చుచున్నది. ఈ 'శాస్త' నే దక్షిణదేశమున తమిళగ్రంథములు 'చాత్తన్' అని పేర్కొనుచున్నవి. తెలుఁగుదేశమున గ్రామీణులచేఁ బూజింపఁడుచుండు 'పోతరాజు' అను దైవ మీశివమోహినుల పుత్త్రుఁడను వాడుక గలదు. ఈ శాస్త యొక్క శిలావిగ్రహము వాఁడు ముక్కున వ్రేలు పెట్టుకొని నిలబడియుండినట్లుగాఁ జెక్కఁబడినదఁట. శాస్త శాసించువాఁడగుటచే, అనఁగా జనులను దుష్ప్రవర్తనమునుండి తొలఁగించి సన్మార్గమునఁ బ్రవర్తింప శాసించువాఁడగుటచే ముక్కున వ్రేలుపెట్టుకొని యదలించుచున్నాఁడను నభిప్రాయమును సూచించుటకుఁగా నట్లు చెక్కఁబడియుండును. దీనినిగూర్చి యొక చిన్నకథకూడఁ జెప్పెదరు. ఒకనాఁడు శిష్యులతోఁ బోవుచున్న యప్పయదీక్షితుల కిట్లు ముక్కున వ్రేలు పెట్టికొనియున్న శాస్తవిగ్రహ మొకటి కంటఁబడఁగా నీతఁ డిట్లు ముక్కున వ్రేలిడుటకుఁ గారణమేమి యని యనుచరు లడిగినట్లును, 'నే నా కారణముఁ దెల్పి యా ముక్కుమీఁది వ్రేలు తీయించి వేయుదు'నని చెప్పి యా విగ్రహము చెంతకుఁ బోయి.

"అంబేతి లక్ష్మీపతి మాహ్వయామి
పత్న్యః పితు ర్మాతర ఏవ సర్వాః
కథంను లక్ష్మీ మితి చింతయంతం
శాస్తార మీడే సకలార్థసిద్ధ్యై."

అను పద్యమును జదివినతోడనే నావిగ్రహ రూపముననున్న శాస్త ముక్కుపైనున్న వ్రేలు తీసివేసెనఁట! మొత్తముమీఁద శివమోహినుల కొక పుత్త్రుఁడు కలిగినట్లు తెలుపుగాథల ననుసరింపకుండుటచే నీతఁడు భాగవతకథనే యనుసరించి రచించినాఁడని నిశ్చయింపఁ దగియున్నది.

ఇఁక పంచమాశ్వాసము నందలి నారదుఁడు విష్ణుమూర్తిచే వంచింపఁబడి స్త్రీరూపమును బొందుటను గూర్చిన కథకు భాగవతమున నాధారమేమియుఁ గనఁబడదు. కాని వ్యాసరచితమే యగు దేవీభాగవతమున నారదుని గూర్చిన కథలు కొన్ని కలవు. వానిలో నీకథయుఁ గలదు. భాగవతమున నొకనాఁడు వ్యాసుఁడు విచారగ్రస్తుఁడై కూరుచుండియుండ, నారదుఁ డాతనియొద్దకువచ్చి ప్రపంచము వాసుదేవ మాయామయమని చెప్పి, యాతనిలీలా విలాసములను వర్ణింపుమని హెచ్చరింపఁగా నాతఁడద్దానిని రచించినట్లు కలదు.

దేవీభాగవతమునఁగూడ నిట్లే వ్యాసుఁడు విచారగ్రస్తుఁడై కూర్చుండి
యుండ నారదుఁ డాతనియొద్ద కేతెంచి తన పూర్వజన్మవృత్తాంతమునుగూర్చి
చెప్పినసందర్భమేకలదు. కాని యచ్చట వ్యాసుని విచారమునకుఁ గారణ మరణ్యా
వాస మూలకమగు పాండవులదుస్స్థితి. నారదుఁ డొకనాఁడు తన యాశ్రమునకు
వచ్చినపు డాతఁడు శాంతుఁడై నిశ్చింత నుండుటఁగని, యీ ప్రపంచమునఁ
బుట్టువుఁ గాంచుటవలనఁ గలుగు నానంద మెద్దియుఁ గనఁబడదు. అట్లయ్యును
దీనిచే మోహితులై మహామతులుగూడఁ గర్మ నెందులకొనర్తు రని యడుగుచు
వ్యాసుఁడు తన పుట్టువుపూర్వోత్తరములును, పాండవవనవాసగమనము నాదిగాఁ
గల వృత్తాంతములఁ దెలిపి, తన్మూలమునఁ దనకుఁ గలిగిన చిత్తక్షోభను, దుఃఖ
మును వెల్లడించి యెచ్చటను దుఃఖమేకాని సుఖము గానంబడుటలేదు. ఏమి
చేయునని మొఱవెట్టఁగా నారదుఁడు దేహధారియగు పురుషునకు మోహము తప్ప
దనియు, బ్రహ్మ, రుద్రాదులేకాక దేవర్షులందఱునుగూడ మాయామోహితు
లయియే యీసంసారమున భ్రమించుచున్నారనియుఁ జెప్పి తానునొకప్పుడు సామా
న్యమానవునివలెనే విష్ణుమాయచే మోసపోయితిననియావృత్తాంతమును దెలిపెను.
అందుఁ దొలుత పర్వతనారదులిద్దఱును దేవలోకమునుండి మర్త్యలోకమునకు
రాఁగా నచ్చట సంజయుఁడనురాజు కుమార్తెను నారదుఁడు మోహించుట
మూలమునఁ గలిగిన పర్వతుని శాపమువలనఁ దాను గోఁతిముఖకలవాఁడైన
వృత్తాంతమును దెల్పి, పిదప తాను మాయామోహితుఁడై స్త్రీరూపమును
జెంది యొకరాజుభార్యయై కొడుకులనుగన్న వృత్తాంతమునుగూడఁ జెప్పెను. ఎల్ల
నార్యునికథ కిదియే మూలమై యుండవచ్చును గాని, యీరెంటికిని కొంతభేదము
కలదు. ఎల్లనార్యుఁడే తనకనువగునట్లీ కథను మార్చినాఁడో, లేక యట్టిమార్పు
లతోఁగూడిన యాకథ మఱి యేపురాణమునన్నైనఁ గలదో తెలియరాదు. ఈ కథా
రంగము దేవీ భాగవతకథలో కనోజిపట్టణ సమీపస్థలమైయుండ ఎల్లనార్యుని
కథలో 'శేషాహిపవిత్రితసోనిష్ఠ మున్ను వెలసిన ముక్తిక్షేత్రంబగు సర్పవరం'బై
నది. మఱియు నీకథల యాద్యంతములలోఁగూడఁ గొంతభేద మగపడుచున్నది.
నారదుఁడు తాను మాయాజేతనని పంతంబులు పలుకుటకు సందర్భమును గల్పిం
చినది యెల్లనార్యునికథలోఁ గాంతాసహితుఁడగు విష్ణునియెదుట మాయాకాంత
చేసిన యింద్రజాల విద్యాప్రదర్శనము. ఈ ప్రదర్శనవిషయము దేవీ భాగవత
కథలో లేనేలేదు. అక్కడ కథాసందర్భ మిట్లున్నది. విష్ణుదర్శనార్థమై వీణ
వాయించుకొనుచు నారదుఁ డొకనాఁడు సత్యలోకమునకుంజని, యచ్చట లక్ష్మీ
దేవితో నేకాంతమున సల్లాపము సల్పుచున్న విష్ణునియెదుటకుఁ బోవఁగా,
వెంటనే లక్ష్మి యచ్చోటువిడిచి యావలికిఁ జనుటయు, నంత నారదుఁ డోజనా
ర్దనా, నేను వచ్చినమాత్రముననే లోకజననియగు లక్ష్మి నిన్ను విడిచి యావలకుఁ

బోనేల! నేను దుర్మార్గుఁడను గానుగదా! ఇంద్రియములను నిగ్రహించి మాయను జయించిన యతినిగదా నేను. కమలాదేవి యట్లు చనుటకుఁ గారణమేమి యని యడిగెను. దానికి విష్ణు విట్లు బదులు చెప్పెను. భర్తగాక యే పరపురుషుని యెదుటను స్త్రీ నిలువఁదగదు. నారదా, మాయను జయించుట కడుదుర్లభము. మహాయోగులే మాయను జయించలేకపోయిరి. నేను జయించితినని నీవు చెప్పఁదగిన మాటకాదు. అనాదియగు నామాయను బ్రహ్మరుద్రాదులు నేనునుగూడ జయించినవారము గాము. గుణబద్ధుఁడగు వాఁడెవ్వఁడైనఁగాని యీమాయను జయింపలేఁడు. రూపములేని కాలము మాయారూపములలో నొకటయి జగన్నిర్మాణ కారణ మగుచున్నది. జీవములన్నియుఁ గాలమునకు లోఁబడియుండును. మహాధర్మజ్ఞుని సైతమీ కాలము భ్రమియింపఁజేయుచుండును. అని విష్ణువు పలుకఁగా విని నారదుఁడు తాను మాయాస్వరూప మెట్టిదో తెలిసికొనఁ గుతూహలుఁడనై యుంటిననియుఁ దన కద్దానిని జూపవలయుననియు నడుగఁగా నాత్మవిజయము నొందనివారికి దానిని జయింప సాధ్యముగాదు. నీకు మాయను వేఱొకచోఁ జూపెదను రమ్మని, జనార్దనుఁడు నారదుని గరుడునిపై నెక్కించుకొని కనోజిపట్టణ సమీపమందలి యొక రమణీయంబగు సరోవరంబునకుఁ దోడ్కొనిపోయి, దీనియందు స్నానం బొనరించి కనోజిపట్టణమునకుఁ బోవుదము. నీవు ముందు స్నానం బొనరింపుము. నేను పిదప చేసెదనని యాతని నందుఁ గ్రుంకించెను. అట్లు మునిఁగిన నారదుఁడు స్త్రీరూపమున లేచునప్పటికి విష్ణువు గరుడారూఢుఁడై యాతని వీణెను దీసికొని తన స్థానమునకుఁ బోయెను. అంత తాళధ్వజుఁడను రాజొకఁ డచ్చటి కేతెంచి యా స్త్రీరూపమునకు మెచ్చి నీ వెవ్వరని యడుగుటయు, నేనెవ్వరో నాకుఁ దెలియదు; తల్లి దండ్రు లెవరో తెలియదు. ఎవ్వరు లేని యనాథను నన్ను రక్షింపుమని వేఁడఁగా నాతఁ డామె నొకపల్లకిలోఁ గొనిపోయి వివాహమాడెను. వీరికి సుధన్వుఁడు, వీరవర్మ మొదలగు వారు పండ్రెండుగురు పుత్రులుమాత్రమే గలిగిరి. ఇట్లు కొడుకులు, కోడండ్రు, మనుమలు మొదలగు వారితో సంసారము పెరుగ వారందఱు తనవాండ్రని తాను రాజపత్నిననియే తలంచెనుగాని నారదుఁడ ననుభావమే యాతనికిఁ గలుగలేదు. కొంతకాలమున కొక శత్రురాజు దండెత్తివచ్చి కనోజిపట్టణమును ముట్టడింపఁగా, నాయుద్ధములోఁ దన సంతానమంతయు మడియుటయు, రాజు కోటలోనికిఁ బాఱివచ్చెను. సంతానము నశించినందులకు దుఃఖించుచున్న యామెయొద్ద కపుడు బ్రాహ్మణునివేషమున జనార్దనుఁడువచ్చి దేవీ, నీవు దుఃఖింపనేల? ఇదియంతయు మోహము వలనఁ గలిగినమాయ నీవెవ్వరో, యీ పుత్రు లెవ్వరివారో యాలోచింపుము, ముందొక తీర్థమున స్నానముచేసి వారికిఁ దిలోదకముల నిమ్మని. అని యామె నావెనుకటి సరోవరమునకుఁ దోడ్కొనిపోయి యిందు స్నానమాచరించి నీదుఃఖ

ములను బోఁగొట్టుకొమ్మని చెప్పఁగా నట్లే యాపుంతీర్థమునఁ గ్రుంకి లేచుసరికి నారదునికి స్వస్వరూపము గల్గెనఁట. భగవంతుఁడగు హరి యాతని విపంచిని చేతఁ బట్టుకొని కొలనియొడ్డున నిలువఁబడియుండెను. అప్పుడు తాను నారదుఁడనియు హరి మాయచే నట్లు స్త్రీరూపమును బొందెననియు నాతఁడు గ్రహించెను. అంతట విష్ణువు 'నారదా, నీటిలో నేమిచేయుచున్నా'వని హెచ్చరించెను. ఇంతలో స్త్రీరూపమున మునిఁగి పురుషరూపమును జెందిన నారదునిఁజూచి యాతాళధ్వజుఁడు తన భార్య కనఁబడకుండుటను హఠాత్తుగా నారదుఁడచ్చటికి వచ్చుటనుజూచి నివ్వెఱపడి భార్యకై దుఃఖింపసాగెను. అంత హరి యాతని నోదార్చి నీవా స్త్రీ నిచ్చటనే చేపట్టితివి యిచ్చటనే యామెమాయమయ్యెను. ఇదియంతయు మాయాప్రభావము. కాలగతి నెవ్వరు నడ్డగింప లేరు. ఆస్త్రీ వచ్చినవిధముననే పోయినది. కావున నింటికిపొమ్మ'ని యోదార్చి పంపివైచి, నారదునిఁజూచి హరి పకపకనవ్వసాగెను. అప్పుడు నారదుఁ డీజీవాత్మ యీ మనస్సు నీయింద్రియము లే స్త్రీరూపమును బొంది సుఖము లనుభవించినపుడుకూడ నాకుఁ గలవుగదా యీ మోహము విస్మృతి యెట్లు గలిగెనని భగవంతు నడుఁగ నిదియంతయు మాయాలీల. ప్రాణుల కిట్టిస్థితు లనేకములు గలుగుచుండును. సుషుప్త్యవస్థయందేమియు నెఱుఁగక మరల జాగ్రదవస్థయందుఁ బ్రాణి సర్వము నెఱుంగుచున్నాఁడు గదా. స్వప్నావస్థయం దనేకానుభవములను బొందుచున్నాఁడుగదా. అప్పటి సుఖదుఃఖములు జాగ్రదవస్థలో జ్ఞాపకమున్నంతమాత్రమున నవి యెట్లు వాస్తవములుకావో అట్లే యీ మాయావిలాసములను, మాయాశక్తినిఁ దెలిసికొను టెవ్వరికిని సాధ్యముకాదు. దాని లోఁతెవ్వరికినిఁ దెలియదు. అది త్రిగుణాత్మకము. నీవు దాని మహిమ ననుభవించితివిగదా ఇఁక దానిస్వరూపమునుగూర్చి యేల యడిగెదవు.' అనిచెప్పి తన వాహనము నెక్కి లక్ష్మితోఁగూడి వైకుంఠమునకుఁ జనెను. అని నారదుఁడు వ్యాసునికిఁ దనవృత్తాంతమును జెప్పి వ్యాసుని విచారమును బాపి చనెను. వ్యాసుఁడును నారదునిమాటలవలనఁ బ్రబుద్ధుఁడై సరస్వతీనదీతీరమునకుఁ జని యచ్చట కాలక్షేపమునకుఁగా 'దేవీ భాగవతమును' రచించెనఁట. ఇది దేవీభాగవతరచనా వృత్తాంతమునందలి నారదుఁడు స్త్రీత్వమును బొందుటను గూర్చినకథ.

దీనికిని, మన యెల్లనార్యుని కథకును కలభేద మిప్పుడు సువ్యక్తం బగుచునే యున్నది. తొలుత విష్ణునియెదుట మాయ తన యింద్రజాలమునుజూపిన సందర్భమున నారదుఁడు ప్రగల్భములు పలికినట్లుకాక, లక్ష్మి యీతనినిఁజూచి భర్తను వదలి యావలికిఁబోవుటయే యీకథ కంతకుఁ గారణముగాఁ జేయఁబడుటచే నీదేవీ భాగవతకథయందు నారదుని యాథాత్మ్య మంతగా బ్రకటింపఁబడియుండలేదు. కథకుఁ బ్రధానరంగము కనోజిగాక యాంధ్రదేశమునందలి సర్పవరముగాఁ జేయఁ

బడుట యొక్క విశేషము. మూలకథలో విష్ణువు నారదుని వంచింపవలయు నను పట్టుదలతోఁ జేసిన పనిగాఁ గాక, యాతనికి మాయాస్వభావము చూపవలెనను తలంపుతోఁ జేసిన పనిగా వ్యక్తము చేయఁబడినది. మూలకథలోని తాలధ్వజుఁ డిచ్చట చంద్రకేతుఁడయినాఁడు. అక్కడ వారికి పండ్రెండుగురు పుత్త్రులు మాత్రమే కలుగ వీరికి 100 గురు పుత్త్రులు కలిగినట్లును, యుద్ధములో నిందఱిపుత్త్రులతో పాటు తండ్రియు మృతినొందినట్లును జెప్పఁబడినది. అంతేకాక క్షుద్బాధాపీడితయైన యా స్త్రీ వీరి కళేబరముల నొకదానిపయి నొకటిఁ జేర్చి వానిపయి నెక్కి యొక మామిడిచెట్టుకాయ నందుకొన యత్నించినట్లును చెప్పఁబడినది. ఈవిషయములు దేవీభాగవత కథలో లేకున్నను మఱికొన్ని పురాణములలోఁ గలవు.

వేఱొకచో నీగాథ మఱియొకవిధముగఁ దెలుపఁబడియున్నది. కృష్ణుని దర్శింప నారదుఁడు ద్వారకకుఁ బోయినపు డతఁడు పదునాఱువేలు నెనమండ్రు భార్యలతో నెట్లు కాఁపురము చేయుచున్నాఁడో యను తలంపుతో నీతని ప్రవర్తనను గనిపట్ట నొక్కొకయింటికే పోయి చూచి కృష్ణుఁడు ప్రతిస్త్రీయింట నేదోవిధమునఁ గ్రీడించుచుండుటఁ గనిపట్టి యత్యాశ్చర్యమగ్నుఁడై మగిడి యాస్థానమంటపమునకు వచ్చుసరికి కృష్ణుఁ డచ్చటనే యుండెను. అప్పుడు నారదుఁడు 'కృష్ణా, నీ విలాసకృత్యము లతి దుర్జ్ఞేయములు గదా' అని యాతనితోఁ బలుక 'నారదా, నీకును దుర్జ్ఞేయములగునా' యని కృష్ణుఁడు బదులు చెప్పుటయు నారదుఁడు తలయూఁచి యూరకొనెనఁట. దీనినిఁబట్టి యీతఁడు కొంచెము గర్వితుఁడయ్యెనని కృష్ణుఁడు కనిపెట్టెను. పిదప వీరిద్దఱును విమానముపై సంచారము సేయుచుండ నారదునకు పిపాసగల్గుటయుఁ గృష్ణుఁడాతని నొక కొలనియొద్దకుఁ దీసికొనిపోయి దింపి నీవిచ్చట స్నానము చేయకయే నీరు త్రాగకుమని చెప్పిపంపెను. ఆతఁడట్లు మునిఁగి లేచునప్పటి కొకస్త్రీ యయ్యెను. కృష్ణుఁడు నాతని విమానము కానరాదయ్యె. అప్పుడా స్త్రీ యొంటరియై జనులెవ్వరైన నగపడుదు రేమో యని యా కాననమునఁ గ్రుమ్మరుచు నొక్కచోఁ దపంబొనర్చు నొకఋషిని గనెను. ఆతఁడు కన్నులఁ దెఱచి యీమెనుజూచి 'నీవెవ్వ' రని యడుగఁగా నామె తానెవ్వరో చెప్పలేక, యాతనికి శిష్యురాలయి పరిచర్య సేయుచుందునని మాత్రము పలికెను. ఆతఁ డందుల కంగీకరించెను. కొంతకాలమునకు వీరు మన్మథుఁడు ప్రేరేప భార్యాభర్తలయిరి. వారి కరువండ్రుపుత్త్రులు గలిగిరి. ఇట్లు కొంతకాలము వారు సుఖముండ హఠాత్తుగా నొకనాఁ డాఋషియుఁ, బుత్రులును జనిపోయిరి. ఆస్త్రీ వారికొఱకయి మిక్కిలి దుఃఖించి యేడ్వసాగెను; ఆయరణ్యమున నేకాకినియై వారి కంత్యక్రియలనైనఁ జేయలేకపోయెను. ఇంతలో నామె కాఁకలిబాధయు మెండయ్యె. తినుట కేమియు దొరుకలేదు. దూరముగా నొక మామిడిచెట్టున నొక కాయ యుండుటఁ జూచి దానిఁగోసికొన యత్నింప నది యామె కందలేదు. అప్పు

డచ్చట మృతినొందినవారి కళేబరములను దెచ్చి యొకదానిపై మఱియొకటి పేర్చి వానిపయి కెక్కి యాపండు నందుకొని తినఁబోవుచుండఁగా నచ్చటికి వృద్ధ బ్రాహ్మణుఁ డొకఁడేతెంచి 'భర్త చనిపోయినపిదప స్నానమయినఁజేయక ఫల మెట్లు భక్షింతు' వని ఎక్కి యామెను వారించి యాకొలనిలో నీపండు నొక చేతితో నీటిపయిఁ బట్టుకొని స్నానముచేసి రమ్మని పంపెను. అట్లు స్నానము చేసినంతనే యాస్త్రీ నారదుఁ డయ్యెను. కాని చేతిపండును, గాజులును నట్లనే యుండెను. బ్రాహ్మణుఁడు మాయమై శ్రీకృష్ణుఁడు ప్రత్యక్షమయి, 'చేతిని గాజు లెక్కడి' వని నారదు నడుగఁగా నాతఁడేమియుఁ జెప్పలేకపోయెను. కృష్ణునిపంపున నాతఁడు మరల స్నానముచేసి వచ్చునప్పటి కాతనిచేతఁ బండునకు బదులు వీణె కానవచ్చెను. 'ఏమి యీ మాయ ? ఈ చచ్చినపురుషు లెవ్వరు' అని నారదుఁడు కృష్ణు నడుగఁగా, నాపురుషుఁడు కాలపురుషుఁడనియు వారందఱు నాతనిపుత్త్రు లనియుఁ జెప్పెను. అప్పుడు తనపుత్త్రుల నామములు శాశ్వతకీర్తిని బడయుఁగాక యని కోరఁగాఁ గృష్ణుఁ డట్లే యగుఁగాక యనిచెప్పెను. వారినామములే ప్రభ వాదిషష్టి సంవత్సరముల పేళ్లయి నేఁటికిని నిలిచియుండెనఁట ! ఈ విధముగాఁ గృష్ణుఁడు నారదునికి గర్వభంగము చేసెను.

ఎల్లనార్యునికథలోనివి, దేవీభాగవతకథలోఁ గానరానివి కొన్ని విషయము లీగాథలోఁ గనఁబడుచున్నవి. మొదటియాశ్వాసమునందుఁ దెలుపఁబడిన సత్య రుక్మిణి మొదలగు పదునాఱువేలు నెనమండ్రు భార్యలయెడలఁ గృష్ణుని లీలావిహార వర్తనములను గూర్చిన కథకు, మూలబీజములు కొన్ని యిందగపడుచున్నవి. ఇక్కడ నారదునకుఁ గలిగినట్లుగాఁ జెప్పఁబడినసందేహ మక్కడ సత్యాదేవియందారో పింపఁబడి చమత్కరింపఁబడినది. మఱియు నిక్కడ నీకౌతూహలమే నారదునికి స్త్రీత్వమును గలిగించి యాతని గర్వభంగమునకుఁ గారణమయినట్లు చెప్పఁబడినది. స్త్రీరూపమున నారదుఁ డొక రాజును వివాహమాడుటకు బదులుగాఁ గాల స్వరూపుఁడగు నొకబ్రాహ్మణుని వివాహమయిన ట్లిందుఁ జెప్పఁబడినను, దేవీ భాగవతకథలో లేని మామిడికాయనుగూర్చినవృత్తాంత మొకవిధముగా నిందగపడు చున్నది. ఇట్లీపురాణగాథల కొకదారి తెన్ను కనఁబడదు. వీనికన్నిటికి మూలకథ యేదో, దానినుండి యిన్నిపాఠభేదము లెందు కేర్పడినవో యన్వేషించి తెలిసి కొనుట యావశ్యకమే యయినను నంత సుసాధ్యముగాఁ గనఁబడదు.

పూర్వ మార్యమహర్షు లార్యావర్తమున నుండిన కాలమున వారిచే రచింపఁబడిన యాయాపురాణ గాథలను గ్రహించి తరువాతి కాలపుకవు లాయా గాథలను సందర్భానుకూలముగ మార్చి తమ కభిమానపాత్రకములగు దేశభాగ ములకు క్షేత్రములకు నన్వయించి నూతనగ్రంథములు, క్షేత్రమాహాత్మ్యములు

మొదలగువానిని రచించుచుండుటంజేసి, యేకథ యెక్కడిదో, యెట్లు పుట్టినదో తెలిసికొనుట కడుదుర్లభ మగుచుండును. ఏప్రాంతములవా రాయాగాథలు తమతమ దేశములలోఁ దా మెఱింగియున్న యాయాప్రదేశములకు క్షేత్రముల కును జెందినవనియే యెంచుచు, వానిమాహాత్మ్యమును బొగడుకొనుచు వాని మూలమునఁ దాము తరించి ముక్తిఁ బడయుదమని తలంచుచుందురు. ఇందుకుఁ బ్రసిద్ధమైన నిదర్శనమొకటి సారంగధరునికథ. ఈతఁ డాంధ్రదేశమునందలి రాజ మహేంద్రవరము నేలిన చాళుక్యరాజగు రాజనరేంద్రుని కుమారుఁడనియు, నాతని గూర్చిన కథయంతయు నాపట్టణముననే జరిగినదనియు పలువురు తలంచుచుండు టయేకాక, రాజమహేంద్రవర పట్టణప్రాంతమున నిది సారంగధరుని మెట్ట యనియు నిచ్చటనే యాతని కాళ్లు సేతులు తెగ నఱుకఁబడెననియు నిప్పటికిని స్థల జ్ఞులు చూపుచుందురు. ఇంతియేకాదు; చాళుక్యరా జగు రాజరాజనరేంద్రుని యాస్థానమున భారతమును దెనిఁగించిన నన్నయభట్టు రచించినట్లు చెప్పఁబడు 'యాంధ్రశబ్దచింతామణి' యనువ్యాకరణము కారణాంతరములచే నశించినదనియు, తండ్రిచే వధియింపఁబడియు సిద్ధులలోఁగలసి సిద్ధుఁడయి నివసించియున్న సారంగధ రుఁడు బాల్యమున నన్నయభట్టునొద్దఁ జదువుకొనుటచే జ్ఞాపకముంచుకొన్న యీ గ్రంథమును దరువాతఁ గొన్ని శతాబ్దముల పిమ్మట నాంధ్రలోకమున కిచ్చెనను ప్రసిద్ధియు కూడఁ గొంతవఱకు వ్యాపించుట తటస్థించినది గదా! "హరిశ్చంద్ర ద్విపద" రచించిన గౌరనకాలమున కీకథ కాంధ్రదేశముతోఁగాని, రాజమహేంద్ర వరముతోఁగాని సంబంధ మేర్పడినట్లు లేదు. ఏలయనఁగా నాతఁడురచించిన 'నవనాథ చరిత్ర' మను దానిలో నీకథ మహారాష్ట్రదేశమునకు సంబంధించినదిగానే చెప్పి యున్నాఁడు. ఆకాలములో నీకథకు రాజమహేంద్రవరముతో సంబంధము ప్రసిద్ధ మయి యుండిన నాతఁ డద్దాని నభిమానించి యుండునుగదా! దేవీ భాగవతమున నార్యావర్తమునందలి కనోజ్ పట్టణప్రాంతమున జరిగినదిగాఁ జెప్పఁబడిన నారదుని స్త్రీరూపమునుగూర్చిన వృత్తాంతమున కది యాంధ్రకవి చేతులలోఁ బడుటచేఁ గాఁబోలు గోదావరీ తీరమందలి సర్పవర క్షేత్రము నిలయమైనది. మూఁడవ యాశ్వాసమున బోయదాని తగులమునఁబడిన పుండరీకుని నివాసస్థానము యమునా నదీతీరమందలి మధుర యని చెప్పఁబడినది. యమునాతీరంబునఁ బిప్పల తరు చ్ఛాయాశీతలప్రదేశంబున సాలగ్రామార్చనము చేయు నతఁడు "కతిపయ దినం బులకే యచట నచట నాకలంబులఁ దినుచు గౌతమీపుణ్యభూమిం జేరి యచట నొక యగ్రహారంబున భిక్షాటనము చేయఁదొడంగెను. దారిలోనున్న "కాళింగమధ్య

దిక్కుఁడంబు లాంగూల శౌరదానదులచేఁ జాలఁ బండు" నని యాతఁ డెఱింగించి యున్నను, అచ్చట నీతనికిఁ బట్టెఁడన్నము దొరకలేదు కాఁబోలును స్వీయదేశము గుటచేత నాగోదావరీ తీరమునందలి యొక యగ్రహారమునకు నాకలములఁ దినిపించుచు నీతనిఁ గతిపయదినములకే యాకవి తీసికొని వచ్చియుండుట! రామాయణ భారతకథల విషయమునను వానియందు జనులకుఁగల యభిమానమునుబట్టి యే దేశములవా రాయా దేశములం దాయాకథ లక్కడక్కడ జరిగినట్లే చెప్పుచుండు టయు నాయాస్థలములను జూపుచుండుటయుఁగూడ గలదుగదా! రామాయణమున వింధ్యసమీపముననే హనుమంతునకు సముద్ర మగపడినట్లును, అచ్చటి నుండియే యాతఁడు సముద్రమును దాటినట్లును అగపడుచున్నది. అదియే వాస్తవమైనచోఁ గిష్కింధ యెచ్చటనుండెనో, రామేశ్వరప్రాంతమగుదక్షిణపుకొననుండి వారిధిఁ గట్టుటెట్లు తటస్థించెనో, వా రపుడు ప్రవేశించిన రావణుని లంక యెద్దియో నిశ్చయింప వీలులేనిస్థితి యేర్పడక మానదు. బహుశః ఆర్యజనుల తోపాటు, వారి నాగరకతతోపాటు, నీకథలు కాలక్రమమున భిన్నప్రదేశములకు జరుగుచుఁ దారుమారయి యుండవచ్చు నని తలంపఁదగియున్నది.

మొత్తముమీఁద సందర్భానుకూలముగ నీ గాథలను సంస్కరించి యొక్కచోఁ గూర్చుటచే నీకవి యొకచక్కని ప్రబంధమును రచింపఁగలిగినాఁడు. ఇంతకాల మీ రాధామాధవకవి గ్రంథములు ప్రకటింపఁ బడకుండుట రాయల యుగమునాఁటి వాఙ్మయమున కొకకొఱంతయనియే చెప్పనొప్పును. వసుచరిత్ర తరువాత పిల్లవసుచరిత్రలు బయలుదేరినట్లే యీతని విష్ణుమాయానాటకము బయలుదేరినపిదప విష్ణుమాయావిలాసములు పెక్కు బయలుదేరినవి. అందు 'రోసనూరి వెంకటపతి' రచించిన దొకటి యిప్పటికిఁ బ్రకటితమైన ట్లగపడు చున్నది. ఎరగుడిపాటి వెంకటకవి మఱియొక 'విష్ణుమాయా విలాసము'ను రచించెను. ఇది బిట్రగుంట వేంకటేశ్వరుని కంకితము.

ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రతి ప్రాచ్య లిఖిత పుస్తకాలయ ప్రతికంటె భిన్నమయినదిగాఁ గనబడుచున్నది. ఇందుఁ గొన్ని పాఠభేదములుకలవు. ఒకటి రెండు సందర్భములలో నిందు లేని పద్యములుగూడ నందుగలవు. అవి యీ గ్రంథమునఁ జేర్పఁబడినవి. పాఠభేదములు గలచోటుల నుచితమని తోఁచిన పాఠము గ్రహింపఁబడినది. తక్కిన పాఠము లధోభాగమున నీయఁబడినవి. "చూతామంచు, పోతేనేమేలో, నీవేమిసేతు, ఏమనినమ్మెది. వనరుహనేత్రీ" మొదలగు కొన్నిప్రయోగములు కవిబుద్ధి పూర్వకముగఁ జేసినవేగాని లేఖక ప్రమాద జనితములు కావనుతలంపుతో మార్పసాహసింపలేదు. ఈ రెండు ప్రతులనుబట్టియే

యీ గ్రంథము పరిచూచి ముద్రింపఁబడినది. వేఱుప్రతులు దొరికినచో నీ ముద్రణమునందలి లోపములు తొలఁగవచ్చును. తమ కార్యస్థానముననున్న యీ గ్రంథముయొక్క యసమగ్రమగు తాటియాకుల ప్రతిని దయతో నొసఁగిన ఆంధ్ర సాహిత్యపరిషత్తు వారికి వందనములు.

ప్రాచ్యపరిశోధనాలయము
మద్రాసు.
1-12-1933.

కోరాడ - రామకృష్ణయ్య

శ్రీ ర స్తు.

# విష్ణుమాయానాటకము.

## ఎల్లనార్యకవికృతము.

### ఆశ్వాసము. ౧.

పరీక్షిన్మహారాజు శుకయోగి నడుగుట.

తే. గీ. భాగవత ముఖ్యుఁడగు శుక బ్రహ్మచేత
భాగవత సత్కథాపర బ్రహ్మవిద్య
నెలమి వినుచుఁ బరీక్షిన్న రేంద్రచంద్రుఁ
డచ్యుత క్రీడలాత్మకిం బారఁబలికె. 1

చ. కనుఁగొన నింద్ర నీలమణి కాంతి నొకప్పుడు పూర్ణచంద్ర చం
దనరుచి నొక్కవేళ యరు ణద్యుతి కుంకుమ దీప్తినొక్కచోఁ
దనరి గుణత్రయాత్ముఁడయి తానె సమస్తమునైన దేవునిన్
వనరుహనాభుఁ బల్మరు మ నంబున భావనచేసి వెండియున్. 2

సీ. అఖిలంబునిండి ప్ర హ్లాద ప్రమాణోక్తి
వెలయంగ నిలిపిన విశ్వమయుత
ఆబ్రహ్మకీటశూ న్యంబైన వెంబైటి
నీటిలోఁ దేలెడు మేటి తనము
కంసకారాగృహాం గణమున రుద్రాది
జయనాదములఁ గన్న జనన కేళి
నిర్వికల్పస్థితి నిర్లేపుఁడై పర
బ్రహ్మంబుదానైన భవ్యమహిమ.

తే. గీ. తలఁపనచ్చెరు వంబుజో దరుని గుణము
లన్ని వర్ణింపఁ దరమె ప ద్మాసనునకు
నిట్టిపరమాత్మ నాద్యుని నెఱుఁగు నాతఁ
డతఁడు దానౌట నిస్సంశ యంబు మదికి. 3

వ. అని వెండియుం బుండరీకాక్షుని యక్షయగుణంబు లొక్కొక్క సమయంబున నపారగంభీర పారావారతరంగ సంఘంబుల చందంబున తండోపతండంబులై పొడముచు, నొక్కొక్క వేళను కాలరాత్రినిబిడనీరంధ్రతమోనిశితాతప జ్యోత్స్నాదిజ్యోతిః కలాపంబుల రూపంబున స్వకీయమాయాంతర్గతంబులై నిలుచుచు, నొక్కకాలంబున జగత్ప్రాణ ప్రసరణ ప్రవీణత్వంబున దీప కత్వ నిరూఢంబులై సకలంబునం బ్రవర్తింపుచు నవాఙ్మానస గోచరప్రభా వంబున నుండుటకు నరిదిపడి హర్షవిస్మయ స్వరూపంబగు మనంబున నమ్మ నీంద్రు నవలోకించి పరీక్షిదీశ్వరుండు ప్రాంజలియై యిట్లనియె. 4

మ. మునినాథోత్తమ విష్ణుదివ్యకలనల్ ♦ మోదాద్భుతాపాదక
త్వనిరూఢిం నిగమాంత భావిత ప్రభున్ తత్త్వస్వరూపున్ విభున్
మననధ్యాన సమర్చనాభిమత స ♦ న్మానస్థితిం బొల్చియుం
డున శేషక్రియలందు నన్మునిగరి ♦ ష్ఠుల్ చాలనే విూఁపఁగన్. 5

వ. ఇవ్విధంబున ననన్యదైవ సామాన్య తేజోవిలాసంబుల వెలయు నిఖిలభువనైక నాయకుండైన విష్ణుండు పరమపురుషుండని యుపనిషన్మర్మంబులవలనఁ దెలిసి వేదసిద్ధాంత రహస్య వేదులగు మహామతులు, సర్గస్థితి ప్రళయవికార కలితం బులు నశేషప్రాణిగణ సంకీర్ణంబులు నగులోకంబులం బ్రవర్తించుటుడిగి తద్దివ్య విష్ణుధ్యేయ తేజోరూపంబు తుదిముట్టంగాంచితదాత్మకంబునుం బొందక మనంబు బహువిధకర్మ వ్యాపారంబులకుఁ బ్రేరేచి త్రివర్గ ఫలభోగంబు లను భవించు నల్పసుఖానుసారు లగుచుందురు. దీనికిఁ గతంబేమియో సర్వంబు న ధ్యాహరించి సంశయ విచ్ఛేదంబుగా నెఱింగింపవే మహాత్మా! యని ప్రార్థిం చిన నవ్వివేకనిధికి శుకబ్రహ్మ యిట్లనియె. 6

క. అవునీవు చెప్పినట్ల న
భువనైకస్వామి సకల ♦ పూజ్యుఁడు హరి వే
దవిచారణీయ పరత
త్త్వవిలాసము సృష్టినడుపు ♦ వాఁడును నరయన్, 7

ఆ. గీ. అతని నైజతత్త్వ ♦ మగు తేజమిట్టిది
యతనిగుణములిట్టి ♦ వతనిక్రీడ
లిట్టివని నుతింప ♦ నెఱుఁగవు వేద వే
దాంతములును నిశ్చ ♦ యంబుగాను. 8

వేదప్రశంస.

తే. గీ. శ్రుతులనంతములవి యెన్ని చూడ నందు
నర్బుదాంశంబయేమొ స హస్రగతుల
నాదిలో బ్రహ్మ వక్త్రప ద్మాంతరముల
నిండి ఘోషించు మధుకర నినదలీల. 9

క. అందొక పరమాణ్వంశము
నందైన సకృత్స్నముగఁ దదర్థము తెలియన్
బొందుపడదు వ్యాసమహ
ర్షీందు ప్రముఖులకు నైన నృపకులతిలకా. 10

వ్యాసప్రశంస.

ఉ. వ్యాసమునీశ్వరుం డపర వారిజనాభుఁ డతండు నిష్ఠన
జ్ఞానను దేవతోత్తము మ హామతిమంతుని సుప్రసన్నునిం
జేసి తదీయ శిక్షనొక చేరికఁ గైకొని కొంతవేదమ
భ్యాసము చేసెఁ దాను చతు రాస్యములై చననాల్గు వేదముల్. 11

మతప్రశంస.

సీ. ఆవేదములు నాల్గు నవగతంబులు గాఁగ
చదివితదర్థముల్ వెదుక లేమిఁ
దదను రూపమున శా స్త్రములారు నష్టాద
శపురాణములు నోలి సంఘటించె
వేదబీజాక్షర విన్యాస సరణి గా
యంత్ర్యాదిమంత్రంబు లనువుపఱచె
మతశాస్త్రములు యోగ మార్గశాస్త్రంబులు
నతిరహస్యములుగా జతనకట్టె
తే. గీ. నమ్మహాభాగుఁడిట్లు[1] వే దాదులందు
దనరు నర్థంబు వివిధ భే దములనడుచు
దానమతములు వెక్కయ్యెఁ దన్మతముల[2]
కన్నిటికిఁ గల్గెనధిదైవ తాంతర[3]ములు. 12

క. తామసరాజసమతములు
భూమి ననేకములు బహుళ ములు తదధీనం
బై మెలఁగు జగము సాత్విక
మామతములలోన సూక్ష్మ మైవర్తించున్. 13

1. ఆ. పాఠ-డిట్టి 2 ఆ. పాఠము-తన్మతంబులన్నిటికి గల్గెనది దేవతాంతరంబు । 3 ఆ. పా. తాంతరంబు.

క. మతములు మంత్రంబులు వాం
ఛితములు సేవార్చన[1]లును శిష్టాచార
వ్రతములును బదవిభాగ
స్థితులును భిన్నంబులగుచుఁ జెల్లుధరిత్రిన్. 14

శా. ఈమార్గంబున శాస్త్రవాక్యములు ప్రత్యేకార్థయుక్తంబులై
భూమింబెక్కు మతంబులన్నడు[2]వఁగా బుద్ధి ప్రకారోన్నివ
త్సామర్థ్యంబున నెల్లవారు బహువాదప్రౌఢినాయామతం
బే మేలంచు భ్రమించుచుండ్రు తమకే దిష్టంబు తన్మాత్రతోన్. 15

క. అందఱికి నన్నిమతముల
నందముగాఁ దదధిదేవతాకృతులను గో
విందుఁడె యుచితఫల ప్రా
ప్తిందుదిఁ బొందించు తద్విదిత[3] లోకములన్. 16

క. సారస్వతసంపద్భో
గారూఢములగుచుఁ దలఁపులా[4]వర్తించున్
గోరికల తమకమున మో
క్షారంభములేదు పద్మజాదులకైనన్. 17

క. కేవలని[5]ర్వాణమునకుఁ
దావలమది సాత్వికంబు తత్ప్రతిహారి యా
త్రోవకు నేరికిఁ జిత్తము
ద్రోవ[6]దు తన్మతయుగంబు త్రోవకుఁబోలేఁ. 18

క. కావున నుత్తమ సాత్విక
ధీవిభవముగలిగి తదధిదేవతయగునా
శ్రీవిష్ణుని నతినిర్మల
భావంబున నిలుపవలయు భక్తినిరూఢిన్. 19

శా. ఈరీతిం నిజసాత్విక క్రియలతోనేకాగ్రనిష్ఠా మహా
ధీరుండై హరిమూర్తి నాత్మనిడునా ధీమంతుఁడా మూర్తి సం
స్కారంబొప్పఁగనచ్చునన్[7] బ్రతిమయో జంజెందుచందానఁదే
జోరూపంబున ముక్తుఁడై మెలఁగుఁజు[8] క్షోణీతలాధీశ్వరా. 20

క. వినుసహజ సాత్విక పుమ[9]త
మునవిర్మలహృదయ పద్మమునఁ దిరముగ వి

---

1. అ. పా. సేవార్చన వ్రతంబులు దమకున్ । గతిమెలగజేయు భోగ। స్థితులును. 2. అ. పా. నడపగా. 3. హిత. 4. లోవర్తించున్. 5. ప్రా.నిర్వా. 6. ద్రోవదు. 7. నంచు బ్రతిమాయి. 8. వో (నో?) 9. సాత్వికత్వమ్మున.

ష్ణుని నిలుపుచుఁ దాదాత్మ్యం
బునఁ బొందుట దుర్భరంబు § భూవరచంద్రా.[1] 21

ఆ. గీ. అంతసాత్త్వికక్రి § యయు నంత నిశ్చల
సూక్ష్మదృష్టియును వి § శుద్ధమతియు
సంభవించుమాన § సంబన్యమతముల
వ్రాలకున్న పరమ § వైష్ణవులకు. 22

విష్ణుమాయానాటక ప్రశంస

చ. కమలదళాక్షుఁడింతటికి § గారణమావెడగాని యింద్రజా
లముభువనత్రయంబు సకలక్రియలుందద భీష్టకేళితం
త్రములరయంగ నాతని మ § నంబున కెట్టులుదోచెనట్లవి
శ్వముజరియించు నెవ్వరికి § శక్యముస్వేచ్ఛభరంబు నొందఁగన్. 23

వ. మహామాయా నాటక సూత్రధారుండగు నప్పరమ పురుషుండును జూపు దివ్యకేళీకృత్యంబులు బహువిధవిచిత్ర ప్రహ్లాద కారణంబు లవి వినవలతువేని సావధాను[2]ండవై యాకర్ణింపుము. 24

సీ. వాగీ[3]శ్వరుండయ్యు § వనరుహగర్భుండు
శ్రుతికదంబము లెక్క § చూడఁగలఁడె
భానుసహస్ర సం § పద గల భానుండు
తిమిరమంతయును భే § దింపఁగలఁడె
భువనత్రయము నే లు § దివి జాధినాథుండు
చిత్తతృష్ణావధి § చెప్ప[4]గలఁడె.
పటు గరుజ్జవ రేఖఁ § బరగుఖగేంద్రుండు
గగనంబు కడయెఱు § గంగఁగలఁడె

తే. యట్లుతేజోగుణోత్కృష్టుఁ § డై యనంతుఁ
డైనవిష్ణుని మాయా వి § హారకలన
నమరగంధర్వసిద్ధ వి § ద్యాధ రర్షి
యక్షరక్షోగణంబైన § నరయఁగలదె. 25

మ. ఇదిమధ్యం బిదియాదియంతమిది రూ § పిభ్భంగి యిచ్చోటుత
త్పదమంచున్ హరియున్న రూపుశ్రుతులున్ § భావింపలేవన్న చో
నిదమిత్థంబని చెప్పనోపుదురె భ § క్తైకావన ఖ్యాతునా
నదయాత్మున్ మదినిల్పుశక్తి ప్రతిభా § సంయుక్తినాటించె[6]దన్. 26

1. ప్రా. భూరివరేణ్యా, 2. ఆ. సావధానంబున, 3. ఆ. ణీశ్వ, 4. చేయగలడె, 5. గురుజవ, 6. ఆ. బ్రాపించెదన్

వ. అని యంతర్నేత్ర మనంత పరధ్యానయోగాధీనంబుగావించి యుదంచిత
రోమాంచకంచుకిత దేహుండును సంతోషరస ప్రసవదశ్రుధారా మధూళీబిందు
సుందరదృగరవిందద్వంద్వ పునఃపునః ప్రకటీభూత హరిభక్తి సుధాప్రవాహుం
డును, కరతలముక్తాఫలీకృత ప్రాగ్వచశ్చూడా ప్రౌఢరహస్య వాక్సహృదు
పదిష్టభావి కైవల్య లక్ష్మీవిలాస సర్వస్వసంగ్రహణ[1]వ్యగ్రుండును, మధుర
ప్రబోధోదగ్రుండును నగునయ్యోగి కులాగ్రణి రాజకులాగ్రణికిట్లనియె. 27

క. ధరణీశ్వర 'మమమాయా
దురత్యయా'యనియె నరుని తో హరిమునుద
త్పరమోక్తికి ననుగుణమై
పరగెడు తన్మాయ విధము ప్రకటింతుఁదగన్. 28

వ. అని తత్ప్రకారంబు ప్రపంచించునప్పుడు. 29

విష్ణుమాయాప్రభావంబు శుకయోగి చెప్పఁబూనుట.

సీ. క్రతుదీక్షితర్షి సంతతికిదుగ్ధరసంబు
గురియునాకనివాస సురభిపోలె
సస్యాభివృద్ధికి చాలఁగ వర్షించు
ప్రావృట్పయోధర పటలిపోలె
వేలాతటంబున విబుధరతూర్ధంబు
ప్రభవించు నమృతకుంభంబుపోలె
సత్యభామామన స్స్వామికి నభివాంఛి
తమునిచ్చు పారిజాతంబుపోలె
తే,గీ. పారికాంక్షి పరీక్షిన్నృపాలమౌళి
మధుకరస్వాంత సంతోషమయములైన
కోరికలమిం[2]చు శుకముఖాంభోరుహంబు
నందనందన గా[3]థామరం దధార. 30

క. మనసునకు గోచరింపని
వనజోదరు తత్త్వకలన వాగ్వైఖరివ
ర్ణనసేయ నొరులకెట్లగు
ననిశితవిజ్ఞాన నిధికి శుకునికిఁదక్కన్. 31

వ. ఇట్లు చాటుకార వాక్పరంపరా సంపాదకుం[4]డేక ముఖుండయ్యు చతుర్ముఖ
సహస్రముఖ జంఘాలిక కళాగర్వ నిర్వాహకంబగు శేముషీ విశేషంబున సర
స్వత్సలిలాంతర్మగ్నంబులగు రత్నంబులుంబోలె నామ్నాయ మండల గర్భ

1. ఆ. సంగ్రహ సమగ్రుండును. 2. ప్రా! ముంచె!! 3. ప్రా. 'గాథ", 4. సంపాద కందళితముఖుం."

స్థంబులైన హరికథా సందోహంబులుగూడం దిగిచి వసంతసమయ సమారంభ విజృంభమాణ సురభికుసుమ విసరంబుల పసనసలుగొని దెసల పుణ్యగంధం బులు వెదచల్లుచు సత్పురుషహృదయ మధుపాయి నికాయంబుల నాకర్షింప సమకట్టి చెప్పనప్పారికాంక్షి యిట్లనియె. 32

విష్ణుమాయాప్రభావము.

క. శ్రేయస్కర విష్ణుమహా
మాయానిబిడాంధకార ♦ మండలిఖద్యో
తాయిత తేజోమూర్తులఁ
దోయజభవముఖులు దిరుగు ♦ దురు వినుమధిపా. 33

చ. జననసమృద్ధినాశములు ♦ చంద్రకళావళి కెట్టులంబరం
బున ఘటియిల్లునట్లన యి ♦ మోఘ దురత్యయ విష్ణుమాయయం
దనవరతంబులోకనివ ♦ హంబునకుణ్ బ్రహతంబుగావునణ్
జనవర సర్వముంజలజ ♦ నాభుని కైతవమగ్నమారయణ్. 34

చ. ఉరగవరైక దండకలి ♦ తోజ్వలలోక పరంపరణ్ సురా
సురముఖ జంతుకోటిని డి ♦ చూడ్కికి యత్నకరండమట్టులై
పరఁగఁగఁజేసి యెల్లెడల ♦ భక్తమనో నిలయాంగణంబులణ్
దిరముగ నిల్పెవేడుకలఁ ♦ దేలుచు వైష్ణవమాయ భూవరా. 35

ఉ. నీలపయోధరావలివి ♦ నిర్భరదీధితులాడ కాడకుం
గోలమెఱుంగు[1] తండములఁ ♦ గొల్చి గ్రహించెడు మాడ్కిభానుతే
జోలవ చంద్రికాంశువులఁ ♦ జూపుచుమా[2]పుచునుండు విష్ణుమా
యాలలితేంద్రజాలము ని ♦ జాశ్రితకోటికిఁ బ్రీతిసేయుచున్. 36

క. భూయోజ్యోతిర్వైష్ణవ
మాయానాటక విధాన[3] ♦ మర్దల పాంచా
లీయవనిక భాగవతని
కాయాంతర్నేత్ర కౌతు ♦ కము నొదవించుణ్. 37

తే. గీ. ఆచతుర్ముఖకీట ♦ పర్యంతజంతు
సంతతులు విష్ణుమాయోరు ♦ జాలపటలి
దగులుచుందురు మత్స్యవి ♦ తతులు వోలె
వితతతృష్ణాబ్ధి నీదుచు ♦ విధి[4]నరేంద్ర. 38

మ. అరిషడ్వర్గగుణత్ర యేంద్రియధర ♦ ణ్యాకాశవాశ్లైతి మ
న్నరుదాశాంతరవత్సరర్తుకలనా ♦ మర్యాదలై జాతిక

1. ఆ. మెరుంగుదండముల, 2. ఆ. పాయకనుడు, 3. ఆ. 'విధానుమర్దర', 4. విడు.

ర్మరతిశాంతి తిరస్క్రియాదురిత ధర్మఖ్యాతి [1]పూజాదులై
చరియించున్ హరిమాయ ప్రాణిగతమై సర్వైక సేవ్యోన్నతిన్. 39

మ. హరిమాయావిభవంబు రాజ్యపదప ద్మాక్షీసుత ద్విట్సుహృ
త్కరుణాశానుభవోత్సవ వ్యయగృహో ధాన్యాదులై తృప్తియై
పరమాపత్సుఖ సంపదా[2]ర్తిగతులై ప్రాపించులోకంబునన్
సురమర్త్యాసుర ముఖ్యజంతు తతిఁదే ల్చుం[3]దూల్చుఁ గూల్చున్నృపా. 40

—•• ప్రకృతిపురుష స్వరూపంబులు ••—

సీ. మానవేంద్రవినుము మాయనాఁ బ్రకృతిత
త్కర్త విష్ణుఁ డతఁడు దానె విష్ణు
డతఁడె మొదలితేజ మామీఁదమఱిలేదు
దానినెఱుఁగు నిగమ తత్త్వవేది
పంచేంద్రియములకుఁ బరమంబులై యుండు
నర్థంబులఖిల వి ధార్థయుక్తి
నర్థంబులకు నెక్కు వైతనర్చు మనస్సు
నిఖలప్ర[4]యత్నత నియతిగలిగి
మనసున కధికమై మనుజునసద్బుద్ధి ని
శ్చలసూక్ష్మదృష్టికి నిలయమగుచు
బుద్ధికి నుత్కృష్ట భూమిగ్రమై విలసిల్లు
నాత్మ విజ్ఞానసీ మాంతమగుచు

తే. గీ. నాత్మకతిరిక్తమగుచు మ హత్తువెలయు
నంతకంటెను నవ్యక్త మతిశయిల్లు
నవలబురుషుండు పరకాష్ఠ యై వెలుంగు
ప్రకృతిలో నంబుధర గర్భ భానునట్లు. 41

వ. ఇట్లు పరబ్రహ్మ తేజంబున వెలుంగు పురుషుండు ఘటనిహిత ప్రదీపంబునుం బోలె నిబిడమాయావరణ మధ్యస్థుండై నిజతేజంబు సకలంబునక[6] గోచరం బని కేలీ సంచారపరాయణత్వం బపేక్షించి యేకైకకాలవళితంబై (బహు కాలంబు) పరిభ్రమించి కులాలచక్రంబు కరణిఁదిరుగు, స్వకీయ మాయాకాల చక్రంబున నావర్తించు బ్రహ్మాదులలోన పావకశిఖాంకూరంబువలన నంకు రించు దీప[7] కలశపగిది నిజతేజోబ[8]లంబున మత్స్యకూర్మవరాహ నారసింహాది బహువిధరూపావతారంబులఁ బ్రతిఫలించుచు సౌందర్య వీర్య శౌర్య ధైర్య

1. ఖ్యాత. 2. ఆ. సుకసంపదర్తి గతులైప్రాపించు లోకంబులన్. 3. పా-దాల్చు. 4. ఆ. ప్రవర్తన. 5. ఆ. 'మలయు' 6. సకలంబునకు. 7. ఆ 'పరంపరల.' 8. ఆ. లవంబున.

ప్రతాప ప్రభావనిగ్రహానుగ్రహ దాక్షిణ్యంబు లత్యుత్కృష్టంబులై వెలయ శంఖచక్ర గదాపద్మ పీతాంబర కౌస్తుభ వనమాలికా శ్రీవత్సలాంఛనప్రముఖ లాంఛనంబులతోఁ జతుర్దశభువనంబులం బ్రవర్తించుచు, సర్గస్థితిప్రళయ కర్తృత్వంబునఁ బ్రాణివర్గంబుల నడుపుచుండు, నయ్యవతారంబులలో మిక్కిలి కృష్ణావతార విలసితుండగు విష్ణుండు సహజమాయా మానుషవేష ధారియై తత్పురుష ప్రభావంబు గలిగి విహరింపుచుండు. అతండె కాడె కౌరవ కులం బాహుళింగొని ధర్మనందనుఁ బట్టంబుగట్టి భవద్వంశంబునిలిపిన భక్త పరతంత్రుండు. తత్కపటకేళీకృత్యంబులు నువ్వె, మాయావిధానంబులు. నీకుఁ జెప్పసమకట్టిన కథాప్రసంగంబు నదియు వినుము. 42

క. భూమిన్ "సర్వం హ్యస్తి ప
దేమగ్న"మ్మనెడు మాడ్కిఁ దెలియఁగఁ దన్మా
యామగ్నము శివవిధిర
త్నోమరమాయా విధంబు నవనీనాథా. 43

విష్ణుమాయాతిశయత్వము.

తే. దేవ గంధర్వ యక్షదైతేయతతికిఁ
గలవు మాయలు విను మల్పకాలగతులు
సలిల జనిబుద్బుదాంబుదచ్ఛాయలట్టు
లన్నిటినిమ్రింగి హరిమాయ యతిశయిల్లు. 44

క. జలరుహ నాభుని మాయా
విలసనమున నుల్లుగొనిన విధమదివినవే
జలజజ శివ వాసవముఖు
లల వడి నుడిగాలిఁబడిన యాకులు వ్రాలెన్. 45

తే. జాతి పుష్పంబునందు వాసనయుఁ బోలె
దీపమునఁ బ్రభ వ్రాలెనా దేవదేవుఁ
గలసి యన్యోన్య సౌభాగ్యగతిఁ జరించు
సిరియు గర్వించి హరిమాయఁ జిక్కువడియె. 46

వ. ఇవ్విధంబున ననవరత సన్నికృష్ట సాంగత్యంబున నద్దేవునికిఁ బ్రాణేశ్వరియై విశాలవక్షస్థల కౌస్తుభరత్నసింహాసనంబున భాసిల్లు సంపద్విలాసినియును, నిరంతర సందర్శన పారాయణ ప్రారంభంబున నయ్యంభోరుహనాభు నాభ్యంభోరుహంబున బంభరాయమాణుండై యుండు నంభోరుహసంభవుండును, నమేయ కల్యాణగుణ సాదృశ్యంబున వేఱులేని మచ్చికలతో హరిహరు లేకాకృతియనుటకు నాద్యైత్యారింగూడి దంటయై నిలిచిన ఫాలలోచనుండును, సతతంబును నారాయణాష్టాక్షరీమంత్రసంస్మరణశ్రవణ కుతూ

హాలంబున నా పురాణపురుషు నాశ్రయించి తన్మంత్రముఖరియగు వీణెఁ గైకొని పరమభాగవతుండై భవపంకంబునం బడక నిరాతంక సుఖయోగంబునం జెంది, మోహాయత్త విషయరస సంజాత ప్రభూతరోష కషాయితస్వాంతులై పౌరలువారిం జూచి ప్రహసించుచు హర్షించుచుఁ జరియించు నారద మహామునీంద్రుండును, మొదలుగాఁగల మహామహి మాధ్యులు లోకంబుల నల్పప్రాణి మండలంబుల తేజంబులం దమ తేజం బులచేతం గుదియించుచు, నిశాసమయజ్యోతి రింగణ గణద్యుతుల నమ్యై కొలంది మాయించు నతిస్థూల సూక్ష్మ ప్రదీపాంకురంబుల మాడ్కిం బ్రకీపించుచుఁ దమలోన లీలారూపధరుండై తన మూలరూపంబు దాఁచి కలసి మెలసి వర్తించు నయ్యచ్యుతుని నొరసి చూచి యనంత తేజో ధాముం డగు ప్రభాకరు సన్నిధింబోలె నిస్తేజులగుదురు. మున్ను చన్న కథలుగలవు. చెప్పెద నాకర్ణింపుము. 47

క. మీతాత ధర్మనందనుఁ
డాతత[1]విభవాధికారయశములఁ దా[2] నే
కాతప వారణముగ వసు
ధాతల మొక్కరుఁడ యేలె § ధర్మోన్ముఖుఁడై. 48

ధర్మరాజుయొక్క ప్రశంస.

సీ. ధర్మదేవతకు ను§ద్భవమొంది యత్యంత
 ధర్మపరాయణ§త్వమున నిలిచె
రాజసూయ మహాధ్వ§ర మొన్నర్పఁగఁ బూని
 [3]గుఱుతుగా రాజుల § చెఱలుమాన్చె
సత్యప్రతిజ్ఞ వి§శ్వమునిండ బలవంతుఁ
 డయ్యును వనవాస § మాచరించె
[4]తేజితఖడ్గధా§రాజలౌఘంబునఁ
 గౌరవవంశ పం§కంబుగడిగె

తే. గీ. నిఖలదిఙ్మండలాధీశ§నిత్యదత్త
వస్తు విస్తారపూరిత § వాజిమేధ
యాగభాగాది నందితేం§ద్రాదిదివిజ
నిర్మితఖ్యాతి నొప్పునా § ధర్మసుతుఁడు. 49

వ. ఒక్కనాఁడు. 50

---

1. విద్యాదిగౌరవాంతంబున 2. అ. పా. పాంత్తంబునసె । కాతప. 3. గురుతర రాజులం. 4. జితఖడ్గధారాజ లౌఘంబుచేతను.

ఉ. ఇందు కులప్రభూతపృథివీశ్వరుఁడా[1]దలపట్టభద్ర ల
క్ష్మీం దనరారి యొక్కఁ బ్రసిద్ధికి నెక్కిన యాసముజ్జ్వల
త్సుందరరత్న సింహముల శోభిలుచున్న పసిండిగద్దెఁ బెం
పొందఁగ నింద్రులీలఁ గొలు వుండె నమన్నృపదీపితాంఘ్రుఁడై. 51

సీ. కౌరవాధీశోరుకాండద్వయద్రోహి
పటుగదాహస్తుండు పవనజుండు
కర్ణవక్షఃపీఠఘట్టన చణబాణ
జనక గాండీవపాణి సవ్యసాచి
చటుల కౌరవ్య పక్ష [2]విపక్ష నిగ్రహ
వ్యగ్రశౌర్యుఁడు మాద్రి యగ్రసుతుఁడు
కైతవద్యూత వినిగ్రహకారి సౌబల
హననధుర్యుఁడు నకులానుజుండు

తే. ననుఁగుదమ్ములు నలుగురు నర్థిఁ గొలువ
నింద్రునకు గీష్పతియుఁబోలె నెనయఁ దనకు
ధౌమ్యుఁ డుచితాసనమున సద్ధర్మకథల
వలన రాజర్షిమార్గముల్ దెలుపునపుడు. 52

వ్యాసముని వచ్చుట.

ఉ. కౌరవ పాండవేయ కులకర్త కళింద సుతాంతరీప వి
స్ఫారతరా కరోద్భవ లసద్రుచి సాంద్ర మహేంద్రనీల మం
భోరుహసంభవాకృతి విమోహితమోహహరణప్రచండ వి[3]
ద్యారవిమండలోదయము వ్యాసమహాముని దోఁచె ముందటన్. 53

సీ. జమున పుంభావమై సాక్షాత్కరించెనో
లలిత మహేంద్ర నీలముల ప్రోవొ
నవ్యసాలగ్రామ నగశృంగ మెగసెనో[4]
సుస్మేరకల్హార సూనవనమొ
కోమల పల్లవాంకురిత తాపింఛమో
ఘనతరామృత మేఘ ఖండభరమొ
సామాది దైవతోద్దామ విలాసమో
హరిమూర్తి నచ్చొత్తినట్టి రూపొ

తే. యనఁగ దూర్వాంకుర శ్యామలాంగ దివ్య
కాంతి చకచక లాళలఁ గడలుకొనఁగ

1. పీశ్వరపేఁడుల. 2. (ఆ. పా.) పక్షపాతనిగ్రహ. 3. విమోహ తమోహ తమోహరణ.
4. ఆ. పా. మెసలెనో.

నిష్టదైవంబుపోలె సమిద్ధకరుణ
నెదుటఁ దోఁచిన వ్యాసమునీంద్రుఁ జూచి. 54

ధర్మరాజు వ్యాసులవారికి నమస్కరించి పూజించుట.

క. మానసము నిండి వెలువడు
నానంద రసంబుపోలె నశ్రులు దనక
న్నోనల దొరఁగఁగఁ గ్రక్కున
నా నరపతి గద్దెడిగ్గి యంఘ్రుల కెఱఁగెన్. 55

మ. సకలక్ష్మావర సార్వభౌమ పదవీసామ్రాజ్యపీఠస్థుఁడిం
దు కులగ్రామణి ధర్మనందనుఁడు దోడ్తోఁగూడి తత్సోదర
ప్రకరంబున్ నిఖిలోర్వీపాలక సుహృద్వ్రాతంబులున్ మ్రొక్క ర
త్నకిరీట [1]ప్రసవార్చ్యలందనరెఁ దత్పాదద్వయం బయ్యెడన్. 56

వ. ఇట్లు సహజన్మ సామంత సుహృత్సంతానంబుతోఁ బ్రణమిల్లి వినయ వినమిత శరీరముకుళీకృతహస్తారవిందద్వంద్వసందర్శితభక్తితాత్పర్యంబులతోఁ దోడ్కొనివచ్చి సభామంటపమధ్యప్రదేశంబున సమున్నతకుశాసనంబున నునిచి పూజించి తదనుమతంబున నిజసింహాసనాసీనుండై తగినవారలఁ [2]దగిననెలవుల నుచితపీఠంబులనుండ నియమించి ప్రాంజలియై యభిముఖుం డగు నాధర్మతనయు నవలోకించి కృపాయత్తచిత్తంబున నమ్ముని కులోత్తముం డిట్లనియె. 57

వ్యాసుఁడు ధర్మరాజును శ్లాఘించుట.

మ. జననాథోత్తమ ధర్మనందన! హరిశ్చంద్రక్షమా భర్తతోఁ
నెనయై నిల్చితి సత్యవాక్యమున ధాత్రీశోత్తమశ్రేణిలో
ననినిన్మె[3]చ్చెద నట్లుకాదె, సుజనుండైనట్టి వాఁడార్యవ
ర్తన వర్తించినఁ గీర్తియున్ సుకృతముం బ్రాపింపదే యెయ్యెడన్. 58

శా. ప్రాలేయాంశు కులావతంసములలో భాన్వన్వయోద్భూతభూ
పాలశ్రేష్ఠులలోన రామునిక్రియం భాస్వద్ఘన బ్రహ్మవి
ద్యా లక్ష్మిప్రభవంబు శౌర్యనయయుక్త [4]భ్రాతృసౌజన్యముం
ద్రైలోక్యంబున నెన్నికోవెలసితార్యస్తుత్య ధర్మాత్మజా. 59

క. జలరుహ సంభవముఖులకుఁ
[5]గొలఁది యెఱుంగంగరాని గోవిందుఁడు నీ

---

1. ఆ. పా. ప్రసవార్చ్యనంద్దనరె 2. నయ్యెనెలవుల. 3. నని నిన్నెంచగ. అనిమున్మెచ్చెద
4. ఆ. పా. 'నయయుక్తి' 5. కొలదియు నెరుగంగ్గరాని.

కులమునకుఁ గూర్మిచుట్టము
చెలికాఁడును నయ్యె నేమి చెప్పుదునింకన్. 60

వ. అని హరిం దలంచి తద్భక్తవత్సలత్వంబు నూహించి. 61

తే. భక్తపరతంత్రుఁడై నయా పద్మనాభుఁ
డేడుగడయును దానయై యెల్లకడల
మిమ్ముఁ బ్రహ్లాదుపోలెనమేయకరుణఁ
[1]దగిలి రక్షించె ఘోరదుర్దశలవలన. 62

సీ. కావఁడే మానంబు కౌరవసభలోన
పాంచాలికక్షయాంబరములొసఁగి
యాఁకొన్నదుర్వాసు నలుక చేపడకుండ
నరయఁడే నిను పులోకార్థియగుచు
రవి గ్రుంకకుండ సైంధవు ద్రుంచు సవ్యసా
చిప్రతిజ్ఞ నిలుపఁడే చిక్కుఁబెట్టి
ధృతరాష్ట్రు కౌఁగిట మృతిమాననుక్కుకం
బము చేతఁ ద్రోవఁడే పవనతనయు

తే. [2]నాదరింపఁడె నారాయణాస్త్రవహ్ని
బలము దెగకుండ ద్రోణిశాపంబువలన
నుద్ధరింపఁడె మీవంశ ముర్వినెడల
కుండఁ గృష్ణునివంటి హితుండు గలఁడె. 63

వ. వెండియు నాఖండలాదులయెడ నసురులుంబోలె పాపవర్తనులైన ధార్తరాష్ట్రులు మీమేలు సహింపఁజాలక యకారణంబ వైరంబునూది కర్ణసౌబలుల దుర్మంత్రంబున నట మిమ్ముఁ గపటవ్యాపారంబున హింసింప సమకట్టి చేయు దుష్కృతంబులన్నియు మీరెఱుంగకుండిన సర్వాంతర్యామిగావున నయ్యనంతుండు దూరస్థుఁడయ్యు నికటస్థుండునుంబోలె నిరర్థకంబులు గావించుచుండు. మీరెల్ల నచ్చెరువడిచూడ భగదత్తుండు వైచిన దేవాసుర నిరంకుశంబగు వైష్ణవాంకుశంబు విజయునిం బొలియింపకుండ నడ్డమై ముందట నిలిచి దాని తన కౌస్తుభగ్రైవేయ లక్షితంబైన వక్షస్థలంబున వైజయంతికి దండయగు పూదండగా ధరియించియు నింద్రదత్తయగు నుగ్రశక్తి పార్థునిమీఁద వైవకుండ కర్ణదుర్యోధనాదులకు మఱపుఁబుట్టించియు, నారాధేయుండలిగి యేసినయమోఘనాగాస్త్రంబు తాకునంబోకుండ రథంబు గ్రుంగనదిమియు, ప్రత్యస్త్రశూన్యుండైన నరుని తలఁగాచియు, భీష్మద్రోణకృపాశ్వత్థామ

1. కలిగి రక్షించె ఘోరదుఃఖములవలన, 2. ఆ. పా. ఆశ్వసింపఁడె.

కృతవర్మప్రభృతిమహావీరపురుషుల మంత్రవీర్యవంతంబులగు ననన్యవార్య
శౌర్యదివ్యాస్త్ర సంఘంబు లసంఖ్యంబులై విలయసమయ ధారాధర ఖండం
బులవలనం దొరఁగు [1]పిడుగుల చందంబున పైఁబయింబడునప్పు డద్దేహంబు
దహింపకుండఁ దదీయ తేజోవహ్నులంతర్ధానంబు నొందియుండం దోడ్తోన
సంస్తంభింపఁజేయుచుఁ, బోరుతుది ధనంజయుం దొలఁగించి యయ్యనల శిఖా
ముఖంబులకుఁ దురగ సహితంబగు రథంబునాహుతింగాఁ జేసియుఁ, బుత్రశో
కార్తింగుందు గాంధారి క్రూరశాప వ్యథాభారంబు మీయందఱకు లేకుండం
బరిహరించి తానే వహించియు, నపార కౌరవకుల పారావారంబు నిశ్శేషం
బుగా శోషింపంజేసియు నశేషసముద్ర ముద్రితవసుంధరా భార ధౌరంధర్యంబు
నీకుఁ బాపరహితంబుగా ననుగ్రహించి నినుం గీర్తిసుకృతంబులకుం బ్రథమ
గణ్యునిఁగాఁ బ్రసాదించె నదియునుంగాక.— 64

సీ. మేనత్తయనిగొంతి ✽ మెయికొని పూజించు
నెమ్మిమఱందివై ✽ నీకు మ్రొక్కు
ననుఁగునెచ్చెలికాని ✽ యట్లపావని మెచ్చు
నర్జునుఁ దనప్రాణ ✽ మనితలంచు
కవలసాత్యకియందుఁ ✽ గలకూర్మి పాటించుఁ
బాంచాలిఁ జూచుసు✽భద్రవోలె
నాత్మకృత్యములుగా ✽ నరయునీపను లెల్ల
మేలుసేయనెకోరు ✽ మీకు నెపుడు
తే. తల్లిదండ్రులమీఁద సో✽దరులమీఁద
ధర్మపత్నులమీఁద నా✽త్మజులమీఁద
లేదుమీమీఁదఁ గల్గు ప్ర✽హ్లాదభరము
ధర్మనందన! దేవకీ ✽ తనయునకును. 65

మ. అమరేంద్రర్షులచేత మ్రొక్కుగొనున✽య్యంభోజ పత్రాక్షుఁడ
య్యమరేంద్రర్షులుచూడ నెమ్మిప్రణతుం✽డై కంటికిన్ రెప్పచం
దమునన్ నీకు సహాయుఁడై తిరుగుచు✽న్నాఁడట్టి నీవంటియు
త్తముఁడాదివ్యులయందునైనఁ గలఁడే ✽ ధాత్రీశ లింకేటికిన్. 66

వ. అని సాత్యవతేయుండు పలికిన సత్యవచనంబులు విని ధౌమ్యపురోగములైన
గురువిద్వజ్జనంబులును, భీమార్జున నకుల సహదేవులును సేవాగతులై యున్న
సూర్యసోమవంశ సంభవులగు నుత్తమక్షత్త్రియులును హితామాత్యవర్గం
బులు నట్లయానని పరస్పరాలోకన స్వీకృతాంగీకారులై యతిహర్షంబునం
బొంది దేవకీనందను దయాదాక్షిణ్యంబుల నభినందించుచున్నం గొలువు

1. వెడిపిడుగు.

భృంగ సంగీతంబులతోఁ జెంగలువకొలను మెలంగినచందంబునఁదంబయ్యె, నమ్మహారాజ శ్రేష్ఠుండును మునిగరిష్ఠుని ముఖచంద్రబింబంబు వలనం దొరఁగిన పుండరీకాక్షుని నామాక్షరంబులను నమృతబిందుబృందంబులు శ్రుతిపుటంబులం బడిన యప్పటినుండియు నంతర్నిరీక్షణంబున నుత్ఫుల్ల పులకకలికాభిరామాంగంబుతో నంతరంగంబు నిరంతరానందరస సరసీ తరంగంబుల నోలలార్చుచున్నవాఁడై సుఖపారవశ్యంబువలనఁ గొండొక దెలిసి బ్రహ్మధ్యానానంతరంబున యోగిపుంగవుండునుంబోలె కన్నులువిచ్చియంద ఱంగలయు నాలోకించి యమ్మహాభాగున కిట్లనియె. 67

### ధర్మరాజు శ్రీకృష్ణ ప్రభావము వర్ణించుట.

క. ఆహా కృష్ణుని సుగుణ
వ్యాహారము లింతయొప్పు నా విన నవము
క్తాహారకలాపములకు
సాహాయ్యమొనర్చుమీవచస్సామగ్రిన్. 68

క. హరినామోత్కరములు శుభ
కరములు త్రైలోక్యవిజయకరములు శ్రేయ
స్కరములు హితకార్యవశీ
కరములు సత్పురుష సౌఖ్యకరములు వినినన్. 69

చ. కలమృదు వల్లకీరవము కంటె వసంతవిహారచారుకో
కిలనినదంబుకంటె నళి కీరరుతంబులకంటె తాళసం
కలితమృదంగశబ్దముల కంటె మనోహరకామినీవచః
కలనలకంటెనింపొసఁగు నాచెవికిన్ హరినామవర్ణనల్. 70

క. మీరానతిచ్చినట్లన
నారాయణుఁడార్తరక్షణ పరాయణుఁడా
ద్వారవతీపురపతియా
ధారము లేకున్న బ్రతుకఁ దరమే మాకున్. 71

క. జలరాశి మగ్నవసుధా
తలమెత్తిన క్రోడమూర్తి తాఁగావున నా
కులముద్ధరించె హరియు
మ్మలఁగౌరవ్యార్ణవ[1]మున మునిఁగిన దానిన్. 72

ఆ. భక్తితోడఁ దన్ను భావించు దీనుల
నెలమితోడఁ బ్రోచు నెనరుగలిగి

---

1. వ్యాన్వయమున.

కోరి తన్ను వెతకు ॥ వారికి వెన్నిధి
యట్లదోఁచి ప్రోచు ॥ నచ్యుతుండు. 73

వ. అంతియకాదు. ప్రబలతరతృణస్తంబసముచ్ఛేదనానంతరంబున వర్షధారాభిషేచనంబుచేత సస్యభరంబును, విషవృక్షకంటకలుంఠనానంతరంబున వసంతసమాగమంబుచేత నుద్యానవనంబును, సంసార సంకుల విషయభోగవైరాగ్యానంతరంబున చిదమలానందలహరిచేతం బరమయోగి హృదయంబును, బహుళ బహురుగ్ఘ్న వ్యాధి మోచనానంతరంబున హితాన్నపానాదిక ద్రవ్యవిభవంబుచేత శరీరంబును, దురహంకారకాకవిద్విషాత్పశుకంఠదారుణ ఘంటా ఘణ ఘణత్కారనిరాకరణానంతరంబున రసికసుకవికావ్య ప్రసంగ గంభీర వచస్సారస్యంబుచేత నాస్థానంబు నెవ్విధంబున నభివర్ణింప నొప్పునట్లన క్రూరకౌరవ్యకులపంకకళంకక్షాళనానంతరంబున చక్రధరునికరుణాకటాక్ష నిరీక్షణంబుచేత జగదేకపూజ్యంబైన కరినగర సామ్రాజ్యంబు నాకు సిద్ధించినయది. అమ్మహాప్రసిద్ధియుఁ బ్రతియుగంబునఁ బ్రహ్లాదచరిత్రంబును గజేంద్రమోక్షణ ప్రకారంబును విభీషణ పట్టాభిషేకపుణ్యకీర్తనంబును ధ్రువోపాఖ్యానంబునుంబోలెఁ జంద్ర సూర్య సాగర మేరు ధరణీతలంబులుంగల కాలంబు వెలయ హరిసమకట్టిన వాఁడు. మఱి యట్టి ప్రభావంబు బ్రహ్మ రుద్ర మహేంద్ర గంధర్వ యక్షరాక్షస సిద్ధవిద్యాధర శ్రేణులలో నెవ్వరికైనం గలుగుట వినిమైన నెఱుంగుదుమే. ఈ ముకుందుండే పరమపురుషుండదియెట్లంటేని. 74

చ. హరియును నేముఁ గూడినది ॥ యాదిగ నమ్మహనీయ మూర్తివిస్ఫురదురుతేజమాత్మఁగని ॥ పొందుగఁ గేలిమనుష్య వేష సుందరుఁడగు నాది పూరుషుఁ డితండని మ్రొక్కఁ దలంచి, యాతఁడే పరువడిమ్రొక్కినం బ్రకృతి ॥ బాంధవుఁడంచును గూర్మి సేయుదుర్. 75

ఆ. మ్రొక్కి నిలిచినపుడు ॥ మక్కువ మఱఁదిగా
గారవించి శౌరి ॥ గాఁగిలింతు
వెనుక నితఁడు దైవమనుభీతి వాటిల్ల
భక్తినుతియొనర్తు ॥ భావ[1]వీధి. 76

మ. గురుభీష్మార్జున సూనులాజిఁ బడినన్ ॥ క్షోభించి మే[2]మార్తిచేఁ బొరలంజూచుచు మందహాసవదనాం ॥ భోజంబుతో నుండ నెవ్వరు వద్దందుది మేలెకాఁదలఁచు భావం [3]బుట్టనేనా మహాపురుషుం జూచుచునుందు నయ్యెడలు దాఁకబోవుందదాలోకనన్. 77

---

1. ఆ. పా. విధుల. 2. మోహార్తిచే. 3. బెట్టు.

క. సంధియొనర్పనెకోరుదు
బంధుక్షోభమునకోడి పలుమరునదిని
ర్బంధప్రయత్నమనియును
సంధింపఁడుపెంచునీరసమె యిరువాగుల్. 78

ఉ. అన్నలు దమ్ములుం గురులు నాప్తులు విప్రులు నాశ్రితాళియుం
బన్నినపోరు ఘోరమగు పాతకమేలని మానఁ జూచినన్
మిన్నక సాక్షిమాత్రములు మీరలు దీనికి మూలమేనె కా
నున్నది కాకపోదనుచు నుల్లముఁ దేర్చుఁ [1]దదీయబుద్ధిచేన్. 79

చ. కురుకులసంక్షయంబు నృపకోటుల చావుతదాప్తమిత్రసం
హరణము తత్కులాంగనల యార్తరవోత్కట వహ్నిపాతని
ష్ఠురరభసంబుచూడనతిశోకభయంబగు మాకునమ్మహా
పురుషుఁడు భార[2]మెల్లడిగి పోయెనటంచు[3]హసించునవ్వలన్. 80

వ. అదియునుంగాక. 81

తే. కనకపీతాంబరంబుతోఁ గౌస్తుభంబు
తోడనానందమగుహరి దోచునెపుడు
కమలనేత్రుఁడునాకన్నుఁ గవకునెదుట
నిఖిలరూపంబులనుజెందు నీడఁబోలె. 82

చ. జలధ[4]రకోమలావయవ సంపదతో వెలిదమ్మిరేకులం
గలకలనవ్వుచున్న తెలి గన్నులతోహరివచ్చి ముందటన్
నిలిచినఁజోతుఁ గొండొకవి నిశ్చలదృష్టులఁ జూడఁజూడను
జ్వలరుచిరాశియౌ, నవయవంబులు చూపకయేమిచెప్పుదున్. 83

శా. ఆ తేజంబును నీలపీతసితవర్ణాయత్తమై క్రమ్మరన్
శ్వేతంబౌనరుణంబయౌనసితమౌ వేర్వేఱనిల్లట్టి[5]దో
చూతంబంచుఁ దలంప నెప్పటిగతిం సువ్యక్తకృష్ణాగతిం
జేతఃప్రీతియొనర్చు మద్భ్రమపరిచ్ఛేదంబు నానంతటన్. 84

క. ఇదియెల్లనెఱిఁగియునునా
మదిఁగృష్ణుండాదిపురుష మయుఁడనుతలఁ ప
ట్లాదవఁ గనీ [6]విజ్ఞానం
బదియేమొకొయనుచువగ[7]తు ననవరతంబున్. 85

---

1. ఆ. పా— నేపుణాతదియ్యబుద్ధికిన్, 2. భారమెల్లడగిపోయె, 3. హరింద్దలంపునవ్వలనూ, 4. రుహ, 5. వెర్వేర నిబ్లెంన్నుచున్, 6. తత్వజ్ఞానంబది, 7 దలతు.

కృష్ణుని యాథార్థ్యము వ్యాసులవారిని ధర్మరాజడుగుట.

వ. ఇవ్వి చిత్ర కృత్యంబు లెట్టివి, యమ్మహానుభావుండు నిగూఢ తేజుండై శాణోత్తేజితంబుగాని మాణిక్యంబు చందంబున నున్నవాఁడు దర్శితాదర్శిత ప్రభావుండై జలధివిలోల వీచీనిచయ ప్రతిబింబిత ప్రభాకరుననుకరించుచుఁ [1]బ్రవర్తించు. దీని విభజించి కృష్ణుని కలరూపంతయు మీ దివ్యదృష్టిం బరామర్శించి వచింపుఁడు. మీరు త్రికాలవేదులు. సకల విద్యాపారంగతులు నఖిలసచరాచర జగద్వ్యవహార విజ్ఞులును నగు వివేకనిధులు. మీకు నగోచరంబులైన యవి లేవు, పెద్దకాలంబునను[2]బట్టి నామనంబు తత్సందేహడోలాయమానంబై యున్నయది. మీ సత్యవాక్య కౌశలంబునం గైతవచ్ఛాదితంబైన తత్స్వరూపంబు రాజహంసముఖంబున నుదక సమ్మిశ్రితంబైన దుగ్ధరసంబునుంబోలె నేర్పడునని ప్రార్థనాపూర్వకంబుగాఁ దన్నుఁ ధర్మనందనుం డడిగిన యపూర్వ తాదృక్ ప్రశ్నంబునకు నచ్చెరుపడి వేదవ్యాసమునీశ్వరుండు కొండొకదడవు నిష్కంప నిస్తరంగ తరంగమాలి[3]యుంబోలె నూరకుండి తన యంతర్గతంబున నిది విష్ణుమాయా విభ్రమంబని నిశ్చయించి యిట్లనియె. 86

ఇదియంతయు విష్ణుమూర్తి మాయయని వ్యాసులవారు చెప్పుట.

క. ఈయెల్లదియు[4]ను నాతని
మాయానాటకము విష్ణు మాయ యెఱుంగం
దోయజభవునకు నరిదిత
దాయత్తంబీజగత్త్రయంబును నధిపా. 87

చ. తనఘనమాయ లోకము, నిదానము దానికిఁ దాన కృత్యముల్
దనయవ కర్తదాన సఫలత్వము బొందెడువాఁడుదాన ధ
ర్మనియమకారి దాన పరమంబగు తేజము దానయై జగ
ద్వినుతుఁడు లోకముల్ నడుపు విష్ణుఁడు సర్వము దానకావునన్. 88

చ. నెఱినిజతత్త్వ మేరికిని నిర్ణయ మొందఁగ నీఁడు లీలమై
మెఱపును బోలెఁ గొందఱికి మేయదయాకృతిఁ జూపుఁ జూపిత
న్నెఱిఁగితిమన్న మాయఘటియించు నహంకృతిఁ బాసి భక్తిమై
నఱగొఱ లేనివారికి నిరంతరముం గనుపట్టు భూవరా. 89

వ. అతండు కపటనాటకుండు తనమాయా నిర్మితంబగు జగంబెల్లు నడపవలయు నట్లు నానారూప వర్తనంబులం గార్యసంసిద్ధిఁ బ్రవర్తించు నీవడిగిన సంశయంబులెల్ల నేర్పరించెద వినుము. 90

1. ప్రా—వెడలి, 2. నకుంబండె. 3. మాలికయుం. 4. ఆ. పా. వినుము.



విష్ణుప్రభావము.

క. వనజాక్షుఁడు నీరూపునఁ
దన తేజమునిల్పికొంత దనపనిఁ దీర్పన్
నినుఁబెద్దఁజేసి మ్రొక్కును
జనవర సహచరితకార్య సఫలతకొఱకున్. 91

చ. అనలరవీందు రుద్రజల జాసన వాసవులందునున్నయి
య్యనుపమదివ్యతేజమును నాహరియంశమకాదె వారివం
దనములఁ దన్పఁడేయతఁడు తద్విషయంబులఁ గూడిమర్త్యవ
ర్తనమున నేరికిన్ సహజ తత్వముఁ జూపకమాయఁ బెంపునన్. 92

వ. కావున నీకు మ్రొక్కుట బంధుభావంబని తలంపకుము, [1]తనను దానే సన్మా
నించుకొనుటగా వితర్కింపు మతనికి నీవు నేనని భేదంబు లేదు. పూ[2]జ్యపూ
జక పూజారూపంబులు విష్ణుండ. 93

క. వన[3]జాసను శాసనములు
తనమాయా కృతములగుటఁ దాఁ బన్నిన మే
లును గీడును జంతువులొం
దినపరహిత మహితమనఁడు నియమస్థితికిన్. 94

వ భీష్మద్రోణాదులయం[4]దుఁ బితృమా[5]తృకళత్ర పుత్రాది జంతుసంతతియందు
నెవ్వరెట్టిన దది యతనికి సంతోషంబుగాని దుఃఖకారణంబుగా దమ్మహా
పురుషుండానందమయుండుగాని దుఃఖకలితుండుగాఁడు, మఱిమాయందు
ననుగ్రహంబు గలిగి మమ్మురక్షించు చున్నవాఁడని పలికితి వది యెట్లంటేని.

క. భక్తాధీనుఁడు గావున
భక్తుల నాపదలవలనఁ బనివడి కాచున్
భక్తప్రవరుల మిముఁనా
సక్తిన్ రక్షించు టెంత చక్రధరునకున్. 96

వ. తొల్లి ప్రహ్లాదాదుల నెవ్విధంబుం బ్రతిపాలించె వినవె యతనికి ప్రపన్న ప్రతి
పాలనంబు వ్రతంబు. 97

క. వినుభూభారముఁ దీర్పఁగఁ
బని బూనిన చక్రధరుఁడు పనిచిన పనియె
ట్లొనరించిన పాపములే
దనఘాఁత్మా సేయువాఁడు నచ్యుతుఁ డరయన్. 98

---

1. తనకు. 2. అ. పా. పూజ్యపురుష పూజారూపంబుల విష్ణుండా. 3. జననాథన శాసనములు. 4. యె(డ)ల. 5. భాతృపుత్ర పౌత్రాది.

క. మనుజుండే చందంబున
దనచేయు నఘంబులైన ధర్మములైనన్
వనజాక్షు సేతలని మన
మునఁ దలఁచిన నుభయకర్మ ముక్తుండు దుదిన్. 99

క. మీరణకృత్యము విష్ణు
ప్రారంభముగాన పరమపావన మయ్యెన్
గౌరవ పాండవవీరుల
పోరుత్తమ మనఁగ నెగడు భువనములందున్. 100

ఆ. హరికిఁగానియజ్ఞకర్మైన నదర్మ ప్ర[1]
బీజ మచ్యుతునకుఁ బ్రీతియొసఁగు
బ్రహ్మహత్యయైన పరమధర్మము ధర్మ
శాస్త్రవాక్య మర్మ సరణి వినుము. 101

వ. అత్యంత సాత్వికజ్ఞాన వంతుండవుగావున నీకు నట్లుకొంత కొంత నిజతేజో విలసనంబు ప్రకాశింపంజేయుట యనుగ్రహంబు. 102

చ. జనన సహస్రపుణ్యఫలశంబరధారలనూని సాత్వికం
బనియెడు విత్తునన్మొలచు నచ్యుతభక్తి సురద్రుపల్లి స
జ్జన హృదయాలవాలముల సారెకుఁ బ్రోది యొనర్చుచుండ నం
దున ఫలమై జనార్దనుఁడె తోఁచి ఘటించుఁ దదీయ సౌఖ్యముల్. 103

చ. అనుపమ విష్ణుభక్తియు సమంచిత సాత్వికధర్మసత్తపో
ధనతయుఁ గల్గునిన్ను హరిదాస దయున్ జగదేకపూజ్యుఁగాఁ
గనియును నీకు నిట్లు పొడకట్టుట మోక్షమునీఁ దలంచి యీ
యనువునఁగాదె భక్తులఁ గృతార్థులఁ జేయుచునుండు నిచ్చలున్. 104

క. తగ సర్వంవిష్ణుమయం
జగత్తనుట వినవెయట్ల సర్వగతుఁడు త
త్త్వగరిష్ఠులకుం గనుపడు
ప్రగుణములై యందునతని ప్రతిబింబంబుల్. 105

చ. త్రిగుణమయుండు గావునఁ బ్రదీ[2]పుఁడగున్ వివిధప్ర[3]భాప్తి ని
మ్మగనొకవేళ నొక్కయెడ మూటను నేర్పడియుండుఁ గేవలుం
డగు పురుషుండు గావున క్రియాపరతంత్రుఁడు గావునన్ సమ
స్తగుణ విలాసమూర్తులఁ బ్రసక్తివహించి నటించు నొక్కచోన్. 106

వ. అని సర్వంబునుం దేటపడఁ బరాశరనందనుండు పలికిన ధర్మనందనుండువిని, మహాత్మా! మీ హృదయంగమ ప్రమాణవాక్యంబుల నాసందేహ నివృత్తి

1. పుతేజయచ్యుతు. 2. ఆ. పా. ప్రదీప్తమగున్. 3. వివిధప్రభాప్తి.

యయ్యె. వాసుదేవుండట్టి వాఁడయ్యునైన నింకనొకటి యడిగెద. నప్పురుషోత్త ముండు నిజవే[1]షంబు డాచి మాయామానుష వేషధారియై జగంబులు నడుపు చుండు. తద్విలసనం బెద్దియుంగానక భ్రమసితిరుగు మముబోంట్లు తుది ముట్టనెఱింగి ముక్తి వడయఁజాలరు గాక. విజ్ఞానదృష్టిఁ బెక్కుతెఱంగుల నతని మొదలితేజంబుఁదెలిసి కృతకృత్యులైన మీరట్లు తత్పరమసాయుజ్య ముక్తిం బొందక యుంటకుం గారణంబేమియనిన నమ్మునియిట్లను. సకలంబు నతని మాయావలితంబు తన్మాయాతిమిరంబు జగంబులన్నియుంగప్పి సకల జనుల నజ్ఞానాంధులం గావించుచున్నది. అది భేదింప నెవ్వరికి నలవిగాదు. దానంజేసి విష్ణుసాయుజ్యంబు దుర్లభంబు క్రమక్రమంబున నతనియందు భక్తియెక్కించిన పరమభాగవతులకు సిద్ధించు, నహంకారపరులైన వారు మాయాచక్రంబునంద పరిభ్రమింతురు. వీరు వారనవలదు. సకలజనులు [2]ప్రతిభాశౌర్య విద్యాప్రభావంబుల నహంకరించుచుండ్రుగావున ముక్తి వడయనోపరు. సాత్త్వికగుణంబుగలిగి యతని నెఱుంగుటయరిది. అహంకార గ్రంథులై విష్ణుమాయం దిరస్కరించి బ్రహ్మరుద్రాదులు మోసపోయిరి. మేమెంతవార మెట్లంటేని నేనెఱింగిన కథలు చెప్పెదఁ గొన్నివినుమని పలుకు సమయంబున. 107

ఉ. ద్వారకనుండి వచ్చెవటు వర్యుఁడొకండు వినీలకంధరా
కారుఁడు, గోపిచందన విశేకస్వరఫాలుఁడు, పారిజాత మా
లారమణీయవక్షుఁడు, మిళత్తులసీనవమంజరీ శ్రవో
హారి ద్వితీయ కృష్ణుఁ డనహాటకపుస్తకహస్తుఁడై దివిన్. 108

క. సనకసనందన నారద
సనత్కుమారులును వాని సంగతిఁబిరుదన్
జనుదెంచిరి తత్తను ది
వ్యనితాంత ద్యుతులు పర్వ వడిఁ గొలువెల్లన్. 109

ఉ. వాసవనీలజాలముల వారణరాలెడు మింటనుండియు
ద్భాసితలీల వాని పిరుదన్నవ పంకజ రాగరత్న ము
[3]త్రాసముదాయముల్ దొరఁగెఁ గన్గొనుఁడంచు వటూత్తమాంబు జా
[4]తాసనజాంగ దీధితుల కచ్చెరువందిరి సభ్యులందఱున్. 110

వ. ఇట్లు గొలువువారెల్ల నెద్దియు నిశ్చయింపఁజాలక తత్ప్రభాపట లంబులు కన్నుల మిఱుమిట్లు గొలుపుచుఁ దద్భవన ప్రదేశంబాచ్ఛాదింప సొంపారుచుఁ గొండొకప్రొద్దు హర్షవిస్మయ రసంబుననున్న నర్జునుండు గగనతలం బవలో

1. ఆ. పా. తేజంబుడాచి. 2. బ్రకాంతిభావ. 3. 'ల్కా' 4. ప్రా. పా. పటూత్త మాంబు జాతాసనితాంత.

కించి సాంద్ర మహేంద్ర నీలనీలాకారుండొక [1]బాలుండును సూర్య సంకాశు లైన వారొక్క ముప్వురును, పూర్ణచంద్రోపమానుం డొక్కరుండును నెవ్వరోకాని యేవురు దివ్యపురుషులు విజయంబు సేయుచున్న వారని వెండియుఁ బ్రతీక్షించి యెఱింగితి నివ్వటుండు ద్వారకా నగరంబువాఁడు కృష్ణుని యంతఃపురస్త్రీలకు రుక్మిణ్యాదులకు సుబుసుపోవఁ గథలుచెప్పు గోవిందశర్మయనువాఁడు. వీనియందు సత్యభామా మహాదేవి యనుగ్రహం బతి సమగ్రంబై యుండు, కడమ నలువురును సనకసనందన సనత్కుమార నారదులు. మీరెఱింగినవార. వారి రాకయునియ్యెడకయని తోఁచుచున్నయది. అనినఁ గృష్ణద్వైపాయనుండునట్ల నిశ్చయించి యీ గోవింద శర్మయనువాఁడు మహాతపస్వి, సకలకథాప్రవీణుండు. మనముపక్రమించిన విష్ణుమాయా రహస్యంబులన్నియు విశదంబుగాఁ జెప్పనేర్చు, నిక్కడి కథాప్రసంగంబు తన దివ్యచిత్తంబున నెఱింగి వాసుదేవుండే పంపినవాఁడు. తదనుమతంబునఁ దద్దేవమునులును వాని వాక్పాటవంబును తదీయ మాయాప్రభావంబును వినువేడుకఁ జనుదెంచినారనిన నందఱుం గుతూహలాయత్త చిత్తులై తదభిమతాగమన ప్రత్యుత్థాన ప్రయత్నాభి ముఖులగుచుండిరంత (వారు) ననంత మార్గంబుడిగ్గి తత్సభా సమీపంబున నిలిచిన. 111

ధర్మరాజుసభకు గోవిందశర్మయనే బ్రహ్మచారియును సనక సనందన సనత్కుమార నారదులును వచ్చుట.

శా. పారాశర్యుఁడు దక్కఁ దక్కిన మహా భాగుల్ సభాసీనుల
వ్వారాన్యున్నమితోర్మి సంఘములకే వన్నిల్చుడుంసంభ్రమం
బారం [2]గద్దియడిగ్గిపోయి ప్రణతుండై ధర్మజుండర్థిమై
వారిందోడ్కొని తెచ్చియిచ్చె కడువిశ్వాసంబుతో నర్చనల్. 112

వ. తగువిధానంబున నేవురం బూజించి సత్యవతీసుతుని సమీపంబున నబ్బాలుండ గ్రభాగంబునం గూర్చున్నఁ దక్కిన నలువురక సుఖాసీనులం గావించి తదనుమతంబునఁ గూర్చుండు సమయంబున. 113

ధర్మరాజుసభకు ఋషులందఱు వచ్చుట.

సీ. కశ్యపకణ్వమార్కండేయ భృగువసి
ష్ఠమతంగజాబాలిజహ్నుపులహ
వాలఖిల్యాగస్త్య గాలవమైత్రేయ
జమదగ్నినారద శంకుకర్ణ

1. ఆ. పా. మహాబాహుండును. 2. ఆ. పా. "కారంపానఃజాఁడైన ధర్మజుడు ప్రేమా యత్తచిత్తంబులో వారిం"

కపిలభరద్వాజ గౌతమచ్యవన వి
శ్వామిత్రమౌద్గల్య ఛందదమన
రోమహర్షణపైల జైమిని మాండవ్య
వరతంతుశరభంగ వత్సకౌత్స

తే. లాదిగాఁగలపరమ సంయములువచ్చి
రందుగోవిందశర్మ ధర్మాత్మజునకు
విష్ణుమాయా ప్రభావంబు విస్తరించు
ధీరమతినంచు విజ్ఞాన దృష్టినెఱిఁగి. 114

వ. అట్లు సరిత్సాగర పర్వతారణ్యాశ్రమంబుల నున్నవారలును, దిశాపాల భరిత బ్రహ్మలోకవాసులును తండోపతండంబులై పాటల జటాభార దండక మండల దర్భసూత్రాక్షమాలావల్కలాజిన ప్రముఖ లాంఛనంబులతో నారాయణనామాక్షరోచ్చారణ పరాయణులగుచు వచ్చి ద్వారదేశంబునం దొట్టిన. 115

క. కనిదౌవారిక ముఖ్యుఁడు
వినయాంజలితోడవచ్చి విన్నపమొనరిం
చినవిని కృష్ణద్వైపా
యనుఁడంపఁగ ధర్మపుత్రుఁడతుల ప్రీతిన్. 116

క. అనుజులు దానును సంభ్రమ
మునయెదురుగఁ బోయివినతి పూర్వకముగ స
ద్వినయమున సమ్ముని నీంద్రులఁ
గొనిచనియర్చించియునిచెఁ గుశపీఠములన్. 117

వ. తదనంతరంబవారల యాశీర్వాదంబులతో సోదరామాత్య పరివృతుండై [1]కూర్చుండె. సిద్ధమంత్రకళాప్రత్యక్షీకృతనిజాభిమతుండై దైవతంబుల సన్నిధి సిద్ధపురుషుండునుంబోలె నొప్పుచుండె నప్పుడు. 118

—ధర్మరాజును నారదుఁడు శ్లాఘించుట.—

క. అందఱు సముచితపూజా
నందితులై యున్నఁబలికె నారదుఁడుజనా
నందకరు ధర్మనందను
చందురునందమృతరసము జారెడుభంగిన్. 119

ఉ. గొంతికి ధర్మదేవతకుఁ గూరిమిపుట్టిన పుణ్యమూర్తివ
త్యంతదయావిధేయుఁడవు తాపసముఖ్యులు నీగృహంబునన్

---

1. ఆ. పా. పరివృతుండై సిద్ధమంత్రతంత్రంబుల సన్నిధి సిద్ధపురుషుండునుంబోలె నొప్పుచుండెనప్పుడు!

సంతతముం బ్రియార్చనల సంతసమందుచు నున్నవారినీ
యంతటిభాగ్యవంతుఁడర యన్యమతిలేఁడు జగత్త్రయంబునన్. 120

తే. దేవగంధర్వయక్షదైతేయరాజ
సభలు చూచితినవియునీ సభకుసాటి
గావుసురరాజు సభయేమొ కాని కొంత
ధార్మికశ్రేష్ఠ సంపూర్త ధర్మతనయ! 121

సీ. వాసవదహనాంత కాసురవరుణమ
రుద్యక్షనాయక రుద్రపూజ్యు
లనుచరభూతగుహ్యకసిద్ధగంధర్వు
లైన ద్విపేంద్ర మృగేంద్రమూర్తు
లమితశాపానుగ్రహ ప్రభావులుహరి
హరహేమగర్భాదు లఖిలవేద
శాస్త్రోపనిషదర్థ సన్మంత్రదక్షులు
కల్పాంతరస్థుల నల్పమతులు

తే. సత్యసంధులు తత్వనిష్ఠాగరిష్ఠు
లిట్టిమునులిట్లు నీయింటి కేగుదెంచి
పూజలందుచునుంట నీపుణ్యఫలము
తత్ఫలమునీకు హరినువ్వె ధర్మతనయ. 122

సీ. అఖిలలోకైకనా యకుఁడాదిపురుషుండు
త్రైలోక్యరక్షావి శాలబుద్ధి
శ్రీకృష్ణుఁడనుపేరు చెవులకుఁ జల్లఁగా
భువిదేవకీదేవి కవతరించి
యనుఁగు ముద్దులబిడ్డఁ డగుచు నందయశోద
లకునిహాపర సౌఖ్య లక్ష్మినొసఁగె
కంసాదిరాక్షస ఘోరవ్యముఖపాప
కారులఁద్రుంచి భూభారమడఁచె

తే. వెలయనక్రూరముచుకుంద విభుఁగుచేలు
భీష్మవిదురుని మిమ్ము సంప్రీతిమనిచె
వెండియును నాపయోజనేత్రుండు మిమ్ముఁ
గూడివర్తించు పాయనినీడఁబోలె. 123

వ. అని నారదుండు పలికినయట్ల యానని యశేషమహర్షి పుంగవకులంబు సవిశేష భాషణంబుల ధర్మనందను భూషించిన శేషపన్నగ సహస్రముఖ నిర్ఘోషంబు ననుకరించె. తదనంతరంబ సనత్కుమారుండు తన యందటినడుమను

త్కృష్ట తేజోభిరాముండగుచు గ్రహమండలమధ్యంబున బాల భానుండునుం బోలె ప్రకాశించుచుఁ బ్రతిభా విశేషంబున సభానందకందంబై యున్న గోవిందశర్మంజూచి ధర్మనందనున కిట్లనియె. 124

ఉ. ఈవటు చక్రవర్తిహరి ఽ కిష్టసఖుండు సమస్తశాస్త్రగా
థావిదుఁడాత్మవేదిసతఽతంబును నవ్విభురాణివాసముల్
భావముపల్లవించి బహుఽభంగుల మెచ్చఁగఁ జెప్పఁద[1]త్కథల్
శ్రీవెలయంగ రహస్యకృత ఽ రీతుల మిక్కిలి ప్రస్తుతించుచున్. 125

వ. ఇది యెఱింగి విను వేడుక మేము నలువురము శ్వేతద్వీపంబుననుండి ద్వారకా నగరంబునకువచ్చి యచ్యుతునిచేత బహుమానంబువడసి. 126

ఆ. కృష్ణ నీవిచిత్రఽకేలివర్తనములు
కథలుచేసెనట ప్రఽగల్భబుద్ధిఁ
గూర్మినీసఖుండుఽగోవిందశర్మమా
కవివినంగవలయు ఽ నాదరమున. 127

వ. అనిన మందస్మితవదనారవిందుండై నందకపాణి గోవిందశర్మం జూచి నీవు నామీఁది సౌహార్దంబునఁ జెప్పిన కథలన్నియు, మత్ప్రియ బాంధవుండగు పాండవేయాగ్రణియు నిపుడు కరినగరంబున నిండు గొలువుండి వ్యాసభట్టారకుండు[2] వచ్చిన, నతనితో నన్నుం బ్రశంసించి నామీఁది వాత్సల్యంబునఁ బ్రసంగవశంబున హరిమాయా కేలిచరిత్రంబులు వినవేడుకయ్యెడుఁ గొన్ని చెప్పుండని యడిగిన నమ్మునియేమేనియుం జెప్ప నుపక్రమించినాఁడు. నీవిమ్మునుల వెం[3]టఁబెట్టుకొని యక్కడికి నరిగి యారాజుకుఁ బ్రియంబుగాఁజెప్పుమ్మని యానతిచ్చి వీడ్కొలిపిన వచ్చితిమి. ఇక్కడి కథాప్రసంగంబు నట్లయున్నది. అతని సర్వాంతర్యామిత్వంబు ప్రశంసింప నరిది. ఇంక నతని నీవు ప్రార్థించి మాహృదయంబులు ముదంబునంబొంద నిమ్మునిబృందంబు నకుఁ గర్ణానందంబుగా నడిగి వినుమనిన, సంతసించి కృతార్థుండనైతినని హరిదయా విశేషంబుదలఁచి పులకించి సత్యవతీ సుతుని యనుజ్ఞవడసి ధర్మ పుత్రుండిట్లనియె. 128

ధర్మరాజు గోవిందశర్మను నిజవృత్తాంతమడుగుట.

తే. అనఘ భూసురతనయగుణాభిరామ
యచ్యుతుని యట్ల నీవు మాఽకరసిచూడ
నీదు వృత్తాంతమంతయు ఽ నెమ్మితోడ
నాకు నెఱిఁగింపుమున్న విఽనంగవలయు. 129

1. ఆ. పా. సత్కథల్, 2. డచ్చటికి చనుదెంచిన, 3. దోకొని.

క. అహితల్పునకుం దక్కను
మహితోజ్జ్వల పారిజాత § మాల్యమొరులకున్
మహిఁదాల్పరాదు నీకున్
[1]వహియింపఁగ నెట్లొదవెను § వటుకుల తిలకా. 130

మ. అనినన్ సంతసమంది యానృపతియు § త్యాశ్చర్యముంబొంది క
న్గొనఁ గర్ణామృత వాక్పరంపరల నా § గోవిందశర్మండు మ
న్ననఁజూడుండని యమ్మహామునులకున్ § హస్తాబ్జముల్ మోడ్చి ప
ల్కె నితాంత క్రియగోపకాంతమురళీ § గీత ప్రబంధ ధ్వనిన్. 131

గోవిందశర్మ తనవృత్తాంతము చెప్పుట.

సీ. ఘనుఁడు [2]సాందీపని § యనెడు విద్వాంసుండు
రామకృష్ణులకు గా § రాబు గురువు
ఆమహాభాగుని § యగ్రపుత్రుండైన
ధర్మశీలునకు నం § దనుఁడ నేను
నాజన్మవేళ నం § దకపాణి వినుచుండ
నాకాశవాణి వీఁ § డఖిలశాస్త్ర
వేది యత్యాశ్రమ § విశ్రుతకీర్తి గో
వింద శర్మండు గో § వింద మిత్రుఁ
ఆ. డనుచుఁ బలికెఁ బలికి § నట్లనబ్రహ్మచ
ర్యాశ్రమంబుఁ జదువు § నలరియుండె
మైత్రిఁగృష్ణు నగరు § మరగి వర్తింతు గో
విందశర్మయనఁగ § వెలయువాఁడ. 132

క. చెప్పదుఁ గ్రొత్తలుగాఁ గథ
లప్పద్మదళాయతాక్షు § న బ్జాక్షులకున్
జొప్పడనంతఃపురిలో
నెప్పుడు తత్కేళికలన § తేర్పడియుండన్. 133

పారిజాత పుష్పమాలికాప్రాప్తి వృత్తాంతము.

వ. మఱియుఁ బుష్పదండ వచ్చినప్రకారంబునుం జెప్పెద నాకర్ణింపుము. 134

ఉ. ఆరయ సత్యభామ హృద § యంబెటులుండునొ యంచుమాయ వి
స్తారముచేసి శౌరి ప్రమ § దంబున రుక్మిణియాదినైన పం
కేరుహపత్రలోచనల § కేళివనంబుల నొక్కటొక్కటే
పారఁగఁబారిజాత విట § [3]పమ్ములనిల్పె సమ[4]త్వ మేర్పడన్. 135

1. ఆ. పా. 'వహింపనెట్లొదవె చెపుమ' 2. దీపుడు ననెడు. 3. నివహంబుల.
4. ఆ. పా. సధర్మ

తే. అష్టమహిషులయిండ్ల సహస్రసంఖ్య
లైన గోపాంగనలయిండ్ల నందఱును
నన్నిరూపంబులై కేలి నలరెవిభుఁడు
పారిజాత ప్రసూన సౌభాగ్యలీల. 136

క. ఇందీవరదళలోచన
లందఱుఁ దన్మాయయెఱుఁగ కబ్జాక్షుఁడు నా
యందయనురక్తుఁడని యిం
పొంది [1]తదాసక్తులగుచు నుండిరి ప్రేమన్. 137

వ. ఇవ్విధంబున నయ్యనంతుఁడనంత రూపవిలాసంబుల దక్షిణ నాయకత్వం బవలంబించి యందఱియెడల మనోవాక్కర్మ విలాసకేళీలీల లొక్కచందం బుగా మెలంగుచు నుండె నంత నొక్కనాఁడు. 138

చ. దళమగు రూపయౌవనమదంబునఁ బైకొని చంద్రపాద ని
ర్మల కలధౌత సౌధమణి మంటప కోమలపుష్పడోలికా
తలమునఁ బద్మలోచనుఁడు దానురమించుచు సత్యభామతోఁ
దలఁచెమదీయ కేళికినితండె ప్రియుండని నెమ్మనంబునన్. 139

వ. అట్లు దలంచి యనురాగంబు పెంచి. 140

క. తిలకించుచు పులకించుచుఁ
[2]గలకలమని నగుచు విభుని కౌఁగిటఁగోర్కుల్
నెలకొలిపి కబరభారో
ద్గళితోత్కట పారిజాత గంధంబెసఁగన్. 141

ఉ. చయ్యనశయ్యడిగ్గి యరజాఱెడువేణియు మందహాసమున్
బయ్యెదజీరుపాటు నవపాటలితాక్షులు మర్మసీమలన్
వ్రయ్యలు వాసియున్న నెలవంకలు నొప్పఁగ నాలతాంగియొ
య్యొయ్యనవచ్చె వాకిటికి నుబ్బుచు నవ్విభుఁగూడి క్రీడమై. 142

క. చనుదెంచి వికచపంకజ -
వనబంధు[3]రసురభిగంధవాసితమై యిం
పొనరించుకేళి దీర్ఘిక
ననువున మజ్జన మొనర్చె నభిమతలీలన్. 143

వ. కనకపీతాంబరంబులు ధరియించి తత్తీరపారిజాత ప్రసూనంబులు మనోహర మండనంబులుగా నలంకరించుకొని, పుష్పాడియలంది మధురసంబుగ్రోలి యానందలహరిం దేలియాడుచుఁ దదంతిక చంద్రోపల వేదికామధ్యంబునఁ

1. సదాసక్త. 2. కలుషింపుచు. 3. ఆ. పా. వనబంధ సుగంధసురభి.

బుష్పాస్తరణంబునం గూర్చుండి చంద్రికాశీతలంబులగు మందపవన కందళం
బులచేత సురతఖేదంబపనయింపుచుండిరప్పు డమ్మహాదేవి తనమనంబున. 144

శా. నాతోఁగూడి విభుండు సంతతము సుకేన్నాఁడిట్లు ప్రేమోల్ల స
చ్చేతో మోదమెలర్ప దీనికి మదిన్ సిగ్గైన నెట్లున్న వా
రోతర్కింపఁగ రుక్మిణీముఖవరాకేరోహాల్ తదుద్యోగముల్
[1]చూతామంచు దరస్మితాంశుకలనాకేను స్మేరవక్త్రాబ్జయై. 145

తే. ఇంగితాకార చేష్టలెకేఱింగి మనను
లోనమెలఁగెడు స[2]ఖులగాకేరానఁబిలిచి
యానుర ద్రుమకుసుమ చకేయములు గొన్ని
యేర్చికోయించి వేర్వేఱ కే యేర్పరించి. 146

తే. దివ్య మాణిక్య పాత్రికల్ కే దెచ్చియిడినఁ
దత్ప్రసూనంబులన్నియుఁ కే దగిన కొలఁది
నోలిఁబెట్టించి యిట్లనె కే నొకతెతోడ
నలిననేత్రుఁడు దనలోన కే నవ్వుచుండ. 147

క. [3]ఈపువ్వులుగొని రుక్మిణి
కేపారుకడంకతోడ కే నిచ్చితదీయ
వ్యాపారము తలఁపును గని
రాపొమ్మని యానతిచ్చె కే రాజసమొప్పన్. 148

వ. అప్పుడు. 149

చ. సురతరులాభగర్వమును కే శోభనయావన గర్వమున్ మనో
హరనవరూపగర్వమున కే నంగవికార విహారగర్వముం
బరమహితాత్ముఁ డైవిభుఁ డుకేపాయని గర్వము సత్యభామకున్
సరిపుఁబోండ్లలోనఁ గడు కే సాగుటకున్నదిఁ బొంగిరచ్చెలుల్. 150

వ. ఇట్లు పారిజాత ప్రసూనదాన వ్యాజంబున రుక్మిణ్యాదులకు దనమహారాజ
సంబును బ్రాణేశ్వరు తోడంగూడి యనుభవించు మదన సామ్రాజ్య వైభ
వంబును హృదయశల్యంబై యుండవలెనని కాదె ననుఁబోంట్లఁబంపుట యని
యా[4]పరిచారికారత్నంబు తన్మనః ప్రసాదంబున నెఱింగి,చూపిన పుష్పపా[5]త్రిక
పుచ్చుకొని రుక్మిణీదేవి నగరికిం జనియె. కడమ సవతులయిండ్లకు నట్ల యా
దేవి నియోగించిన సఖిజనంబులుపోయిరి. అట మున్నపోయినది రుక్మిణీదేవి
కేళీభవన ద్వారంబు ప్రవేశించినఁ దద్ద్వారపాలాంగన వాకిటికి నడ్డమై నిలిచి
దానితో నిట్లనియె. 151

1. చూతంబంచు. 2. సుతుని. 3. ఈ వువులుగొన్ని. 4. సంచారికా. 5. ఆ. పా. పుష్పమాలిక,

క. ఏకాంతంబున దేవియు
శ్రీకాంతుఁడునున్నవారు చిత్తజకలనా
వ్యాకులితేంద్రియులై తమ
లోకంబై, పోవఁద[1]గునె లోనికి నీకున్. 152

క. ఇవ్విరులెవ్వరు బంపిరి
యెవ్వరిచెలివనిననవ్వి యెఱుఁగవె యున్నా
రివ్విరులెవ్వరి కింగల
వవ్వారిజనేత్రునగరి యతివలలోనన్. 153

వ. లేని యేకాంతంబులు గల్పించెదు. పువ్వులెవ్వరు పంపిరెవ్వరిదానవని నన్ను నిరాకరించి పలికెదు. పారిజాత ప్రసూన సౌరభ సౌభాగ్యంబు దేవేంద్రుని నందన వనంబు చూఱవెట్టించి తెచ్చిన వీరపత్నీ తిలకంబగు సత్యభామకుం దక్కఁ దక్కిన యీనగరిమగువలకుం గలుగనేర్చునేయని గర్వించిపల్కిన నవ్వెలది నవ్వెలయ నిట్లనియె. 154

ఆ. పారిజాతమేమి ప్రాఁతియందఱియిండ్ల
[2]నుంటఁజూడవే పయోజనేత్ర
ముదుతురిట్టి పువ్వు[3]లుడిగెంపువారుమా
జనని నగరి పారి జాతమొసఁగ. 155

వ. అనినప్పలుకులకుఁ గనలి నవ్వుఁ బలుకుగాఁ దిరస్కరించి మాసత్యభామ మీరుక్మిణికిఁ బువ్వులిచ్చి రమ్మని పంపినది. ఈ పువ్వులిచ్చిపోయెదఁ ద్రోవ నిమ్మని పలుకు సమయమ్మున వారిద్దఱి సంవాదంబు నాలకించి యొక్క సంచారికలోననుండి వచ్చి మహాదేవి యానతియయ్యె రమ్మని దానిం దోడ్కొనిపోయె. నటమున్న యభ్యంతరమ్మున. 156

మ. సుమనోనిర్మిత హర్మ్యనిర్మల శశిజ్యోత్స్నాఽరసస్వచ్ఛవ
భ్రమరీచిస్ఫుటవేది లేఁజిగురుపర్యంకంబునన్ రుక్మిణీ
రమణీరత్నముశౌరిఁ గూడిరతిసంరంభంబు చాలించియా
కమలానాథుఁడు డింపశయ్యడిగియోన్ గాఁడీఁగ వేసోలఁగన్. 157

కృష్ణరుక్మిణీ సంభోగము.

సీ. అంకుశనిర్భిన్న హస్తికుంభములట్లు
కొనగోటినొక్కులకుచములమర
కీరంబువాయి సోకినబింబ ఫలమట్లు
దంతక్షతాధర దళముదనర

1. దరమె, 2. నుండఁజూడవే పయోజనేత్రి. 3. అ. పా. 'ఱడిగాలవారుమా.'

నత్తుటఁదోఁగిన ॥ నిశితబాణములట్ల
కరవాఁడి కెంజాయ ॥ కన్నులెసఁగ
మృగయాంతమునఁజిక్కి ॥ దగిలిన వెడవిల్తు
నురులట్లు చెదరిన ॥ కురులుశెరయఁ
తే. గేళిమైనట్లువచ్చి దీర్ఘికకుఁడిగ్గి
ప్రమదమున మజ్జనంబాడి ॥ పసిడిపచ్చ
పట్టుధరియించి తత్తీర ॥ పారిజాత
కుసుమభూషణములుదాల్చి ॥ కోర్కినిండ. 158

ఆ. పువ్వుదేనెఁ గ్రోలి ॥ పుష్పొడియలఁదిత
త్పారిజాత మంటపంబులోన
నలరుపాన్పుమీఁద ॥ నాసీనులై యుండి
రింపుఁ బవనమొలయ ॥ నెలమిఁబొంది. 159

క. అక్కడనక్కడ నాక్రియ
దక్కఁగహరిఁగూడి సమ్మ ॥ దంబెసలారం
జొక్కమయియుండిరందఱు
నక్కట్టడయేమి చెప్పనచ్చెరు[1]వెందుర్‌.  160

వ. ఇవ్విధంబున వినోదించుచు రుక్మిణీదేవి తనమనంబున నిట్లనియె. 161

ఉ. నాకును బారిజాతము మ ॥ నంబెసలారఁ గనిచ్చెఁ బ్రేమతో
నాకడనే యహర్నిశము ॥ నాయకుఁ డుండఁగ నంతఁగుందుచున్‌
వ్యాకులితాత్మయై యెటులు ॥ వర్తిలుచున్నదొ సత్యభామనేఁ
డాకత చూతమంచు దర ॥ హాస విలాస విభాసితాస్యయై. 162

వ. ఒక్క చతుర సంచారికం బిలిచి క్రొవ్విరి పారిజాతమంజరులు గొన్నికోయించి పసిండి పళ్లెరంబునం బెట్టించి యవ్విరులు సత్యభామకుం గానిపొమ్మని దానితోనేకాంతంబున. 163

క. మాకు నొక పారిజాతము
మాకృష్ణుఁడు దెచ్చినాఁడు ॥ మగువాయిది గో
నాకల్పకతరువిరులివి
యేకడలేవనుచుఁ జెప్పి ॥ యే[2]తెమ్మనుచున్‌. 164

వ. పలుకుచున్న సమయంబై యున్న నాసపత్నిసంచారిక డాయంబోయి. 165

మ. కనియెన్ రుక్మిణిఁ బూర్ణచంద్రవదనం ॥ గంజాక్షుతోఁ బారిజా
తనవీనాభరణాభిరామ నభిజా ॥ తస్మేరతారుణ్యమం

1. వొందున్‌. 2. యేతేనగుచున్‌.

డనలక్ష్మిఁ సురతాలసాంగి నతులా § నందస్ఫురన్మానసన్
ఘనపుష్పోదయ పారిజాత సవిధ § గ్లారత్న వేదిస్థలిన్. 166

వ. కని వెఱఁగుపడి యవలోకించి. 167

క. ఏమార్గంబున వచ్చెనొ
యీమాయావేషధారి § యిచటికి నీకాం
తామణి నెప్పుడు దనిపెనొ
కామకుశల నింతహృదయ § కంజంబలరన్. 168

క. మాయింటి పారిజాతము
నీయెలమి వహించియుండ § దెన్నడు నిది దా
నీయతివ కెపుడు తెచ్చెనొ
యీయనిపుఁడు సత్యభామ § యెఱుఁగక యుండన్. 169

వ. అని ద్వారపాలిక చెప్పినమాట నిశ్చయించి వెండియు రుక్మిణింగనుంగొని.

ఉ. తానును సత్యభామకు ము § దంబున రుక్మిణి పంపనున్నదో
యీనవ పారిజాతములు § నిప్పుడు సంభ్రమమట్లయున్నదా
నానలదూతియుంగదిసి § యల్లనతావినుచున్నదేటివ్రా
కానొకకొన్నిమాటలు వి § కాసముతోఁ జెవిలోనఁ జెప్పఁగన్. 171

క. ఏనీకొనితెచ్చిన విరు
లీనెలఁతకు నీగిమేలొ § యీకమగుడిపో
తేనేమేలో యొకగతి
నేనెయ్యది యాచరింతు § నీయుభయమునన్. 172

ఆ. ఇచ్చియున్నమాకు § నెన్నిలే వేలతె
చ్చితివియనియె నేని § సిగ్గుమిగుల
నీకమగుడిచనిన § నీసతినగుఁ బోవ
నిమ్మటంచు నదియు § నెగ్గకాదె. 173

వ. అని సందేహంబు మనంబున నూటాడఁ గొండొక వితర్కించి మహారాజ పత్ని నగర విహారించిన ప్రౌఢగాన నదియప్పుడు దెచ్చి యిచ్చినట్ల నిర్వికారం బున నవ్వుచు నీపువ్వులిచ్చి పోవుటయ కర్జంబని నిశ్చయించి కడంక చెడక యాదేవిముందటఁ బువ్వులువెట్టి మీకు సత్యభామ యంపించినదనిన లంఘించి యవ్విరులు చూపి రుక్మిణి ప్రాణేశ్వరునితో నిట్లనియె. 174

క. నాళీకనయన నీప్రియు
రాలంపినవిరులు గొనుము § రతిరాజకళా
కేళికిలంచము సేయం
బోలుననుచు నీరసంబు § వొడమ నగవుతోన్. 175

క. అదిచూడఁగ నవ్వీరుల
మ్మదవతి వల్లభునిమాళి § మండలిఁ దురిమెన్
హృదయప్రణయామర్షణ
నదమల దృగ్రాగసూత్ర § సంగతిమెఱయన్. 176

వ. అట్లు రుక్మిణి యా రసికశిఖావతంసంబగు కంసారికిఁ బువ్వులు ముడిచితన
వయస్యచేతఁ బువ్వులంపుట మాని యాపువ్వులు దాని పళ్ళెరంబునం బెట్టించి
దానికిఁ దనపారిజాతంబు చూపి విభునిఁ గన్నుగీటి నవ్వుచు నిట్లనియె. 177

తే. ఇంతి యీపువ్వు చెట్టు మీ § యింటి పారి
జాతమట్టిదె యీ నేము § చక్కఁ జూడు
మిందుపువ్వుల నెత్తావి § యెందుఁ జూడ
మన్నదని చెప్పుమీ మీవశీయస్యతోడ. 178

వ. అని వీడుకొలిపిన నమ్మాట వాడిగసికయై మనంబుగాడినం గనలి వెడవెడ
నవ్వుతో నమ్మగువ యిట్లనియె 179

చ. అలవుఁ జలంబుచూపి నర § కాసురుఁ గెల్చిన వీర సంపదన్
బలరిపువీడుఁ జొచ్చి భువ § నంబులు మెచ్చఁగ సత్యభామ సొం
పలవడఁ దెచ్చియాత్మనిల § యంబుననుంచిన పారిజాత మీ
చెలువ తలంప మీ పెరటి § చెట్టునకున్ సరిరాక పోయెనే. 180

క. నీ వేమి సేతుమాని ని
యీవిభు నాటకముగాక § యిది కానీవే
యీవెలఁది బోరిఁ బడినపు
డీవిధములు చూపకున్నె § యిపుడేమిటికిన్. 181

వ. అని పారిజాతంబునకై రుక్మిణి నెకసక్యంబాడి నెఱవాది తనమున్న నమ్మురాం
తకుఁ బంతంబులు పలికి యీపువ్వులు దృష్టాంతంబులుచేసి యిచటి వృత్తాం
తంబంతయు నయ్యాది గర్భేశ్వరికి విన్నవించి సేయంగలపనులు సేయింతునని
మరలి శీఘ్రయానంబునం బఱతెంచె. నప్పుడక్కడ సత్యభామయు. 182

క. దరహాస రుచులు నిగుడఁగ
గురు కుచములఁ బ్రియునురమ్ము § గ్రుచ్చుచుఁ దొడపై
నిరవుగఁ గూర్చుండి మద
స్ఫురణంబునఁ జెలికి నెదురు § చూచుచు మదిలోన్. 183

ఆ. చెలియ రాక తడవు § చేసె రుక్మిణి శౌరి
విరహభారవహ్ని § వేఁగుచున్న
నవసరంబు లేమి § నటమండెఁగాఁ బోలుఁ
గాక పువ్వులిచ్చి § రాకయున్నె, 184

వ. అని వితర్కించుచున్న సమయంబున. 185

శా. విన్నంబోయిన మోముతో హృదయ నిర్వేదంబుతో సంభ్రమ
స్విన్నాంగంబులతో విరాగకలనా వేశంబుతో సిగ్గుతోఁ
జెన్నుం జేవయు లేక యల్లచని చూచెన్ దూతి దాదవ్వులం
గన్నారం దమసత్యభామను హరిం గౌతూహలోదాత్తులన్. 186

వ. కని వెండియు నాశ్చర్యంబునొంది. 187

క. క్రమ్మర నిచటికి నేమా
ర్గమ్మునఁ బ్రత్యక్షమయ్యె రసికుఁ డితఁడుచో
ద్యమ్మయ్యె నింద్రజాలమొ
యిమ్మైనది చిత్రమనుచు నెలనవ్వలయన్. 188

వ. ఆగమనసంభ్రమంబులం బదంబులు తడంబడ డగ్గఱవచ్చి యమ్మచ్చకంటి ముందటం బుష్పపాత్రిక వెట్టి యేమియుం బలుకక యెడఁ గలుగనిలిచి నివ్వెఱపడి చూచుచున్న దాని ముఖవైవర్ణ్యంబుపలక్షించి సత్యభామ యిట్లనియె. 189

క. వెఱఁగుపడి భ్రమసిచూచెదు
తెఱవా యిది యేమివింత ధృతిచాలక సొం
పఱియున్న దేమి నీమొగ
మెఱఁగింపుము వింతపువ్వు లెచటివి నీకున్. 190

క. నావుడు నది యిట్లను నా
దేవికిఁ బ్రియునట్లు నిన్నుఁ దేలించెదు నీ
దేవరఁ గృష్ణుని నడుగుము
నీవడుగఁగ నోపితేని నీరజనేత్రా! 191

వ. అనుచుఁ బతిసమ్ముఖంబునం జెప్పనోడి తొలంగిపోవ నిదియేమొకో కీని మాటలవలనఁ గొంతవింత చందంబు పుట్టెనని కలుషించి యాదేవి విభుని నెఱిం[1]బాఱంజూచి యాభావంబు చెప్పుమని యడుగంబోయి రోషంబున నడుగక మణికంకణ మంజీర మేఖలాకలాప ఝుణఝుణత్కారంబు తోరంబై మదన [2]భృంగశింజినీ భీకర[3]టంకార రావంబు ననుకరింపం జేయఁ దోయజాక్షుని హృదయంబు చెదర నుదరిపడి తదంక పీఠంబు పరిత్యజించి లేచి పృథు నితంబ భారంబునను గురుకుచ కుంభంబు వ్రేగునను గమనవేగంబు చాలక తొట్రుపడుచు, నిలునిలుమని దానిం డాయంబోయి కరంబవలంబించి యొక్క కాంచన స్తంభంబు దండగొని యడిగిన నది దాచక తనకన్న విధంబెల్ల నల్లనం జెప్పి వెండియు నిట్లనియె. 192

---

1. ఆ. పా. నెరిబారిచూచి, 2. మదనధనుర్భృంగశింజినీ భయంకర. 3. ఝుంకార.

సీ. హరియును నీవు నెయ్యముతోడ నిచ్చోట
నుండఁగాఁ గనుగొంటి § నుల్లమలర
నచ్చోటఁగంటి నెయ్యముతోడ రుక్మిణీ
లోలుగాఁగ సరోజ § లోచనుండు
నచటికెట్లరిగెనో § యచటివాఁ డిచటికి
నేలాగువచ్చెనో § యేనెఱుంగ
నీవ యెఱుంగుదు § నీలవర్ణుని మాయ
[1]కాంత యేమందు నీకంటె మిగుల

తే. రాజసంబున [2]రతిరాజ § రాజ్యకళయుఁ
గలిగి విభుతోడనున్న యాచెలువ చెలువు
మన్మథునిఁగూడి రతియున్న § మహిమదోఁచె
మగువయేమని నమ్మెది § మాయకాని. 193

క. నీకిచ్చెఁ బారిజాతము
లోకంబు లెఱుంగమున్ను § లోలుండై నేఁ
డా కంజాక్షికినిచ్చెను
నీకంటెను గూర్చునా వనిత గృష్ణునకున్. 194

క. ఆవెలఁది నీకుఁబంపిన
పూవులనెత్తావి చూడు § బూమెల వలపుల్
గావించినపతిఁ జూడుము
[3]నావచనము కల్లగాదు § నమ్మవయేనిన్. 195

క. చెలియొకతెనంపు రుక్మిణి
నిలయమునకు నిపుడెయనఁగ § నిశ్చయముగఁ బు
వ్వులు గొనిపోయిన యందఱు
చెలులొక్కటవచ్చియట్ల § సెప్పిరి సతితోన్. 196

చ. అనయము నేక వాక్యముగ § నందఱు చెప్పిన యప్డునిప్పు సో
కిన క్రియవెచ్చి యంగలత § కేవలతప్త సువర్ణమూర్తియై
కనుబడఁగెంపు సొంపడరు § కన్గవతోఁ దరళాక్షిమీనకే
తనుమహితానలాస్త్రము విరోధంబున వచ్చెమురారి పాలికిన్. 197

వ. ఇట్లసూయారాజాత ప్రభూతరోష కషాయిత స్వాంతయై తనతోన సకలసఖీ
వర్గంబు ననర్గళభంగిన్ బుష్పమణిపాత్రికలతో నేతేర వనదేవతాసంతతితో

1. అ. పా. నాకెంత తెలియుంగ నలినగంధి. 2. రతిరాజ్య రమ్యకళయు 3. నావచ
నము కల్లగాదు నమ్మనుయనినన్. (నమ్మమటన్నన్ ?)

వచ్చిన వసంతలక్ష్మియన నమ్మానవతీ తిలకంబు హరిముందట నిలిచి యి ట్లనియె. 198

క. విను, తాల్మి లేక యేడ్చుచుఁ
దనులత గంపింప గద్గదస్వరమున న
జ్ఞానిచేఁ బలికెదు వీణియ
కైనస్మై తడబడుచుఁ బలుకు లేర్పడకుండన్. 199

చ. ననునొక పెద్దచేసి భువనంబు లెఱుంగఁగఁ బారిజాతమ
య్యనిమిషనాథుగెల్చి నయమారఁగ [1]నిల్పితి నాఁటిమేలు నా
నెనరు కృపావిశేషమును నేఁడొనరించితె పెద్దదేశిక
మన మలరన్ వశీకరణ మంత్రము గ్రొత్తగ నభ్యసించితో[2]. 200

తే. పారిజాతంబు భువి సత్యభామయింటఁ
గానిమఱి యొండొరులయిండ్లఁ గలుగ దనఁగఁ
గలుగఁజేసితె తక్కిన పొలతులిండ్ల
నేమి మందుల వలపించి రింతనిన్ను. 201

ఆ. సత్యభామ పారిజాతపుష్పము లంపె
నంపసాటికొరులు నంపువారె
యింక కడమమాట లేల యీతరువునీ
యిష్టసతికిలంచ మిచ్చుకొమ్ము. 202

వ. అని సపత్నివిషయ రోషవిషాదంబున శంకాతంకంబులేక యవ్విరులన్నియు వెన్నునిపై దిగు పాఱంబోయించి చంచల హృదయంబునం గోపోద్దీపితయై, తత్సన్నిధానంబువిడిచి తన కేళిమందిరంబు చేరంబోవ, నవ్విభుండు నవ్వుచు లేచి కూడముట్టి బోటిక త్తెలవ్వ లివ్వలఁ దొలంగిపోవ నమ్మానిని పయ్యెద చెఱంగుపట్టినఁ బట్టువడక భ్రమణవేగంబున నవ్వలువవిడి జాఱ లోనికింజని గ్రక్కున గగనకవాటార్గళంబు బిగియించి వేఱొక్కచీనాం శుకంబుధరియించి చెంగలువ పాన్పున మేనువైచి పొరలుచు, ఘటనిహిత క్షుభిత పన్నగాం గనయుంబోలె రోజుచుండె నట యొడుపుదప్పిన పద్మలోచనుండును మగుడి యొక్క బహిర్మంటపరచిత కుసుమశయనీయంబున శయనించి, తద్వయ స్యలుసముచిత సేవా విధానంబు లొనరింప నయ్యంతి సంతాపశాంతికై విరహ ధర్మం బవలంబించి యమ్మూర్తినచటనుండి, రుక్మిణ్యాది ప్రధాన దేవీజనంబుల యందును,షోడశసహస్రసుందరీ సందోహంబునందు ననురక్తిఁ దాల్చిన రూపం బులఁ గ్రీడించుచుఁ జిత్రకాళలంబుల నారాత్రి గడపి ప్రభాతంబున నామా యారూపంబులన్నియు నుపసంహరించి యూరకుండె నప్పుడు. 203

1. ఆ. పా, నిచ్చితి. 2. నభ్యసింపుచున్.

క. ఆలీలామిథునము త
త్కాలోచిత విధులుదీర్చి కడువడి నన్యో
న్యాలోకన సదుపాయం
బాలోకించుచును తమాతమం బడుచుండన్. 204

సీ. ఆవేళ నేఁబోయి యదియెల్లఁ దప్పరి
చారికాజనముచేఁ జక్కఁ దెలిసి
హరిఁగాంచ నమ్మహాపురుషుండు దనకేళి
మాయావిధానంబు మందహాస
మెసఁగ నానతియిచ్చె నీ సేతలన్నియు
వెడపోకలని యార్య విడువఁజేసి
సత్యభామకుఁగోప శాంతిసేయుము పొమ్మ
నావుడు నలతి యాదేవికడకు

తే. సముచితక్రియఁ జనిన యాజలజనేత్ర
నన్ను మన్నించి కనకాసనమునునుంచి
తాను నానతి యిచ్చెత ద్వృత్తనములు
నాత్మసంచార ఫణితియు సర్వాభంగి. 205

క. చెప్పిననంతయు వినినే
నప్పుడు తలయూఁచి యమ్మహాదేవి మొగం
బొప్పారఁజూచి నవ్వినఁ
గప్పర పడినన్నుఁ బలికెఁ గౌతుక మెసఁగన్. 206

వ. కుమారా! దుగ్ధసాగరంబున నమృత పూరంబునుంబోలె నీ నవ్వు మన్ననకు ప్రసాదహేతువై యొక్క విశేషంబుదోఁచె నభిప్రాయంబు చెప్పుమనిన, నంబా! యీసకలంబును నాకపటనాటకుని మాయానాటకంబు. ప్రతిమంది రపారిజాతవిలసనంబును బహురూపకత్వంబును హరి యింద్రజాలంబు, నీ హృదయ ధైర్యసామగ్రిచూడ నమకట్టిన పని యింతప్రొద్దు నిన్ను భ్రమ యించె. నింతియేకాని నిక్కంబుకాదని సంచారికలవలన పరామర్శించి కల్ల చేయకదీనికై నీవంటి మహా ధీరనాయికా రత్నంబునకు సంచలింపనగునే, తొల్లియు శ్రీమహాలక్ష్మి ద్రుహిణ రుద్రాదులు నీవిభుని మాయానాటకం బున భ్రమసి తిరిగిరి. ఆ కథలు చెప్పెద నాకర్ణింపుమనిన, నచ్చెరువంది పరిణమించె నంత నిజవల్లభుండు ప్రణయప్రీతి పూర్వకంబులైన విధానంబు లందన్ను మన్నించి కూడుకొనిన నలరి యద్దేవ దేవుని యనుమతి నన్నుఁ బుత్రవాత్సల్యంబున నారాధించి యా జగజ్జనని నాకు నీ పారిజాత మాలిక

యనుగ్రహించెనని గోవిందశర్మ ధర్మనందనునకుం జెప్పెననిన విని పరీక్షి త్తుండట మీఁదటి వృత్తాంతం బెట్లయ్యెనని శుకబ్రహ్మ నడుగుటయును, 207

క. నారాయణదేవ కృపా
పారాయణ భక్తలోక । పాలకవిద్యా
కైరవ చంద్రోదయమా
యారమణీరమణయుతా । యానందనిధీ. 208

ఉ. శ్రీతులసీస్రగర్చితప । రిస్ఫుట కౌస్తుభపద్మరాగ ర
త్నాతుర భద్రపీఠసమ । పాశ్రితసింధు సుతాకటాక్షవీ
క్షాతుహినాంశుదీప్తివిక । సత్త్రిజగత్కుముద ప్రసూనగం
ధాతిథిబంధురాయిత నిశాను చరేంద్రదమూఖాఖిలామరా. 209

మాలినీ. ప్రకృతి పురుషమూర్తీ । బ్రహ్మయోగానువర్తీ
సకలనయనరమ్యా । సాధులోకైక గమ్యా
ముకుటకలితపింఛా । ముక్తసంగాతివాంఛా
వికచకమలనేత్రా । వృత్రజిన్నీలగాత్రా. 210

ఇది శ్రీమదన గోపాలచరణకమల సేవాధురీణ సత్కళాపారీణకృష్ణ
భట్టారకపౌత్ర చింతలపూడికామయప్రభునుపుత్ర సుకవి
వర్యరాధామాధవయల్లనార్య ప్రణీతంబైన
విష్ణుమాయానాటకంబునందు
ప్రథమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

౦ శ్రీ ౦

శ్రీ ర స్తు.

# వి ష్ణు మా యా నా ట క ము.

## ఆ శ్వా స ము. ౧.



క. శ్రీరాధాధరమధురను
ధారసధారా ప్రశాంత దారుణనిశిత
స్మారశరానల ధీరో
దారగుణావాలనవమ దనగోపాలా. 1

తే. అవధరింపుము దేవసం యమివరుండు
సకలవేదాంత విద్యా విశారదుండు
శుకమహాయోగి పలికెను త్సుకతమతియు
నింపుగా నాపరీక్షిన్న రేంద్రునకును. 2

తే. ఈవిధంబునఁ బారిజాతావనీజ
కుసుమమాలిక తాఁగయి కొన్ని తెఱఁగు
చెప్పి వెండియు నానృప శేఖరునకు
ననియె గోవిందశర్మ ప్రహ్లాదమెసఁగ. 3

క. ఆసాధ్వి చిత్తగించుటఁ
జేసి పవిత్రములునతివి చిత్రంబులునై
భాసిల్లెవిష్ణుమాయో
ల్లాసచరిత్రములు వినుమి లాతలనాథా. 4

మ. హరిలీలా మహనీయమై హరవిరిం చ్యామర్త్యసంసేవ్యమై
పరమంబై బహుశాస్త్ర సారమతమై ప్రామాణిక గ్రాహ్యమై
నిరతానంద సుఖైకహేతువయి యున్నేమించిమాయాప్రపం
చరహాస్యంబగు తత్కథానివహము శ్రాంతంబులోకంబులన్. 5

విష్ణుమాయావిలాస కథలయొక్క ప్రారంభము.

క. శ్రీయుతమై విష్ణుమహా
మాయానాటకము నాఁగ మహి వెలసె మహీ
నాయక తత్కథలన్నియు
నాయతగతి నొకప్రబంధమై నాచేతన్. 6

మ. వినువిశ్వక్షితిపాలమౌళి వలభీ విస్ఫారరత్నప్రభా
కనదుద్దామ పదారవింద త్రిజగత్కల్యాణచారిత్ర పాం
డునరేంద్రోత్తమపుత్ర యీముని గరిష్ఠుల్ నీవునుంగూడియొం
దునకుం జిత్తముఁ బోవనీక హరియందు న్నిల్పిసంప్రీతితోన్. 7

వ. అని కొలువు సావధానంబు గావించి. 8

వైకుంఠ పురవర్ణనము.

సీ. పాలమున్నీటిలోఁ బ్రభవించునుదయరా
గంబుతోడి సుధాంశు బింబమనఁగ
మంచుగుబ్బలిమీఁద మించునుదంచిత
కమనీయ ధాతుశృంగంబనంగ
నిండుఁగొలంకున నిండారవిరసిన
ప్రత్యగ్రహల్లక ప్రసవమనఁగ
పటికంపురాసనపైఁ బ్రోవుగానిడ్డ
కాశ్మీరకర్దమ కబళమనఁగ

తే. ధవళకర్పూరరాశి విధంబుగలిగి
యందమైయున్న తెలిదీవియందుఁ దనరు
దివ్యమాణిక్య రుచిపుంజదీప్తివప్ర
గోపురోద్దామవరమువైకుంఠపురము. 9

ఉ. ఆరమణీయధామమున నాదిమవిష్ణుఁడు లక్ష్మియున్ మనో
హారిమణిప్రభాస్ఫురిత హాటకకుట్టిమ చంద్రశాలలో
భారతియాదిగాఁగల సుపర్వవధూటులు చేరికొల్వ సొం
పారుచు జూదమాడుటకు నాత్మఁదలంచిరి కౌతుకంబునన్. 10

విష్ణుమూర్తియును లక్ష్మీదేవియును జూదమాడుట.

ఆ. చిత్తవృత్తియెఱిఁగి యత్తఱిపవడంపు
[1]పలకరత్నసారెలలవరించి
[2]కనకరుచిరపాచికములుదన్మధ్యభా
గముననునిచె దివ్యకాంతయొకతె. 11

క. సిరిచూడా రత్నంబును
హరికౌస్తుభమణియుఁ[3] బందెమయ్యెజయాశా

---

1. ప్రా. పా. పలకల దనరసారెలలరబన్ని, 2. ఆ. పా. కనకఖచిత పాచికలును. దనర సారెల లరబన్ని. 3. ప్రా. పా. మణికి.

పరతంత్రబుద్ధినపుడొం
డొకులకుఁ బెనఁగొనియె [1]నేర్పు నుత్సాహంబున్. 12

క. గిలకల సారెల మ్రోఁతయుఁ
గలకల కంకణ రవంబు కర్ణో[2]త్సవమై
చెలఁగఁగ నాడిరి ద్ర[3]స్తరి
పలుకులఁ బంతముల నేర్పు పచరించి తగన్. 13

క. కాంతుఁడు జయమందఁగ భూ
కాంతామణి గోరు దివ్యకాంతాతతి శ్రీ
కాంతజయము గోరును వా
క్కాంత యుభయజయముఁ గోరుఁ గౌతుక మెసఁగన్. 14

సీ. అడిగిన ద్రోయంబు లందందఁ బడుచున్న
నుల్లంబులో శౌరి యుల్లసిల్లు
నొంటిన సారెకు నొనరదోయమువడ్డ
చంచలేక్షణ ముదలించి పాడుచు
నాటఁగొంచెం పుద్రోయమున [4]దూగక సార్లు
చచ్చిన వెసనవ్వు చక్రపాణి
తనయాట నయమయ్యెఁ దగుపందుసారెత్తు[5]
ద్రాయంబు రాకున్నఁ దరుణి కినలు.

ఆ. నాటసగము చేసి యాడించు దనుజారి
[6]పిక్కమొదటి కాలఁ బెట్టునతివ
హరి తిరస్కరించు నంగన గలుషించు
నాటయాగ్రహంబు నగ్గలింప. 15

క. [7]అవమతి సప్తవ్యసన
వ్యవసాయము వలదు సుజన వరులకు సరస[8]
వ్యవహారహాని గావున
నవనీశ్వర జూదమొప్ప దన్నిటికంటెన్. 16

---

1. ఆ. పా. డొండొరులకు బెనగొని యొనర్చు నుత్సాహంబున్. 2. ప్రా. పా. కర్ణోత్సవమై. 3. ఆ. పా. ప్రస్తరి. 4. కొంచెపుద్రాయమునగూడ కాసారె వొచ్చిన వెడనవ్వు. 5. దగు పంట సాలెత్తు. 6. బెట్టుమొదలి పాలెబెట్టునతివ. 7 ప్రా.పా. అనుపమ. 8. ప్రా.పా. సదసద్వ్యవహార.

ద్యూతనింద

సీ. స్వామి భృత్యన్యాయ సరణి నాక్షేపించు
గురుశిష్యభావంబు పరిహరించు
పితృపుత్ర వాత్సల్య గతి మిథ్యగావించు
నన్నదమ్ముల పాడి నపనయించు
బాంధవమిత్ర [1]సద్భావంబు భంజించు
బహుమాన వినయ తత్పరత నడచు
ధర్మశీలంబుల మర్మంబు భేదించుఁ
గీర్తిధనంబులఁ గేవడించు
తే. మచ్చరముఁబెంచుఁ గోపంబు నెచ్చరించుఁ
బ్రాణహాని ఘటించుఁ బాపంబునించుఁ
గాన జూదంబువల దభిమానధనుల
కాడిరేఁ బన్నిదమునకు నాడఁజనదు. 17

వ. ఇవ్విధంబున నలుకఁగొని తలంపుల ధైర్యంబుగలంపఁ బరస్పరవిజయ కాంక్షల నీడంబోక యాడుచున్న సమయంబునఁ గలిమిబోటి యాట నయంబై యోటు[2] పన్నిదంబునకు వచ్చిన మెచ్చుచు మేలుచేయుయ్యోనని సంతోషించి యంతరంగంబు చెంగలింపం జేతివాటగుటంజేసి పాచికలువైచి గెలువం దలంచిన. 18

విష్ణుమూర్తి జూదములో మాయచేయుట.

ఆ. ఆటడీలుపడిన సమ్మోహమాయావి
చిత్తవృత్తినగవు చెంగలింప
నీమృగాక్షి హృదయ మెట్లుండునో చూత
మంచు మాయపన్నె నాక్షణంబ. 19
క. ఆ మాయావిభ్రమమున
నేమనిచెప్పుదు నృపాల యిందిరవైవన్
భూమిఁబడి పాచికలలో
నా మునుపటి లెక్కలుడిగి యన్యములయ్యెన్. 20

లక్ష్మీదేవి జూదమందోడిపోవుట

క. లెక్కలు విపరీతములై
యక్కామినిచేతి పందె మది దప్పిననా
వెక్కసపడి వెలవెలనై
గ్రక్కున పాచికలు చటచెఁగనలుచుఁ జేతన్. 21

1. సంభావంబు. 2. వాటు, నాటు,

తే. నవ్వెభూకాంతవాణి మోనంబుదాల్చెఁ
దద్వయస్యలు లజ్జించి తలలువంచి
రబ్జనాభుండు పరిహాస మాడెనపుడు
వానినన్నింటనడఁకె నవ్వనిత మనను. 22

క. జననాథ జూదమున నో
డినవారి మొగంబు వ్రాయఁ డెప్పరమని చె
ప్పినమాట నిజము కమలం
బునుబోలెడు శ్రీముఖంబు పొలుపునఁ దఱిఁగెన్. 23

వ. ఇట్లు పరాజయ పరాభవంబు వాటిల్లెననుచుఁ జెక్కుచెమర్ప నేర్పరు
లైన సపత్నీభర్తలొనర్చు కెలసనంబునకు సొలయుచు ధర్మదేవతనుదూఱి,
యంతఁ గొంతధైర్యంబు దెచ్చుకొని యమ్మహాధీరనాయిక వివేకించి
దా[1]యంబు రాకుండుటకుఁ గతం బేమని విభుండు వైవకుండఁ గ్రమ్మర పాచి
కలు బట్టిచూచి వానియందు [2]ముందటిరేఖల క్రమంబుగాఁ దనయాటకుం
గూడక నలువంకల నొక్కలెక్కయై యధిపుని యాటకుందగిన పన్నిదం బగు
చున్న తెఱంగు వెఱఁగుపడిచూచి, యది యతనిమాయగా నెఱింగి యద్భుత
క్రోధరసరంజితంబగు మొగంబునం గంటికి నగవు చిగురుకొల్పి యిట్లు
కపటంబు సేయం దగునే యని మందస్మిత వదనారవిందుండై యున్న వెన్ను
నుద్దేశించి. 24

ఉ. జూదరికాని చందములు చూపితివన్నియు మేలుమేలు నీ
గాదిలి భూమిదేవికి వికాసముగా జనులెల్ల నెల్లెడం
జూదము వాదహేతువును చుల్కదనంబును బొంకు నంటదాఁ
గాదనరామినిక్కముగఁ గంటిమి నీవెడమాయ లచ్యుతా. 25

మ. ననువంచించి జయించి నాశిరము రత్నంబుం బ్రయత్నంబునం
గొని యావల్లభికిఁ దలంచితివొ నీకుం బ్రేమమట్లయ్యెనేఁ
గొనుమేనిచ్చెద మాయయేల యిదినాకుం బ్రాఁతెరత్నాకరేం
ద్రుని పట్టిన్ సిరినాటెఱుంగవె జగత్తుల్ గోరి సేవింపఁగన్. 26

క. అల్పుల నసురులఁ గొందఱ
వేల్పుల మానవులఁ గొన్ని వెడవెడ మాయల్
గల్పించి త్రిప్పునీ సం
కల్పము చెల్లునె మదంతికంబునఁ గృష్ణా. 27

ఉ. కేవల మూఢజాతి నడకించెదు నేర్పులు చూపవచ్చితో
నీవెడమాయ నాయెదుట నీళ్లలోఁ బ్రాత హిమంబువెంపు మే

1. దోయంబు. 2. అ. పా. ముందరి లెక్కలున్న క్రమంబుగాక.

ఘూవరణంబు బుద్బుద ఘటావళి వేసవి యెండమావుగాఁ
బోవునకాక నిల్చునెయ పూర్వవిశేషము శేషతల్పకా. 28

వ. ఆటవారిని భ్రమియింపనే నీమాయలు, నీమాయ కొలఁదిగాదు నామాయ
లవియెట్లంటేని వినుము. 29

సీ. హరవిరించి పురందరాది బృందములకు
సిద్ధవిద్యాధర శ్రేష్ఠులకును
యక్షగంధర్వ గుహ్యక కులాధిపులకు
పన్నగ కిన్నర పరివృఢులకు
చారణఖచరరా జన్య వర్గములకు
కనకాద్రి ముఖనగ గ్రామణులకు
దైతేయదానవాధ్యక్ష సంఘములకు
విశ్వ విశ్వంభ రాధీశ్వరులకు

తే. పదవు లైశ్వర్యములు మహా ప్రాభవములు
మత్కటాక్ష మహామాయ మహిమఁగాదె
విస్తరిల్లుట త్రైలోక్య విభుత నీకుఁ
గలుగుటయె నీకు నేఁ గలుగంగఁ గాదె. 30

సీ. చంద్రబింబంబునఁ జంద్రికరవి మండ
లంబునఁ బ్రభయనలమున దీప్తి
రత్నజాలంబున రంగు, సరోరుహ
వనముల శృంగార వైభవంబు
పురమహోత్సవములు కరిహయరథ భట
సామ్రాజ్య సామగ్రి చారుభూష
ణాంబరలావణ్య హావభావ విలాస
కలనలు త్యాగభోగముల గరిమ

తే. శ్రీమహాలక్ష్మి కళయున్న చెలువయనఁగ
వినవె నా మాయలోకైక విలసితంబు
నిఖిల మిథ్యాకరోపాయ నీదుమాయ
కంటివే రెంటి మేలును కమలనేత్ర. 31

వ. అని యీర్ష్యాజనితలజ్జా విషాదక్రోధంబుల సంతపించి యంతట నిలువక. 32

శా. నీ వైకుంఠమహోత్సవా భ్యుదయముల్ నీమందిరాంతఃపురీ
లావణ్యాతిశయంబు నీమణి గణాలంకార సౌభాగ్యముల్
నావిస్ఫూర్తులునే గ్రహించెద భవన్మాయా విలాసంబు లె
ట్లై వర్తించునొ చూతమంచు నిజదివ్యాకార మేపారఁగన్. 33

—●●◆ లక్ష్మీదేవి కోపముచేతను వైకుంఠ విలాసమును హరించుట ◆●●—

తే. ధరణి గంపింప లోకముల్ । తల్లడిల్ల
భూతపంచక మాక్రోశమునఁ జలింప
శారదాదేవి ప్రార్థన । సరకుగొనక
క్రమింగ వైకుంఠ సామ్రాజ్య । రేఖ లక్ష్మి. 34

సీ. ప్రాకారగోపుర । ప్రాసాదమంటప
చంద్రశాలల పెంపు । చేటువడియె
పర్యంకభూషణాం । బరపరిమళవస్తు
విస్తారముల మేలు । విన్నఁబోయె
సౌవర్ణమణిమయ । ఛత్రచామర కేత
[1]నంబుల బిరుద చిహ్నంబు లెడలె
వారణహయభట । వ్రాతరథానేక
సైన్యసంకుల గర్వ । చయముడింగె
తే. రంగవల్లీవితాన తోరణవిచిత్ర
దీర్ఘికారామవాటికా । దివ్యకేళి
పర్వతప్రోల్లసత్త్వంబు । పాడువారె
నట్టివైకుంఠమునసిరి । యాగ్రహింప. 35
తే. అవ్విధంబున సిరితన । యమృతదృష్టి
మరలఁదిగిచిన వైకుంఠ । పురవరంబు
కువలయప్రియ రుచిలేని । కుముదసూన
మట్లుశూన్యత్వమొందె చంద్రాన్వయేంద్ర. 36

●● ◆ అందుకువిష్ణుమూర్తి కలుషించుట. ◆●●—

సీ. అంతయుఁగనికడు । నాత్మలోఁ గలుషించి
వేగిరపడక యా । విశ్వకర్త
యాటవారల నాగ్రహంబింత సేయునే
యక్కటా యీఫలంబనుభవించుఁ
గాకేమియని భావి । కపటకృత్యముగాన
రాకుండ మాయాను । రాగలీల
ననుపారపరిరంభ । ణముచేసి కోపమి
ట్లేటికిలోకంబు । లేమిసేయు
తే. నవ్వులాటలకై నీకు । నివ్విధంబు
చనునెయిఁకఁజాలు నీచిత్త । జాలవహ్ని

1. నంబులు.

శాంతిబొందింపు భూతపంచకము జెదర
కుండఁ గరుణామృతముచల్లు ముత్పలాక్షి. 37

క. కోపమువచ్చిన నాపైఁ
జూపవలెంగాక మిగుల సుందరతరమై
చూపట్టెడు వైకుంఠము
హాపుర సౌభాగ్యముడుప సగునే నీకున్. 38

క. కంటివె వైకుంఠము నీ
కంటికృపాశ్రీలఁబాసి కడుశూన్యంబై
యుంటయిది చాలకయ్యో
గెంటింపందలఁచెదవు నిఖిలలోకము లన్. 39

వ. సర్వమంగళాధి దేవతయును లోకమాతయునని నిన్నుం బ్రహ్మాలు సేవింపనుండి నీకు లోకంబులపై నలుకదగునే. మనము వినోదార్థంబున కాడ సమకట్టిన జూదంబింత చేసె, సరసంబు విరసంబయ్యె, నీదేమిదోషంబు జూదంబు దోషంబుగాక. దీనికేమి యింకఁ బ్రసన్నురాలవు గమ్ము, నీవ గెలిచితివనుచుఁ దన కౌస్తుభ గ్రైవేయంబు నయంబున నయ్యిందిరాదేవి సమున్నత కుచ కుంభ మధ్యంబున నలంకరించి కలంకఁదేర్చి యీదుర్ద్యూత వ్యసనదోష ఖేదంబులు మానఁ గొంతకొంతప్రొద్దు సరస్వంతంబు పొంత విహరింతము రమ్మని, యనుగ్రహంబుగల యప్పుడు వైకుంఠ దివ్య మందిరంబు వెలుంగెడుంగాక శూన్యగృహంబున నుండం దగదని యెలయించి కైదండయిచ్చి తోడ్కొని యంతఃపురోద్యాన మార్గంబున వెడలి చనియెనంత కొంత దూరంబున. 40

లక్ష్మీదేవియును విష్ణుమూర్తియును క్షీరసముద్రమును జూచుట.

ఉత్సాహ. కమలయుంజ నార్దనుండు గాంచి రుర్వరావచః
ప్రమదలున్ సురాంగనాళి - పజ్జఁదోడఁ గూడిరా
విమలఫేనకాంతికాంత విస్ఫురత్కళానిధిన్
ఘుమఘుమ త్తరంగసంఘ ఘోషభీషణాంబుధిన్. 41

మానిని. నీదగుసోదర భావముఁజెంది యసిందిత కీర్తివహించె సుధా
పాదసుధాతులసీనవ భాస్కర భాస్వర కౌస్తుభరత్నమరు
త్పాదపపంచక కామగవుల్ బహు భంగుల నెల్లజనుల్ పరమా
మోదముఁజెందఁగ నీయమృతాంబుధి ముద్దియ చూడుము వేడుకతోన్.

సముద్రవస్తువులను లక్ష్మీదేవికిఁ జూపించుట.

స్రగ్విణి. నీరజాతేక్షణా నీకటాక్షాంచలా
ధీరతాభ్యాసమర్థించి కాఁబోలుఁ జూ

చేరి మీనాళి వేచిత్రమై దాటెడున్
గోరికల్ మీఱఁగ న్గొంటివే వారిధిన్. 43

వనమయూరము. వేల్లితనవీనతర విద్రుమలతోద్య
త్పల్లవవిలగ్నమయి భాసిలెడు ముత్తెం
బల్లదె మృగాక్షికల శాంబునిధిలోనీ
యుల్లసిలు మో[1]విఁగడు నొప్పె చిఱునవ్వై. 44

కుసుమితలతావేల్లితవృత్తము.

రాకాచంద్రాస్యా యమృతనిధిసం రంభ మొప్పం బయోదా
నీకం బా పూరంబులు గడునడిన్ నిల్చిపానంబు సేయన్
వేకంబే నీవిభ్రమరసమునే వేడ్క నేత్రద్వయం బా
లోకశ్రీలం గ్రోలెడు సువిహితా లోలసంప్రీతిఁ జూపెన్. 45

ఉ. శాతకటాక్షమూచితివె శంఖముకందు నితాంతయాతనా
యాతతరంగహస్తముల నావల యీవల యాచుచున్న య
య్యాతురవృత్తి తావకగళాభ మటన్న సహింపరామి మీ
తాతబహిష్కరింపఁగఁ బకంపడి లేవఁగ లేకయుంబలెన్. 46

వ. మఱియు మదభరంబున మదనమదనోన్మదనాది నిశితశరపరంపరాకంప మానమానసలగుచు నేటి మదిరాక్షులు చక్షురుత్సవంబులైన మదకల కలహంస రశనాక్రేంకార సంకులపులిన ఘనజఘన బింబంబులును, వర్తులా వర్తగంభీర నాభీతలంబులును, కోమలశైవాల రోమరాజిలతలును, సముత్తుంగరథాంగ కుచకుంభంబులును, నాళీకనాళహస్తంబులును ప్రశస్త విలాస రేఖలు మెఱయ పుష్పంధయ ధమ్మిల్లవళి బంధంబులుం జెదరఁదరుసురభి కుసుమ సౌరభ్య ప్రవాహంబులతోడిండీర ఖండసుందరమందహాస చంద్రికల కలంకారంబై లేఁదరగకటి వంకబొమల మురిపెంబుల నలరు కలికి గలువరేకుల కనుంగవ కెలంకులం దళుకులెసంగు బేడిసచూపుల దీవెలుపుట్టింపుచుఁ, బాయకపై కొనిన దక్షిణనాయకత్వంబున నందఱ నొక్కచందంబగు ప్రేమంబున నుద్దామదీర్ఘతరంగ బాహుదండంబులు సాచి కౌఁగిలించి తదీయ పద్మవదన తదధర నిర్గళిత మధుమధురామృత పానంబున నుప్పొంగు లీలాసంగతివలన శృంగారరసంబును, నిఖిల భువనైక సంభావితంబగు ప్రాభవంబున విశ్వవిశ్వంభరా చక్రంబాక్రమించి సమున్నతాయతోర్మి హస్తస్ఫార పరిస్ఫాలనని పాటిత దిగంతదంతావళి కుంభకూటంబైన పాటవంబువలన వీరరసంబును, [2]ఆఖండల దోర్దండ మండిత చండధారాక్రూరభిదురధురాపాత సంజాత

1. మోము. 2. అఖండ.

ప్రభూత భీతింగ్రచ్చుటి శరణుసొచ్చిన శిలోచ్చయ నాయకుండగు మైనాకుని రక్షించు దాక్షిణ్యంబువలనఁ గరుణారసంబును, ప్రావృషేణ్య పయోవాహంబుల భ్రమంబున నదభ్రనీలమణి విభ్రమంబున నింద్రచాపదీపిత దిగ్వీటంకంబులును గఠిన నిర్ఘాతపాత ప్రకంపిత జంతులోకంబులును విద్యుద్దండ మండిత జగదండ ఖండంబులును, దుర్జయ గర్జాజర్ఝరీ రావతాండవిత శిఖండి మండలంబులునై కుంభద్రోణ వర్షంబులు వర్షింప, మొల్లంబైన యన్నీటి వెల్లువ యెల్లకడలంగడలుగొని యుప్పొంగి తరంగిణీ ముఖంబులం బ్రవేశించు నప్పుడును, నిదాఘ సమయ దీర్ఘదివసకర కిరణ సహస్ర స్వీకృత సరస్వత్ సరోవారికూప పానీయంబైయుండి మహీమండలంబు బ్రయ్యలు వాయు నప్పుడును చెప్పరాని యగాధ జలగాంభీర్యంబున నుబ్బునుగ్గుక్కులులేక యొక్క చందంబుననుండు నఖండమహిమవలన నద్భుతరసంబును, సురాసుర పరివార పురాకృత మందర ధరాధర మంథానమథన సంభ్రమణంబున గంభీర గుణంబు చెడి వికల జీవనభంగ ప్రయాసజాత విశ్వాస యాతాయాత సర్వతో ముఖంబులం బొరలంబడుచు ఘోషింపనెటి దప్పిదెప్పరంబున నాటనుండియు మొరవెట్టుచున్నదో యనునాడిక [1]వలన హాస్యరసంబును, నిరంతరంబును దద్వీపంబులు నివాసంబులుచేసికొని కినుక ననేక పట్టణ గ్రామ వర్ణాశ్రమ వాసుల గోవృషభ శిశు స్త్రీలోకంబులు జీకాకు పడఁగసిమసంగియనువులకుం బాపి రక్తమాంస మేదో మస్తిష్క పంక పంకిలంబగు శవనివహంబులు దెచ్చుకొని విచ్చలవిడి నిచ్చలు బ్రమత్తులగుచు నక్తంచరులు బుత్తులుగొనఁ దదీయ పూతిగంధ బంధురంబులగు గంధవహ ప్రసరణంబులవలన భీభత్సరసంబును, పరస్పర విగ్రహ పరిగ్రసన రసరభస క్రోధధా[2]వనసంకులంబై నిశ్శంకంబై కుంభీరకుంభీనసతిమితిమింగిల కమఠకర్కటాదియాధ పరంపరలు తెంపున విహరింప, దురవలోక భీకరత్వంబువలన భయానకరసంబును, విలయకాల రుద్రవినిద్ర జగదాభీల మహోల్కాల ఫాలనయనానల జ్వాలాకరాళంబై విశాలజిహ్వా సంహతులం [3]బయఃపూరంబులు గ్రోలుచు పొగలఁ దగులకతెగలుపడి భగభగనిగుడు పొగరు చిగురుమంటల వెంటమింటికి నుప్పరంబెగయు నిప్పులకుప్పలు చదలతుదలం జెదరి చామరధ్వజ ఛత్రాకారంబుల ప్రకారంబున నలువంకలం [4]దూలిరాలుచుండం బ్రచండతేజంబున, బ్రహ్మాండమండలోర్ధ్వకర్పరపర్యంతంబు శతయోజన సమీపసంచర ద్దివ్యవిమానవిహంగ ముఖఖేచరనిచయంబుల భస్మసాత్కరింపుచు ననవరతంబు నీడఁబోకలోకోత్కృష్టంబగుమన్న బడబాగ్నివ్యగ్రతాపోద్రేకంబువలన రౌద్రరసంబును,

1. పా. వాడికల 2. అ. పా. క్రోధదావసంకులం. 3. ప్రా. పా. యాదఃపరంపర.
4. అ. పా. దూర్విగాలుచుండ, 5. బలోత్కృష్టం బగుమ.

చంద్రచంద్రికాశీతల ధవళస్వభావంబును నమృతరూపంబును నతివిమలాంతరంగంబును, ననేక సాధుబుధ [1]సేవ్యమానస్థానంబును నగు సౌజన్యంబువలన శాంతరసంబును దనయందు బ్రకాశింపం జెంపారునపార గుణవారం బగు పారావారంబున వారాకర కుమారికి ననేకవిధ విచిత్ర సుందరతర పదార్థ సందోహంబులు సూపుచు నవ్వనమాలి లీలావిహారంబునం గొండొక దవ్వుచని. 47

—•●◆ సముద్రతీర వనవర్ణనము నంపలి విహారవర్ణనమును. ◆●•—

ఆ. తాళపూగనారి । కేళహింతాళకే
తకరసాల సరళ । వకుళ కదళి
పనస సింధువార । పారిజాతాధి కా
వనిజరాజి నొప్పు । వనము చొచ్చె. 48

సీ. నిండారు బొన్నల । నెత్తావిఁ గైకొని
పసిడిఁ సంపెంగల । పైకి ను[2]దిరి
నెఱిమించు పొగడల । నెత్తావిచేకొని
లీలమై బొందు మ । ల్లెలకునుఱికి
నిగుడు గొజ్జంగుల । నెత్తావిహరియించి
పొదిగొన్న చేమంతి । [3]పొదలకరిగి
నిం[4]డారజాజుల । నెత్తావి సవరించి
నవపారిజాత సం । తతులద్రావి

తే. యొలమిఁ దద్దివ్య గంధంబు । లేర్పఱించి
మెలపుతో వాని నన్నింటి । మేళవించి
యింపు నునుగాడ్పు కానుక । యిచ్చెవారి
కాత్మగంధ వహార్థంబు । సార్థకముగ. 49

చ. పరభృత సద్భటార్భటియు । భాసుర కీరతురంగ హేషలం
దరురథవిభ్రమంబు సమ । దభ్రమర ద్విరదోగ్ర బృంహిత
స్ఫురణయు మీఱఁ బుష్పశర । భూపతి సర్వజగజ్జయార్థమై
యురుగతి వచ్చిదండు దిగి । యున్నటుల వ్వన మొప్పెఁ జూడఁగన్. 50

సీ. ఈఱంబులగు పొద । రిండ్ల నీడలవలి
గ్రమ్ముచో శీతల । క్షణము దోఁచుఁ
బూదేనెతుంపురుల్ । పొరి పొరి రాలుచోఁ
బ్రాలేయసమయ సం । పద దనర్చు

1. స్తవ్యమాన. 2. ఆ. పా. నెగసి. 3. పూవులలది. 4. నింపార.

సహకారకిసలయా § స్వాది కోకిల నాద
మొసఁగుచో నామని § యింపు చూపు
నగరు కాశ్మీర గం § ధాన్వితోష్ణానిల
మడరుచో గ్రీష్మర్తు § వతిశయిల్లు

తే. నమరు మధుకరగతులమే § ఘాగమంబు
నెరయు విచికిలకిరణ చం § ద్రిక[1]శరత్తు
అవ్వనంబున నట్టి మ§హావిభూతి
నాత్మ మెచ్చిరి సిరియున § య్యచ్యుతుండు. 51

సీ. కమలా కమలగంధి § కచ బంధమునఁ దోఁపెఁ
బారిజాత ద్రుమ § ప్రసవభరము
[2]తనరు మహీమహీ § ధరకుచకు చముల
హరిచందన పరాగ § [3]భరమలందె
రాణవాణీశుక § వాణి యాస్వాదించె
మందార మధుర మ § రందధార
నెలమి సుపర్వ ప § ర్వేందు వక్త్రలుదాల్చి
రసలార సంతాన § కిసలయములు

తే. కల్పకము నీడ భక్తసం § కల్పదాయి
యయ్యనంతుఁడు గ్రోలెమం § దానిలంబు
మహితరతిరాజ రాజ సా § మ్రాజ్యలక్ష్మి
నలరు జలనిధి[4]సవిధవ § నాంతరమున. 52

క. కుసుమాపచయ రసంబునఁ
గుసుమాయుధ గురుఁడు వలపు § గులుకుచులీలన్
గుసుమ[5]సుకుమారి సిరినవ
కుసుమిత తరులతలవెంటఁ § గూడి చరించెన్. 53

సీ. సఫల పూగశ్రేణి § సౌభాగ్య మగ్గించి
యురగ వల్లుల దండ § నుండి యుండి
గురివెంద పందిళ్ల § పరువంబు గొనియాడి
మల్లెపూఁ బొదరిండ్ల § మలసి మలసి

1. పా. శరర్తు. 2. ఆ. పా. తనరుమహీ ధరతరగురు కుచముల. 3. అ. పా. మలదెగ లయు 4. ప్రమద. 5. కుమారించిరి.

ద్రాక్షాఫలస్రవ § ద్రసధారలనునా[1]ని
గొజ్జంగిపూఁ దేనెఁ § గ్రోలిగ్రోలి
సహకార చారుమం § జరులకుఁ దలయూఁచి
పొన్నపు పొవ్వుల్ల పైఁ § బూసి పూసి
తే. భృంగభయదంబులైన సం § పంగివిరుల
మురువు ప్రకటించి జాజులు § ముడిచి ముడిచి
వెలయువనలక్ష్మి గారాపు § విందులనఁగ
హరియుసిరియును గ్రీడించి § రభిమతముగ. 54

సీ. ఘనవేణికాబంధ § మునకుఁ జుట్టము[2] శిఖా
వళియంచు వనశిఖా § వళులు గేర
నయనవిస్తారము § నకు సయిదోడు సా
రంగియటంచు సా § రంగు లొలయ
మధురసల్లాప సం § పదలకు నసుఁగుఁ గో
కిలబాలయంచుఁ గో § కిలలు మలయఁ
గనకతులాకోటి § నినదంబునకుఁ దోడి
యంచ యటంచురా § యంచలలర
తే. నెలమి వనదేవతా లతాం § గులు చెలంగి
చిగురు చేతులఁబైఁ బువ్వు § సేస చల్ల
నవ్విలాసిని చరియించు § నవ్వనమున
పద్మనాభుని కన్నుల § పండు వగుచు. 55

మ. లవలీపుష్పసుగంధముల్ మఱగియే § లాలాస్యముల్ చూచుచు
స్రవిదీప్తి ప్రతిమాన విద్రుమవితా § నచ్ఛాయ రంజిల్లుచున్
ధవుఁడుం దాను సఖీసమూహములతో § దవ్వేగలీలాగతిన్
జివురుంగైదువు జోదుతల్లిజలరా § శి ప్రాంతవన్యావలిన్. 56

విష్ణుమూర్తి లక్ష్మీదేవిని వంచన చేయఁదలఁచుట.

వ. ఇవ్విధంబున నయ్యమృత పయోనిధానసవిధ వనమార్గంబున ననేకవిధ క్రీడా రసపరాయత్త చిత్తయై యత్తమ్మివటారు మిటారి కత్తె సవతియుఁ గోడలును మొదలయిన సఖీజన సమూహంబులతో విహరింపఁదదీయకౌతుక లీలలాలోకించి వైకుంఠవల్లభుండు నెయ్యంపు జూదపునయ్యాటంబునకై వైకుంఠంబు శూన్యంబు గావించిన నిర్దయురాలిని మోసపుచ్చుటకై యెడరు వేచియున్న వాఁడు గావున నొక్క కపటకృత్యంబు నంస్మరించి. 57

1. సధారకానని. 2. జుట్టపు.

క. బలసంపత్పౌరుషములు
గలిగియు వినయంబు లేని । గర్వాంధులుత
ద్బలసంపత్పౌరుషములు
పొలిదఱుఁగక వశులుగారు । బుద్ధిఁదలంపన్. 58

క. సతియైనను సుతుఁడైనను
హితుఁడైనను మేరఁదప్పి । యెఱుఁగక కడుదు
ష్కృతి గావించిన వారిం
బ్రతి విధిఁ గుదియింప వలయుఁ । బ్రాభవ మొప్పన్. 59

వ. అట్లగుటం జేసి. 60

ఉ. ఈ యెలనాఁగ గర్వమున । నీభువనత్రయ రాజ్యలక్ష్మి యా
త్మీయవిలాస లేశమని । తెంపున నన్ను గణింప కుగ్రతం
బాయక పద్మజాండములు । భస్మములైనను విన్నఁబోనిశో
భాయతసంబు మద్భవన । మంతయు శూన్యముచేసె దుష్కృతిన్. 61

క. తానును దనయైశ్వర్య క
ళానయసామర్థ్యములు ద । లంపఁగ మన్మా
యా నిర్మాణంబని మదిఁ
గానదు తా లక్ష్మి ననెడు । గర్వము చేతన్. 62

క. ఈరసమును నిర్దయతయుఁ
గ్రూరత్వము సతులసహజ । గుణములు మిగులన్
వారలలోఁ జంచలకడు
నారయసిరి దుర్మదమున । కాశ్రయమగుటన్. 63

{ విష్ణుమూర్తి లక్ష్మికిఁ బ్రతిలక్ష్మినిఁ గల్పించి వైకుంఠము మిక్కిలి ప్రకాశింపఁ జేయుట. }

క. కావున నీదుర్మదగ
ర్వావిర్భావంబుమాన । నతిచిత్రముగాఁ
గావింతు వేఱయొక ల
క్ష్మివిభ్రమకల్పనంబు । కేవలమాయన్. 64

క. మున్నున్నకంటెఁ గ్రమ్మఱ
వన్నెకు నెక్కంగఁ జేతు । వైకుంఠముదాఁ
గ్రన్నన హరియించితినని
యున్నమహాత్త్వము గుదింతు । నొకనిముసమునన్. 65

వ. అని యనంతగుణగణ విలాసుండును బ్రహ్మాండ నిర్మాణ కర్మకుశలుండును ప్రకృతి పురుషాధీశ్వరుండును, పరమేశ్వరేశ్వరుండును, నానారూప ప్రవర్త

కుండును, సర్గస్థితి ప్రళయవికార కారణుండును, జగద్వంచనా కపటనాటక సూత్రధారుండును, బ్రహ్మాండకోటి బహి[1]రంతస్థితుండును, సురాసుర గంధర్వ బలపరాక్రమ మాయోపాయ నిరాకరిష్ణుండును నగునవ్విష్ణుం డును దన తేజంబు ప్రకటించిన. 66

వైకుంఠపురవర్ణనము.

క. ఘోటకకరిరథభటసం
నాటోపముపౌరకలక లారంభమును
ఘ్యాటింపనాటికం టెను
మేటిగవైకుంఠపురము మెఱసెన్‌సిరులన్. 67

సీ. పద్మసంభవులెల్లఁ బ్రభవించు పురిటిల్లు
ప్రళయదుర్దశలంటఁ బడనిభూమి
కాలాహిఁ గొడిసి బ్రమింగఁగ రానివాకట్టు
తలఁప నచ్చెరువైన తానకంబు
ప్రాకృతుల్ చొరరాని యేకాంత దుర్గంబు
మహితసాత్వికకోటి మనికిపట్టు
కైవల్య లక్ష్మిచక్కని కేళిభవనంబు
పంచభూతములఁ గల్పించుగుటుతు

తే. సహజ తేజోల వగ్రస్త చంద్రసూర్య
పావకంబమ్మహా దివ్యపదమునైజ
[2]లక్ష్మిబాయునెయో కేళి లక్ష్మిచేత
నిత్యలక్ష్మీశ్వరుఁడు హరినిలుచు నెలవు. 68

వ. ఇట్లమేయ కళ్యాణగుణ సుందరంబగు వైకుంఠ మందిరంబు షడ్గుణైశ్వర్య సంపన్నుండగు వెన్నుని మహాప్రసాద సామర్థ్యంబున సిరికి నచ్చెరువగు సిరిఁదొలంకుచుఁ బంకజ హితుమండలంబునుంబోలెఁ దొల్లింటికంటెఁ గన్నుల పండువై తేజరిల్లుటకు సంతోషాద్భుత రసంబులు జొత్తిల్లు చిత్తంబుల బ్రహ్మరుద్రాది దివిజ సిద్ధచారణ గంధర్వ జయజయనాదంబులతో దివ్య కాంతలు పుష్పాంజలులు సమర్పించిరి వెండియు. 69

ఆ. సహజకఠిన వజ్రసారమై విలయాంధ
కారనిబిడమైయ గమ్యమహిమ
మహిత దివ్యవిష్ణుమాయావిలాసంబు
పద్మనిలయఁ బొక్కు భ్రమలఁగప్పె. 70

1. అ. పా. రంతర్దీపితుండును. 2. పా. లక్ష్మిబాయనీమాయ కేళి లక్ష్మిచేత.

లక్ష్మీదేవి విష్ణుమాయకు భ్రమించి వనమునఁ దిరుగుట.

క. హరిమాయామోహితయై
పరమజ్ఞానంబు దివ్యభావము నెడలన్
సిరి ప్రాకృత సతికైవడిఁ
దిరిగెన్ వనవీథిఁ జెక్కుతెలుఁగుల భ్రమలన్. 71

వ. అంత నవ్వనాంతరంబునఁ దన్మాయావశంబున. 72

శోభావిహీనమైన కొలనును జూచుట.

క. కనుఁగొనియె నగ్రవీథిన్
వనజాలయయొక్క దివ్యవనజాకరముం
దనువు సెడి వాడఁబాఱిన
వనరుహ కల్హారకైరవంబులతోడన్. 73

సీ. నింపారఁ జిగిరించి నిగనిగల్ చాలక
వాడిన నవపల్లవములతోడఁ
గలయంగఁ బూచి తేనెలు చిందు నెత్తావిఁ
బొరయక కందిన విరులతోడఁ
బరిపాకమునఁ బండి సరసమాధురి లేక
పదనింకిపోయిన పండ్లతోడ
[1]మొలకువల్ మాని కొమ్మల విన్ననై యున్న
యలిపోత శుకపికావలులతోడ
తే. చిన్నవోయిన వనము వీక్షించి లక్ష్మి
యనుఁగుచెలులకుఁ జూపుచు నరిదిపడుచు
నెన్నఁడును జూడ మిటువంటి హేమవనము
శూన్యమైయున్న దిది యేమి చోద్యమొక్కొ. 74

వ. అని యాదివ్య వనంబుఁ గలయ నాలోకించి యపూర్వసిద్ధాశ్రమంబని మనంబున నభివర్ణించుచుఁ బ్రవేశించి శంకించుచు నట్టకేలకు నందలి కొలంకు డగ్గరి. 75

ఆకొలనియందు ప్రభాహీనమైన దేవతను జూచుట.

ఉ. నిండితొలంకు నాకొలని నెన్నఁడుమం గనకాంబుజాత మొ
క్కండు వికాసహీనమయి కప్పక [2]రేకులు వ్రాలి శూన్యమై
యుండఁ దదీయకర్ణికను నూనహిమాన్విత బాలభానుమ
న్మండలివోలెఁ గొంత ప్రభమాసిన దేవతఁ గాంచె నొక్కతెన్. 76

1. అ. పా. మలయుకొమ్మల విన్ననై యున్న, 2. కప్పురరేకులు వ్రాలి,

క. ఒకచేతనక్షమాలయు
నొకచేఁ జిన్ముద్రయును సముమ్నత దో[1]ర్ద్వం
ద్వకలితముకుళ కరణముం
బ్రకటిల్లఁగ ధ్యాననియతిఁ బరగెడు దానిన్. 77

ఆదేవతయొక్క వర్ణనము.

క. పరివేష్టించి సరోజాం
తరములవై నిలిచి దివ్యతరుణులు సేవా
పరికరములతోఁ నయత
త్పరులై తనుగొలువనున్న ప్రాభవమూర్తిన్. 78

సీ. పద్మాసనాంకాగ్రభాగాంఘ్రిశుభరేఖ
లఖిలలోకేశ్వరి యగుట నొడువ
చిన్ముద్రచేత మించిన సమాధిక్రియ
కైవల్యలక్ష్మి నిక్కడ వచింప
దివ్యన్మహాతపస్తేజోవిభూతి ని
జాభిమతా[2]ప్తికి నదను దెలుప
నాపూర్ణపరమయోగానందకళ మది
నిష్టదైవంబున్న యింపు చెప్ప
తే. కన్నులకు వెక్కసంబైన చెన్ను మిగిలి
మనసునను నద్భుతంబైన మహిమ గలిగి
యైహికాముష్మిక శ్రీవిహారభూమి
యగుచు నొప్పారె బ్రహ్మవిద్యావిధేయ. 79

వ. కని విస్మయంబందుచు నందఱం గరారవిందాభినయంబునఁ గ్రందుపడకుండ వారించి వారితో నిట్లనియె. 80

చ. ఉరుపరమాత్మయోగమున నున్నది యీ శుభమూర్తిఁ గంటిరే
యరుదగు విభ్రమాభ్యుదయ మంగజుఁ డాఁగనినట్లయొప్పెడున్
బరిణత తాపసప్రతిభ బ్రహ్మముఁ దాఁగని నట్ల యొప్పెడున్
నిరుపమనవ్య దివ్యరుచి నిండి తొలంకెడు నంగకంబులన్. 81

మ. సలిలాంతః ప్రతిబింబితార్క రుచియోజంబొ[3]ల్చి ధూమచ్ఛటా
కుల[4]కాంతిన్నవహేతియట్లడరుచున్ గుప్తప్రభావంబునై
మలినత్వంబును గల్గి యోగనిరతిన్ బ్రహ్మన్విలోకించు నీ
యలఘుప్రక్రియఁ దొల్లి యేసతులయుం గ్రొద్దైనం గనుంగొంటిరే. 82

1. దోర్దండ కలిత ముకుళీకరణము, 2. తావాప్తియదను. 3. అ. పా. తొచ్చి.
4. కులకార్శన్నవ.

వ. అని వెండియు వాగ్దేవతకరంబవలంబించి యించు విలుకాని తల్లి యిట్ల
నియె. 83

క. ఈయుగ్ర తపముసేయఁగ
నీయొలజిగురాకుఁబోఁడి కేటికి[1] నోకోము
న్నేయుగములఁ జూడములేఁ
బ్రాయంబునఁ దపమొనర్చు పావనమూర్తీ. 84

సీ. ఈరేడు జగముల నేలుటకో యది
తనమహారాజసంబునకు నెంత
రతికంటె విభ్రమోన్నతిఁ జెందనో యది
తనమోహనాకారమునకు నెంత
యఖిలాంగనారత్నమై యుండనో యది
తనదివ్య సామర్థ్యమునకు నెంత
బ్రహ్మంబు తానయై పరిణమించనో యదె
[2]తనచిదానంద సంతతికి నెంత

తే. యేలొకో యింత తపము వహించి సేయ
నింత నిర్బంధమునఁ బొందనేల తనకు
యక్షగంధర్వ సిద్ధ విద్యాధరర్షి
తరుణులందెవ్వరోకొ యీపరమసాధ్వి. 85

సీ. బ్రహ్మాది దేవతల్ ప్రణమిల్లరే తన
కేటికంజలి ఘటియించ దాను
తన కేది యభిమతార్థము కాని యభిమతా
ర్థమునకు నభిమతార్థంబు దాను
తనుమెచ్చు [3]నధిదైవతంబును గలదొకో
యఖిలైక దైవతమరయఁ దాను
తనుగూర్చి యందఱు తపము సేయుట గాక
యొరుగూర్చి తపము సేయుదురె తాను

తే. ఈమహానిష్ఠఁ గృశియింప నేల తనకు
నవశిరీష ప్రసూనంబు నవఘళించు
మృదులతనువల్లి నేటికిమ్మొయిసలంప
సర్వకల్యాణియైనయీ చంద్రముఖికి. 86

ఉ. ఈలలనాశిరోమణికి నీశుభమూర్తికి నీలతాంగికి
య్యాలరి దైవమేమిటికి నచ్చెరువైన తపోగ్ని కీలలం

---

1. కేమిటికోము. 2. ఆ. పా. 'తనచిదమలానంద తతికియెంత' 3. నొక.

దూలఁగఁజేసెఁ జేసి[1]యును ♦ దూఁకొని దీనితపంబు పేర్మికిం
బాలనవృత్తి నీవలదె ♦ పల్వడఁగ్రమ్మర వాంఛితార్థముల్. 87

తే. హరిహరబ్రహ్మలకు నవశ్యులైన దైవ
మెవ్వరోకాక వారైన ♦ నీ[2]రకోర్కి
కోర్కి త్రైలోక్యమును నేలుకొలఁది కంటె
నెక్కువై యుండఁ బోలునీ ♦ యిందుముఖికి. 88

క. నాకేశ్వరు సతికంటెను
భూకామినికంటె నద్రి ♦ పుత్రికకంటెన్
నీకంటెను నాకంటెను
లోకోత్తర చరితయిది విలోకింపఁదగన్. 89

వ. అని వెండియు వనంబవలోకించి. 90

ఉ. ఈవనిపూఁచికాచి ఫలియించె శుకాన్యభృతాళి జాతితో
నీవిధిఁజిన్న ప్రావృటకునేమి గతంబొకొ యీకొలంకుప
ద్మావళియేల వాడెనిది ♦ యచ్చెరు వెన్నఁడుఁ జూడమిట్లనే
దైవము శాపమిచ్చె నొకదాయలుకన్ సతితోడఁ గూడఁగన్. 91

వ. ఈ దివ్యవన దివ్యాంగనలకు నీదురవస్థ దైవశాపంబకానోపు, దైవశాపంబగు నేని యింత యంతర్వికాస తేజంబు లెట్లు సిద్ధించు, నీయపూర్వ సిద్ధాశ్రమంబున నిప్పరమ పావని నిగూఢప్రభావంబున నుగ్రతపస్సామగ్రినుండుట యద్భుత కథాప్రసంగంబు మున్నెన్నఁడు విన్న కన్న యదిగాదు చతుర్దశభువనంబుల నెక్కాలంబు [3]నిక్కట్టడయెఱుంగము దీని విధంబంతయు నీ కాంతామణిచేత ధ్యానాంతరంబున నడిగి తెలిసికొని పోవుదముగాని కొండొక తడవు నిలువుండని యాజలజ కన్యక పలుకునవసరంబున. 92

ఆదేవత యోగసమాధి చాలించి లక్ష్మీదేవి మొదలయినవారిని జూచుట.

గీ. బ్రహ్మయోగంబు చాలించి ♦ పద్మగంధి
యూర్ధ్వబాహుత్వ చిన్ముద్ర ♦ లుజ్జగించి
వెడదకను దమ్మిలల్లన ♦ విచ్చిచూచె
నిందిరాముఖ లలిత పూర్ణేందుముఖుల. 93

క. ఆ చంద్రవదనసమధుర
లోచనరుచిచేత నావి ♦ లోలాక్షులు సొం
పేచిరి నవశిశిరాంశుమ
రీచిమహౌషధులు వోలెఁ ♦ బ్రియయోగమునన్. 94

1. ప్రా. ప్ర, చే నది. 2. నిట్టి. 3. ఆ. ప్ర. కాలంబుల నెక్కడ యెఱుంగము.

వ. అట్లు పరబ్రహ్మయోగంబు చాలించి యా పద్మాక్షి యక్షిణ తపఃప్రభా వాతిశయంబునం జేసి త్రైలోక్యపూజ్యలైన శ్రీభూసరస్వతుల నగ్రభాగంబున నిరీక్షించి సామాన్య స్త్రీలఁగాఁ బరిగణింపుచుఁ దనయున్న పద్మాసనంబు డిగక యాది గర్భేశ్వరీత్వంబు వహించి సాదరంబున వారితో నిట్లనియె. 95

—మాయాలక్ష్మి వారి వృత్తాంతమడుగుట.—

ఉ. ఎవ్వరు మీరు మీయునికి ◊ యెక్కడ నామములెవ్వి మీరు మీ
రివ్విపినాంతరంబునకు ◊ నేటికివచ్చితిరింతులార యా[1]
మవ్వపువింతయచ్చరలొ ◊ మానవకాంతలొ యక్షకన్యలో
యివ్వనదేవతామణులొ ◊ యించుక నాకెఱిఁగింపుఁడాతగన్. 96

వ. అని యయ్యుత్తమ స్త్రీరత్నంబు పల్కినం జిత్తజాతజనని మాఱుత్తరం బిట్లనియె. 97

క. ఏమమర స్త్రీలము మా
నామములట్లుండనిమ్ము ◊ నలినాక్షి భవ
త్సామర్థ్యము వినవలతుము
ప్రేమంబునఁజెప్పు నీదు ◊ పేరుమునుపుగాన్. 98

—లక్ష్మిదేవి యాదేవతను స్తోత్రముచేసి యామె వృత్తాంతమును జెప్పుమని యడుగుట.—

క. నీదీర్ఘ తపము కలిమికి
నీదివ్య విలాసమునకు ◊ నీదృఢమతికిన్
బైదలి! యచ్చెరువయ్యెడు
గాదిలిమైఁ జెప్పు మ[2]మ్మ ◊ కలతెఱఁగెల్లన్. 99

ఆ. మలినవస్త్రగుప్త ◊ మాణిక్యమునుబోలె
నీఱుగవిసియున్న ◊ నిప్పువోలె
వెలఁది నీదురూపు ◊ వెలిమాసిలోనింపు
గలిగియుంటకేమి ◊ కారణంబు. 100

క. నీవంటి దివ్యకామిని
కీవిధిఁదపమాచరింప ◊ నేటికివలసెన్
దైవకృతంబేమననీ
భావముఁ దెలియంగవలయుఁ ◊ బల్కులతాంగీ. 101

వ. అని యాదిలక్ష్మి పలికిన నమ్మాయా లక్ష్మి యిట్లనియె. 102

—ఆదేవత తన వృత్తాంతముచెప్పుట కారంభించుట.—

ఉ. ఏమనిచెప్పుదాన తరళేక్షణనాదు పురాణ వృత్తముల్
తామరసాసనేందుధర ◊ తామరసాక్షపురందరాది స

1. లారమీ. 2. చెప్పవమ్మ.

ర్వామరకోటి కాత్మనయ§నాంచలమే విభవాను కారి నా
నామము లక్ష్మియంద్రు భువ§నంబులెఱుంగ మహావిభూతితోఁ. 103

తే. హరికిఁ బ్రియురాలనై భువ§నైకదివ్య
విభవములకెల్ల మూలమై § వెలయునేను
దత్ప్రసాదంబు కలిమిగాఁ § దలఁపలేక
ముదిత గర్వించి యతనిచే § మోసపోతి. 104

వ. అది యెట్లంటేని తత్పరమరహస్యంబు నెఱిగించెద నాకర్ణింపుము. 105

చ. అరయఁగ మూఁడుమూర్తులకు § నవ్వలిమూర్తియుఁ దానయై మహా
పురుషవరేణ్యుఁడై ప్రకృతిఁ § బ్రోచుచుఁ జిద్విమల స్వరూపుఁడై
పరగెడు విష్ణుదేవుఁడు ప్ర§పంచమునన్ బహురూపధారియై
తిరుగుచునుండు లోకములఁ § ద్రిప్పుచు సర్వసురైకసేవ్యుఁడై. 106

ఆ. అతనివలనఁబుట్టు § నఖిలంబు నాతని
యందు డిందునతఁడె § యాదికర్త
భూతపంచక ప్ర§భూత పద్మభవాండ
మండలంబునతని § మాయసూవె. 107

వ. పరమేశ్వరుండైన యద్దేవదేవుండు కల్పాదియందనంత కోటిసూర్యచంద్ర
పావక ప్రకాశంబున నతి శీతోష్ణంబైన యఖండజ్యోతియై వెలుంగుచుఁ
బెక్కువేలు దివ్యవర్షంబులు నిలిచి తదనంతరంబ యవ్వెలుంగు సంస్తంభింపఁ
జేసి శుద్ధస్ఫటిక సంకాశంబైన రూపంబున నీలజీమూత శ్యామల కాంతియైన
యొక్క విలాసినియును దానును కవగూడి సాక్షాత్కరించి సృష్టి ఘటియించి
దాని సంరక్షింప నప్పువ్వుఁబోడిఁ జాలించె, నదియవ్విష్ణుమాయ,యవ్విష్ణుండు
పరమ యోగానందంబునఁ గొంతకాలం బేకాకియై తిరిగి క్రమ్మర లోకరక్ష
ణార్థంబు నిలిపిన యవ్వెలందియందు నేను నుదయించిన నన్నుం బరిగ్రహించి
నామీఁది యనుగ్రహంబున సకలంబును మత్కటాక్ష వీక్షణంబున బహు
విధ సంపద్విలాసంబై వెలయ నమకట్టి లక్ష్మియను పేరును బ్రసిద్ధి
గావించి తన తోడునీడగా మెలపుచు ననేక బ్రహ్మాండ కోటులయందు
యదృచ్ఛం జరించుచునుండ నొక్కనాఁడు. 108

సీ. రుద్రుండు పద్మగ§ర్భుండు గంధర్వులు
దిక్పతుల్ మునులు దై§తేయయక్ష
పన్నగాదులు మహీ§పతులాది గాఁగల
వారల ప్రాభవై§శ్వర్యములకు

నేన నిదానమై । నిఖిల నిధానాధి
దేవతాధీశ్వరి । నై వెలయుచు
నఖిలదివ్యాంగనా । భ్యర్చిత మహిమాతి
శయమహారాజన । శక్తులమర
తే. నందఱకు నెక్కువై భువ । నైకవంద్య
నగుచుఁబతివెన్నురంబు సిం । హాసనముగ
సకలజగములునేలుచు । సర్వమంగ
ళాధిదేవతనై యుందు । నబ్జవదన. 109
క. మానిని "యెక్కినవానికి
యేనికగుజ్జంట" నిక్కమీఁగతి, పతిస
న్మానింప నుండి కన్నులఁ
గానఁగలేనైతి నాదిగర్భేశ్వరినై. 110
తే. అన్నిఁటికి నన్నుఁ జాలించి । యధిపుఁడూర
కున్న యనురాగమెఱుఁగక । యుత్పలాక్షి
ధిక్కరించితి విభునిఁద । త్తేజ మడియు
నన్మదీయప్రభావంబ । యనిమనమున. 111
ఉ ఆజగదేక భర్తకుఁ బ్రి । యాంగననైన మహానుభావతన్
బూజకునెక్కి యాదిమవి । భూతికినే నెలవైతినాకునా
తేజమకాఁదలంచితిమదిన్ భువనైక విలాసిసిద్ధికిన్
రాజస దుర్మదంబునఁగరంబభిమానముఁ దాల్చియుగ్మలీ. 112
క. నాతలఁచిన తలఁపదినిజ
మైతోఁచున్ సంతతంబు । నంభోరుహాసం
జాతప్రముఖసుపర్వ
వ్రాతంబులు నాకు మ్రొక్కు । వరరుహనేత్రీ. 113
వ. అట్టి సమయంబున నొక్క కల్పాదియందు. 114
చ. భువనము సృష్టిసేకై కమల । భూకమలారికళాధరుల్ మహా
ర్ణవమునవంతుకుందపమొనర్చిరి నిష్ఠననేకవర్షముల్
వివిధవిధి ప్రయుక్తులయి । విష్ణుహితంబుగఁదత్తపోగ్ని నిం
డి వెలుఁగఁజొచ్చెఁ జెంబయిట । నిష్ఠురకీలలురాలనెల్లెడన్. 115
క. దానికినించుకయేనియు
నానాథుఁడు కరుణపూనినలినభవార్యా
జానుల వరమొసఁగఁడు యో
గానందసుధాబ్ధి మగ్నుఁ । డై యెలనాఁగా. 116

తే. భువననిర్మాణశక్తికై పూనివిభునిఁ
గోరితపమాచరించుట వీరితలఁపు
వల్లభుండేలొకో వీరి వరమొసంగఁ
డనుచుఁ దద్దివ్యచిత్తంబు నరయలేక. 117

క. వరమీఁజాలకయో ని
ష్కరుణాత్మకుఁడయ్యొ, వేళ గాదో, తనకున్
హరిభావ మెట్లొ[1]కో యని
పరికించితిఁ గొంతదడవు భావమునందున్. 118

వ. అట్లు పరబ్రహ్మయోగానంద రసపారవశ్యంబునం దన్నుఁదా [2]భావించు
కొనుచు నాతపోధనుల దెసతలంపులేక యూరకున్న విభుని యాలస్యంబును,
వారల తపఃప్రభా[3]వంబు నుపలక్షించి, వరదాన సామర్థ్యంబు చాలక తడ
యుచున్నవాఁడని తన్మాయామోహితనై తలంచి వెండియు నాదు మహి
మాతిశయంబున నింతవాఁడయ్యెంగాక యితనియందు దైవ సామర్థ్యం
బేమియున్నదనుచు నాసంపద్గర్వంబునఁ బతిం దిరస్కరించి నగవు దొలంకు
నెమ్మొగంబుతో వారలకడకుం బోయి మీ యిష్టంబైన వరంబు నిచ్చెద
వేఁడుండనిన కపర్దికనకగర్భులు నాతో నిట్లనిరి. 119

క. కారుమెఱుంగులు బోలెం
శారీరప్రభలు నిగుడ సమధిక తేజ
శ్శ్రీరేఖఁ దోఁచితివి నీ
పేరెవ్వరు చెప్పు మ[4]మ్మ బిసరుహనేత్రీ. 120

ఉ. ఎన్నఁడుఁజూడ మిట్టి ప్రభ కెక్కిన దేవతనర్కమూర్తిన
త్యున్నతవైభవాభ్యుదయ నూర్జిత కారుణి కాంతరంగనున్
మన్నిఁగ మాధి దేవతవొ మా కెఱిఁగింపఁగదమ్మ నిన్ను నో
పున్నమనిండు జందురునిఁ బోలెడు ముద్దుల మోముకోమలీ. 121

శా. కారుణ్యామృత వీచికల్ దొలఁకునీ క్రాల్గన్గొనల్ సొంపునిం
పారంగోర్కుల వెల్లివెల్లడరు శ్రేయశ్శ్రీలు శోభిల్లఁగా
నోరాజానన యస్మదీయ వరదానోత్సాహవై తెట్లు నీ
పేరుం జెప్ప వినంగఁగోరెదము సంప్రీతాత్మవై చెప్పవే. 122

క. మావరమొసఁగఁగఁజాలు ప్ర
భావము విష్ణునకుఁగాక భామిని తన్మా
యావిద్ధమతులకుం బెర
దేవతలకుఁ గలుగునే మతింబరికింపన్. 123

1. మేటకో. 2. అ. పా. దనుసంభావించుకొనుచు. 3. ప్రయాసంబును. 4. చెప్పవమ్మ.

తే. అయినఁగరుణావిధేయవై ✽ యమితతేజ
మొప్పఁబ్రత్యక్షమై మాకు ✽ నోడకిట్లు
వరమొసఁగుదునని నీవు ✽ వచ్చినపుడ
యఖిలలోకైక జననివి ✽ యగుటఁదోఁచె. 124

వ. దేవీ నీదివ్య చిత్తంబునం గరుణించి త్వద్వృత్తాంతంబెఱింగించి మాకోరిన వరంబొసంగుమనిన నవ్వి యవ్వారిజాసన శశాంకకళాధరుల కిట్లంటి. 125

సీ. నన్నెఱుంగరెభువ ✽ నమ్ములు సృజియింప
మనుపమర్దింప సమర్థనగుచు
సౌభాగ్యభోగ రాజ్యకళావిభూతిప్ర
భావంబులకు మూల ✽ మైవసించి
[1]చెల్లుదునాకృపా ✽ శ్రీలఁగావింపుచు
నిగ్రహానుగ్రహ ✽ నిపుణనగుదు
నాదిలక్ష్మిని బంకజోదరు జీవితే
శ్వరి జగన్మాతను ✽ సభ్యులార

తే. మీవరంబులు కరుణింప ✽ మేటినేన
కాకదైవంబు మఱివేఱెకలదె జగతి
విష్ణుఁడరిదియె మీకు సర్వవిష్ణునకును
మత్కటాక్షంబు సర్వసామర్థ్యమునకు. 126

క. వావిరి బహుసృష్టిభవ
ద్దేవాసురమర్త్యపక్షి ✽ తిర్యఙ్ముఖజీ
వావలి కలిమియు సొబగును
నావిలసనమగుటఁగనరె ✽ నానాగతులన్. 127

క. జలరుహ ఫుల్లాఫుల్లత
జలరుహమిత్రోదయాస్త ✽ సంప్రాప్తులచేఁ
బలెఁద్రిజగత్కుల నాకల
నలుసంధిల్లునుమదీయనయనాంచనలన్. 128

ఉ. ఆదిమశక్తినేన పరమార్థవిలాస నివాసమేన, బ్ర
హ్మాదిసురేంద్రకోటులకు ✽ నాదరువేన, సమస్తలోకసం
పాదనకర్తనేన, మది ✽ భావనసేయుఁడు వేఁడుఁడిష్టమా
హ్లాదమొలర్ప విష్ణునకు ✽ నద్భుతభంగిగనిత్తు సత్కృపన్. 129

క. అనిపలికిన నాపలుకులు
వినిజయజయనాద మొసఁగ ✽ వినుతించినను

1. ఆ. పా. మేలెల్లనా కృపా శ్రీలగావింపుచు. ప్రా. పా. వసింపచెల్లును.

జననీ మహాప్రసాదం
బనిభక్తివిధేయులవినతులకులై సంప్రీతిన్. 130

వ. మహాసంభ్రమంబున నన్ను వలగొని నిలిచిరప్పుడు బ్రహ్మదేవుండు ప్రాంజలియై యంబా నీవు సర్వలోకశరణ్యవగుదేని నావిన్నపం బాలకించి జగత్సృష్టికరణవిద్యయు సకలసంపత్ప్రదాయినియైన నీవిద్యాకళయును మదీయశాసనంబునం బ్రవర్తింపుచుండవలయు, నివ్వరంబు కరుణింపుమని యడిగిన నట్లయనుగ్రహించితి, నంతరుద్రుండును నవ్వరంబును వేఁడిన వివేకంబు లేక నిలుకడదప్పి నీకును నిచ్చితినని పలికితి నావాక్య ప్రమాణంబున నవ్విద్యాకళలు రెండును నొకరియందును నిలుకడ వడయరాక చంచలించి మూర్తివంతులై యిద్దఱి దెసనడయాడుచున్నవారు. విఫల ప్రయత్నులై దీనులై యున్నం గనుంగొని దీనికేమి సేయుదాన, భ్రమసి యిద్దఱికి నొక్కచందంబు వరంబుపన్యసించితినని, వెరవులేక చీకాకుపడుచున్న సమయంబున దేదీప్యమాన మహేంద్ర నీలమాణిక్య పుత్త్రికయుంబోలె లీలామందహాసంబెసంగ విష్ణుమాయ సాక్షాత్కరించి నాతో నిట్లనియె. 131

మ. త్రిగుణాధారుఁడు విశ్వలోకఘటనాదీక్షాసమర్థుండు స
ర్వగతుండాదికి నాది విష్ణుఁడని సత్కార్యవ్యాజంబుతో నిద్దఱుం
దగనీదివ్యలు భక్తినాహరికిఁ జేరఁ తత్ప్రీతిసంధిల్ల దు
ల్యగతిం జేయుచునున్నవారు తమ యిష్టావాప్తికై నిష్ఠతోన్. 132

ఆ. ఉగ్రతపముసేయుచున్న యీ యిద్దఱి
యభిమతంబు నేకమరసిచూడ
వీరితమకముడిపి వేర్వేఱవరములీ
వెదకుచున్నవాఁడు విష్ణుఁడిపుడు. 133

వ. ఇట్లున్నచోటఁ దద్దివ్య చిత్తంబుగానక యతండు లీలార్థంబున సహచరింగా ననుగ్రహించి యనురాగంబునం బెద్దచేసిన ప్రియునందు ఘుందెమేలంబున మందబుద్ధివై లక్ష్మీవిభవ గర్వంబునఁ బతిందిరస్కరించి. 134

క. భావింపఁగ నీవునునొక
దేవతయునుబోలె మీఁదుదెలియకవరము
ట్లీవచ్చితి యిచ్చినవర
మీవిధమున వ్యర్థమయ్యె నీకనెట్లుండున్. 135

చ. పతియసమర్థుఁడంచుమతి భావనఁజేసితి బ్రహ్మరోహిణీ
పతిశకలావతంసులతపస్సులు విఘ్నముచేసి తద్వర
ద్వితయమువిన్నబుచ్చితివి విష్ణుహితంబిది లక్ష్మినంచుదు
ర్మతివయి యాత్మవల్లభ పరాభవదుఃఖముఁ గందుగాకఁకన్. 136

వ. అని పలికి నీయందు దుర్మదకారణంబులైన రాజసతామస గుణంబులు త్యక్తంబులై యున్నవి. దానం జేసి సదసద్విజ్ఞానంబు పుట్టదు, శుద్ధసాత్త్విక ప్రబోధ సుధాసారస్యంబుగలదాఁక నీ లక్ష్మీగర్వ విభవంబుమాని, యంతస్తేజంబుతోఁ గొన్ని దివ్యవర్షంబులు తపంబు సలుపుము, నీవు వసించిన తపోవనంబు కిసలయ కుసుమ ఫలలలిత శుకభ్రమర సంకీర్ణంబయ్యును శూన్యంబై చిత్రరూపంబు కైవడినుండు, నెప్పుడేని నవ్వనంబు వికాసంబు నొందు నప్పుడు శాపావధియగు, తత్క్షణంబు క్రమ్మరఁ ద్రిజగత్సేవ్యంబైన వైభవంబుతో నిజప్రభావసామగ్రి గలిగి యప్పటియట్ల యా పరమేశ్వరుం గూడి యుండఁగలవు. నీకు సహాయ పరిచారికలై శూన్యనిధానాధి దేవతలు ప్రవర్తింతురు. నీకు నిది విష్ణుశాసనంబు దుర్లంఘనీయంబు, పొమ్మని పలికి బ్రహ్మదేవునింగని మీరిద్దఱు నేకాభిలాషంబునఁ దపమాచరించుట తగదు. నీవు లోకంబు సృజియించుచు స్రష్ట నామధేయుండవగుము. శివుండు జంతులోకంబుఁ గాలపరిపాకంబున హరింపుచు హరుండగు విష్ణుండు దాను సర్వంబును రక్షించుచు జగద్రక్షకుండను దివ్యనామంబున వెలయువాఁడునని యాజ్ఞాపించి విష్ణుమాయ మాయమయ్యె, నమ్మాయయా శాసనంబున నమ్మువ్వురు నట్ల ప్రవర్తించుచున్నవారు, నేను నవ్విధంబున నాటనుండియుఁ దపంబు సేయుచున్నదాన, నివ్వనంబును నట్లనావచ్చిన యది మొదలు వికాసరహితంబై యున్నయది యీకాంతలా నిధానదేవతలు, కరుణావిధేయుండగు నప్పరమేశ్వరుండింక నెన్నఁడు ప్రసాదించునో కాని యిది మదీయ వృత్తాంతంబు వినుమని యమ్మాయాలక్ష్మి యాదిలక్ష్మికిం జెప్పుచున్న సమయంబున. 137

మ. కలపుంస్కోకిల గర్వధూర్వహకుహూః కారంబు కీరాళిసం
కులనాదంబు లెసంగ నవ్వనము చక్షుఃప్రీతిగావించెదుం
జులతాపల్లవవల్లరీఫలరస స్ఫూర్తుల్ ప్రవర్తింపనా
జలజాక్షీ నిజదివ్య భాగ్యకలనా సంప్రాప్తి సూచించుచున్. 138

క. ఆవననవవిలసనల
క్ష్మీవిభవము చూచిమేలు చేకురెననిమా
యావనరుహవాసినిమో
దావహమతియయ్యె లక్ష్మి యద్భుతమందన్. 139

శా. ఓలోకేశ్వరి ! యోజగజ్జనని ! యో యోగీంద్ర వంద్యప్రభా
వాలంకార ! భవత్తపోమహిమచే హర్షంబుతో నిప్పుడే
నాళీకేక్షణుఁడాదిపూరుషుఁడు నీనాధుండు నీకిచ్చె యీ
నీలక్ష్మీ ప్రభయుంచు నాగగన వాణీదేవి పల్కెం దగన్. 140

— సురదుందుభులుమ్రోసి పుష్పవర్షము గురియుట. —

క. గంధర్వ మధురగానము
బంధుర దుందుభిరవంబుఁ బైపై నాశా
సంధుల మొరయఁగ దక్షిణ
గంధవహమువీచె దివ్య గంధంబులతోఁ. 141

చ. సురతరు పుష్పమంజరుల సోనలుముంచె మదాళిజాలఝం
కరణపయోధర ప్రకట గర్జలు తాండవితాప్సరోవధూ
త్కరనవకేకి సంఘముము దంబొదవింపఁగ సిద్ధసాధ్యని
ర్జరఫణిచారణాశ్వముఖ చాతక సంచరణాభిరామముల్. 142

క. కోరికలువెల్లి విరియఁగ
నారదమునికుంచెవిసరె నాట్యముసలిపెఁ
స్వారాట్ప్రముఖ దిశాధిప
వారిజలోచనలు గొలువ వచ్చిరివేడ్కన్. 143

— ఆదేవతకు దివ్య విమానమువచ్చుట సమస్తదేవతలు స్తోత్రములు వందనములు చేయుట. —

చ. జలరుహగర్భముఖ్య సుర సంఘము గొల్వఁగ విష్ణుమాయయు
జ్జ్వలగరుడధ్వజంబు ధృత చామర లాలస దివ్యకామినీ
తిలకనిషేవితంబునగు దివ్యవిమానముఁ దెచ్చినిల్పె నా
నెలఁతుకదండ మండిత మణి ప్రభలాళల నాక్రమింపఁగన్. 144

ఆ. ఆవిమాన పూజితా మరతరు పుష్ప
దివ్యగంధములకుఁ దేటులెసఁగె
లక్ష్మియున్న యాకోకలంకు క్రొవ్విరిదమ్మి
పువ్వుఁదేనెఁగ్రోలి పొదలి పొదలి. 145

సీ. దండముల్బెట్టిరా ఖండలాదిదిగంత
నాయకుల్ ప్రణమిల్లె నాగకులము
మ్రొక్కిరి గంధర్వ మూర్ధాభిషిక్తులు
ప్రాంజలు లైరి సుపర్వవరులు
వందనంబొనరించె వాచంయమిశ్రేణి
యానతిచేసె గుహ్యకగణంబు
అభివందనముచేసె యక్షనాయకకోటి
కరములుమోడ్చిరి గరుడపతులు
తే. చారుకరుణాకటాక్ష వీక్షావిభూతి
పాలితాశేషభువనకు బ్రహ్మముఖ్య

దివిజపూజ్యకుఁ బరమసాత్త్వికమతల్లి
కాదిలక్ష్మికి నిత్యకల్యాణవతికి. 146

వ. ఆసమయంబున నమ్మహావిష్ణుమాయ తోయజాసనాదులు విన, దేవీ నీ తపంబు ఫలించె నీ వల్లభుండగు విష్ణుండు ప్రసన్నుండై నిజలక్ష్మి తేజంబు నీకు ననుగ్రహించె నీకు దివ్యవిమానంబు పుత్తెంచినవాఁడు విజయంచేయు మని పలికినఁ దద్వచన ప్రమాణంబున, 147

తే. పంచభూతములును సముదంచితాధి
జాతనిర్ఘోష మొనరించె సకలదిశల
దిశలు విశదప్రభలఁ బొందె దివ్యమహిమ
నమ్మహాలక్ష్మి నిజతేజ మాశ్రయింప. 148

క. హరికరుణా సంప్రాప్తిక
సరసీరుహనయనయపుడు సంతోషరస
స్ఫురణమునఁ జూడనొప్పెను
ఖరకరరుచిఁ బొదలునబ్జ కలికయుఁ బోలెన్. 149

సీ. శుద్ధసువర్ణంబు సొబగుమించినమేన
బాలసూర్యప్రభల్ ప్రజ్వరిల్లె
పార్వణచంద్రబింబముఁ బోలుమోమున
సుప్రసాదశ్రీల సొంపునెరసె
వెలిదామరల మీఱు వెడదకన్గొనలపై
నైశ్వర్యకందళు లంకురించె
నమృతపూరముఁబోలె నలరుచిత్తంబున
కరుణారసార్ద్రత గడలుకొనియె

తే. లలితశుభలక్షణాంఘ్రిపల్లవములందు
దివ్యనారీకిరీట సంసక్తరత్న
దీప్తిపుష్పోపహారముల్ దీటుకొనియె
పతికృపాలబ్ధవిభవకా పద్మముఖికి. 150

తే. నవనిధానాధిదేవతల్ వివిధకళలఁ
బొందిసేవించి రప్పుడప్పువ్వుఁబోణి
నలవసంతాగమమునఁ బుష్పాభిరామ
లతలువనలక్ష్మి నవరించు లాగుదోఁప. 151

{ ఆమాయాలక్ష్మియొక్క విభవముచూచి యాదిలక్ష్మి విభ్రాంతిబొంది తనలోఁ దాననుకొనుట. }

క. ఆమాయాలక్ష్మిమహా
సామర్థ్యము నిజముపోలె ౹ సమధిక తేజో
ధామంబై త్రైలోక్య
ప్రేమాస్పదమైనఁ గమల ౹ బెగడుచు మదిలోన్. 152

క. నేనేలక్ష్మీకాంతను
నానాథుఁడు విష్ణుఁడఖిల ౹ నలినభవాండ
ప్రాణిగణరక్షకుండని
మానసమునఁదలఁతు దివ్య ౹ మాన్యవిభూతిన్. 153

ఉ. ఆదికినాదియైన పరమాత్ముఁడు విష్ణుఁడు నావిభుండు నీ
వాదిమలక్ష్మి వంచునుగ్ర ౹ తానతులై యనిశంబు బ్రహ్మరు
ద్రాదులు వీరు దివ్యులుని ౹ జాభిమతార్థములర్థిఁ గోరిన
న్నాదటఁ గొల్వవత్తు రిదియంతయు లోకమెఱుంగు నేర్పడన్. 154

మ. అదిమిథ్యాకథ నమ్మచేసి యిదిగోనా దేవతాధీశ్వరుల్
మదినుప్పొంగుచు నీశుభాంగిని మహాలక్ష్మీ! జగన్మాత! మ
మ్మదయంజూడుమటంచు మొ్రక్కెదరు నాకుఁబ్రమోలం మహాసంభ్రమం
బొదవన్ వైకుంఠ విష్ణుఁడున్ సిరియునెక్కున్నారొకో మాపయిన్. 155

మ. కనినైనన్ విననైన నేనెఱుఁగనె ౹ క్కాలంబు నీపద్మలో
చనదాలక్ష్మియుటంచుఁ జెప్పినకథా ౹ చ్ఛాయాప్రకారంబు చూ
చిన సత్యంబయి తోఁచుచున్నయది లక్ష్మీనైనయైయున్నదా
న ననేకక్రియలందలంపనిదిగా ౹ న న్నాదునిక్కంబుగాన్. 156

క. కలగంటి నొభ్రమసితినో
[1]పలవరమోయింద్రజాల ౹ పరికరకలనా
కులతయోయివియన్నియువృథ
[2]యలవడునే యింత నిక్కమై యక్లైనన్. 157

క. నాలక్ష్మికలనలుమి
థ్యాలీలలుగాని యీలకాతన్విజయ
శ్రీలన్నియు నిక్కముల
క్ష్మిలావణ్య ప్రభా విశేషములగుచున్. 158

క. ఇన్నియు నిట్లుండఁగ ని
మ్మెన్నఁగ వేఱొక్క విష్ణుఁ ౹ డీ సతివరమీ

1, పలవరో్ని అ. పా. కలవరమో. 2. యలవరు.

మన్నాఁడో నావిభుఁడై
యున్న జగత్కర్త విష్ణుఁడో భావింపన్. 159

ఉ. ఈనలినాక్షి యాత్మ గురి యించిన విష్ణుఁడు నావిభుండయా
నేని, జగత్ప్రసిద్ధముగ నిమ్మహనీయ విభూతిసంపదన్
దీని వరించె నేని యిది దివ్యులు గొల్వఁగ నమ్మహాత్మునిం
పూనఁగఁగూ[1]డి లక్ష్మియయి యుండిన నేమగు దాననోసుమీ. 160

మ. ననుమీఱున్నతి కెక్కు నీవనిత నా నాదివ్యనారీజనం
బును దద్వల్లభులుం గరంబు వినయంబుల్ సేయుచుం గొల్వ లో
చనపద్మాంచల చంద్రికారుచులచే సంపత్కళల్ నింపుచున్
మనుచున్ లోకము[2]లింతయున్ నిజమ్మై నావిష్ణునిం గూడినన్. 161

తే. పెక్కువేలేండ్లు విష్ణునిఁ బ్రేమఁ గూడి
లక్ష్మినై యుంటిఁ గాక యీలక్ష్మిలీల
యిట్లు భువనైకచిత్రమై యెసఁగుమహిమ
కెక్కియుంటినె గురుతుగా నెన్నఁడైన. 162

ఉ. ఇంతయు నేమి గాఁగలదొ యేర్పడఁ జూచెదఁ గాక చిత్రమై
యింతకు వచ్చునట్టి పని యెక్కడఁ బోయెడు నంచు నయ్యుద
న్వంతునిపుత్రి మానసము నంబెగడొందుచుఁ జూడ మ్రోసినా
శాంతములన్ జయావహము లావెడలక్ష్మి విమాన మెక్కఁగన్. 163

క. కాంచనపంకజమె[3]క్కెడు
కాంచనకలహంసివోలె కమలాలయ యా
కాంచనపుష్పకమెక్కెన్
గాంచనమయదేహరుచులు గడలుకొనంగన్. 164

ఆదిలక్ష్మియొక్క తేజస్సును మాయాలక్ష్మి హరించుట.

క. ఇమ్మెయిఁ బుష్పకమెక్కెడు
నమ్మాయాలక్ష్మి లక్ష్మి యందుల తేజం
బిమ్ముల హరియించెను లో
కమ్మెల్లను విస్మయంబు గాఁగనుచుండన్. 165

ఆ. ఉదయభానుదీప్తి యొడిసిన సారంబు
దెరలియున్న యోషధియునుబోలె
కపటలక్ష్మి సహజ కాంతి హరింపన
యాదిలక్ష్మి విన్ననయ్యె నపుడు. 166

1. (మా. పా.) గూట. 2. వింతయై. 3. మెక్కెడు.

వ. వెండియు నమ్మిథ్యాలక్ష్మి లక్ష్మికనుంగుఁ జెలులై గూడియున్న భూకాంతా సరస్వతులఁజూచి [1]నేనయ్యాది విష్ణుంగూడి చతుర్దశభువన సామ్రాజ్యంబునుం బ్రతిపాలించుచు వైకుంఠ నగరంబున వివిధోప భోగంబు లనుభవించుచుండుదు, నింక మీరు నాసఖులై యాదివ్యస్త్రీలు పరిచారికలై సేవింపనుండవలయు నాయనుజ్ఞఁ గైకొని రండని వారిద్దఱ నవ్విమానం బెక్కించుకొని బ్రహ్మరుద్రాది బృందారక సందోహంబులును విష్వక్సేన ప్రముఖ దండనాయకులును బరివేష్టింప గంధర్వ మధురగానంబులు నప్సరో నృత్తావధానంబులు నాదరింపుచు శంఖకాహళ భేరీ మృదంగ పటహ వీణావేణు నాదంబులు చెలంగఁ ద్రైలోక్యమహోత్సవంబుగా గగన మార్గంబున వైకుంఠపురంబునకుం జనియె. తదనంతరంబ. 167

తే. అట్లు తేజోవిహీనయై § యబ్ధికన్య
నిబిడనిర్వేద దైన్యముల్ § నివ్వటిల్ల
నొంటిఁబడియుండె విగతతారోగ్రతిమిర
జలధరాలీఢ యామినీకలనవోలె. 168

క. త్రైలోక్య వినుత సాధ్వికి
శ్రీలక్ష్మికి నీయవస్థ § సిద్ధించెఁబతిన్
మేలమున నెన్నకుండఁగ
నేలాగణియింప నింక § నితర స్త్రీలన్. 169

మ. చెలులుం దేజమునుం దొలంగిన మహా § చింతాపరిక్రాంతయై
పలుమాఱున్ విధిదూఱి యద్భుతభయ § ప్రచ్ఛన్నయై యవ్వలి
వ్వలనెవ్వారును లేక యొంటిఁబడియు § వ్వామాక్షి పద్మాక్షునిం
నలుచోట్లంబరికించి కానకమదిన్ § శంకించి తానిట్లనున్. 170

చ. కటకట కూర్మియైన చెలికత్తెలటంచును వీరినమ్మి నే
నిటువలె నేలవచ్చితి నిజేశ్వరుసంగడిఁబాసి యొం[2]టిమై
నిటకిదె నన్నుడించి చనిరిందఱు వెంటనెవచ్చి విష్ణుఁడె
చ్చటవసియించె నొక్కొనుమ § సౌరభసంభృత కుంజవాటికన్. 171

వ. అని కొలంకు గొలంకులఁ గలయ నాలోకించి తన వచ్చిన త్రోవ గొండొక మరలివచ్చి యయ్యెడఁ ద్రొక్కిచూచి క్రమ్మఱ కొలంకు[3]తావునకువచ్చి వీక్షించియు, మగుడిమార్గ తరులేఖలన్వేషించుచు నిక్కంబుగాఁ బ్రాణేశ్వరుం గానక శోకంబునం జీకాకుపడుచు నేకడకుంబోవఁ గాళ్లురాక యా కలశసాగర కుమారి తనమనంబున. 172

---

1. (మూలప్రతిపాఠము) జూచిన. 2. గొంటమై. 3. డాపలికిం బోయి.

సీ. ఆ తపస్విని దివ్యకీలర్చింపలక్ష్మినై
యాది వి[1]ష్ణునిఁజెంద § నరిగెఁ గడఁక
నాదేవి పిలిచిన § ననుఁగు లైతోఁగూడి
నా సఖుల్ పోయిరి § నన్ను విడిచి
యివ్వని ననుఁగూడి § యేతెంచి వంచించి
ప్రాణేశ్వరుఁడు డాఁగె § నడవిలోన
తొల్లింటి తేజంబు § దొఱఁగి విభ్రాంతనై
యొకటియు నెఱుఁగక § యున్నదాన
తే. [2]నమ్మహావిష్ణు కవగూడ § నాదివిష్ణుఁ
డాత్మ భర్తయ కానోపు § నవ్విధమున
సఖులఁజేకొని యాసాధ్వి § చనఁగనిచట
విభుఁడు కనుపడకున్న య § వ్విధముచూడ. 173

క. ననునీ యుగ్రాటవిలో
నెనరువిడిచిపోయె విభుఁడు § నిష్ఠురుఁడై నె
మ్మనమున నిండారెడు దన
యనురాగము లేక నావ§యస్వలు డానున్. 174

ఉ. దూరమువచ్చితిన్ మిగుల § దుర్గమహాటవి నొంటిడించి యం
భోరుహలోచనుండరిగె § బోటులుదా[3]మును వింతలక్ష్మి నిం
పారగఁగూడి వేడుక దలిర్పఁగదివ్య పదంబు చేరిరె
వ్వారికిఁ దోడునీడయగు§వారు తలంపఁగ నాకు నీయెడన్. 175

క. పతియాశయుఁ జెలులాశయు
గతజలసేతువు దలంపఁగా§నిఁక తద్వ
ర్జితమతినై వైకుంఠపు
గతిఁబోయెదఁగాక యొంటిఁ § గానల వెంటన్. 176

తే. [4]ఎవ్విధంబుననైన నే§నివ్వనంబుఁ
బాసిపురిఁ జేరియుండఁగాఁ § బ్రభుఁడు వచ్చు
నపుడునా పద్మపాణ్లిల § నడలుగదురఁ
జెప్పి తనువు విసర్జింతుఁ § దప్పదిట్లు. 177

తే. చోరుఁడు నేలేని వైకుంఠ § పురము భర్త
యదియుఁగాదు మహాశూన్య § మగుటఁ జేసి

1. ఆ. పా. అదిలక్ష్మినిజెంద. 2. ఆ. పా. అమ్మహాలక్ష్మి కవగూడి యాదివిష్ణు, డాదిభర్త యొకానోపు. 3. ప్రాచ్యపుపాఠ "దానును 4. అవ్విధంబున నేనును నివ్విధంబు దుఃఖాచరణంబులు."

విన్నవై యున్నదాన నవ్విభుఁడు పోలె
నేను నిఁకనందయుండ దనేకతంబ. 178

వ. అని మోహాతిశయంబున నవ్విష్ణుమాయాసముద్రంబు దరియింపంజాలక యాలోకమాత మిథ్యాలక్ష్మి మహోత్సవ సంభ్రమంబును, ప్రియసఖీజనంబు వాసిపోవుటయును వల్లభుండు వియుక్తుండగుటయుఁ దన మనంబున కసహ్య[1]దుఃఖకారణంబులగుటం జేసి పరితపించి. 179

సీ. దవ్వువచ్చుటయు మార్దవముచే నోర్వక
చరణముల్ పొక్కినఁ బొరలఁబడుచు
వ్రేఁగు పిరుందున వీఁగు జన్నుల వడిఁ
దూఁగని నడకలఁ దొట్రుపడుచు
ధృతిలేమిఁ గడునుప్పతిల్లెడు శోకాగ్నిఁ
బొడము నిట్టూర్పులఁ బొనుఁగు పడుచుఁ
దగుసహాయత లేక దైన్యసంభూతాశ్రు
ధారలఁ జన్నులఁ దడుపఁబడుచు

తే. దుష్టమృగ దర్శనంబులఁ దొలఁగఁబడుచు
భ్రమసి మార్గముదప్పి సంభ్రమము పడుచు
నెట్టకేలకు నిబ్భంగి నేగుదెంచె
తెఱవ వైకుంఠసవిధాబ్ధి తీరమునకు. 180

వ. ఇట్లు బహువిధప్రయాసగమనఖేదజనిత స్వేదపూరాభిషిక్తంబై సత్వంబు సడలిన మేనుదీఁగెతో నల్లనచనుదెంచి. 181

### వైకుంఠపట్టణ విలాసముఁజూచి యాశ్చర్యపడి యాదిలక్ష్మి యోచించుట.

ఉ. అచ్చటనుండి చూచెకలశాంబుధికన్యక నాఁటి కంటెఁగ
న్నిచ్చకువచ్చు దత్పురసమీహిత లీలలు సాలచంద్ర శా
లోచ్ఛ్రయ రత్నతోరణ సమున్నత కేతన హేమకుంభముల్
మెచ్చొదవించుచున్ దిశల మించుల ముంచుచుఁ దేజరిల్లగన్. 182

ఉ. చారుమృదంగభేరి జయశంఖ విరావము లాసికాంఘ్రి మం
జీర ఝుళంఝుళధ్వని విశేషము గానకళామనోజ్ఞ వీ
ణారవముం దురంగభటనాగ చరద్రథ పౌరలోక గం
భీర రవంబునుం జెవికిఁ జెక్కువచూపెఁ బయోధికన్యకున్. 183

1. పాఠాంతరములు-దుఃఖా చరణంబులు దుఃఖాకరణంబులు. 2. ఆ. పా. బొరలు.

ఉ. నాలుగువంకలన్ సురలు ॥ నగ్రముశిరంబులతో సమస్త ది
క్కూలవిజృంభమాణ జయ ॥ ఘోషముతో హరిపూజనార్థమై
పోలఁగవచ్చుచున్ మగుడి ॥ పోవుచునుండెడు సందడిందివిన్
గ్రాలెడు రత్నభూషణ పరంపర చిత్రమొనర్చె లక్ష్మికిన్. 184

మ. హరిపూజా సమయార్పితా గరుముఖోద్యద్ధూపధూమోత్కరం
బురుసౌధోపరి జాలమార్గములయందు ద్భూతమై వీథులం
బరిసర్పించుచు గంధబంధురపురప్రాంతస్థలోద్యానసుం
దర వాతాహతిఁదూలుచున్ బురికి చిత్రశ్రీ యొనర్చెం గడున్. 185

వ. వెండియు ననంతలక్ష్మి నివాససదనంబై రాశీభూత దివ్యతేజః పుంజంబై యపరిమిత మహోత్సవాభిరామంబై యపూర్వమణిమాలికా లంకృతంబై దివ్యనారీ నరసేవ్యమానంబై వికచకనకారవింద సుందరంబై త్రిభువనానంద కరంబై యొప్పునా వైకుంఠ పుటభేదనంబుచూచి లక్ష్మి విలక్షహృదయయై తలయూఁచి నేనిప్పుడు పాడు చేసిపోయితిఁ గ్రమ్మఱనింత యైశ్వర్యవంతంబు గావించిన దివ్యప్రభావు లెవ్వరొకో యిది జగదేకాశ్చర్యంబు నేనెలవు కొనియున్నాఁడు నిట్టి సంపదయెట్లుంగ, దీనితెఱం గెఱుంగవలయు ననుచుఁ దన్నికట ప్రదేశంబున ప్రవాళకిసలయచ్ఛేదం బొనర్చుచుఁ బారిజాత కుసుమ మంజరులుగోయుచు నమృతసాగర తీరభూములం దొట్టిన ముక్తాఫలంబు లేరుచు లీలావిహారణంబులఁ బరిభ్రమించుచున్న తీఁగెఁబోండ్లఁ గొందఱ నాలోకించి వారిడాయంబోయి యిట్లనియె. 186

తే. ఏమిసేయుచు నున్నారు ॥ భామలార
యెంతదడవాయె పురినుండి ॥ యేగుదెంచి
వార్తలేమంద్రు నగరిలో ॥ వనజవాస
యునుముకుందుండు నేలాగు ॥ నున్నవారు. 187

వ. అని యయ్యిందిరాదేవి పలికిననయ్యిందీవరాక్షు లిట్లనిరి. 188

ఉ. ఎయ్యెడనుండి వచ్చితివి ॥ యీపురిదానవుగావె, నైతివే
నియ్యెడమమ్మి నిట్లడుగు ॥ దే మరివార్తలు మంచివన్నియున్,
నెయ్యముతోఁ జనార్దనుఁడు ॥ నేఁడొకనూతన లక్ష్మిఁదెచ్చి నాఁ
డయ్యెల నాఁగవిభ్రమ మహత్త్వము లెన్నవశంబె యేరికిన్. 189

ఉ. తొల్లొకలక్ష్మిఁగూడి పతితో రపు మేలుననుండియుండి యా
పల్లవపాణివై [2]విఱిగి ॥ బ్రహ్మముఖుల్ దనుఁగోరి కొల్వఁగా

1. మూ. పా. రతో. 2. ఆ. పా. 'నలిగి'.

నుల్లము సంతసిల్లఁ దనకొప్పఁ దపంబొనరించె నంచునేఁ
డెల్లజగంబులుంబొగడ నింపులఁగూడె నవాబ్జమందిరన్. 190

క. ఆ లక్ష్మీ తిలకంబు మ
హాలక్షణ వతియటంచు నతి[1]భక్తిఁబుర
స్త్రీలర్చించిరిపతితోఁ
జాలఁగ దీవించిభాగ్య సంపద వెలయన్. 191

తే. అమ్మహాదేవి దివ్యాంగ నాళిగొల్వ
భూసతీరత్నమును దానుఁబొత్తుఁగూడి
ముద్దుగోడలు వార్ధిపిముదమొనర్ప
నేలెవైకుంఠ సామ్రాజ్య మేకహేళి. 192

{ ఆ స్త్రీలు మాయాలక్ష్మీ వృత్తాంతము చెప్పఁగా విని యాదిలక్ష్మీ విచారపడుట. }

క. ఇవిగో వార్తలు వినుమని
యువిదలు తన దండఁబాసి యొండొడకరుగన్
నవలక్ష్మీ లీలలకున్
ధవుఁడుం బురజనము ప్రేమఁదగిలిరటంచున్. 193

చ. మనమునఁ గుందికుంది పలుమారు నిజేశవియోగ వహ్నితా
కునఁగడు బ్రమంది బ్రమంది పటుకోప మహాజ్వరపీడ దట్టమై
మొనసినఁగంది కంది యతి మోహతమంబునఁ గానదయ్యె న
మ్మనసిజతల్లి, యవ్విభుని మాయలఁ జిక్కనివారు లేరఁకన్. 194

వ. అట్లు మాయాలక్ష్మీలీలావిలాసలాలసుండై విభుండున్నవాఁడకాఁ దలంచి దృగం చలంబులం గన్నీరు వెడల నిట్టూర్పు నిగుడించి వెండియు నా దివ్యమందిర సౌందర్యంబు సందర్శించి యింక నవ్విభుని ముందరికి నేమని పోవుదానఁ బోయితినేని క్రొత్త బిత్తరినిందగిలిన యవ్విలాసి పరిహాసంబు సేయుంగాక నన్ను సన్మానించునే, దీనికిఁ బరితపింపనేల, తపంబున మెప్పించికాదె యీ సాధ్వి యింత వైభవంబు వడసె, నట్లన యనాథనాథుండును కరుణాసాగ రుండును భక్తవత్సలుండునునగు నవ్వైకుంఠవల్లభు నుల్లంబున నారాధించి తదీయ తపస్సిద్ధి క్షేత్రంబై పొగడొందిన యాకోలని పసిండికెందమ్మిపువ్వు నంద నేనునుం దపంబుచేసి మెచ్చువడసెదంగాక యని నిశ్చయించి మగుడి కొలంకుచేరి కృతస్నానయై తత్కర్ణికా పీఠంబునఁ బద్మాసన బంధంబు దృఢంబు గావించి. 195

1. నరుదెంచిపుర.

సీ. వేదాంత నూ[1]పురాన్విత చరణాంభోజు
హాటక పీతాంబరాభి రాముఁ
గౌస్తుభ గ్రైవేయ కమనీయ కంధరు
శంఖ చక్ర గదాబ్జ చారుబాహు
మకరకుండల వజ్రమణి కిరీట విలాసు
సురభిమాల్యాలేప సుందరాంగుఁ
గుందమందస్మితాంకురలోచనాంచలుఁ
గారుణ్య రససుధాగార హృదయు
తే. హృదయమున విష్ణునాత్మేశుఁ బదిలపఱచి
చిదమలానంద బంధుర సింధులహరి
నోలలాడుచు వసియించె నొక్క కొంత
దడవు శ్రీకాంత యేకాంత తత్త్వనిష్ఠ. 196
క. తోయధి తీరవిహారము
మాయాలక్ష్మివిలాసమయకృత్యములన్
మాయముగావించి విభుం
డాయెడ నొకవింత చంద మందముచేసెన్. 197
క. వినుధర్మతనయ, కాంచన
వనరుహ పీఠాగ్రయోగ వర్జితయై యు
ల్లన గొంత ప్రొద్దునకుఁ దన
కనుదమ్ములు విచ్చిచూచెఁ గడుచిత్రముగన్. 198
మ. ఆ వైకుంఠమునందు నొప్పె[2]డి మహా హర్మ్యంబున న్వేడ్కతో
నా విశ్వంభరు నంకపీఠమున నెయ్యం బారఁ గూర్చున్న య
ట్లావారాకరపుత్రి యొప్పెఁ గలగన్నట్లయ్యె నమ్మాయ లీ
లావిర్భూత దరస్మితుండగుచు దైత్యారాతి మోదింపఁగన్. 199
క. కురిసెం బువ్వుల వానలు
వరుసం దుందుభులు చెలఁగె వైకుంఠమహా
పురి లక్ష్మీనారాయణు
లురులీలల నట్లుగూడి యుండిన వేళన్. 200
క. ఈ లక్ష్మీనారాయణ
కేళీమాయావిలాస కీర్తనమయశః
శ్రీలొసగుఁ వినినవారికి
నాలవ పురుషార్థసిద్ధి ననుపారంగన్. 201

1. ఆ. పా. వేదాంతసుస్వరాన్విత. 2. నెప్పటి.

వ. అని గోవిందశర్మ ధర్మనందనునకుం జెప్పెననిన విని పరీక్షిత్తు అటమీఁదటి కథాప్రసంగం బెట్లుండెనని శుకబ్రహ్మ నడుగుటయు. 202

ఉ. నందక శంఖచక్ర నలినిన ప్రతిభాసితనంద సుందరీ
నందన నందన ద్రుమహరిణప్రియు గోపవధూసహస్ర గో
బృందకసత్కదంబవిటపీ వ్రజకేళివిహార చారుసం
క్రందన చాపదీపిత శిఖావళిపింఛ కిరీట లాంఛనా. 203

క. శ్రీవిభవ బ్రహ్మవిద్యా
భావిత బ్రహ్మస్వరూప పరమపురుష శ్రీ
గోవింద నంద నందన
గోవర్ధనధర ముకుంద గోకుల రమణా. 204

మత్తకోకిల. ధీరశంఖ సుదర్శనామృతదీధితీనయుతాంబకా
చారుశార్ఙ్గ సురేంద్రకార్ముక సంచరజ్జలదోదయా
హారిహాటకచేల సాంధ్యమహః స్ఫురద్రజనీముఖా
మారకోటివిలాస పుష్పసమగ్ర నందనకాననా. 205

ఇది శ్రీ మదనగోపాల చరణకమల సేవాధురీణ సత్కళాపారీణకృష్ణ
భట్టారకపౌత్ర చింతలపూడికామయప్రభుసుపుత్ర సుకవి
వర్యరాధామాధవయల్లనార్య ప్రణీతంబైన
విష్ణుమాయానాటకంబునందు
ద్వితీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీ ర స్తు.

# విష్ణుమాయానాటకము.

## ఆశ్వాసము. 3.

క. శ్రీరాధా నఖరక్షత
తారేశకళా నిరంతదర్పకదర్పో
దారాంధకార జగదా
ధాఽగుణావాల నవమదనగోపాలా. 1

తే. అవధరింపుము దేవసంయమివరుండు
సకల వేదాంతవిద్యా విశారదుండు
శుకమహాయోగి పలికె సుత్సుకతమరియు
నింపుగాను బరీక్షిన్నరేంద్రునకును. 2

వ. అవ్విధంబున శ్రీమహాలక్ష్మి కథఁజెప్పి గోవిందశర్మ ధర్మనందనునకు బ్రహ్మ
దేవుండు విష్ణుమాయవలన మోసపోయిన తెఱంగు విశదంబుగా నెఱింగింప
సమకట్టి. 3

మ. విను విశ్వక్షితిపాల మౌళివలభీ విస్ఫారరత్న ప్రభా
కనదుద్దామ పదారవింద త్రిజగత్కల్యాణ చారిత్ర పాం
డునరేంద్రోత్తమపుత్ర యామునిగరిష్ఠుల్ నీవునుంగూడి యొం
దునకుం జిత్తముఁబోవనీక హరియందున్నిల్పి సంప్రీతితోన్. 4

క. లోకవిహీనంబై జల
మాకాశము మోచియున్న యపుడంబుధిపై
నేకాంతంబున హరిపెను
చీఁకటిఁబవళించి యుండెఁ జిన్మయలీలన్ 5

తే. అట్లు సకలంబు నణచి యేకాంతలీలఁ
బరమయోగాభిరతిఁ బరబ్రహ్మబోధ
నవసుధాధార నానంద మవధరించి
లీలమై నుండఁగాఁ గొంత కాలమునకుఁ 6

## విష్ణు నాభికమలమునందు బ్రహ్మపుట్టి విష్ణుమూర్తిని స్తోత్రము చేయుట.

మ. హరినాభీ జలజాతరేణు పరమాణ్వంశంబునం బ్రహ్మ భా
స్వరహేమద్యుతిఁబుట్టె నాత్మకృత పూర్వ ప్రాజ్య పుణ్యోదయ
స్ఫురణన్ దన్మహనీయమాయ కెనయాశ్చర్య సాధనంబై జగ
త్పరినిర్మాణ విధేయతన్నిగమతత్త్వజ్ఞాన నిక్షేపమై.[1] 7

తే. ఇవ్విధంబున జనియించి యవ్విధాత
బిసమహోన్నత కర్ణికా పీఠమెక్కి
దేవదేవుని ముఖమున దృష్టినిలిపి
ప్రస్తుతించెఁగరాంజలి బంధమొప్ప. 8

శా. ఓనారాయణ! యోజగద్వరద! యో యోగీంద్ర! యోగీంద్రహృ
ద్ధ్యానధ్యేయఫలాత్మ! యోజనక! యో యామ్నాయతత్త్వార్థవి
జ్ఞానానందనిధాన! యోపరమ! యో సర్వేశ! యోమోక్షల
క్ష్మీనిత్యాశ్రయ! యాశ్రితుండనను నెమ్మిం జూడవే సత్కృపన్. 9

క. నీయందె పొడముచుండును
నీయందెయడంగుచుండు నిఖిలమువేదాం
తాయత్త తత్త్వవిద్యా
శ్రేయోనిధివరయ నీవ చిన్మయపురుషా. 10

క. నీకంటె నితరదైవము
లేకుండు[2]ట కంబరావలీఢత మోర
త్నాకరములు సాక్షులుజగ
దేకాధిపకీర్తి నీకయొసఁగు మహాత్మా. 11

మ. సర్వాత్ముండవు సర్వలోకఘటనా చాతుర్యధీవర్తివిన్
సర్వవ్యాపివి సర్వపూర్ణరుచివిన్ సర్వైక సేవ్యుండవున్
సర్వోత్కృష్ట మహాప్రభావుఁడవు నెంచ[3] న్నిన్ని నీవాటకున్
సర్వంవిష్ణుమయంజగత్తనెడిశా స్త్రంబుల్ ప్రమాణంబులా. 12

సీ. బయలునీయందు సంక్షభమైనకతమున
దోయజేక్షణ యనం తుండవైతి
పృథివినీవు సముద్ధరించినకతమున
దానవదమనభూధరుఁడవైతి

1. మూ. పా. 'నిక్షిప్తమై' 2. మూ. పా. లేకుండనంబ విధతమో. 3. 'నెన్నన్నిన్ని'.

వుదకస్వరూపమై యుండెడు కతమున
నుతకీర్తి నారాయణుండవైతి
వఖలతేజముఁ బూని యందున్నకతమున
సర్వేశ బ్రహ్మతేజంబవైతి
తే. ప్రాలిఁ బ్రాణానిలంబవై యున్నకతనఁ
బుండరీకాక్ష సర్వాత్మకుండవైతి
ప్రకృతిరహితవిచక్షణ పరమపురుష
నిరుపమానంద సర్వంబు నీవ తలఁప. 13
తే. పంచభూతాత్మకంబులై పద్మజాండ
మండలంబులు నీమహామాయయందు
నుద్భవించుచు డిందుచు నుండుఁ సలిల
పూరమున బుద్బుదంబులు బోలెనంగ. 14
సీ. నీవచఃకలనలు నిగమాదివిద్యలు
జగములు నీయింద్రజాలకేళి
ద్వాదశాదిత్యులు దహనుండు శశిప్రజా
పతులు రుద్రులు సురల్ పవనవసువు
లాదిగాఁగల దివ్యులందఱు సృష్టిబీ
జాత్మకులగుచు నీకయుంద పొడము
చంద్రుడు నాశము బొందు చంద్రచ్యుతఖ్యాతి
నీయందవర్తించు నిక్కువంబు
తే. కాలచక్రంబు నీకేళి కల్పనంబు
పరమకూటస్థుఁడవు పరబ్రహ్మతేజ
మై వెలింగెడు తత్వంబు నరయ నీవ
యంతయును పరమాత్మ నీకేవరసిచూడ. 15

{బ్రహ్మకు విష్ణుమూర్తి ప్రత్యక్షమై సృష్టిచేయుటకుఁ దగిన సాధనములఁ బ్రసాదించుట.}

వ. అని బహుప్రకారంబులఁ బ్రశంసించు విరించికిఁ బ్రసన్నుండై వెన్నుండు జగంబులు నిర్మించు తలంపున ననేక విద్యారహస్యంబు లుపదేశించి సృష్టిరచనా చాతుర్యంబును వాక్సిద్ధియుఁ గామరూప కామసంచార ప్రభావంబుల ననుగ్రహించి తద్వచనాను రూపంబున మాయ సంఘటించి యంతర్హితుండయ్యె; తదనంతరంబ. 16

క. హరినిర్దిష్టవివేక
స్ఫురణంబున గోచరించె భువనవిరచనా

పరిబోధము బ్రహ్మకుఁద
ద్గురు విద్యావిభవ మాత్మఁ గొనసాగంగన్. 17

—ప్రహ్మదేవుఁడు బ్రహ్మాండ కల్పనము చేసి ప్రపంచ సృష్టి చేయుట.—

వ. ఇట్లు ప్రబంధుండై విద్యానాథుండు. 18

క. కోటీరదివ్యతేజము
దీటుకొనంజేసి యాత్మతేజాంశమునన్
హాటకమయాండ మొక్కటి
పాటించి యొనర్చి నీటిపైఁ దేలించెన్. 19

క. లోపలబయలై ధరణియు
రూపును గర్పరయుఁగాను రూఢంబగుచున్
వ్యాపింపఁదొడఁగెనంబుధి
లోపలనది పరపులేక లోలోర్ములమై. 20

క. అంతర్గతుఁడై యపుడు త
దంతరమున నిలిపెఁ జదల ననిలంబుసభ
స్వంతువలన నగ్నిశిఖా
వంతువలన జలము కుశము వలనఁ బృథివియున్. 21

క. పై సప్తావరణంబులు
భాసిల్లగఁ జేసెననల పవమానపయో
భూసుర వర్త్మాదులచే
నాసరసిజ సంభవుఁడు దశాండంబునకున్. 22

వ. ఇట్లు సృజియించి సకల భువన దురంధరయగు నివ్వసుంధరం దిరంబుగాఁ దద్బ్రహ్మాండంబు క్రింద కర్పరంబు నాలుగంచులు మోవ హత్తించి బహుకోటి యోజన విస్తీర్ణంబగు నందు గొంత భాగంబు గడపలచేసి నట్టనడుమ నాల వాలంబు చందంబుగా చక్రవాళంబునిలిపి తన్మధ్య ప్రదేశంబున మేరు శైలంబు సంస్థాపించి వెండియు వెండికొండ మొదలైన కొండలు పెక్కు గల్పించి దిశాష్టకం బేర్పరించి యయ్యష్టదిక్కోణంబుల నైరావతాది వేదం డాష్టకంబుఁ బ్రతిష్ఠించి యంతర్ద్వీపంబులతో నుదన్వంతంబులు సంతరించి యివ్విధంబునం బదిలంబైన మహీమండలంబు మొదలుగా నధోభువనంబు లేడును నిర్మించి. 23

క. పదునాలుగు లోకంబులు
నదనున వెలిఁగింప వేయిశయంశములకు నా
స్పదముగఁ ద్రిగుణాత్మకుఁ డెం
పొదవఁగఁ బుట్టించె నినునిశనురు తేజమునన్. 24

తే. క్రిందిభువనంబు లే[1]డింటి § నంది వెలుఁగ
మీఁది భువనంబు లే[2]డింటి § నూఁది వెలుఁగ
వేయి వెలుఁగుల సూర్యనా § రాయణుండు
చక్రవాళాద్రిపై మింటఁ § జాగుచుండె. 25

క. అవధిగిరి మధ్యభూమిన
రవిమండల దివ్యదీప్తి § రంజన మవలం
దు విజృంభింపదు తిమిరం
బవిరళమైయుండు కజ్జ § లాకారమానన్. 26

తే. మేదినీకాంత ముత్యాల § మేలుకట్టు
మాడ్కిఁ జూపట్టు నక్షత్ర § మండలంబు
గగనమున నిల్పి వెండియుఁ § దగినచోట్ల
పెక్కు దివ్యాలయములు దీ § పింపఁజేసె. 27

క. ఈరేడు లోకములఁ బరి
పూరితముగ జంతుచయముఁ § బుట్టించెను రేం
ద్రారి నరపన్నగాధి ప
మారూఢిగ నుచితకుల గు § ణాకారములన్. 28

మ. తగులోకంబులు తద్విశేషవిహిత § స్థానంబులుం దత్కలా
నుగుణవ్యాప్తులు జంతుసంతతులకున్ § రూపించి తన్నాశమున్
మగుడంబు[3]ట్టువు పృథ్విలోఁగలుగ సం § భావించెఁ గాలంబుతోఁ
దెగుతత్కాల మహర్నిశాబ్దగతినా § దిత్య ప్రచారంబులన్. 29

క. అన్నిటికి నూర్ధ్వలోకం
బన్నలువకు నిలయమయ్యె § హరియును మాయా
భ్యున్నత తేజోమూర్తుల
వన్నెగ విహరించెఁ బెక్కు § వసతులయందున్. 30

క. హరియంశ భేదమగు శం
కరుఁ డాత్మారాముఁడగుచు § కైలాసమహా
గిరిశృంగాగ్రమునందుం
బరమ చిదానందకేళి § పదమున నుండెన్. 31

సీ. మనువు లింద్రాది దిఙ్మండలాధీశ్వరు
లాశ్వినేయులు రుద్రుల మరవరులు
వసువులు మునులు రాక్షసులు గంధర్వులు
మానవుల్ మొదలైన § జ్ఞాననిధులు

---

1. లేనూట. 2. లేనూట. 3. మూ. పా. బుట్టువు పృథ్వీయుం.

ఖగమృగ పశుకీటక ప్రాణులైన య
ల్పజ్ఞానజీవులు పర్వతావ
నీజాతగుల్మలతాజాతులైన య
జాచరణంబులు సంక్రమింప

తే. విష్ణుమాయా పరిభ్రమ ద్వీపుల కాల
చక్రవిభ్రాంతమగుచుండ సకల జగము
బహుళ బహువిధ సంపత్ప్రభావ విలస
నముల నభివృద్ధిఁ బొందుచు నరవరేణ్య. 32

వ. ఇవ్విధంబున ప్రభవించిన నిఖిల ప్రాణిగణంబులును సత్వరజస్తమో గుణ సంజాత శమద[1]మాహంకార దుర్మానమోహ మాత్సర్యాదుల ననుసరించుచుఁ బ్రవర్తించుచుండు. 33

చ. తముఁగడుమించుకొన్న పటుతామసరాజసవృత్తిఁ బూనువా
రమిత మహాగ్రహస్ఫురద న[2]ల్పరుషాదులఁ బాపకారులై
శమకరుణా ప్రమోదములు చాలక వైష్ణవ మాయచేత దు
ర్గమ భవపంకమగ్నులయి గ్రాలుదురుత్కట దుఃఖదుర్మతిన్. 34

చ. సుమహిత సాత్వికోదయ విశుద్ధమతుల్వినయప్రకాశితో
త్తమకరుణాశమంబులు నుదార వివేకము గల్గి మోహసం
తమస విదూరులై హరిపదస్థిర చిన్మయసౌఖ్యలీలలం
బ్రమదమునొందుచుండ్రు బహుభంగుల సత్పురుషుల్ నుతింపఁగన్. 35

క. కావున రాజసతామస
భావంబులఁ బొరలఁబడక పటుసాత్వికసం
భావితులై సత్పురుషులు
సేవింపఁగ మెలఁగుదురు విశేషవిధిజ్ఞుల్. 36

{ బ్రహ్మదేవుఁడు రాజసగుణముచేత బ్రహ్మాండము తానే కల్పించితిని గదాయని గర్వించుట. }

క. రాజసగుణ కలితుండై
రాజీవభవుం డహంకరణ పరి[3]వృతుఁడై
తేజముచూపుచుఁ ద్రిభువన
పూజితుఁడై ప్రాభవంబు పొదలఁగనుండెన్. 37

వ. ఇవ్విధంబున మహారాజసంబున లోకేశ్వ[4]రత్వం బవలంబించి. 38

1. మూ. పా. 'దయా'. 2. దర్పకరుణాదుల. 3. అ పా. 'పరిణతుఁడై'
4. ఉండై ఐశ్వర్యత్వం.

మ. తానే బ్రహ్మను, పద్మజాండము స్వజాతంబౌ[1]టఁ దా నొక్కఁడే
తా నన్యంబిఁక నొండు లేదనుచు సంకల్పించి యాస్రష్ట దు
ర్మాన శ్రీనసలారె వైష్ణవ మహామాయా కృతాజ్ఞాసనాం
డానీకంబు లనేకముల్ మఱియు నయ్యైచోట్ల వర్తింపఁగన్. 39

క. ఆ పరమేశ్వరు మాయా
రూపంబు జగంబు, తదను రూపంబునను
ద్దీపించితిఁ దానక, త
దాపిహిత నిజ ప్రబోధుఁడై విధి మఱియున్. 40

వ. ఒక్కనాఁడు సత్యలోకంబునందు నె[2]నమంద్రు బ్రహ్మలును మహామునులును,
మనువులు పురందరాది బృందారక సందోహంబులును, యక్షరాక్షస గరుడ
గంధర్వ కిన్నర కింపురుష సిద్ధవిద్యాధ రాప్సరోవ్రాతంబులును, చంద్ర సూర్య
గ్రహతారకా సరిత్సాగర పర్వతాదులుం [3]బరివేష్టించి బహువిధ సేవా
యత్తంబులగు చిత్తంబులు మొత్తంబులై కొలువ నలువ గొలువునఁ
గూర్చుండె. 41

సీ. నాలుగువిధముల లీలాభినయములు
పొసఁగనాడెడు నప్సరసల యొరపు
సప్తస్వరములు మించఁగను [4]దంత్రులు మీటి
పాడెడు గంధర్వ పతుల మేలు
వేణునాదామృత వీచీపరంపర
నలరించు నాగకన్యకల చెలువు
లలితేంద్రజాల విద్యలు చూపి మెప్పించు
సిద్ధవిద్యాధర శ్రేణి నేర్పు

తే. బ్రహ్మపురుష సరస్వతీ ప్రాణనాథ
సర్వలోకేశ, సర్వరక్షాధురీణ
యనుచు వినుతించు దివ్యజయారవంబు
నవధరింపుచు సంతోష మావహించె. 42

క. తన సృజియించిన యింద్రా
ద్యనిమిషముఖదివ్యకోటు లవ్విధమునఁ ద
న్గొనియాడుచుఁ బూజింపన్
ఘనరాజసమహిమ వెలయఁగా నిట్లనియెన్. 43

---

1. బైన, 2. ప్రా. పా. నవబ్రహ్మలు. 3. ఆ, సా. పా. మూ. పా. ప్రవేశించి.
4. ఆ. పా. చవిపంచికలు మీటి

క. నాయంత వేల్పుగలఁడే
యేయెడల జగత్ప్రపంచ § మిట్లొనరింపన్
బాయకనడుపుచుఁ ద్రిభువన
నాయకుఁడై బ్రహ్మపదము§నన్ వర్తింపన్. 44

క. నాకంటె నధికుఁడొక్కఁడు
లోకంబుల లేఁడు దివిజ§లోకములోనన్
నాకల్పించిన యవియు
ల్లోకంబులు, నధికుఁడిందులోనం గలఁడే. 45

ఉ. తానె త్రిలోకనాయకుఁడఁ § దానె జగద్రచనాధురీణుఁ డం
దానె జగత్ప్రపోషకుఁడఁ § దానె జగత్పరిహర్తఁ బూజ్యుఁడం
దానె సమస్తదివ్యులకుఁ § దాపసులార మునీంద్రులార యో
దానవులార నన్నపర§దైవముగా భజియించుచుండుఁడీ. 46

క. పదునాలుగు లోకంబుల
పదముల మిముఁ బుచ్చఁబెట్టఁ § [1]ప్రభువును నై చె
న్నొందవుచు సకలైశ్వర్య
ప్రదుఁడు స్వతంత్రుండు నాగఁ§బరఁగుదు నెందున్. 47

ఆ. ఇంద్రియముల గెల్చి § యెక్కటి నిర్విఘ్న
యోగచిత్సుఖామృ§తోపయోగి
నై య[2]దృచ్ఛఁ దిరుగు§నట్టి యోగీంద్రుండ
నరయ నేన కాని § యొరుఁడు లేఁడు. 48

క. ఎన్నఁడు నొండు దలంపక
నన్ని పరబ్రహ్మమని మ§నంబున నిడియు
త్యున్నతిఁ దపములు సేయుచు
నున్న వివేకులకుఁ గలుగు § నురుశుభఫల[3]ముల్. 49

చ. అని తనుదానె చెప్పుకొని § హర్షసుధారస వారి రాశిలో
ననయము నోలలాడు హృద§యంబునఁ దా నసలారుచున్న య
వ్వనరుహ సంభవున్ భువన § వందితు నుత్కట దివ్యతేజునిం
గనుఁగొని ప్రాంజలుల్ దనరఁ§గా నురలోలి నుతించి రొక్కటన్. 50

---

1. అ. పా. బుచ్చునట్టి ప్రభువను నేనై, యొదవుచు  2. అ. పా. యథేచ్ఛ.
3 ఫదముల్,

బ్రహ్మాలు దేవతలు మొదలయినవారు బ్రహ్మను స్తోత్రము సేయుట.

సీ. బ్రహ్మలయ్యోనమంత్రదు పరమార్థమని పల్కి
రిదమిద్ధమనియె మహాసీంద్రగణము
లింద్రాదిదిక్పాలు రీలాగ యానని
రాదిత్యు లిదినిశ్చయంబయనిరి
తప్పదీమాట నిదానవులాడిరి
కల్లగాదనియె యక్షవ్రజంబు
సత్యోక్తియనిరి నిర్జరసమూహంబులు
గంధర్వపతులు నిక్కంబయనిరి

తే. యాశ్వినేయులు మనువులు నాదిగాను
వారు నట్లనెయనిరి దుర్వారఫణితిఁ
దన్నహా ఘోషమపుడు మంథాన మథన
సమయసాగర ఘుమఘుమ స్వనము [1] గెలిచె. 51

క. వనజభవు నంతవాఁడును
ఘనవైష్ణవమాయ కోలఁది గానఁడటన్నం
గను[2] నే ముంతెడు నీళ్లను
మునుఁగుచుఁ గాఱఱపు లఱచు మూఢుండెందుఁన్.    52

మార్కండేయ మహాముని యాక్షేపించి పలుకుట.

వ. ఇవ్విధంబున విధాత జగదేకాధిపత్యంబు వహించి యాత్మస్తుతి చేసుకొనిన నా[3]కరించి సింహగర్జకుంబ్రతిధ్వనులిచ్చు గిరి గుహాగర్భంబులుంబోలె తదను రూపంబునఁ గంఠశోషణంబుగా నుద్ఘోషింపుచు నవ్విరించిఁ బ్రస్తుతించు విజ్ఞానవిహీనుల దేవదానవాది దివ్యయోనులంజూచి సహింపక లేచి మార్కండేయ మహామునీంద్రుండు బ్రహ్మదండంబునుం బోనిదోర్దండంబెత్తి యంద ఱంగలయ వారించి ప్రజాపతి నవలోకించి. 53

ఉ. వేదపురాణ శాస్త్రముఖ విద్యలు మూర్తివహించి పల్కెడున్
[4]సాదరతం బ్రమాణముగ నన్న క్రియం బరమాద్భుతంబుగా
నాదిమునీంద్రముఖ్యుఁడు చిరాయురుపేతుఁడు పూనిపల్కెనం
భోద గభీరనాదమున మోహపరీతుని నబ్జజాతునిన్. 54

1. జెలిపె 2. మూ. పా. 'గనుగొను నే' గాఱులరచు. ముంతెడునీళ్లను మునుగుచు.
3. ఆ. పా. వారించి. 4. సాదరణన్ బ్రమోదముగ నత్క్రియలం.

మ. పరదైవంబును బ్రహ్మయోగియు పరబ్రహ్మైకతేజంబునుం
బురుషుండుం భువనైకనాయకుఁడు నంభోజాసనాండావలీ
పరినిర్మాతయు హర్తయు న్వరదుఁడుం భావింప విష్ణుండవై
పరగన్నిన్ను నుతించుకొన్న సుమతుల్ పాటింతురే పద్మజా. 55

ఆ. నిన్నఁగాదు మొన్న నీవు జనించుట
నిపుడసంభవించె నీజగంబు
నపుడప్రభుఁడవై తివకటమహాప్రభుం
డైన విష్ణుఁడుంట యరయవైతి. 56

క. నారాయణ నాభీసర
సీరుహమున సుకృతిఫలవిశేషంబునఁ బెం
పారఁగఁబుట్టుట మఱచితి
వే రాజస మేల మఱువనీ[1] దెట్లైనన్. 57

వ. పూర్వజన్మసహస్రంబుల నేలాగుతపంబు లాచరించితివో తత్ఫలపరిపాకంబున పరమపురుషుండైన పద్మనాభుని నాభీపద్మంబున నుద్భవించి పద్మసంభవుండను ప్రధాననామంబు వహించి యమ్మహాత్ముని ప్రసాదంబున జగంబును సృజియించి స్రష్టవై పర్యాయంబున బ్రహ్మ[2]ది నామంబులఁ బ్రసిద్ధుండవై ప్రతాపంబు వడసితివి. ఈమేలు ప్రకటించిన బ్రహ్మణ్యదైవంబును బ్రహ్మాండనాయకుండును, బ్రహ్మయోగియు, పరబ్రహ్మంబును, బ్రకృతిపురుషాధీశ్వరుండును, కాలాతీతుండును, కాల స్వరూపుండును, నిత్యుండును, సర్వవ్యాపకుండును, సకల జగత్సృష్టి కర్మకుండును, విష్ణుండ యని తగిన ధీమంతులఁ బ్రబోధింపుచు, స్వామిభృత్యన్యాయంబున నద్దేవుని సే[3]వింపుచుండక దురభిమానంబున నజ్ఞుండవై నేనే దైవంబనని యాడుకొనుట దగునేయని పలికిన, నప్పలుకులు క్రోధోద్బోధకంబులైన నిర్వేదించి యాసత్యసంధునితో నిట్లనియె. 58

అందుకు బ్రహ్మకోపించి విష్ణుమూర్తి నాక్షేపించుట.

చ. హరిపరమాత్ముఁడుం బ్రభుఁడు నయ్యెనయేనిజగంబు తానెపెం
పరుదుగ సంఘటింపవలదంటినె నే[4]బలె సర్వపూజ్యమై
పరగెడు బ్రహ్మపట్టమున భాసిలుచున్ సకలైకసేవ్యుఁడై
యురువిభవాన్వితుండగుచు నుండక యూరకయుండ నేటికిన్. 59

1. క. నెదెట్లైనన్. చ. నీదెట్లైనన్. (అ-పా) నిందెట్లైనన్. 2. బ్రహ్మనామంబుల ప్రసిద్ధుండవై ప్రభావంబుకు 3. అ.పా. గీర్తింపుచుండక, 4. అ. పా. నావలె.

ఆ. అతనినాభియందు నవతరించిన మాత్ర
సంయమీంద్ర పౌరుషంబు చెడెనె
స్థానమొకటిలేక జనియించునే యెట్టి
దైనదానికేమి యవలవినుము. 60

సీ. ఉదయింపఁడే సూర్యుఁడుదయాద్రి నుదయాద్రి
[1]కంటెను తేజమై కానఁబడఁడె
ప్రభవింపఁడే వహ్ని పాదపంబున పాద
పముకంటె ప్రాభవాస్పదముగాదె
అంకురింపదెము త్తియము చిప్పనా చిప్ప
కంటె సత్కాంతి సంగతముగాదె
యుద్భవింపదె ఫల మొగిఁ బుష్పమునఁ బుష్ప
మునకంటె నుపయోగ్య మనఁగఁబడదె
తే. జననమందదె కర్పూర మనఁటినంటి
కంటె నిఖిలైకయోగ్యమై గడలుకొనదె
యట్లు యేనునుహరియందు నవతరించి
యంతకంటెను బూజ్యుండ నైతివినుము. 61

క. నేజనియించిన కతమున
నీజగములు గలిగెఁగాక యిన్నాళ్లయ్యం
భోజాత్ముఁడు సృజియింప బ్ర
యోజకుఁడగునేని యూరకుండునె చెప్పుమా. 62

క. నాకల్పించినలోకము
గాక జనార్దనుఁడు వేఱె కల్పించెనె యా
లోకము గల్గినఁజెప్పుము
నీకన్నదిగలిగెనేని నిఖిలము నెఱుఁగన్. 63

ఉ. ఈమునులీమరుద్గణము లీదనుజుల్ వినియూరకుండఁగా
నేమని మించి పల్కితివి యీసభలోపల పద్మనాభుపైఁ
బ్రేమవహించి నాకునొక పిన్నతనంబుగ నీవు పెద్దవై
యీమెయి నీకుబంటి తెలివిక్కడ నేరికి లేకపోయెనే. 64

ఉ. ఆరయలోకనాథుఁడు సురాసుర పూజ్యుఁడు కర్తయీ[2]విధిం
జీరికినిట్లు గైకొనక చెల్లునె యీముని[3] దేవకోటిలో
నూఁకనోటి క్రొవ్వున దురుక్తులు పల్కఁగనంచునుంటగా
నేరకధిక్కరించితివి నిన్నిఁక నేమనవృద్ధతాపసా. 65

1. ప్రా. పా. కంటెతేజంబుగా. 2 కర్తభర్తయున్. 3. యాత్రియ.

ఆ. అనిన మందహాస మంచందరోచులఁ
చంద్రికామయూఖ సదృశమగుచు
రత్నదర్పణాభిరామ సముద్దామ
మృదుకపోలరుచికి మెఱుఁగుగాఁగ. 66

మ. అర్కోదగ్రరుచి ప్రకాశుఁడు ప్రభావాఢ్యుండు వేదార్థసం
పర్క ప్రస్ఫుటసత్యవాక్యుఁడు మహాప్రామాణిక శ్రేష్ఠుఁడౌ
మార్కండేయ మహామునీశ్వరుఁడుప ద్మప్రోద్భవుఁ మూఢతా
కార్కశ్యం బెడలింపఁగోరి పలికెన్ గంభీర వాక్ప్రౌఢిమన్. 67

మార్కండేయుఁడు విష్ణుప్రభావ మనేకవిధములఁ జెప్పుట.

తే. హస్తిమశకాంతరము సహస్రాంతరంబు
విష్ణునకు నీకు నిట్లు భావింపలేక
పలికితివి నీవు నీబ్రహ్మపదము నెంత
యతని దాసానదాసుని ప్రతికిరావు. 68

ఉ. అక్కట కన్నులారఁగనినైన నెఱుంగవు రాజసంబు పెం
పెక్కఁగ వేద మేదినుతిసేయించెదుఁ జూడవె తద్రహస్యమున్
[1]న్యక్కృత మయ్యె నీకతన నల్పవిచారుఁడ వౌటఁ జేసి నీ
వెక్కడ విష్ణుఁడెక్కడ సహింతురెయార్యు[2]లనర్హవాక్యముల్. 69

క. ఎన్న నినుఁబోటి బ్రహ్మలు
వెన్నుని నాభీసరోజ వీధిమరందో
త్పన్నులయి పద్మజాండము
లెన్నెన్నో సృజింపుచుందురీ చందమునన్. 70

క. నా సంభవించినది మొద
లీసందునఁజేనిరి బ్రహ్మ లిరువురు వినుప
ద్మాసన ! తద్భువనద్వయ
మాసరసిజనాభమూర్తి యందున డిందెన్. 71

వ. చిన్మయమూర్తియగు నమ్మహాపురుషునియందు ప్రాణిగణ సంకీర్ణంబులగు బ్రహ్మాండంబులు సర్వతోముఖంబులు తండోపతండంబులై మొందుకొని జంతువులంబోలె నావిర్భవింపుచుం గాలపరిపాకంబున భగ్నంబులై పోవుచుండు కొన్ని బ్రహ్మాండంబులు గగనంబున నక్షత్రంబులుం బోలె దృశ్యాదృశ్యంబులై యుండు. నొక్కవేళ నమ్మహా మాయానాటకుండు తన మాయవలన లోకంబులకుఁ బ్రళయ దశలు గల్పించి వినోదలీలకై నినుఁబోటి

1. మూలపాఠము—న్యక్కడమయ్యె నీకతన నల్పవిచారుడవౌటఁజేసి. ఎక్కడమయ్యె నీకతనవ్వల్ప 2. యార్యుల-నర్హవాక్యముల్. 3. ఫలంబులుం.

బ్రహ్మలం బెక్కండ్రం బుట్టించి వారు పడుచులు బొమ్మరిండ్లు గట్టుకొని యాడునట్లు తనప్రమోల నిటువంటి జగంబులు పన్నుకొని యాడుచున్న వారిలో నొక్కఁడై తిరుగుచుండు నతని దివ్యప్రభావంబు లనేక విధ[1]చిత్రకారణంబులు.

క. తన కపటకృత్యమఖిలము
నన[2]క, జనుల్ బ్రహ్మసృష్టి యని భ్రమయుటకై
నినుఁగని నీచే జగములు
జనియింపఁగఁ జేసె హరి విచారింపు తగన్. 73

ఆ. విష్ణుమాయగాఁగ వివరింపుదురు మహా
సూ[3]క్ష్మమతులు మఱియు స్థూలమతులు
బ్రహ్మసృష్టిగాఁగ భావింత్రు కొంద ఱె
ద్దియును నెఱుకపడక తిరుగుచుంద్రు. 74

ఆ. హరికి సృష్టికర్త వై జనించుటఁ జేసి
యధిక దివ్య తేజ మడరెనీకు
నన్నదాది దివిజు లర్చింప వెలసితి
వింతవట్టు చాలదే మహాత్మ. 75

— వటపత్ర శయనుఁడైన విష్ణుమూర్తికి మార్కండేయుకు జరిగిన సంభాషణము. —

వ. ఇంక నొక్క రహస్యంబు వినుము. 76

తే. నీవు బుట్టకమున్న మున్నీటిమీఁద
బాలవట పల్లవంబున బాలమూర్తి
నొంటిఁ బవళించి హరిదివ్య యోగలీలఁ
దన్నుఁ దానాత్మ భావించుచున్న వేళ. 77

సీ. [4]నేనొక్కరుఁడ నీటిలోనఁ దోడెవ్వఁడు
లేక యెల్లెడలఁ జీకాకుపడుచు
నీఁదుచు మునుగుచు నెగయుచు గ్ర[5]గ్గోలు
పడి మొరటిల్లుచు భ్రమసి విభుని
శివుని సంతతము బూజింతు నా దేవుఁడె
య్యెడ దాఁగియున్నాఁడొ యింక నెట్లు
సచరాచరంబులై జగములు పొలసిన
వీవేళ నాకు దిక్కై వసించు

1. విచిత్ర. 2. న నేక. 3. మూ. పా. స్థూలమతులు బ్రహ్మసృష్టిగాఁగ భావించినల్ప మతుల. ఆ. పా. స్థూలమతులు జంగమస్థూలమతులు బ్రహ్మసృష్టిగాగ భావింపుదురు అజ్ఞులడియు. 4. నే నొక్కరుండము న్నీటిలో దోడెవ్వరునులేక చీకాకునొంది నీట. 5 జన్గోడు.

తే. ఎచట నాదేవుఁ గనుగొందు నేమిసేయు
వాఁడనని క్రుమ్మరుచు నొక్క వలన మాయ
నట్లు శైశవలీలా విహారరసిక
మానసంబు[1]చి దానంద మందిరముగ. 78

సీ. పరితస్స్ఫురత్ప్రభోత్కర రత్నమునుబోలె
క్రొమ్మెఱుంగులు గిరికొనెడువాని
నీటఁదోఁగుచు నిగనిగమను చిగురు మ
[2]ఱ్ఱాకు పానుపున సొంపారువాని
మంజీరమేఖలా మణిమయ గ్రైవేయ
మకరకుండలదీప్తి మలయువాని
వెలిదమ్మి రేకుచూపులఁ జిన్నినవ్వుల
లేఁతవెన్నెల జక్కళించువాని
తే. బాలుఁడయ్యును బ్రౌఢితోఁ బరగువాని
గోచరించియు బ్రహ్మమై తోఁచువాని
సృష్టి లీలాత్మకుండయై చెలఁగువాని
విపుల మాయాచరిష్ణు నవ్విష్ణుఁగంటి. 79

వ. కనిజగత్త్రయంబై మిన్నుమోచియున్న యమ్మున్నీటిమీఁదఁ దేలియాడు ముద్దుగద్దరి బాలుండెవ్వఁడో యాశ్చర్యంబై యున్నది. కపటబాలుండై వర్తించునొక్క దివ్యపురుషుండు గాఁబోలు నితని చాదంబు గందమని డాయంబోయి సకలశూన్యంబైన చీకటిం[3]గలిసియున్న పెంజైటి నీటిమీఁద నొక్కరుండవు వెఱపులేక యున్నవాఁడవన్నా నీవెక్కడ పిన్నపాపఁడవు. నీవిధం బెఱిఁగించి నన్ను నూరడింపుము. చేరుగడలేక యున్నవాఁడ చంద్రశేఖరుండెచ్చట నున్నవాఁడు నీవెఱుంగుదువే యనిన నిందులో నున్నవాఁడు పోయి చూడుమని నోరుదెఱచిన నేను గిరిగుహాగర్భంబునుంబోని తదభ్యంతరంబు ప్రవేశించి యందు చంద్ర సూర్య గ్రహనక్షత్ర సరిత్సాగర పర్వత వనపవన దహన విలసితంబులును, బ్రహ్మాది దేవదానవమానవ ప్రభృతి జంతుకోటి సమర్థంబులును, మహోత్సవాడంబరాభిరామంబులునగు చదుర్దశభువనంబులు గానవచ్చిన విస్మయంబంది కామసంచారంబున సకలంబును గలయఁ గ్రుమ్మరియొక్కచోటఁ గైలాసవాసుండగు నిందుధరుని దర్శించి యారాధించి తత్ప్రసాదంబువడసి, యచటనుండక వెండియుఁ గొంత తడవునకుఁ ద[4]ద్వదన ద్వారంబున వెడలిచూచు నప్పుడప్పుండరీకాక్షుండు

1. మానసంబున సచ్చిదానంద్దమయుని. 2. వ్రా. 'ఈచరణములోకుసంధి'—అని యున్నది. 3. ఆ. పా. గవసి. 4. ప్రా. పా. తద్వనద్వారంబునమగుడివెడలి.

వైకుంఠ దివ్యభవనశేషపర్యంకంబున లక్ష్మీసమేతుండై దివ్యాంబరాభరణ గంధమాల్యాలంకృతుండును శంఖ చక్ర గదా పద్మ శోభితుండును మధుర మందస్మిత సుధాధారాభి[1]షిక్త భక్తలోచనుండును నగుచు నానందింపుచున్న లాగు కన్నులకు వెక్కసంబుగాఁ జూచి నలుదిక్కులు ప్రతీక్షించునప్పుడు నీవు గల్పించిన యీప్రపంచంబు గానవచ్చిన నచ్చెరువంది, యాపరమానంద స్వరూపంబునకు నభివందన సహస్రంబులు సమర్పించి, యుదంచితరోమాంచ కంచుకిత దేహుండనై యానందాశ్రు కణంబులు[2]రలంగరంబులు మోడ్చి.

క. ఓ దివ్యపుగుప యో కరు
[3]ణోదధి యో దేవ దేవ యోజనక, భవ
త్పాదారాధన యోగ్యుని
[4]గాదృష్టింపవె మహాత్మ కమల దళాక్షా. 81

చ. తనరు పురాణ సంహితల[5]తావలముం దగమెట్టి శాస్త్రపుం
బెనుదలుపుల్ వడిందెఱచి పెంపున నాగమసౌధ మెక్కియం
దనుపమ యోగపీఠమున నంచితలీల వెలుంగుచుండు ని
[6]న్ననుఘనయోగి పుంగవుల కంటె సుఖస్థితినిట్లు గాంచితిన్. 82

వ. అని నా నేర్చునట్లు వాక్పుష్పాంజలులు సమర్పించినం గనుంగొని హైకొని మందస్మితంబు నిగుడ మునీంద్రా చంద్రశేఖరుం జూచితివేయనిన విని యంజలి బంధంబుతో మహాపురుషా చంద్రశేఖరుండేల విశ్వప్రపంచం బంతయు ననంత విలాసంబుతోఁ జూచితి. దివ్య ప్రభావంబుచూడ నేనెంత వాఁడనని [7]నమస్కరించిన నీవు వీరశైవుండవు నాయంశ భేదంబగు శివుని యందభక్తి సలుపుమదిమదీయ హితప్రవర్తనంబని కరుణించె. నాటనుండియు మృత్యుంజయుని సేవింపుచుఁ దదీయ వరప్రసాద సామర్థ్యంబున మృత్యువు గెలిచినవాఁడఁ గావున లోకంబున నద్దేవ దేవుని మాయలు కొన్నికొన్ని యెఱుఁగుచు నిటువంటి మహత్వంబులు చూచుచు నిట్లున్నవాఁడ నిదినా చూచినయర్థంబు తన్మాయాప్రభావంబు విజ్ఞానహీనులకుఁ దెలియనరిది. తనయందు భక్తిసల్పిన మహాత్ములకు మాయావిధానంబుచూపి తుదింబరమ సాయుజ్యంబు గలుపుకొను నింక నొక్క యితిహాసంబు చెప్పెద. 83

•• పుండరీకుని కథ. ••

క. వినుమధురా పురవరమున
ఘనుఁడుమహా భాగవతుఁడు గలఁడతఁడు జగ

1. ఆ. పా. భిషేకలోచనుండును. 2. మూల. పా. 'ఉరుకక' 3. ణానిధి.
4. ఆ. పా. గా సృష్టింపదె. 5. "సంహ్రుతలతాపరమున్." 6. న్ననఘునియోగి.
7. ఆ. పా. అనిన మన్నించి నీవు.

ద్వినుతుండు పుండరీకుం
డనువిప్రుఁడు సహజసాత్వికాచారుఁడిలన్. 84

క. సావిత్రియతని యంగన
సావిత్రికి సాటివచ్చు సాధ్వీతిలకం
బావెలఁది తోడ నాతఁడు
శ్రీవిలసితుఁడైన హరిచరిత్రము నొందెన్. 85

సీ. శాంతిసద్వృత్తులు సతతుగా నవరించుఁ
గారుణ్యసౌజన్య కలితుఁ డగుచుఁ
గర్మధర్మంబులఁ గనగాఁగ నలగించు
నన్వయాచార నయజ్ఞుఁడగుచు
సత్యశీలంబులు సమముగా నవరించు
మితభాషణార్జవ మిళితుఁడగుచు
శ్రుతి[1]పరిబోధముల్ ప్రతిగాఁగ నొనరించుఁ
బ్రతిభావిరక్తి సంపన్నుఁడగుచు
తే. ఫాలమున గోపిచందన ప్రభయు నగుత
జలరుహాక్షుంపు [3]మాలికల్ శ్రవణవీధిఁ
దులసిమంజరియును బలుకుల రమేశు
కీర్తనము నొప్ప వెలయునా కీర్తిధనుఁడు. 86

సీ. ప్రాణంబుకంటెను బరమ హితంబుగాఁ
బాటించు నేప్రొద్దు పద్మనాభు
నాత్మనేపథ్య క్రియలకంటె సంప్రీతి
విష్ణుపూజలుగడు విస్తరించు
నిల్లాలికంటెను నుల్లంబునకుఁ గడు
నింపుగా హరిభక్తి నిరవుకొల్పు
లలితపుత్రోపలాలనకంటె వైష్ణవ
ధర్మమార్గ సపర్య కూర్మినడుపు
తే. వేదపఠనంబుకంటెఁ బవిత్రమనుచు
హరికథా తత్పరుండగు యజ్ఞఫలము
కంటెఫలమని తద్వ్రత క్రమము నలుపుఁ
బుండరీకుండు సుజనసంపూజ్యుఁడగుచు. 87

క. ధీమహితుఁ డతులసాల
గ్రామ శిలాతలమునందుఁ గమలాక్షురమా

1. మూ. ఫా. "మగుచు." 2. శ్రుతివాక్యప్రబోధముల్. 3. జలరుహాక్షుప్రజంబులు.

రాముని నర్చించుమన
స్తామరసమునందుఁ బోలెఁ - దద్దయుభక్తిన్. 88

పుండరీకునియొద్దకు నారదమునివచ్చి విష్ణుభక్తి ప్రభావము చెప్పుట.

వ. ఇవ్విధంబున ననుకూలదాంపత్య సౌభాగ్యంబును సాధుబుధ సేవ్యమాన నిజకులోచిత వ్యాపారంబును విష్ణుభక్తియు నంతకుం గొనసాగ నాగమజ్ఞుం డగు నమ్మహానుభావుండొక్కనాఁడు స్వసమారోపిత తులసీకాననంబున యమునా తీరంబునఁ బిప్పల తరుచ్ఛాయ శీతల ప్రదేశంబున నిష్పారుష్యుండై సాలగ్రామ శిలార్చనం బొనర్చువేళ యదృచ్ఛాగతుండైన నారదునింబూజింప నతం డతని శుద్ధసాత్విక ధర్మంబునకు సంతోషించి యిట్లనియె. 89

ఉ. ఆరయవేషభాషలు క్రియల్ మనమున్ సరియైన సద్గుణో
దారుఁడు గల్గుటచ్చెరువు - ధారుణి నేఁడిదె చూడఁగంటిఁ బెం
పారఁగ వేషభాషలు క్రియల్ మనమున్ సరియైన సద్గుణో
దారుని వైష్ణవోత్తముని - ధన్యుని నిన్ను మహీసురాగ్రణీ. 90

క. ఇదిగో గృహస్థధర్మం
బిదిగో యాచారపరత - యిదిగో ముక్తి
ప్రదమార్గము సాలగ్రా
మ దృషత్పూజనముఁ జూచి - మదహర్షించెన్. 91

క. నీవును సాలగ్రామ శి
లావాసుండైనయట్టి - లక్ష్మీవిభుఁడున్
భావింపనొక్క రూపం
బై వెలిఁగెద రేమిచెప్ప - ననఘచరిత్రా. 92

మ. పట్టంబట్టఁగఁ బోరు నింద్రియములన్ - బంధించి వాంఛల్గదున్
బుట్టింపం బలువైన తద్విషయముల్ - పోఁద్రోలి దుర్మోహపుం
బట్టై యుత్కట దుఃఖదుర్గతులకుం - బ్రాపైన సంసారముం
గట్టల్కం దిగఁద్రోయ కేల కలుగుం - గంజాక్షుపూజారతుల్. 93

చ. సతులు సుతుల్ సుసహోదరులు - సంగడికాండ్రు పదార్థజాలముల్
ప్రతిపద దుఃఖమూలములు - పాపసమాచరణాను బంధముల్
మతిఁ బరికింపనంచు గుణ - మాన్యులు తత్పరిముక్తమోహులై
యతుల సుఖైక హేతువగు - నచ్యుతభక్తి భజింతురెంతయున్. 94

క. వినుదీర్ఘ స్వప్నము జగ
మనియుఁ బ్రపంచంబు మిథ్య - యనియును సంసా

రనిబద్ధ బుద్ధిమరలిచి
నినుఁబోటులు విష్ణుభక్తి నిలువు దురాత్మన్. 95

ఉ. అంతయు విష్ణుమాయ జగదీశమాత్మ నెఱుంగ మసత్యలోక వి
భ్రాంతము లోకవర్తనము బ్రహ్మవిదుల్ గనుఁగొంద్రు దీని[1]న
త్యంత వివేకదృష్టిఁగని తద్విరతిన్నిరతంబు చిత్సుఖా
నంతవిలాససిద్ధి కొఱకచ్యుతు భక్తిభజింతు రెంతయున్. 96

మ. పరిబోధాంజనయుక్త చిత్తనయన ప్రవ్యక్త దుష్ప్రోల్లస
ద్గురుమాయావృత చిన్నిధానమని యా [2]దుర్యల్ విష్ణునింగాంచి దు
స్తరసంసార విమోహదైన్యమెడ[3]లన్ సంతోష సంప్రాప్తిచేఁ
బరమ బ్రహ్మపద ప్రకృష్ట సుఖసంపత్ప్రౌఢులై చుండ్రిలన్. 97

క. హరిమంత్ర జపని రూఢియు
హరిపూజా సంభ్రమంబు హరికీర్తనమున్
బరమమగు సాధనము దు
స్తరభవవిదళన మొనర్చి తత్పదమొసఁగన్. 98

క. కావున నీవును నుత్తము
ధీవిభముగల్గి సన్మతిన్ సాలగ్రా
మావాసుం గేశవుఁదుల
సీవనమంజరులఁ బూజ సేయుము భక్తిన్. 99

తులసీప్రభావము.

ఆ. కల్పక ప్రసూన కనకారవిందమా
ణిక్యపూజనముల నెలవుకొనదు
జలజనాభు చిత్త జలజంబు తులసీద
ళార్చనమునఁబోలె ననఘచరిత. 100

క. తులసీకానన మెచ్చట
విలసిల్లుచు నుండునచట విష్ణుఁడునుండున్
జలజాక్షుఁడున్న చోటను
జలజాసన ముఖ్యదివిజ సంఘమునుండున్. 101

ఆ. భక్తజనులయందుఁ బావనతులసీవ
హీజవాటియందు నెట్టివేడ్క
[4](నుండునట్టివేడ్క) నుండఁడుహరిలక్ష్మి
యందుఁ బరమపదము నందు వినుము. 102

1. తీన. 2. పా. తాం, యార్యుల్. 3. మెడలెం. 4. ఈ భాగము మూలములో లేదు.

సీ. శ్రీతులసీమహీజాతాభిషేకంబు
పట్టాభిషేక సంకల్పప్రదంబు
శ్రీతులసీతీర్థ సిద్ధరసార్ద్రత్వ
మవబృథస్నాన పుణ్యావహంబు
శ్రీతులసీమూల మృత్తికాతిలకంబు
యమనిశాచర పరిహారరక్ష
శ్రీతులసీనమస్క్రియ బ్రహ్మహత్యాది
పాపతిరస్క్రియా ప్రౌఢముద్ర
తే. తాపహరణంబు తులసీ ప్రదక్షిణంబు
శ్రీకరము నిత్యతులసీ విలోకనంబు
వేదశాస్త్రోపనిషదర్థ విశ్రుతంబు
దీనిఫలమేమిచెప్ప భూదేవవర్య. 103

సీ. తులసీమహీజంబు మొలువఁబెట్టినఁ గల్గు
ససముద్రభూదాన సమఫలంబు
తులసీవనము దండనలకు శ్రాద్ధంబు గ
యాశ్రాద్ధఫలదమై యతిశయిల్లు
తులసీవనంబునందు జపించుమంత్రము
కోటికోటిగుణమై స్వసంకల్పమొసఁగు
తులసీవిలాసంబుగల యిల్లు కలనైన
దర్శింపభయమందు దండధరుఁడు
తే. తులసిదురితాహితాభేద్య దుర్గభూమి
తులసిసజ్జన గృహవాటి కలకుఁదొడవు
తులసినిత్య మహోత్సవంబులకు నెలవు
తులసికైవల్య లక్ష్మికిఁ దోడునీడ. 104

క. గంగాకళింద జాదిత
రంగిణులందీర్థమాడఁ బ్రాపించుఫలం
బంగీకృతమగు శ్రీతుల
సింగరములనంటినపుడ చింతింపుతగన్. 105

తే. తులసి యొన్నులనెత్తావితులకురాదు
కల్పవృక్షప్రసూన సుగంధభరము
తల్లసన్మంజరీపూజఁ దన్నుఁదనుపు
వారికచ్యుతుఁడచ్యుతావాస మొసఁగు. 106

వ. అని తులసీవనలక్ష్మిం బ్రశంసించి. 107

చ. ప్రతిదివసోపవాసములఁ బాయక కృస్సియు సత్యదానస
ద్వ్రతములఁబెద్దలయ్యును దురంతతపోనలకీలఁ గ్రాఁగియుఁగ్
గ్రతునియమార్తిఁ గ్రాఁగియును గానరు వైష్ణవ దివ్యలోకమ
చ్యుతపదపంకజార్చకుల చొప్పున విప్రకులైకభూషణా. 108

మ. ప్రతిమాస్థండిల హృజ్జలాగ్ని రవిబింబస్థాన లక్ష్మ్యప్రకా
శితునారాయణుఁ గొంచబుత్తమగుణుల్ సేవింతురార్యుల్ ఘనుల్
ప్రతిభంగొందబు నీవునుంబలెనె సాలగ్రామ సాక్షాత్ప్రకా
శితులక్ష్మీవిభుఁ బూజసేతురమృత శ్రీవాస సౌఖ్యార్థులై. 109

సాలగ్రామ పూజామాహాత్మ్యము.

క. ఏమిటియందును సాల
గ్రామస్థలియందుఁబోలె కమలాక్షుఁడు తే
జోమహితుఁడగుచుఁ బూజితుఁ
డై మోక్ష శ్రీనొసం[1]గఁడంద్రు మహాత్ముల్. 110

శా. ఉగ్రైనస్తిమిరార్క మండలము నిత్యోత్కృష్ట దుఃఖాట[2]వీ
వ్యగ్రోదగ్రమహాదవాగ్ని కుమతవ్యాపారదుర్మోహస
ద్వ్యగ్రస్తాభయదానమానిత కళాపక్షీంద్ర రూపంబు సా
లగ్రామాచ్యుత పూజనంబు సుజనాలంకారచూడామణీ. 111

ఆ. కీర్తనీయవజ్రకీటవినిర్మిత
చారుచక్రసుప్రసన్నమైన
విష్ణుదివ్యమూర్తి వెలయు సాలగ్రామ
మల్పమతుల కబ్బదర్చలోసఁగ. 112

క. వినుసాలగ్రామ శిలా
ర్చన మెవ్వఁడొనర్చువాని సకల పితృగణం
బును పితృలోకంబునకును
జనుయమపురినుండి యైన సత్యం బనఘా. 118

ఆ. అనఘకారియైన నఘవంతుఁడైన మో
హాంధకార మగ్నుఁడైన భక్తిఁ
బూనివేడ్క నెవ్వఁడేని సాలగ్రామ
పూజసేయునతఁడు పూజ్యతముఁడు. 114

1. మూ. పా॰ "నొసంగు (ద) నంద్రు. 2. దుఃఖాదిది.

సీ. దివ్యసాల గ్రామ దేవ మందిరము ప్ర
త్యక్షవైకుంఠ పుణ్యాలయంబు
దివ్యసాలగ్రామ దేవోత్సవక్రీడ
త్రిభువన సామ్రాజ్య దివ్యపదవి
దివ్యసాల గ్రామ దేవ పూజానిష్ఠ
బ్రహ్మనిర్వాణ సంపన్నలీల
దివ్యసాల గ్రామ దేవ తీర్థ ప్రసా
దములు త్రిలోకసేవ్యములు దలఁప
ఆ. నిదియెఱింగినువ్వొ యెపుడు సాలగ్రామ
పూజసేయుదురు ప్రబుద్ధమతులు
మ్లేచ్ఛశూద్రకుమతతుచ్ఛ చండాల నా
స్తికులు దక్క వినుము ధీరహృదయ. 115

హరినామకీర్తన ప్రభావము.

క. హరినామ కీర్తనమునకు
నరయఁగ నేకులజులయిన నర్హులుపూజా
పరతగల పుణ్యసంపద
హరియొసఁగుం గీర్తనీయుఁడై వారలకున్. 116
క. విస్తారంబగు దుష్కృత
దుస్తర సంసార వార్ధితుదిఁ గోరరమే
శస్తుతి నాకారూఢుల
కస్తోకాత్ములకుఁగాక యన్యులకగునే. 117
తే. పుత్రమిత్ర కళత్రార్థ భూరివిషయ
సంకులంబగు సంసార చక్రమెల్ల
విష్ణుమాయా మహామోహ విభ్రమంబు
దీని మదివాడికొల్పు భూదేవ వర్య. 118
తే. విష్ణుమాయా పరాధీన విధివిధేయ
ధర్మమల్పార్థభోగ ప్రదంబు వినుము
సర్వధర్మంబులును మాని చక్రధరుని
నాశ్రయింపుము చిత్సుఖావాప్తికొఱకు. 119

పుండరీకుఁడు మిక్కిలిభక్తిచేత హరిపూజచేయుట.

వ. అని యనేక పరమరహస్యంబు లెఱింగించి భవనందనుం డందేనియుం జనియె. తదనంతరంబ యమ్మహీదేవోత్తముండు చిత్తంబున [1]లోకోత్త

1. మూ. పా. చిత్తంబు లోకోత్తరుండ .

రుండగు నారదముని సత్తముని సత్యవచనంబులు వేదప్రమాణంబులని యాదరించి తొల్లింటికంటెను బ్రతిదిన ప్రవర్ధమాన నుపక్తభక్తి తాత్పర్యంబులుగలిగి సాలగ్రామ విష్ణుపూజా మహోత్సవంబు లొనర్చుచుఁ దదీయ మంత్ర పరతంత్రుండును దదీయ నామస్మరణ పరాయణుండునునై యను కూల కులపాలికా సహాయుండగుచు నిజ కులోచిత ధర్మ కర్మంబులు కృష్ణార్పణ బుద్ధిందగిన కొలందివిడువక నడుపుచుం, దనలోన. 120

ఉ. నారద సంయమీశ్వరుఁడు నా కుపదేశమొసఁగ్చె విష్ణు పూ
జారతియుం దదీయగుణ సంస్మరణ స్తవమంత్ర తంత్ర వి
ద్యారమణీయ భంగియుఁ గృతార్థుఁడ నైతి మదీయజన్మ సం
స్కార విశేషసంపద జగంబుల వర్ణన కెక్కెఁ బో[1]యిఁకన్. 121

వ. అని హర్షించి వెండియు. 122

క. ఇస్సీ సంసారంబిది
లెస్సదనంబేమియును [2]ఫలింపక మిగులన్
నిస్సారంబై తోఁచు మ
న స్సంకల్పములు వెక్కు నాశముఁ బొందెన్. 123

—●●◆ ఇదియంతయు విష్ణుమాయయను నర్థమంచు పుండరీకుఁడు సందేహపడుట. ◆●●—

ఉ. [3]ఆమునినైతమున్ భువన మంతయు విష్ణునిదివ్యమోహ మా
యామయమంచుఁ బల్కెనిది యట్లనయయ్యెడుఁ జూడఁ జూడ మి
థ్యామమతన్ నిజంబుగఁ బదార్థవిసర్జన మాచరింపఁగా
లేమినయాతలంపును జలించెడుగాని యొకించుకాత్మలోన్. 124

వ. అని కొండొక పరమార్థంబు విచారించి విష్ణుమాయా విభ్రమంబున నవ్విచారంబు గొనసాగింపలేక ప్రపంచం బాలోకించి. 125

మ. ఆలుం బిడ్డలు నిండ్లు నర్థమును నత్యుద్యమన్వయాచారముల్
నాళీకాసన సృష్టికర్తృకములై నానావిధార్థంబులై
యాలీలం బహుకాలముల్ గడవఁగానీ సర్వమున్ విష్ణు మా
యాలాస్యంబిది యాటకున్ మదికి దృష్టాంతంబు నాకెట్లగున్. 126

మ. ఈ భూమండలి యాసముద్రవలయం బీవాయు వీపావకం
బీభాస్వత్తు హిమాంశుదీప్తి కలుగనీ జంతు సంపత్తి మా
యా భిన్నమ్మనలటంట యెట్టు లవి దృష్టాంతంబులై యుండఁగా
నేభావంబున నిశ్చయింతు నొకటే నీతథ్య మిథ్యా ద్వయిన్. 127

1. బాయకన్. 2. అ. పా. 'బేమియనుచు'. 3. ఆమునిశేతమున్.

క. నాయాత్మకు దృష్టాంతం
బై యుండిన దాఁక మాయ యనలే నెపుడుం
దోయజభవ కల్పితమగు
నీయఖిలము మాటలింక నేటికి వేయుఁ. 128

క. ఈయాలును నీబిడ్డలు
నీయిండ్లును నీ కులంబు నిల్లుండఁగ వే
ఱేయొక సంసారస్థితి
నైయుండిన మాయ[1]యనఁగ నగునఖిలంబుఁ. 129

వ. అని యివ్విధంబున సందేహ దోలాందోళాయమాన మానసుండగుచుఁ గ్రమ్మఱఁ బరబ్రహ్మవేదియగు నారదమహామునీంద్రుని సత్యోపదేశంబువలన సకలంబును విష్ణుమాయా విలసనంబని విని తెఱంగు నిశ్చ[2]యంబుగా నెఱుంగంగోరి యప్పటప్పటికి స్వామీ నే నీభక్తుండ నీవు భక్తవత్సలుండవు గావున నించుక నీమాయ చూపవలయునని విష్ణునిం బ్రార్థించుచున్న వాఁడై యొక్కనాఁడు పితృదివసంబున బ్రాహ్మణుల నిమంత్రణంబు చేసి, ధర్మపత్ని యగు సావిత్రి కృతస్నానయై పాకయత్నంబు నడుపుచుండఁ దదీయోచిత ద్రవ్యంబులు సంపాదించి మధ్యాహ్న సమయంబున నదికింబోయి. 130

ఆ. తీర్థమాడివిధులు తీర్చి సూర్యోపాస్తిఁ
జేసి విమల పులిన సీమయందుఁ
బంకజాసనమునఁ బదిలుఁడై విష్ణు నా
మత్రయము జపించి మఱియు నతఁడు. 131

క. కుందేందు ధవళమూర్తిని
మందస్మిత మధురవదన మండలు మాయా
సుందరు విష్ణునిఁ దనమది
సందేహనివృత్తికొఱకు స్మరియించెదుదిన్. 132

పుండరీకుని విష్ణుమాయ యావహించుట.

తే. అన్నువట్టినగతి నిద్ర యాలమినట్లు
మూర్ఛవచ్చిన పగిదికన్నో[3]గిచి చిత్త
మింద్రియవ్యాప్తి నుడిగిత దేకనిష్ఠ
నలరఁగలవ్రాలె హరిమాయ యాశ్రయించె 133

---

1. ఆ. పా. యైయుండిన నపుడు మాయయగు నఖిలంబున్. 2. ఆ. పా. దృష్టాంతంబుగా నెఱుంగంగోరి. 3. కన్నొద్దు.

తే. పాణి[1]జపియింపఁ దొల్లింటి § భవము తెలివిఁ
గప్పి విపరీత కృత్యమై § త్రిప్పుచున్న
వినుత చారిత్రమైన యా § విష్ణుమాయ
విప్రసహజ ప్రకృతియును § వేఱుచేసె. 134

వ. ఇట్లు పుండరీకుండును విగత విజ్ఞానుండై యుండు నవసరంబున. 135

ఆతనియొద్ద కొక బోయపడుచు వచ్చుట.

క. [2]మారునిమోహన తీవ్ర వి
కారము స్త్రీరూపమొంది § కదిసినక్రియ సొం
పారియొక బోయగుబ్బెత
చేరువఁ గనుపట్టె విప్రచిత్తం బలరన్. 136

సీ. పచ్చగాజులయొప్పు § పచరించు చేతుల
సంకుటుంగరముల § చాయ లెసఁగ
నిగనిగల్ దొలకాడు § బిగువు చన్నులమీఁదఁ
గురువింద పూ[3]సల § సరము దనర
ధవళతాళపలాశ § తాటంక రుచి మించు
చెక్కులఁ జిఱునవ్వు § జీరువాఱఁ
గొప్పున కందని § కురులు నించుక దోఁచు
నుదుటి జేవురు బొట్టు § కుదురు మెఱయ

తే. సన్నవలిపెంపు [4]టొల్లియ § సగముగట్టి
సగము ముసుకిడి యొయ్యార § ముగ మెఱుంగు
కంచుమెట్టెలు మొరయంగఁ గడకవచ్చు
నవ్విలాసినిఁ దగ మెచ్చె § నవనిసురుఁడు. 137

క. ఆలీలావతి విభ్రమ
హేలాయౌవన గుణముల § నెవ్వని తలఁపం
దోళింపదు ధైర్యచ్యుతి
మైలోకమునందు నంగ § జార్తం బగుచున్. 138

తే. అట్లు ముందటఁ బ్రత్యక్ష § మైన మదన
దేవతయుఁ బోలె నొప్పునా § తీఁగఁబోఁడి

1. వాణి జనియింప. 2. ఈ పద్యము ప్రా. ప్రతిలోలేదు. ఆ. ప. ప్రతినుండి గ్రహింపఁబడినది. 3. ప్రా. పా. కురువిందపూగుబ్బ. 4. నునుకాటి.

మేలిమొల జవ్వనమునకు లోలుఁడయ్యె
విగత లజ్జాభిమానుఁడై విప్రకులుఁడు. 139

క. కులశీలంబులు దలఁచు నె
వలరాయని బారిఁబడిన వాఁడు నవీనో
జ్జ్వల యౌవన సంపద గల
కలికిమెఱుఁగువాలు[1] గంటి కడుచే పడినన్. 140

తే. దాని మదనోన్ముఖత్వంబు దాని సొబగు
దాని క్రొమ్మేని జిగి బిగి దాని వయసు
మదనసామ్రాజ్య కళలట్లు మారుమలయఁ
జూచి పులకించె మమతలఁ జొక్కు దేలి. 141

క. అది మాయావిలసనమని
మదిఁగానకపోయెఁ గాక మతిపాలుఁడు దా
నిదిబోయత యనవలదే
[2]తుది భ్రమసిన తలఁపు తెలివి దూఁకొనఁ దెందున్. 142

ఆ బోయదానిని పుండరీకుండు మోహించుట.

వ. వెండియు. 143

ఉ. ఇయ్యెలనాఁగ యొంటిఁబడి యిక్కడికిం జనుదెంచె లీలనిం
కెయ్యెడకైనఁ బోఁగలదొ యేమయినం బనిగల్గి యిచ్చటం
దియ్యముచూపనుండునొ మఱిదింబరికింపఁ గనంచు నాత్మలో
నయ్యవనీసురుండు వెడ యాసల వెల్లునఁ దల్లడిల్లఁగన్. 144

ఉ. ఆచపలాక్షియుం గదిసి యాధరణీ సురపంచబాణునిన్
జూచె మనోనురాగమతి సొంపునఁ బొంపిరివోవు చూపునం
జూచిన చూపులోన మదిజొక్కె వికారము మైచెమర్పఁబెం
[3]ల్లేచిన సౌఖ్యముల్ వెలప లించెను గోర్కికిఁ దావలంబులై. 145

క. జవ్వనపు సిరులుమదమునఁ
గ్రొవ్వారుచు నున్న మెఱుఁగు గుబ్బలతోడన్,
నివ్వటిలుచున్న కన్నియ
యెవ్వనిఁబైకొనదురతికి నేకతమైనన్. 146

క. ఎలప్రాయము లావణ్యము
గలిగిన స్త్రీపురుషు లొంటిఁగదిసిన వేళన్

---

1. ఆ. పా. "మెరుగు గుబ్బెలాడి కడకాపట్టన్. 2. ఆ. పా. మది...మాకొనదెం దున్. 3. ఆ. పా. పెల్లెచనసంఖ్యముల్. వలపులింపుల.

[1]వలరాయఁడేల మాను ను
కులశీలములడఁచిజోడు । గూర్పకయుండున్. 147

వ. ఇవ్విధంబున నొకరియొకరి తలంపులం గామకళాశంకలంకురింప తమకంబు నం బట్టుకొన గమకింపుచుండిరప్పు డప్పువ్వుబోణి యతని తలంపు దెలిసి కొనంజూచి కొండొక ధైర్యంబు పట్టుకొని కట్టెదుర బిగువుచనుకట్టు పయ్యెద దిగ జార్పుచు నదీ జలంబులఁ గాళ్లు చేతులు గడిగికొని యొక్క కెందమ్మి పూవుఁ దిగిచి పుప్పొడి చిందయుందంద కరారవిందంబునఁ ద్రిప్పుచుఁ జక్ర వాకమిథుననిధువన క్రీడ లాలోకింపుచు, ముసిముసినవ్వులు నవ్వుచు వా[3]ట కూటమికాశలు గలుగ మగుడిచూచుచున్నఁ దదభిప్రాయంబు దెలిసి మనసి జుండు ప్రేరేపఁ బుండరీకుండు లేచి యాచమనవ్యాజంబున దాని డాయం బోయి. 148

బోయదానికిఁ బుండరీకునికి సంభాషణంబు జరుగుట.

ఉ. ఎవ్వరిదాన వెక్కడికి । నేగెద వాయితపాటు తోడ నీ
వివ్వల నొంటిపాటున యథేచ్ఛ రతీశవిహారరేఖఁ దో
డెవ్వరు లేక, ప్రాణవిభుఁ । డెవ్వఁడు నీకుల మెద్ది చెప్పవే
జవ్వని నిన్నుఁజూచి మదిఁ । జాలక వేడుక తొంగలించెడున్. 149

తే. అనిన నించుక తలవంచి । యాననమున
నలఁతినవ్వును లజ్జయు । నంకురింప
చేతికందిన ఫలమట్లు । చేరఁబడుచు
నెలుఁగురాల్పడనొయ్యన । నిట్టులనియె. 150

బోయది తన వృత్తాంతముచెప్పి పుండరీకుని వరించుట.

ఆ. బోయవారిపడుచే । భూసురోత్తమ యేను
పెండ్లి లేదు నాకుఁ । బెద్దవారు
గలరు ముసలివారు । తలి దండ్రు లింతియు
యల్లయేటిదాపు । పల్లెదాన. 151

క. మావారిఁ దల్లిదండ్రులఁ
బ్రోవను, ననుగారవింపఁ । బొందై నపతిన్
భావించి గానిపెండిలి
గావించిన నొల్లననుచుఁ । గడుఁజింతింతున్. 152

ఆ. దానఁజేసి మగఁడు । తన కెవ్వఁడును లేఁడు
తగినమగఁడు లేమి । మగనియాశ

1. ఆ. పా॰ వలరాజువారి విడుచునే. 2. దమక తమక తమకంబున. 3. మాటవాటి.

విడిచియున్న దాన, * విప్రపుంగవ నీవు
మగఁడ వైతివేని * మననువచ్చు. 153

క. ఆరూఢ యౌవనంబిది
భారముగా దిన్నినాళ్లు * పరికింపమహా
భారమయి తోఁచెనిప్పుడు
నీరూప శ్రీలమీఁద * నిగుడుచు నుండన్. 154

క. ఎన్నఁడు నెవ్వరిమీఁదను
గన్నాసక యున్నచోటఁ * గాముఁడు నీపైఁ
గన్నానఁ జేసె, నిఁక నె
ట్లున్నదొ నాభాగ్యరేఖ * యుత్తమ చరితా. 155

పుండరీకుండు బోయదాని కులహీనతకుఁ జింతించియు మదనాతురుఁడౌట.

వ. అని పొలివ్రానినిండు జవ్వనంబునఁ గన్నులపండువై యున్న యక్కన్నియ నోరూరం జేయుచున్న చందంబు డెందంబున జంద్రికారసపూరంబు చంద్రోపలంబునుంబోలె ననురాగ రసమయంబు గావింపుచుండఁ బుండరీకుం డంతర్గతంబున. 156

ఉ. అక్కట యింతచక్కని మృ*గాక్షిని బోయతనెట్లు చేసెన
వ్వక్కరు దైవ ముర్విఁ గడు * విభ్రమసంపద మీఱువారి యం
దొక్కకళంక మేమయిన * నుంచుఁ గృపావిపరీతబుద్ధియై
చక్కెర విల్తునంతటి ర*సజ్ఞుని సంగవిహీనుఁ జేయుఁడే. 157

ఉ. వాసన లేని మేలిమి సు*వర్ణము దీని మనోహరత్వము
బ్జాసనుఁడన్వవాయ మొక*టల్పతరంబుగ సంఘటించుటం
జేసి విలాస విభ్రమ వి*శేషము మాన్పెడు నాకళంకమున్
భాసుర చంద్ర బింబమునఁ * బ్రన్నని వెన్నెల కందునుంబలెన్. 158

తే. ఇంక నిన్ని విచారంబు * లేడకెక్కుఁ
గంతుఁడ సిథార ధైర్యంబుఁ * గత్తిరించె
నాదరువు లేక చిత్తమీ*య బలమీఁద
వ్రాలియున్నది మగుడఁ ద్రి*ప్పంగ రాక. 159

క. ఈచేరిక మాటలలో
నేచంచల నేత్రిఁ బ్రేమ * నెలయించితదీ
యోచితరతి తంత్రసుఖ
ప్రాచుర్యం బనుభవింతు * బ్రహ్మము ముట్టన్. 160

వ. అని కామోద్రేక జనితోన్మాదంబున లజ్జాభిమానంబులు విడిచి దానితో నిట్లనియె. 161

క. ఓ వెలఁది నీ చరిత్రము
నీవచన విశేషగతియు § నీ వినయము నీ
లావణ్య భావములు మ
ద్భావము మదనానురాగ § పదముం జేసెన్. 162

ఉ. నీ యిటువంటి సద్గుణము § నీ నవయౌవనరూప లక్షణ
శ్రీయుతిఁ జెందగల్గిన విశేష పురాకృత పుణ్యమేమనన్
దోయజనేత్రి నాదగు మనోరథముల్ ఫలియించు నీవు నా
ప్రేయసివైతివేని విధిపెంపున యోయత్నమైన నేమగున్. 163

క. నీ మనసులోనఁ బెనఁగొద
నీమాటల కడుగుదాట § నిక్కము వినుమా
కాముఁడు రతియును సాక్షులు
గా మృష గాదబలనమ్మి § కైకొను నన్నున్. 164

చ. బిగిచనుదోయి క్రొమ్మెనల § పెక్కువయక్కునఁ జక్కనొత్తి యొ
ప్పుగ నధరామృతం బొసఁగి § పొందికమాటల గారవింపుచున్,
దగనుదభీష్ట పుష్పశర § తంత్రములన్ సుఖకేళిఁ దేల్పవే
మగువతదీయ తీరనవ◆మంజుల వంజులకుంజవాటికన్. 165

క. అని యనుమానింపక మన
మున మనసిజ బాణపాత § మునఁ బొడమెడు వే
దనఁబడఁ జాలక బాలికఁ
గనుఁగొని తమకించిపట్టి § కాఁగిటఁ జేర్చెన్. 166

క. మును వనితజవ్వనపుసిరిఁ
గనివంశము మఱచెఁ బిదపఁ § గాఁగిటిలోనం
దనుమఱచె బ్రాహ్మణుఁడు రతి
నొనరిననిఁక నేమిమఱచునో సుఖకేళిన్. 167

క. అదెరాయిది సాధారణ
మదిరామాత్రమున మఱచు § మనుజుఁడు మదవ
న్మదిరాక్షీలీలోత్కట
మదిరారసలహరిచేత § మఱువఁడె యెందున్. 168

వ. ఇట్లు మోహపరవశత్వంబున బ్రహ్మకుల సంభవుండు సంభ్రమించి పరిరంభించి పులక కలికా కలితగాత్రాభోగుండును. బద్ధానురాగుండునునై కాఁగిలి వదలక మదవతినతిప్రయత్నంబున నొయ్యన నెయ్యంబుగాఁ దార్చికొని తన్నదీసవిధపుష్పితలతానికుంజ క్రోడంబున నిధువనక్రీడ లాచరించి తదనంతరంబ జోడువాయక వేడుకజొత్తిల్లు చిత్తంబులతోడఁ దద్గృహంబునకేగి,

దాని జననీజనకులగు నత్త మామలకు నల్లుండనని తనపేరు చెప్పి నమస్క రించి, వారి దీవెనలు వడసి యింటికి సర్వంబును దానయై భోయకాపురంబు సేయుచుండె, నివ్విధంబునఁ గొంతకాలంబున నప్పువ్వుఁబోఁణి జవ్వనం బనుభ వించి యొక్క కొడుకు నొక్క కూతురం గనియెనంత. 169

క. ఆయాలును నాబిడ్డలు
నాయిండ్లును నాకులంబు నా బ్రతుకును వే
తేయొక సంసారస్థితి
నైయుండెం గోరినట్లు యావిప్రునకున్. 170

—•••◆ పుండరీకుఁడు మాయాసంసారము సేయుట ◆••—

క. ఈ రీతిన్మాయాసం
సార వృథాభ్రాంతిఁ బొరలె సదసద్విద్యా
ప్రారంభమడిగి విప్రుఁడ
వారణ నత్యల్ప భోగవాంఛాసక్తిన్. 171

తే. అల్ప సంసారవిషయ సుఖానుభోగ
మభిలషింపుదు రధములిట్లు ఘనుగతికిఁ
దద్విరక్తి ప్రబోధ సుధాస్వరూప
చిదమలానంద మనుభవింపుదురు ఘనులు. 172

క. దుర్విషయ కలుష వార్ధ్యం
తర్వర్తులు గనరు మోక్షధామము విద్యా
పర్వతశిఖర స్థితులగు
నిర్వాహక మతులుగాని నిశ్చయదృష్టిన్. 173

వ. అంతఁ దత్కాలంబున నతండున్న దేశంబున. 174

సీ. పగలార్ద్రిపూనె ప్రాక్పశ్చిమంబులగురు
కావ్యులు సమస్తకమున నుండ్రి
ధూమకేతువు దోఁచెఁ దూర్పుదిక్కున బుధ
శుక్రమధ్యస్థుఁడై సూర్యుఁడుండె
గ్రహరాజ భార్గవాగ్రగుఁడయ్యెఁ గుజుఁడు మీ
నమున వర్తించెశనైశ్చరుండు
దితిసుతాహితమంత్రి యతిచారగతుఁ డయ్యె
శశిరక్త పరివేష సహితుఁడయ్యె

తే. చంద్రికాచ్ఛాయ విద్యుత్తు సంభ్రమించె
ప్రాతరారంభములఁ దుషారములు చిలికె

రాత్రిగగనంబు నక్షత్ర § రమ్యమయ్యె
విను మనావృష్టి దోషకమా విర్భవింప. 175

సీ. హరునిచిచ్చుఆ కంటికిమురువున నిప్పులు
గురిసెఁ జండకరుండు § గోచరముఁగ
నాడాడనుగ్రద § వాగ్ని శిఖాభీల
మై నీఱుచేసె వకనాంతరములు
గండభేరుండాది § చండమృగంబులు
గ్రామోపకంఠముల్ § గదలవయ్యె
పటుతరసంతాప § భారకారణములై
వ్యాధులు జీవుల § నలఁతముంచెఁ

తే. గల్లరాజులు దెగిరి నిష్కారణంబు
దండుగలువ్యాట్టి ప్రజనాత్మ § ధరణివిభుఁడు
బందిపట్టులు తలఁచయ్యెఁ § బాపకారి
విధికృతంబయియయ్యె నాకవృష్టికతన. 176

ఆ. ఏఱులింకెఁ గొలఁకు § లింకె నొడ్డనబావు
లింకెనూతులింకె § నింక కున్నె
యయ్యవగ్రహోద § యమునసం భోరాశి
నైన నింకుననిన § నబ్జగర్భ! 177

సీ. కడువాడి కొనమాడి § నుడిసచ్చి వేరెండి
వరులు పెంధూళియై § ధరణిఁ గలిసె
యావనాళాది సస్యము లెల్ల భూమిని
పదనులేకయె విత్తు § బడకయుండె
పుష్పఫలాభి సంపూర్తి శూన్యతనెల్ల
తరువులు నీరింక § బిరుదుబ్రొయె
నీరసంబై నేల § నెరియలువాసిన
తూడిదుంపలు గ్రాగి § మాడిపడియె

తే. నిగుడికావురు దిశలఁబెకన్బొగలు గవసె
నెండమావులతో మంట § లెగసెఁజేదల
నయ్యవగ్రహసమయ చండాంశుకిరణ
ధగధగద్వహ్ని కీలావి § తానహతిని. 178

క. ధనికుల యిండ్లం గలిగిన
ధనమెంతయు నెత్తుకెత్తు § ధాన్యముఁగొనఁగాఁ

జనధాన్య వాటికాతతు
లనలశిఖా చోరబాధఽలవిసరియయ్యెన్. 179

చ. దురితమలీమసాంగమును ఽ దుస్సహరోష కఠోర దంష్ట్రలున్
బరిభవ దీర్ఘజిహ్వయును ఽ బంధురరోదన సింహనాదమున్
ధరనిశితాసిధారయు నుఽదగ్రతమీఱదరిత్రతాని ఖా
చరి, వికృతాకృతిం గసిమఽసంగుచుఁ బైకొనె జంతులోకమున్. 180

వ. వెండియు నకాండప్రళయంబైన నయ్యనావృష్టి దోషంబునం బ్రాపించిన
మహాక్షామంబునంజేసి తద్దేశంబున రాజనంబు తేజంబు దొలంగె, దినసరి
సరియయ్యె, సంభావ లేపుదప్పెఁ, గర్పూరభోగి బాగుచెడె, బలుగుత్తి మొత్తం
బడియెఁ, గాంభోది బీదురాలె, నలిసె నవసె, నెల్లి ప్రాసంగి గ్రుంగె, వంకె
డొంకె, మెట్టజీలుగు మాలుగయ్యెఁ, గావర కావరంబుడిగె, సత్తెనంగ
సత్తువచెడె, వెలవడంబు వెలవెలంబాఱె, బుడమముడివడె, వరిగె సురిగె,
చామశోమలంబు విడిచె, యవలచెలువుదప్పె, గోధూమంబు నిర్ధూమంబయ్యె,
నువ్వుక్రొవ్వాఱె, పెసరు నుసురునకుఁదప్పె, మినుము మునుము మునుఁగె, నను
మనుమానంబయ్యె, నులవ చెలువుమాసె, బొబ్బర దబ్బరయ్యె, ననంగ
నలంగె, ముసిరి మిసిమిదప్పె, లంకల బింకంబు దఱిగె, నావ ప్రభావంబు
వదలెఁ, గందమూలంబులు నిర్మూలంబులయ్యెఁ, జెఱకు గిరకపడె, నాకుదీఁగెలు
చీకాకయ్యెఁ, బోఁకబ్రమాఁకులు తేఁకువచెడె, చూత పనస రంభా ఖర్జూర
కపిత్థ తాళ హింతాళ నారికేళ నారంగ జంబు జంబీరమాతులుంగ లవంగ
ప్రముఖ ఫలపాదప ప్రధానంబులు లూనంబులయ్యె, నలాబు కూశ్మాండ
కర్కటీపటోలికా కారవల్లీ వృంతాకకోశాతకీమూలక ప్రభృతి హితౌషధీ
నికరంబు దుష్కరంబయ్యె, దధిక్షీర ఘృతతైల మధుశర్కరా స్తోమంబులు
విరామంబులయ్యె, క్షుధాతుర బాలవృద్ధ స్త్రీలోక భీరుక పరిదేవ నార్త
నాదంబులును, ఘాసగ్రాససలిలపాన దారిద్ర్యంబునఁ గంటక ప్రాచీన సరస
తరుగుల్మలతా సంతతులు నమలుచుం గృశించు పశుగణంబు లొనర్చు
సంభారవంబులుప్పొంగి గగనంబుఁ గబళింప, 'భిక్షాం దేహి, 'నాస్తిగచ్ఛ'
యను దీన నిర్దయజనాలాపంబులును, 'దరిద్రస్య మృతస్యచ' యను
దుఃఖార్తుల దీనలపితంబులును 'కాలోవక్రగతిర్భవే' త్తను చింతాపరిక్రాంతుల
భయాయత్త భాషణంబులును, 'జాతస్య మరణం ధ్రువమ్మను దేహత్యాగ
వైరాగ్య భాషణంబులును, "రక్షంతి పుణ్యాని పురాకృతాని, యను ధార్మిక
ప్రమాణోక్తులును, 'దరిద్రతా ధీరతయా విరాజతే "యను సత్పురుషుల
యభిమాన వాక్యంబులును, "న దేవాత్సృష్టినాశః" యను పౌరాణికుల
యుపశమన వచనంబులును, జెల్లుచుండం గరుణాద్భుత భయానక భీభత్స

కార్ద్రరసావహంబగుచుఁ గేదార క్షేత్రంబులు ధూళిమయంబులయ్యె. గ్రామోప కంఠంబులు పశుశల్యంబులయ్యె. గృహాంగణంబులు శవమయంబులయ్యె; [1]పట్టణంబులు శుష్కీభూత మృతకరితురగగర్దభోష్ట్ర కళేబరకబళన వ్యాకీర్ణ కుర్కుర కంకగృధ్ర కాక సాలావృక కోలాహల మయంబులయ్యె; మనుజలోకంబు పరస్పరద్రవ్య పరిహరణ వంచన తాడన మారణ తర్జన గర్జాదివివిధ దుష్కర్మమయంబయ్యె; దిశావలయంబు దుర్గంధమయంబయ్యె; నహోరాత్ర సంధ్యాసమయంబులు పిశాచ మలినచ్ఛాయా మయంబులయ్యె, నిట్లు మేలెల్ల నడంచి భూమింగల సారస్యం బెల్లఁదీర్చి చతుర్విధ పురుషార్థంబులను గావుపట్టుచు, వర్షప్రాప్తికై పర్జన్య దేవతాప్రీతిగా నొనర్చు మంత్ర తంత్ర జప తపోధ్యాన హోమకర్మ కలాపంబులు గావించుచు శాకునిక భాషణంబు లప్రమాణంబులు సేయుచు ననన్యవార్యంబై యనాచారంబునకు నాధారంబును నజ్ఞానంబునకు నిదానంబును, వర్ణసాంకర్యంబునకు నాకరంబును, నరిషడ్వర్గంబునకు నిసర్గంబును, జంతునాశంబునకు నివాసంబునై యావిర్భవించిన యాదుర్భి[2]క్షకాలంబున. 181

సీ. పెట్టినతల్పులు ౯ పెట్టినట్లుండె దే
వాలయంబుల సమర్యార్చలుడిగె
విప్రమందిరముల ౯ విధిదక్క స్వాహాస్వ
ధానమః పుణ్యాశీర్బద్ధములు లేక
రాజసౌధాంగణ ౯ తేజంబుచెడె వీర
భట[3]ఘోష గజవిజృం ౯ భణము వాసె
నంగళ్లసాబగెల్ల ౯ నడఁగెవస్తుక్రయ
విక్రయంబులు మాని ౯ విజనమగుటఁ

ఆ. దల్లిబిడ్డ కిడని ౯ దశవచ్చె మగఁడాలి
నమ్మియనెడునట్టి ౯ యులఁతవచ్చె
గురుసహోదరాది ౯ పరమబాంధవులకుఁ
బోరుపుట్టెలేమి ౯ కారణమున. 182

మ. క్రతుదీక్షల్ వడుగుల్ వివాహకలనా ౯ ప్రారంభ సీమంతముల్
రతి తంత్రోత్సవమాట పాటలు ప్రియాళీలంకార సారస్యముల్
వ్రతముల్ వేదపురాణశాస్త్ర పఠనల్ ౯ వర్ణాశ్రమాచారముల్
హతసంస్కారములయ్యె లేమిగడుఁబెక్కైల్లె యెల్లెడఁగా దోఁచినఁగా. 183

వ. అట్లు మానిసిమానిసిందిను కఱువుదఱిమిన నుపాయశూన్యులై సకల మహాజనులు నాకటి చిచ్చుపెచ్చున మలమలమాడి యొండి కుండ బడుగులై హత

1. పట్టణాపట్టణ. 2. ఆ. పా. దుష్టకాలంబున. 3. ఆ. పా. భటకోటి కరటిజృం.

శేషులు పాడైనయూళ్లువిడిచి యన్యో నెలవులకుం బోవుచుండి రట్టి ముట్టడి నత్త మామలు గూఁతు రంతరించిన సంతరించలేక నవ్వీరించి కులసంభవుండు దుఃఖాక్రాంతుండై ప్రియకాంతం జూచి కన్నీరునిగుడ్చుచు నిట్లనియె. 184

చ. ఇరువదియేఁడులయ్యె మన । మిద్దఱముం గవఁగూడి యెందునే
యెరుసును లేకయుండితిమి । యీసరికిన్ విధియింతమీఁదనే
వెరవునఁ [1]బెట్టునో యెఱుఁగ । వృద్ధులఁ బుత్రియుఁబోవ దుఃఖసం
భరితులమైతిమి య్యడలు । పాటున కంటెను లేమినో[2]ప్పిదుర్. 185

క. ఈ దుర్భిక్షార్ణవమున
నేదరియుం జేరలేక । యిదిగో చీకా
కై దెసపడుచున్నారము
పైదలి యిఁకనెన్నిపాట్లఁ । బడుదుమొ మీఁదన్. 186

ఆ. తోయజాక్షి నేటితో నీకు నాకును
దైవమెడ[3]రుసేయఁ । దలఁపఁబోలు
నిలరుణానుబంధ । మెన్నాళ్లొ[4] యున్నాళ్లె
కాక కూర్పనేమి । కారణంబు. 187

వ. అని మోహాతిశయంబున వాత్సల్యంబున దైన్యంబు తోపంబలికి యాఁకలి నీరుపట్లకు నోర్వక పురపురంబొక్కుచున్న పిన్నబిడ్డనిం జూచి నిర్వేదించి యీశిశువును రక్షించుటకు మిక్కిలి ప్రయాసంబై యున్న దేయుపాయంబుననైన శీఘ్రంబున నొండుదేశంబునకుం బోవుట కర్జంబు, మా[5]నదేశంబని యుండుట కార్యంబుగాదు, [6]సుభిక్షంబైన రాజ్యంబునఁ దిరిసికొనితినినైన బ్రతుకవచ్చునని యూహించి. 188

తే. హాలఁతి విను పూర్వదక్షిణ । భూములెల్ల
నెపుడు దుర్భిక్షదోషంబు । [7]నెఱుఁగవంద్రు
బహునదీ మాతృకలుగాని । ప్రతిదినంబు
దివినిరీక్షించు దేవమా । తృకలు గావు. 189

సీ. కర్ణాటరాజ్యంబు । గంభీర తుంగభ
ద్రాజలౌఘంబులఁ । దఱచుపండు
ద్రావిడదేశ ము । త్తరళోర్మిరమ్యకా
వేరికాలువల ము । క్కారుబండు

1. బెట్టునోయనగ. అ. పా. వెరవును బుట్టునో యెరుగ. 2. నొప్పదున్. 3. ఎడబుసేయు. మెన్నాళ్లనన్నా. 5. మున్నివేశంబని. 6. సురక్షితంబైన. 7. నెసగదంద్రు.

త్రైలింగ్యమధ్య భూతలము కృష్ణాగౌత
మీ ప్రవాహంబుల మిగులఁబండుఁ
గాళింగమధ్య దిక్ఖండంబు లాంగూల
శారదానదులచేఁ జాలఁబండు
తే. వెండియును జిత్రమిట్లనా వృష్టినైన
నంబుజాక్షి నభోనభ స్యద్వయమున
[1]వర్ష మొప్పార గౌతమి వరదముంపఁ
బార్శ్వముల యూళ్లు పదివేలు పండునెపుడు. 190
సీ. ఏత్రోవఁజూచిన నేప్రొద్దు సలిలాన్న
సత్రశాలాజన సంభ్రమంబు
లేయూరఁజూచిన నెల్ల ధాన్యంబులు
కోరుపట్టెడు ప్రజా ఘోషణంబు
లే యిండ్లఁజూచిన నిందిరాకరసంత
తోత్సవతోరణాభ్యుదయ రేఖ
లెవ్వరిఁజూచిన నివ్వటిల్లెడు దయా
దాన సౌజన్య విద్యా నిరూఢి
తే. [2]యెచటఁజూచినఁ గనుపండు విందువిదన
నారికేళామ్లపనసపున్నాగముఖ్య
ఫ[3]రితశృంగారవన పరంపరలచేతఁ
గోరికలుము[4]ంచు గౌతమీతీరభూమి. 191
తే. [5]దివ్యమై తగుగౌతమీ తీరభూమి
భోగమోక్షంబులకు జన్మభూమి సువ్వె
జన్మసంస్కారఫల విశేషంబు గలుగు
వారలకుఁగాని కలుగ దవ్వసతిసుఖము. 192
వ. ఈ వృత్తాంతంబు మున్ను పెద్దలవలనవిని యెఱింగుదు నందులకుం బోద
మని నిశ్చయించి. 193
సీ. కొడుకుఁ జం[6]కటనిడికొని బోయ[7]యిల్లాలిఁ
జక్కఁగా వీపున సంతరించి
గంజిచిత్తడికి నీఁగలు పోకముసిరెడు
నుగ్గంపుకుండ చే నొకటిపూని

1. ఆ. పా. దర్పమొప్పారగౌతమీ దరులుముంప. పార్శ్వభూములు 2. ఆ. పా. ఏమిచెప్పుదు కనుపండు. 3. ఆ. పా. ఫలిత. 4. ఆ. పా. మించు. 5. ఆ. పా. వారి జానన గౌతమీ తీరవసతి. 6. ఆ. పా. సందిటనిడుకొని బోయయిల్లాలి. 7. ప్రా. పా. బోయియిల్లాలి.

యొక్క కరంబున । నెక్కుడించిన విల్లు
గోలలపిడియుంబు । గూడఁబట్టి
నడునెత్తిపైఁ ద్రాట । మడచి చుట్టినచింపి
యీఁతాకుచాప వ । హించి క్రుంగి

తే. పీనుఁగుల నెత్తుకొని నిజ । స్థానమునకు
జరుగువెక్కురు బడుగు పి । శాచమనఁగ
మైలవట్టిన మైచాయ । ప్రామఁగు[1]పడుచు
పుండరీకుండు గౌతమీ । భూమికరిగె. 194

తే. ఇట్లు కతిపయదినముల । కచటనచట
నాకలంబులు దినుచు న । ల్లల్లఁ జేరి
పుండరీకుండు గౌతమీ । పుణ్యభూమి
నంతపాపక్షయమునకై । యబ్జగర్భ. 195

చ. చనిచని కాంచె విప్రుఁడు బి । స ప్రసవప్రసరత్పరాగసం
జనితసుగంధబంధురల । సజ్జల శీకరశీతవాతపో
తనిరుపమాన శైత్యనిర । త ప్రతివర్ధిత సత్తపోవ్రతా
దినియమ నైష్ఠికవ్రతతి । తీరములంగల గౌతమీనదిన్. 196

వ. ఇట్లుగాంచి యనతిదూరంబునఁ గరంబులు మోడ్చి. 197

ఉ. రంగదనిద్ర సద్రుచివి । రాజిత పద్మసుగంధసమ్మిళ
ద్భృంగకనంగ భంగశశి । దీప్తకదర్ప కృశానుషంగకా
శాంగసశీకరోత్కర స । మగ్రతరంగకు మ్రొక్కెగౌతమీ
గంగకభంగురాభ్యుదయ । కారణకారుణి కాంతరంగకున్. 198

చ. తరఁగలవెల్లిఁ గ్రొన్నురువు । తండము మెండుజలత్కణావళీ
విరళతయున్ భ్రమీవలయ విభ్రమమున్ లహరీపరంపరా
సురుచిరభంగియున్ జవము । సొంపును బెంపెసలార వచ్చునీ
గరిమ త్రిలోకలోచన వి । కాసము సేయుఁగదమ్మ గౌతమీ. 199

ఉ. కొండలు వ్రక్కలించి పటు । కూలనిపాతము నాచరింపుచున్
జండతరోగ్ర నక్రముఖ । సత్త్వవిహార సముచ్ఛలన్మహో
ఖండతరంగ హస్తములఁ । గంకణముల్ వెదచల్లుచున్ సము
ద్దండత వచ్చునీనిబిడ । దర్పము మెత్తుఁగదమ్మగౌతమీ. 200

వ. అని కొనియాడుచుం బుత్రసహితుండై పుండరీకుండు దత్పుణ్య వాహినీ
ప్రవాహంబున నవగాహించి దప్పిదీర సలిలపూరంబులు గ్రోలి దుష్కర్మ

1. ప్రామనుపడుచు. 2. గరిమె.

విముక్తికిం బాత్రంబై వెడలి తత్తీరంబునఁ గొంతదూరంబు చనిచేరువ
నొక్క యగ్రహారంబుచూచి డాయంబోయి. 201

{ పుండరీకుండు బోయదానిని చిన్నవానిని మఱ్ఱిచెట్టు క్రిందనుంచి యగ్రహారములోనికి భిక్షమునకుం బోవుట. }

క. గ్రామోపకంఠమున వట
భూమిజ మొకటున్నఁజూచి పుత్రునిదానిం
బ్రేమమునడించిభిక్షకు
భూమీసురుఁడరిగె పత్రపుట హస్తముతోఁ. 202

తే. బ్రాహ్మణుఁడు ధర్మపథముచే పట్టియింక
[1]యువతిపుత్రావలోక నాభ్యుదయమొంద
మనకునుండుట దగదని మాయసతియు
మాయబాలుండు నవ్వాల మాయమైరి. 203

క. మాయాకారాగృహమున
బోయతయనుపాశబంధమునఁ బాపిరమా
నాయకుఁడు పుండరీకునిఁ
బాయకయిఁక దివ్యరాజ్య పదవియునిచ్చెన్. 204

తే. అధికవిజ్ఞాన నిధియైన యవనిసురుఁడు
పుండరీకుండు త్రైలోక్య పూజితుండు
కోరికొని మాయ నీ దురాచారదశకు
వచ్చెఁగాక యతండు దుర్వాంఛితుండె. 205

తే. ఉత్తమజ్ఞానవి[2]ధిఁదేల్చు నొక్కవేళ
నురుకృపామృతమునఁదేల్చు నొక్కవేళ
నెప్పుడెవ్వరి నెటుసేయ నిచ్చగించు
నట్లకావించు లీలార్థ మచ్యుతుండు. 206

తే. ఉభయకర్మఫల ప్రాప్తినొందఁజేయు
నుభయకర్మవినిర్ముక్తి యొగినొనర్చు
నచ్యుతుఁడె కర్తయనియుండు ననఘమతికి
నొదవు తుదియందు విష్ణుసాయుజ్యలక్ష్మి. 207

వ. ఆ సమయంబున. 208

క. తనమాయాపటలముదా
పునహరి సాక్షాత్కరింపఁ బూనివసించెన్

1. ప్రా. పా. బంధుపుత్రా. 2. సిఖ, నిధి.

వినుతెరలోపల వెలువడి
కనుపండువుగాఁగనిలువఁ గలనటులీలన్. 209

తే. జలధరచ్ఛన్న నక్షత్ర సమితిఁబోలె
మాధవునిఁగొల్చి తన్మహామాయతోన
నారదాది మునీంద్రబృందారకులును
జేరియుండిరి తత్కృపా శ్రీలుచూడ. 210

క. వారున్నయట్ల నచ్చర
లారూఢవిమానలై సమంచితపుష్పా
సారములు గురియనుండిరి
శ్రీరమణుని యాజ్ఞవిప్ర శేఖరుమీఁదన్. 211

వ. ఇవ్విధంబున భాగవతశ్రేష్ఠుండైన పుండరీకుండు వేదగ్రామంబున విష్ణుమంత్రాలయంబు ప్రవేశించి సంసారక్షుధాతాపశాంతికై వైరాగ్యపాత్రంబున నుపనిషద్వాక్యంబులచేతం గైవల్యలక్ష్మిఁ బరమానందామృతభిక్ష యడుగం గోరియున్న యమ్మహాయోగి పుంగవుండు గావున నయ్యగ్రహారంబుఁజొచ్చి యొక్క పుణ్యగృహంబునకుంబోయి యభ్యంతరవర్తిని నయ్యిల్లాలిని 'భిక్షాందేహి' యని పలికిన విని అయ్యా వేళగాదు తిరిగిరమ్మనిన వెండియు నిట్లనియె. 212

క. అల్లదెయాలును బిడ్డఁడు
నుల్లలనుడుకుచును నోర్వకున్నారు కడుం
బెల్లగునాఁకటి చిచ్చునఁ
దల్లీ లేదనక భిక్షదయనిడుమనియెన్. 213

తే. పుండరీకుండు దానునాపువ్వుఁబోణి
తనకులాంగన యీయిల్లుతనదిగాఁగ
నెఱుఁగనేరక భిక్షదాఁ దఱిమియడుగ
నాపతివ్రతపతిమాట తాటయెఱిఁగి. 214

వ. ఇదియేమొకో భర్తనదికింబోయి తీర్థంబాడి వేగిరంబరాక తడవుచేసి మధ్యాహ్నంబు దిరిగెఁ గుతపకాలంబు దప్పక బ్రాహ్మణుల నర్చింపవలయునని విచారించుచున్న దగుటంజేసి సావిత్రి యాలోననే భిక్షాందేహియనిన వేళగాదనినంబోక యాలుబిడ్డలాకొన్నవారని దయదోప భిక్షార్థియై పలుక నవ్వచనంబు తనమనసుచూడఁ బుండరీకుండు పలికిన కపటంపుఁ బలుకని నవ్వుచు నొక్క తామ్రపాత్రంబు దోముచు నిల్లువెడలివచ్చి ముంగిటనున్న పతినవలోకించి, 215

తే. ఎంతదడవాయె యమునకుఁ నేగిమీరు
తీర్థమాడింతకపుడయే తీరరాదె
పిదపనను నిట్లు భిక్షువేఁడెదరు గాని
బ్రాహ్మణులఁ గొల్చితెందు శీఘ్రమునఁ బోయి. 216

వ. వేగిరంబవచ్చి వంటయును వేళదప్పకుండ బ్రాహ్మణుల నర్చింపవలయు నగ్ని హోత్ర దేవపూజా విధానంబు లాచరింపవలయు నాయితము సేయుమనిన భ్రమయింపుచు మాయలాడుచు వచ్చి ముని వాకిట శెంకుపడి యూరకున్న వారిది యేమనిన మారుత్తరం బీ నేరక కళవళించి. 217

చ. భ్రమసి యతండు వెండియును పట్టెడు నాకశనంబు పెట్టుము
త్తమసుచరిత్ర తల్లియని దైన్యము దోఁపఁగఁ బల్కుచున్ననా
యమ చలియించి యేమియిది యక్కట భూతము సోకఁబోలుత
న్నుమఱచియాడెడుంగడుఁ మనోవ్యథయయ్యెడు నేమిసేయుదుర్. 218

సీ. ధాతువుల్ దప్పిన తమకము చందమో
యక్షివిభ్రమము లేదదియుఁగాదు
నీటిలోనక్రంబు నిగుడభీతిల్లెనో
యంగకంపంబు లేదదియుఁగాదు
కార్యాంతరాసక్తిఁ గల విలక్ష్యత్వమో
యార్తభావంబు లేదదియుఁగాదు
బ్రహ్మవిద్యాతత్వ భావనచలతయో
యానందలహరి లేదదియుఁ గాదు

తే. కానదక్కిన వేమియుఁ గనుఁగొనంగ
నొంటినదికేగి రాఁగనత్యుగ్రభూత
వికృతి మైసోకుటయతప్పదకటదీని
కేది ప్రతికృతి చింతింప నెవ్వరింక. 219

సీ. ప్రత్యక్ష విష్ణురూపంబు సాలగ్రామ
మర్చించు భక్తినిశ్చైకనిష్ఠ
బ్రహ్మంబు హరియకాభావించునేక త
సావధానమున యోగానురూఢి
సంసారసుఖము నిస్సారంబుగాఁ జూచు
మృగతృష్ణికాజలముగఁ దలంచి
వైష్ణవమాయ సర్వము గవితర్కించు
నారదాదుల బోధనంబు నమ్మి

తే. శుద్ధసాత్త్వికమూర్తి విశుద్ధబుద్ధి
సత్యసంధుండు కరుణాప్రసన్నముఖుఁడు
బ్రహ్మకులసంభవునకు నీపావనునకు
నిట్టిదురవస్థ ఘటియించితే విధాత ! 220

ఉ. ఈ దురవస్థమాన్పి పరమేశ్వరుఁడార్యుఁ డనంతుఁడచ్యుతుం
డాదివిధాత ధాతసకలాత్ముఁడు సర్వహితైకవర్తి దా
మోదరుఁడార్తరక్షణగుణోదధి నా పతిఁగాచుఁగాతఁ బ్ర
హ్లాదు ధ్రువున్ గరీంద్రుని దయామతిఁగాచిన యట్లయిత్తరిన్. 221

తే. భూతములకెల్ల నాధార భూతమైన
విష్ణుఁడీభూత వికృతి వేవిష్పఁగాతఁ
బుండరీకుఁ డితండు నా¹పురుషుఁడేని
యేఁబతివ్రతనగుదునే నీక్షణంబ. 222

వ. అని ప్రాకృతుల చందంబున నితరమంత్ర తంత్ర విధానంబులకుంబోక యయ్యుత్తమ పతివ్రతాతిలకంబు నిజపాతివ్రత్య మహాప్రభావజనిత విజ్ఞాన విశేషంబున సకలంబునకుం గర్తవిష్ణుండయని నిశ్చయంబు ప్రదీపించినం బులకించి యార్తజనశరణ్యుండగు నారాయణుం బ్రార్థించిన. 223

{ పుండరీకుఁడు విష్ణుమాయా విముక్తుఁడై పరిశుద్ధుఁడు కాఁగా విష్ణుమూర్తి ప్రత్యక్షమవుట. }

మ. కురిసెం బువ్వులవానలభ్రమున దిక్కుల్ నిండ శ్రావ్యంబులై
మొరసెం దివ్య మృదంగనాదములు సమ్మోదాప్సరో లాస్యముల్
బెరసెన్ దేవజయధ్వని స్ఫురణతోఁ బెంపారు తన్నాయయున్
విరిసెన్ ధర్మచరిత్రుఁడైన యతని న్వేమొంచి మంచుంబలెన్. 224

ఆ. సానఁబట్టినట్టి జాతి రత్నముఁబోలె
విప్రుహృదయమపుడు విమలమయ్యె
విష్ణుమాయఁబడిన విధమెల్ల నింద్రజా
లముగఁదలఁచి హరిఁదలంచె నతఁడు. 225

వ. అంత. 226

సీ. వికచముక్తాఫలమకుటదీధితితోడ
ధవళలోచనములఁ దళుకులెసఁగ
వజ్రకుండల సముజ్జ్వల గండకాంతితో
మందస్మిత శ్రీలుమాఱుమలయ

---

1. నప్పురుషు.

అభినవకాస్తుభ ప్రభలతో వక్షస్స
లస్థరమాదీప్తికలతలునిగుడ
స్వర్ణపీతాంబర చ్ఛాయతో జలరుహ
రాగకాంచీరుచి రాజిమెఱయ
తే. బాహుదండ సముద్దండ పద్మశంఖ
చక్రకౌమోదకీ మహాశ్చక్రమొప్పఁ
దేజముల కెల్లనుత్కృష్టతేజమగుచుఁ
గరుణలక్ష్మీశ్వరుండు సాక్షాత్కరించె. 227

వ. అట్లు డెందంబునకు వాక్కునకు నందరాని యమృతచిదానంద స్వరూపంబగు నాదినారాయణదేవుండు ప్రత్యక్షంబైన నద్దేవుని శ్రుతిసీమంతినీ సీమంత సిందూర రజంబులగు శ్రీపాదార విందంబులవలనం బ్రసరించు నరవిందోద్భవ పురందర ప్రముఖ బృందారక పూజిత పారిజాత ప్రసూనదివ్య సౌరభ సౌభాగ్యంబును, శ్రీవత్సలాంఛన సులక్షితంబగు వక్షస్స్థలంబున నిగుడు కౌతుకోత్సవ శ్రీపరిరంభ సంభ్రమ ప్రసక్తలక్ష్మీపయోధర గంధసార సురభి గంధ పరంపరా సారస్యంబును, చూర్ణకుంతల రేఖా బంధురంబగు ధమ్మిల్ల వల్లీ బంధంబునం బొలయు గర్భకేతకీభూత కోమల శ్యామల తులసీమంజరీ మంజుపరిమళ ప్రవాహంబును, బహుప్రకారంబుల నాసికాపుట కుటీరంబులం బొగవులు వార మనోహర శారీరభూరి రుచినిచయ చాకచక్యంబులును, దళ్ళ్లికల నల్లిబిల్లిగొను శంఖ చక్ర కనకాంబరా భరణకిరణ తరంగ సమాందోళనంబులును దన్మయూఖరేఖల నోరయు మందస్మిత కరలోచనాంచల మరీచి చంద్రికా ప్రసరణంబులును, గప్పారి యొప్పు నవలావణ్య యౌవన సంపద్విలాసంబును త్రైలోక్యసామ్రాజ్య మూర్ధాభిషేకలాంఛన ప్రాభవ ప్రసాదలక్ష్మీ ప్రభావాతిశయంబును, బెనుబండువు సేయం గన్నులానంద రసమగ్నంబులై నిగుడ సందర్శించుచు మోడ్పుఁగేలుదోయితోఁ బ్రదక్షిణంబుచేసి యగ్రభాగంబున. 228

చ. సనకసనందన ప్రముఖసంయములూహ లొనర్చుతత్త్వము
న్వనజజముఖ్య దేవ పరివారము నేలెడు రాచవారలుఁ
ఘనతరభక్తియుక్తజన కామఫలప్రదదైవతంబవై
తనరెడునీవు నెచ్చెలి విధంబునఁ దోచితినాకు నచ్యుతా. 229

మ. దురితావాసము పుణ్యనాశనముచేతో జాడ్యమూలంబు సం
సరణం బాత్మకళత్రపుత్ర ధనదోష వ్యాధిపీడాకరం
బరయం జిక్కితి దీనఁజాలునిఁక నన్నర్థిం గటాక్షింపవే
హరినారాయణ కృష్ణకేశవ ముకుందా దేవ దామోదరా! 230

క. ఈదుర్మోహపు సంసా
రోదధిఁ దరియింపఁ జేయ § నొండుగలదె మీ
పాదస్మరణ ప్లవ మొక
టాదరువై నిలిచెఁగా[1]క § యవ్యయపురుషా. 231

వ. అని మహాభాగవత శ్రేష్ఠుండగు పుండరీకుండు పలికినఁ బుండరీకాక్షుండు ప్రసన్నుండై గండమండలంబునం గందలించు మందస్మిత చంద్రికా పల్లవంబులపై జాఱిన ధవళధవళ కటాక్షవీక్షణ ప్రసాదమధుర సుధాపూరంబున నభిషేకం బార్చి ఘోరమాయా సంసారగహన దహన దందహ్యమాన మర్మస్థానుండైన యతనిమన స్సంతాపంబుమాన్చి యిట్లనియె. 282

క. నీమనను చూడఁ జేసిన
నామాయాకలనను వ్వె § నారదుఁడలనాఁ
డీ మేర నీకుఁ జెప్పఁడె
నీమదినిటుగానఁజూడ § నిఖిలము ననఘా. 233

ఆ. అస్మదీయమాయ § యఖిలజనంబును
మాయజగములోన § మలుగఁ జేసె
పదుగుకర్మపాశ § బద్ధులై సంసార
మోహదురితజలధి § మునుఁగుచుంద్రు. 234

క. రాజసతామస మతములు
బీజంబులు మాయసొంపు § పెంపొనరింపఁ
రాజిల్లు సాత్వికము ద
ద్వ్యాజముఁ దలఁపంగపరమ § ధా[2]మముఁ జూపున్. 235

వ. కావున నహంకార మోహదూషితంబులగు రాజసతామసంబులు విసర్జించి యుత్తమసాత్వికజ్ఞానంబున నన్ను సాలగ్రామస్వరూపు నారాధించిన నిన్ను మోహింపఁదలంచి కాదె నారదునిం బంచి బ్రహ్మోపదేశంబు సేయించి యదిసాలక వెండియు నీమనస్సంశయంబు మాన్పుటకు నపూర్వమాయా విలసితంబగు సంసారంబధిగమించి యేనుబ్రతిచ్ఛాయయుంబోలె దీపింపంజేసి తానతగులువెట్టి[3] పూర్వజన్మాంతర కర్మశేషంబులు దొలంగించి యుచిత పదం బొసంగుటకై యింతప్రయాసంబు నొందింపవలసె నట్లు గావున నీవు నింక మోహవికార దూరుండవై యల్పపల్వల కలుషవారి పంకంబున మునుఁగుచుఁ దేలుచుండు మహిషసంఘంబుఁ జూచు గోపాలుని చందంబున, నిద్రాముద్రితులైన వారిగెళవుననుండి చూచు జాగరూకుని మాడ్కి, మదిరా

1. పా. తా. నాకునవ్యయ. 2. అ. పా. ధర్మము. 3. పెట్ట.

పానంబున మత్తిల్లి శిథిలీకృతాంగకములతో నింద్రియజ్ఞానంబు లేక నిద్రించు స్త్రీలనడుమ నింద్రియ భ్రంశంబు లేక పరిభ్రమించు శుద్ధాత్మునికై వడి, మాయావిషయ భోగంబులం జిక్కి మ్రక్కి పాపంబులంబొరలుచున్న మూఢుల నవలోకించుచు సమస్తవస్తు విస్తారంబునం దదంతర్బింబిత తేజోవిశేషుండ వగుచు సత్పురుషులం బ్రబోధించుచు భూలోకంబునం గొంతకాలంబు మహా భాగవతుండవై ప్రసిద్ధివహించి తుదినాయందు జెందగలవని ప్రసాదించి హరి యంతర్హితుండయ్యెఁ దద్వాక్య ప్రమాణంబున నా పుండరీకుండును ప్రహ్లాద నారద పరాశరప్రముఖ మహాభాగవత శ్రేష్ఠులతో జగద్వర్ణనీయుండై యట్లనే కొండొక కాలంబు బుధపుంగవులకు హర్షోత్కర్షంబు గావించుచు హరి నారా ధించుచు నుభయకర్మ నిర్ముక్తుండై ధర్మకళత్రంబైన సావిత్రియుం దానును జ్వాలాసహిత ప్రదీపంబునుంబోలె సాలగ్రామ గర్భబ్రహ్మ నిర్యాణ తేజస్స నాథుండయ్యె నిది జగద్విఖ్యాతంబు. 236

క. ఈపుండరీక చరితము
పాపపుసంసారతిమిర పటలంబడఁచున్
దీపింపఁజేయుబోధము
దీపము క్రియమాయ యింటఁ దిరిగెడు వేళన్. 237

వ. అని యివ్విధంబున మార్కండేయ మహామునీంద్రుండు ముని[1]బృందారకుల విస్మితులం గావించి విరించితో నిట్లనియె. 238

మ. జలజాతోద్భవ పుండరీకుఁడు విశేషజ్ఞానియైయుండియుం
బలుపాట్లంబడె విష్ణుమాయ నిఁకఁజెప్పన్వే[2]డి నిర్వ్యాజని
శ్చలితబ్రహ్మ విదుండొకండు నిలువన్ శక్తుండె తన్మాయకున్
వెలయందత్కరుణాశ్రితుండు వెలిగాఁ విశ్వంభరామండలిన్. 239

క. నావుడుఁ దద్వచనముఁదన
భావంబునఁ దిరుగఁ దిరుగ భావించియుఁబో
ధావహితుఁడు గానేరక
యావిధిహరిమాయఁద్రిప్ప నపుడిట్లనియెన్. 240

మ. అకటా యేమిమునీంద్రబాలుఁడవొ మూఢాత్ముండవో వెఱ్ఱివో
సకలబ్రహ్మమునీంద్ర దైత్యదివిషత్సంఘంబు నిన్మెచ్చునే
యొకమర్త్యాధముఁ బుండరీకుఁదనమా యోపాయకృత్యంబులన్
వికలస్వాంతునిఁజేసెనంచు గుఱిగా విష్ణుం బ్రశంసించినన్. 241

1. అ. పా. మునీంద్ర మహేంద్రాది బృందారకుల. 2. ప్పన్వొండి.

{ బ్రహ్మదేవుఁ డహంకరించి యా విష్ణుమాయఁ దనపైఁ బన్నింపు మని మార్కండేయునితో వాదించుట. }

క. ఇన్ని కథ లేల చెప్పెద
విన్నిచున్ మోసపుచ్చుటిది చిత్రంబే
పన్నినమాయలు నాపైఁ
బన్నింపుము నిర్వహింపఁబదిలుఁడవైనన్. 242

క. ఆతనిచేఁగాకుండిన
నీ తపమునఁగల్గు బల్మి నెరపుచునైనన్
ఖ్యాతిగ ననుభ్రమియింపుము
చూతము నీకేమియిదియె చోద్యముగాదే. 243

చ. హరిదనమాయ పన్నినను నంగజు వెఱ్ఱులఁజేసినట్లయా
సురలు మునీంద్రులుం బొగడఁ జోద్యముగా భ్రమియించియో మునీ
శ్వరయిఁక విష్ణుమాయ గెలువంగరమే యని నీవు మెచ్చగాఁ
బరఁగెడుఁగాక బ్రహ్మమయి పద్మభవాండము దానెయేలుచున్. 244

వ. [1]అని క్రోధించి. 245

క. నేనున్ బ్రహ్మనె హరిమా
యానాటకచక్ర విభ్రమాయత్తుఁడనై
దీనుని గతి దిరుగుదునఁట
యీ నీచోక్తులును వింటిరేయెయ్యెడలన్. 246

క. ఈ సురసంఘము నీవును
నాసామర్థ్యంబు పద్మనాభునినిజమా
యాసామర్థ్యముఁ జూచెద
రాసన్నంబైన వేళయది యట్లుండెన్. 247

వ. ఇదిగో నేఁడు నేను చరాచర నిర్మాణ కర్మంబులు విసర్జించి లోకపరిపాలనంబులు సాలించి నిర్విఘ్న పరబ్రహ్మ యోగాధీనమానసుండనై నిర్వాణ తత్వంబంగీకరించి యొక్కవిహిత పుణ్యస్థానంబునఁ దపంబు సల్పుచుండెద, నేఁ బాసిపోయిన వెనుక సృష్టి చీకట్లుగొని లోకంబులకు దిక్కులేక జంతులోకంబు చీకాకుపడుచుండ నిర్వహింపఁజాలక వట్టి యింద్రజాలంబులు పన్నికొని యాడుచు మిముబోంట్ల భ్రమియింపుచున్న విష్ణుండును నీవును, దేవముని సంఘంబులతోడవచ్చి జగత్పరిపాలనంబునకు నన్నుఁ బ్రార్థింపుచున్నప్పుడు నిన్ను మందలించెదఁగాక యిప్పుడు వృథా ప్రతిజ్ఞలాడనేల యని

1. ఆ. పా. నుండి యిదియు దీనిక్రింది కందము గ్రహింపబడినవి. ప్రా. పా. లో నివిలేవు.

దిగ్గునఁ గొలువువిచ్చి యా ప్రజాపతి యొక్కరుండును ఖేచర గమనంబున
మందర పర్వతంబునకుం జనియె నంత. 248

సీ. బ్రహ్మపోయినఁదోఁడి ఽ బ్రహ్మలు వోయిరి
   సృష్టిక్రియాలీలఁ ఽ జిక్కువఱచి
వేదశాస్త్రాదిక ఽ విద్యలెల్లను మ్రింగి
   యా సరస్వతి యత్త ఽ నాశ్రయించె
బ్రహ్మరథంబు నిర్వాహ్యపారమైననం
   చేలువిచ్చి మానస ఽ సరసికరిగె
బ్రహ్మతేజస్స్ఫూర్తి ఽ బాసిన సత్యలో
   కంబు వెంజీకటిఁ ఽ గవసియుండె

తే. పద్మసింహాసనాగ్రంబు ఽ పాడువారె
దానసత్యతపోజ్ఞాన ఽ ధర్మపరులు
బ్రహ్మపదవాసు లట భయ ఽ భ్రాంతులైరి
తద్విధం బేమి చెప్పుదు ఽ ధర్మతనయ. 249

సీ. ప్రభమాసె నర్కబిం ఽ బంబునఁ జంద్రికల్
   సడలెచంద్రునియందు ఽ జాతవేదు
దాహకత్వము మానె ఽ తారాగ్రహచ్ఛాయ
   లెడలె నోషధుల యం ఽ దింకె సత్వ
మబ్ధిఁ దరంగంబు ఽ లడఁగె నేఱులవేగ
   ముడిగె వాయువులు వీ ఽ యుటలుడక్కెఁ
గాలమార్గంబు వ ఽ క్రతనొందె జపతపః
   క్రతుకర్మ ధర్మసం ఽ గతులు పొలిసె

తే. జననములు లేక జంతుసం ఽ క్షయము గలిగె
దైత్యముని దేవతాకోటి ఽ తల్లడిల్లె
బ్రహ్మతేజంబు వాసిన ఽ పద్మజాండ
మండలం బెల్ల చీకటి ఽ క్రమ్ముపడియె. 250

—•—◆ {అటుతర్వాత మార్కండేయుఁడు విష్ణుమూర్తిని స్మరింప నాతఁడు ప్రత్యక్షమౌట.} ◆—•—

క. ఆయజుఁడు పోవ శూన్యం
బై యుండిన జగముఁ జూచి ఽ యచ్చెరుపడుచుం
బోయిరి సురాసురాదులు
నా యెడ గమివిచ్చి వెగడి ఽ యయ్యోగతులన్. 251

ఉ. అంతయు నామృకండుసుతుఁడాత్మఁగనుంగొని పద్మయోనిన
త్యంతవిమూఢుఁగావగఁచి యవ్విధి లోకము లెల్లమాయచుఁ
జంతువినాశమైన్సృజన చాలక కాలము విన్నదైన శ్రీ
కాంతుభయాపహారిఁ ద్రిజగత్పతి సంస్మరియించె భక్తితోన్. 252

వ. ఇట్లు కన్నులు మూసికొని యంతర్ధ్యానంబున సంస్మరించిన నాక్షణంబ. 253

క. దినకరకోటి ప్రభతో
మునిముందటఁదోఁచి పలికె ముదమున మేఘ
ధ్వనిఁగేవలుఁడవ్విష్ణుఁడు
జననాయకయమృత ధార జాతెడుభంగిన్. 254

చ. పరమమునీంద్ర యోగభువన పాత్రచరిత్ర మృకండుపుత్ర నీ
గురుపరమార్థబోధమునకుఁ మదిఁగోల్పక బ్రహ్మదా నహం
కరణపరాయణత్వమునఁ గానకనన్ను నధఃకరించిదు
ష్కరతరపీడ చేసెఁ ద్రిజగంబులకంచుఁ దలంకనేటికిన్. 255

వ. అని నిజాభిప్రాయంబెఱుకపడం బలుకుచు ముంగట బ్రహ్మ తేజోరూపం
బున నున్నం గన్నులువిచ్చి మార్కండేయుండు. 256

క. అవ్యక్తుఁడైన విష్ణుని
నవ్యక్తధ్యానయోగ సుందరమూర్తిన్
దివ్యజ్యోతిర్మండలు
నవ్యాహత శంఖచక్ర హస్తునిఁగనియెన్. 257

చ. కనుఁగొనియశ్రుబిందువులు గారఁగనంజలి బంధమొప్పఁగాఁ
దనువునఁగంటకాంకుర వితానములీనఁగ భక్తిగద్గద
స్వనమున వేదవాక్యముల సన్నుతిఁజేసె మహాద్భుతోత్సవం
బునఁదనుఁదానెఱుంగక ప్రమోదసుధాంబుధినోలలాడుచున్. 258

క. నారాయణ దేవకృపా
పారాయణ భక్తలోక పాలన విద్యా
కైరవ చంద్రోదయ మా
యారమణీరమణయుతు యానందనిధీ. 259

క. కేవలమగు నీతత్వము
భావింపఁగ నెంతవాఁడ భవదీయకృపాం
భోవాహసుధాధారల
నీవిభవముఁగలిగెఁగాక యీశ్వరనాకున్. 260

**మార్కండేయునికి విష్ణుదేవుండు దివ్యదృష్టి నివ్వఁగా సమస్తమును జక్కఁగాఁ గనఁబడుట.**

వ. దేవా విధాత దుర్నీతిం జేసి భువనంబులకు నపాయంబు వాటిల్లె, ప్రాణిగణంబు సంక్షీణంబయ్యె, భయభ్రాంతులై సురాసుర వరేణ్యులు దిరుగుచున్నవారు వీరిం గమనించి లోకంబుల కభయదానంబు ప్రసాదింపవేయని ప్రార్థించిన నా పరమపురుషుం డిట్లనియె. మునీంద్రా! లోకంబులు మదీయ మాయా నిర్మాణంబులని కానక విధాత తనచేత సృష్ట[1]ంబులైనవని యహంకరించి దురభిమానంబున నిట్లు చేసినవాఁడుగాక లోకంబుల కతనిచేత నపాయం బెట్లు ప్రాపించు నతని దృష్టికట్లుందోఁచె నంతియ చక్కం జూడుమని దివ్యదృష్టి ప్రసాదించిన చరాచర[2] ప్రమాదంబులు వీతంబులై చంద్రసూర్యపావక ప్రభాభిరామంబులయి జగంబులు గానవచ్చిన నచ్చెరువంది వందన సహస్రంబు లాచరించిన నతని మన్నించి వెండియు నిట్లనియె. 261

ఆ. అస్మదీయమాయ । యఖిలంబుననక తా
బ్రహ్మననుచు లోక । పతిననటంచు
యోగిననుచు నున్న । యుబ్బెల్లనడఁగించి
పిదపలోకమునకు । ముదమొనర్తు. 262

వ. కొండొక గాలంబు చూచుచుండుమని తన యభిప్రాయంబెఱింగించి హరి యంతర్హితుండయ్యెనంత. 263

**బ్రహ్మదేవుఁడు తపస్సు నారంభించుటకుఁ బోవుట.**

సీ. రాజేంద్ర వినుమట్లు । రాజీవసంభవుఁ
డాగ్రహంబున మంద । రాద్రియందు
నుగ్రతపంబు సే । యుటకునై పోవంగ
నడుమ ననేక వి । ఘ్నములు దోఁచె
మదిమదినుండి బ్ర । హ్మపదంబు వాయుట
గాదని మ్రోసె నా । కాశవాణి
హరిమాయఁ గడవరా । దని యొక్క సెట్టున
దర్పించి పలికె భూ । తవ్రజంబు

తే. తలఁపనట్లన యాఁగదా । తండ్రి దైవ
మనక యవమాన మొనరించు । నధమజాతి
కేటివిజ్ఞానసంపద । యేటితపము
లేలసిద్ధింప నేర్చు నభీష్టఫలము. 264

1. సృజితంబులై. 2. చరాచర ప్రమోదకలితంబులై, (?)

క. అతిరాజసతామసమతు
లతులానంద ప్రకాశమగు యోగకళా
రతినిర్వహింపశక్తులై
సతతబ్రహ్మజ్ఞ శుద్ధసాత్త్వికులగతిన్. 265

క. కనుఁగొనియె నట్లుచని య
వ్వనరుహసంభవుఁడు మణిసువర్ణమయోద్య
ద్ఘనశృంగ సంగతస్వ
ర్వనితాసాహస్రసుందరము మందరమున్. 266

వ. కని యమ్మహానగంబధిరోహించి. 267

సీ. సరళాదిపాదపచ్ఛాయలఁ జిన్ముద్ర
నురుతరధ్యానులై యున్నమునుల
సానుదేశంబుల సమధిక నిష్ఠతోఁ
బంచాగ్నితప్తులై పరగుమునులఁ
దలక్రిందుగాఁగ శాఖలయందు వ్రేలుచు
నత్యుగ్ర నియతిఁ జెంపారుమునులఁ
గందరాగర్భంబులందుఁ బాములు ప్రాక
దృఢయోగరూఢి వర్తించుమునుల

తే. నిరశన వ్రతజపముల నెగడుమునులఁ
గేవల బ్రహ్మకళఁ బరికించుమునులఁ
గాంచె లక్షోపలక్షులఁ గమలభవుఁడు
ధరణినాయక యమ్మహీధరమునందు. 268

చ. అనలగవీందు మండలసహస్రసముజ్జ్వల దీప్తులోలిఁ బ
ర్వినక్రియ నమ్మహీధర వరేణ్యమునందుఁ దపంబొనర్చు నమ్మునుల
... ... ... ...
... ... ... ... 269

ఉ. ... ... ... ...
ఇట్టితపఃప్రభావులకు నిచ్చు నభీష్టవరంబు లెట్టివో
గట్టిగ వీరికేను బొడకట్టి తదర్థము లిచ్చుటొప్పని
ప్పట్టున నంచు దివ్యరుచి పర్వఁగ డాసి విధాత యిట్లనున్. 270

క. మెచ్చితి మీతపములకే
నిచ్చెదఁ బ్రార్థింపుఁడెద్ది యేనియు ననినం
జెచ్చెర నతులై యమ్మును
లిచ్చిరి మారుత్తరంబు నెలనవ్వొలయన్. 271

ఆమునులకు బ్రహ్మకు సంవాదమగుట.

క. మాకోరిన వరమొసఁగఁగ
నీకు నశక్యంబు పొమ్ము ఽ నీరజభవ నీ
కేకాదు నీవు మొదలుగ
శ్రీకంఠాదులకు నైనఁ ఽ జింతింపఁదగదా. 272

వ. అది యెయ్యది యంటేని. 273

ఉ. దానము సత్యముం దపము ఽ ధర్మము యజ్ఞము బ్రహ్మవాద వి
జ్ఞానము ధైర్యముం గలిగి ఽ సాత్వికులై పరమార్థవేదులె
వ్వాని కృపావిశేషమున ఽ వర్ధిలు చుంద్రు విమోహముక్తినా
శ్రీనిధిమాయ గెల్చుటకుఁ ఽ జేయుటమాతపమబ్జసంభవా. 274

వ. తన్నిమిత్తంబునం జేసి తదధినాయకుండు విష్ణుండుగావున నద్దేవదేవునింగూర్చి తపంబు సేయుచున్నవారము నిన్నుఁ గోరికాము, సమర్థుండవైతివేని యధిదేవతవై మాతపః ఫలంబు స్వీకరించి యవ్వరంబొసంగుము, నీకసాధ్యంబగునేని నీవు పోయెడి త్రోవంబొమ్మనిన నవ్విరించి క్రోధించి. 275

సీ. సంయమీశ్వరులార ఽ సకలవేదాగమ
విద్యా రహస్యముల్ ఽ వెదకినారు
ప్రాజ్ఞులు మహితత ఽ పస్సిద్ధులిట్టి మీ
రజ్ఞులభంగిని ఽ ట్లాడఁదగునె
సచరాచరములైన ఽ జగములు గల్పించి
యఖిలంబునకుఁ గర్త ఽ నైన నన్ను
బ్రహ్మదేవునిఁగూర్చి ఽ ప్రార్థించునర్థమే
విష్ణుమాయాజయ ఽ వికటబుద్ధి

తే. మృత్యురాక్షస శత్రుదా ఽ రిద్ర్యజయమె
విష్ణుమాయాజయంబవి ఽ వేకులార
బ్రహ్మశివవాసవాదిత్య ఽ పదనిరూఢి
యడుగ కెట్లడిగితిరిట్టి ఽ యధమవరము. 276

క. దాకొని మార్కండేయుఁడు
ప్రాకృతులను బోలె మిమ్ము ఽ భ్రమయించెనొకో
కాకాభేద్యము హరిమా
యాకల్పనమనుచు బ్రహ్మ ఽ మచ్యుతుఁడనుచున్. 277

వ. అట్లు కాఁబోలుంగాక లేకున్న మీకు నీవృథావిష్ణుమాయా భ్రాంతి పుట్టునే, మిమ్ము బోధించినట్లు విరతింబుట్టించి దివ్యపద భ్రష్టులం గావించి యేకాకులం జేసి యనేకులఁ జీకాకుపఱిచె, నదియునుంగాక దేవముని సంఘంబులలో నేఁడ

నాసమ్ముఖంబున నాసృష్టియెల్లనుం దృణీకరించి సర్వంబును విష్ణుమాయగాఁ బ్రతిష్ఠించి విష్ణుని పరబ్రహ్మంబుగా నూఁది, నన్నుం దిరస్కరించె, దానికినేఁ గోపించి శాపదగ్ధునిం జేయందలంచి శాపదగ్ధునింజేయుట పౌరుషహానియని వితర్కించి యది విసర్జించి సర్వంబును విష్ణుమాయయను నతని యవివేకంబు మాన్పిపిదపం జేయవలసినట్లు చేసెదనని లోకంబులు శూన్యంబులు గావించి యేకాంతంబునం దపంబుసేయువాఁడనై వచ్చితి, మీఁదటి పనులమీకుం జెప్పనేల నాకంటె విష్ణుండు సమర్థుండయ్యేనేని మీానరంబులు వేడుకొమ్మని వారి కడందొలంగి శిఖరాగ్రంబునకుంబోయి వజ్రకీట రూపంబున శిలాపటలంబుభేదించి తద్రంధ్రంబునలోపలం జొచ్చి దశయోజన విస్తారంబుగా నొక గుహ కల్పించి. 278

బ్రహ్మతపమారంభించుట.

సీ. తనపూర్వరూపంబు దాల్చినిజప్రాభ
వంబున నొక్కవనంబుకొలను
గల్పించితిమిరవికల్పనార్థము బ్రహ్మ
తేజము దివియుగా నోజపఱచి
తత్సరస్తీరమందార భూజము నీడ
విమల చంద్రోపల వేదిమీఁద
పంకజాసన బంధ బంధురుండ చలుఁడై
యంతర్ని రీక్షణం బాచరించి
తే. బ్రహ్మ నిర్వాణ తేజంబు భావవీధి
ధ్యానమొనరించు నిలుకడ దప్పియపుడు
లోకములు లోకగతియును లోక కృతియు
సంస్మరింపంగఁదొడఁగెనా జలజభవుఁడు. 279

తే. అచలిత ధ్యాననియతి బ్రహ్మంబుఁగాంచి
చిదమలానంద రససుధా శీకరముల
నాత్మఁదనుపంగ లేఁడాయె నబ్జసూతి
యట్లు సిద్ధించునే విషయాతురునకు. 280

క. విరతియొఱుంగక యోగా
చరణంబున ధ్యానియైన జనునకు బ్రహ్మ
స్థిరబుద్ధియేలతోఁచెడుఁ
బొరిపొరి సంసారకృత్య ములె కాకమదిన్. 281

మ. పరమ బ్రహ్మముధ్యేయమున్ ఫలమునున్ భావింపఁగా వైష్ణవో
ద్ధురయోగ స్ఫురణంబ, యోగిలతికే త్రోవన్ విచారించినన్

సరసీజాసనుఁడట్లెటింగియును దక్షన్మాయాపరిభ్రాంతి నా
పరమాత్మవ్యతిరిక్త యోగమె మదిన్ భావించె నుర్వీశ్వరా. 282

వ. ఇవ్విధంబున ననన్యభేద్యంబగు మందరగిరి గర్భంబున నిశ్చలసమాధింగన్ను
దెఱవక పదివేలుదివ్యవర్షంబులు తపంబుచేసె, నంతనొక్కనాఁడు సర్వాంత
ర్యామియగు విష్ణునిమాయా బలంబున. 283

సీ. స్వర్ణరంభాతరుస్తంభసంభృతము వి
ద్రుమఖండవలభిప్రగోపితంబు
విలసితకుందకుట్మల మౌక్తికశ్రేణి
కరవీరదళ విటంకప్రజంబు
మాలతీ జాలకమార్గంబునవకేత
కచ్ఛదఫలకప్రకల్పితంబు
కల్హారతోరణకలితంబు మల్లికా
పుష్పవితాన సంపూజితంబు

తే. పద్మకోరక కనకకుంభస్ఫుటంబు
చూతలతికా చతుర్ద్వారశోభితంబు
బహుళబహువిధపరిమళబంధురంబు
నగుచు నొకమేడసంభూతమయ్యెనచట. 284

క. చంద్రాధి దేవతయనం
జంద్రసమానాస్యహాస[1] చంద్రికతోడం
జంద్రకులేశ్వర వాణీ
చంద్రాననయయ్యెమాయ శౌరిమతమునన్. 285

ఉ. శ్రీమదహర్మ్యఖద్యుమణి చెల్వున నుజ్జ్వలరాగరేఖఁ జూ
డామణి మీఱఁదారలవడంబడఁజేయఁగఁజాలు తారహా
రామలదీప్తి పర్వఁగనసంగ ధనుర్గుణ భృంగఝంక్రియో
ద్దామ సువర్ణనూపుర పద ద్వయితో[2] సతియొప్పెఁ జూడఁగన్. 286

చ. కనకముఁ జెక్కిపుచ్చిన ప్రకారమునన్ గిరిగొన్న వన్నియుం
దనరునితంబ బింబమును దామరమొగ్గల యగ్గలంబుఁగా
దనుకుచ కుంభయుగ్మము, నుదగ్రసుధారస పల్లవోష్ఠముం
గనుఁగొన నొప్పసింతికి జగత్రయజైత్ర చరిత్రసంపదన్. 287

---

1. ప్రా. పా. నాస్య హాస్య చంద్రిక. 2. ప్రా. "నూపురవరద్వయి."

సీ. నెత్తమ్మిరేకుల ౹ నెఱిమించునడుగులఁ
గ్రొత్తలత్తుక నీరు ౹ గులుకుచుండఁ
గోమలరంభాభి ౹ రామంబులగు తొడల్
బిగియూరునను జాఱు ౹ నిగల నిగుడఁ
గలికి జక్కవపోయ ౹ గము మీఱు కుచకుంభ
సౌభాగ్య గర్వంబు ౹ సంభ్రమింప
మరునారసంబుల ౹ మాడ్కి మిటారంపుఁ
గ్రొవ్వాడికొన గోళ్లు ౹ నివ్వటిల్ల
తే. నలరుఁగెమ్మోవి నమృతహా ౹ సంబు దొలఁక
వెడదకన్నుల మద రేఖ ౹ విస్తరిల్ల
మనసునిండిన నిండు జ ౹ వ్వనముతోడ
మరులుగొలుపంగఁ దొడఁగె న ౹ మ్మాన్యయమగువ. 288
సీ. కుచములమెత్తిన ౹ కుంకుమగంధంబు
నీరనురాగంబు ౹ నెలవు చెప్ప
నిటలభాగంబున ౹ నెలవంక కస్తూరి
కారేఖవలపు చీ ౹ కట్లు గొలుపఁ
గొప్పునఁ దుఱిమిన ౹ గొజ్జంగి రేకుల
నెత్తావిపవనంబు ౹ నిర్వహింప
వలుదపిరుందుపైఁ ౹ జెలువారు వలిపట్టు
వలువవెన్నెలరేకు ౹ వన్నెఁదాల్ప
తే. నాసికారత్నతాటంక ౹ నవ్యహార
చారుకంకణ కాంచిమం ౹ జీరరుచులు
మేలి తనులక్ష్మికొసఁగు ని ౹ వాళిగాఁగఁ
జెలువరతియోగ్య భూష[1]ణ ౹ శ్రీలఁదోఁచె. 289
మ. మదగర్వంబును యౌవనోదయము ర ౹ మ్యత్వంబు మాధుర్యమున్
మృదులాలాప దరస్మితాంశుకలనా ౹ స్మేరాననాబ్జంబు పెం
పొదవన్ మన్మథరాజ్యలక్ష్మి క్రియనే ౹ త్రోత్సాహ సంపత్కళా
సదనంబై విలసిల్లె నాకపటు భా ౹ షాదేవి లీలాగతిన్. 290
ఉ. అంగనయంగదీప్తి యమృ ౹ తాంశుమయూఖతరంగరేఖను
ప్పొంగుచుదీపమై యచటఁ ౹ బొల్పెసలారెడు బ్రహ్మతేజమున్
భ్రంగపడంగఁ జేసె నభి ౹ రామ గుణాంబికఁ జెప్ప నేలయ
య్యంగజ దివ్యతేజమున ౹ కడ్డమె యూవెడ బ్రహ్మతేజమున్. 291

1. "లక్షణశ్రీల."

క. అమ్మాయ పొలతిఁజూచిన
నమ్మాయానాటకుండు హరిదాసైనం
నెమ్మదిధైర్యము వదలఁడె
యిమ్మైఁజపలాత్ము బ్రహ్మ నేటికిఁ జెప్పన్. 292

తే. ఆవిలాసిని రసహావ భావలీల
మరుఁడు బహురూప ధారియై మానవేంద్ర
నిశితపుష్పాస్త్ర పూర్ణ తూణీర సహితుఁ
డగుచుఁ గార్ముకగుణనాద మడరఁజేసె. 293

క. వెన్నెల రేకు విధంబునఁ
జెన్నగు వెలిదమ్మి పరపుచే నలరుచు న
త్యున్నత డోలాతల్పం
బన్నెలతుక దండరతుల యానలఁ జూపెన్. 294

క. ఉల్లమును మదనసాగర
కల్లోలంబనఁగడోలికాపర్యంకం
బల్లనగాడ్పునఁ దూఁగుచు
నల్లలనాహంసి కాత్రికయంబై యొప్పెన్. 295

వ. ఇట్లు త్రిలోకవిజయ ధ్వజినియగు రతిరాజ తేజంబునకు వన్నెపెట్టుచుఁ గన్నులకు వెక్కసంబైన చందంబైన నమ్మాయాసరస్వతి సనత్కుమారికావరుని శాసనంబు శిరంబునందాల్చి వాసనావశంవద మదాళి జాలంబగుచు సురత సమరఖురళీ నివాసంబై యొప్పునప్పువ్వుమేడలోన మధ్యప్రదేశంబునఁ బుష్పపీఠంబున సుఖాసీనయై పురోభాగంబున వాహన హంసంబును గెలంకున వజ్ర పంజరంబునఁ బ్రియకీర రమణియునుండ నియమించి, కుచకుంభంబునఁ బసిండి వీణెమోపి జాజుపయ్యెదతోఁ గర్ణావతంసకల్హార సౌరభ మధూళిబిందు సందోహంబునకుం బరిభ్రమించు చంచరీ కాంగనలుపట్టు శ్రుతులంగీకరించిన కరాంచలంబులం దంత్రులుమీటుచు మధురగానంబున బ్రహ్మనాదంబుగూర్చి బ్రహ్మవశీకార కామరాజమంత్రకలిత శృంగారగీతంబులు పాడుచుండె నప్పుడు. 296

క. గోపాల వేషధరుఁడై
శ్రీపతి వేణుస్వనంబు చెలఁగించు క్రియన్
బ్రాపించెఁ దన్మహా మా
యా పాటలగంధివీణికాయయు నునుమ్రోఁతన్. 297

వ. పెండియుఁ దనకుందానే సంకల్పదశావిశేషంబున. 298

### మాయాసరస్వతి వికారములఁ గనఁబఱచుట.

సీ. కన్నీరునించుఁ దొంగలిరెప్పలల్లాడ
నొకమాటుప్రియుఁడు రాకునికిఁ జేసి
కంపించునొకమాటు కౌఁదీఁగె చెమరింప
భర్తకౌఁగిటఁజేర్పఁ బట్టెననుచు
నవ్వులఁదేలునాననమొప్ప నొకమాటు
పతితోడ భావించు భావరతికిఁ
బులకించు నొకమాటు వలపుచన్నుల క్రేవ
లదరవల్లభుబీల నాత్మఁగోరి
తే. యంగజుఁడు వెల్లిగొల్పంగ నంగకముల
నెల్లకళజాఱ ధైర్యంబు పల్లటిల్ల
బ్రహ్మదేవునిపైఁ బ్రేమఁ బాఱవిడిచి
వీణియను మీటిపాడుచు విద్రుమోష్ఠి. 299

వ. ఇవ్విధంబున నవయౌవన మదోద్రేకంబున నుప్పొంగు మన్మథరసోల్లాసంబున నవ్విలాసిని యలవోకగా వీణవాయించుచు బ్రహ్మదేవునిం బ్రేరేపఁ దివురుచుండె నాసమయంబున. 300

క. ఆరామపుష్పమాలా
శారీరసుగంధ భరము సన్మ[1]ందమరు
త్ప్రేరితమై పైఁబర్విన
సారసభవు నింద్రియములు సంచలియించెన్. 301

క. పైగాలి వారినంతనె
యోగముచెడి మనసు గరఁగ నొగి బ్రహ్మకుఁ గాం
తాగురుకుచ పరిరంభా
భోగంబున నేము చెప్పఁ బురుషుల తలఁపుల్. 302

క. తనదీర్ఘయోగ భావన
కొనసాగక యింద్రియములఁ గోరెడు మదిన
వ్వనజజుఁడు తాల్మిజాలక
తనువున మరుమోహలహరి దగులుకొనంగన్. 303

వ. కొంతతడవెద్దియుఁ దలంపనేరక యూరకుండి యావివిక్త ప్రదేశంబునఁ జిత్తంబు మదనాయత్తంబయ్యె దీనికిఁ గతంబేమియనుచుఁ గన్నులు విచ్చి యచ్చట నచ్చ వెన్నెలచ్ఛాయం బ్రజ్వరిల్లుచు బ్రహ్మతేజంబునధఃకరించి యమృత ప్రవాహంబు చందంబున నయనానంద కందంబై దం[2]దడించు

1. సద్గంధ. 2. కందళించు.

నమ్మించు దీఁగెఁబోఁడి మైచాయఁజూచి యిదియేటి దీప్తియో, తెలియవలయుననుచు లేచి ముందట మన్మథపుష్పకంబునుం బోని పువ్వుమేడఁగనుంగొని వెఱగుపడుచు డాయంబోయి. 304

మ. శ్రవణోత్తంస వినీల నీరజ[1] గుణాశా సంభ్రమద్భృంగమం,
[2]ద్రవిరావశ్రుతి వీణెమీటుచు సుధాధారామనోహారి గా
నవిశేషంబునఁ గంటకాంకురవితానస్వేదముల్ పైకొనన్
బువుగద్దెన్ విలసిల్లుచుం గలికియై పుష్పాస్త్రు మేల్కొల్పుచున్. 305

బ్రహ్మదేవుఁడు మాయాసరస్వతినిఁ జూచి యత్యంతమోహమును బొందుట.

క. గురుకుచములఁ బయ్యెదకొం
గరజాఱఁగ మేనుమఱచి యనురాగముచేఁ
బరిపరివిధముల తను నా
దరమున నంకించి పాదుతరుణిం జూచెన్. 306

క. కన్నులకు వెక్కసంబై
యన్నెలతకు మదన పరవశాకార విలా
సోన్నతిశత ధృతి ధృతియను
మున్నీటికి మందరాద్రి మూర్తివహించెన్. 307

వ. ఇవ్విధంబున నుల్లంబుపల్లవింపంజేయు నా పల్లవచరణ రమణీయత్వంబును, నారంభోరు యూరుచారు భావంబును, నాపులినజఘన జఘనఘనత్వంబును నానతనాభి నాభిసౌభాగ్యంబును, నాతనుమధ్య మధ్యా[3]నుమితత్వంబును, నాలతాంగి యంగలౌల్యంబును, నాగురుకుచకుంభ కుచకుంభగాంభీర్యంబును, [4]నాబిసహస్త హస్తప్రశస్తలావణ్యంబును, నాకంబుకంఠి కంఠసముత్కంఠిత విభ్రమంబును, నాచంద్రవదన వదనప్రసాదమాధుర్యంబును, నాబింబాధర యధరసుధారస ధారయు, నాసుదతి దంతపంక్తి సొబగు కాంతియు, నామృదు కపోల కపోలపాలికాలాలిత్యంబును, నాచంపకనాస నాసికానిశ్వాససౌరభ్యంబును, నాచకోరాక్షి తీక్ష్ణకటాక్షంబును, నాసుకర్ణ కర్ణవర్ణనీయ శ్రీకారరేఖయు, నాశీతాంశుఫాల ఫాలభాగ పరభాగంబును, నానీలకచ కచనిచయ చాకచక్యంబును, నాసుకుమారి సౌకుమార్యంబును, నాసుందరి సౌందర్యంబును, నాయువతి యౌవనవర్గంబును, నావిలాసిని విలాససామగ్రియుఁ గౌతుకాశ్చర్యధుర్యంబగు మనంబున నేకాగ్రదృష్టిఁ బుట్టించిన మో[5]హాతిశయంబున. 308

1. ఆ. పా. నీరద. 2. మందవిరావాకృతి. 3. ఆ. పా. తనుమధ్యమధ్యాన వధ్యత్వంబును. 4. ఆ. పా. నాబిసరుహహస్తహస్తప్రశస్తలావణ్యంబు. 5. ఆ. పా. వాంఛాతిశయ.

క. ఈ లీలావతి కౌఁగిలి
చాలదె తాదాత్మ్య మొసఁగ ✽ సమధికయోగ
జ్వాలాముఖగత సౌఖ్యం
బేలా కాంక్షించెద[1]రు ము✽నీశ్వరులాత్మన్. 309

క. ఈలలన యౌవనాంబుధిఁ
దేలక యోగాగ్ని శిఖలఁ ✽ దేరెడునామే
నేలాగునఁ జల్లారెడుఁ
జాలు జితేంద్రియతఁ గల్గు ✽ సౌఖ్యములింకన్. 310

వ. ఇదియ మదీయతపః ఫలంబు నాతిపోఽధిదేవతయ యీరూపంబునఁ బ్రత్యక్షం
బైనది గాక కేవల స్త్రీమాత్రంబున కిచటికిం బ్రవేశింప నెట్లువచ్చునని తన
ప్రయత్నంబు మఱచి పట్టుకొనఁ దలఁచి కదియంబోయి. 311

క. ఒకచో వాహనహంసము
[2]నొకచోఁ బ్రియకీరరమణి ✽ యును జేతవిపం
చికయును నుండఁగ భారతి
యొకొ యని యటకొంతనిలిచి ✽ యొయ్యనఁ జూడన్. 312

ఉ. ఆ చపలాక్షి యంతటనె ✽ యాననమించుకయెత్తి ముందటం
జూచె సరోజసూతి, మరు ✽ చొక్కునఁబట్టఁ దలంచు చంచలుం
జూచి విపంచిడించి నగు✽చుం బువుగద్దియడిగ్గె మేఘలా
కాచకలధ్వనుల్ చెలఁగఁ ✽ గాఁబయికొంగు దొలంగ గ్రక్కునన్. 313

క. పువుగద్దె డిగ్గువడినను
బువుఁదీగెంబోఁడి తురుము ✽ పువ్వులురాలెన్
పువువిలుతు నక్షయములగు
పువుదూపులు వ్రాలెబ్రహ్మ ✽ బుద్ధి గలంగ[3]న్. 314

తే. అట్లు చనితూఁగుటుయ్యెల ✽ యావలికేగి
ముదిత తల్పంబుమాటున ✽ కొదుగఁబోవఁ
దనమనంబూన పఱచి యా ✽ తమ్మిచూలి
యంగజోద్రేకమునుబైఁ ✽ కొంగుపట్టె. 315

ఉ. పట్టినలజ్జయున్ భయము ✽ పాటిల, మైగరుపారలీలమై
గొట్టునఁబట్టనీక వెన✽గొంచుఁ గరంగుచునున్నఁ బోక యా
దిట్టమగండు ప్రేముడిఁ ద✽దీయ విధంబరయంగఁ గోరిలోఁ
దొట్టెడు కోర్కి వెల్లువలఁ ✽ దోఁగుచునిట్లనియెన్ మృదూక్తులన్. 316

1. పుదురు. 2. ఆ. పా. హంసం బొకచో బ్రియకరశుకంబు. 3. ఆ. పా. గలంగెన్.

క. బాలా నీవెవ్వరు నీ
వేలాగున వచ్చియుంటి వి విచ్చట నీకీ
కేళీ గృహమెట్లాదవె, గు
ణాలంకృత చెప్పవే ప్రియంబున నాకున్. 317

క. నీపేరుచెప్పి మధురా
లాపసుధాధార చేత లలన మనోభూ
చాపధ్వని నిర్ఘాతమ
హాపరితాపంబు మాన్పుమా కృపతోడన్. 318

వ. అని కామార్తుండై యధైర్యంబు దోపఁబలుక నిట్లనియె. 319

సీ. దేవ మహాత్మ నీదేవి నన్నెఱుఁగవే
సేవకురాలి వాణీవధూటి
నట్లు మార్కండేయుఁ డాడినఁ గోపించి
యబ్జజాండంబు శూన్యంబుచేసి
మీరు విచ్చేసిన మీతోడఁగూడి యీ
గుహకునే తెంచితిఁ గూర్మితోడ
బ్రహ్మనవలోకనపరత నావైదృష్టి
యునుపకుండితి గాక యుగ్రనిష్ఠ

తే. తావకాయల్లకార్తి సంతాపమంది
నాటనుండియు మిముఁగూర్చి నాసవిడిచి
చేయుచుందుదుఁ దపమిట్లు చిత్తభవుని
బారిపడలేక యీలీలఁ బరిభవించి. 320

క. దేవ మహాయోగివి నీ
కీవిధమున నార్తిఁబొంద నేటికి నేనీ
దేవిని స్వకీయఁగా నే
కావింపుము చిత్తకాంతుఁ కరుణాదృష్టిన్. 321

వ. అన నెవ్వరు నెఱుంగని యేకాంత స్థలంబగుటకు నితరసామాన్య స్త్రీగాక స్వతంత్రకులపాలికయగుటకు సంతోషించి యంతరంగంబున నుప్పొంగు ననంగ సాగరకల్లోలంబుల మునింగి నిర్నిరోధంబున నయ్యంగనం గవుంగలించి మించుటూగుటుయ్యాల యెక్కించి పంచశరకేళి ప్రపంచంబు విస్తరించి వలసి నట్లు పెక్కువేలేండ్లు గ్రీడించె. 322

తే. ఊర్ధ్వరేతస్కుఁడై దృఢ యోగశక్తిఁ
బటుతపోజ్వాలఁగ్రాగు తపస్వియైన

చెదరుసతిఁగన్న వాణికిఁ జెప్పనేల
మనసు పండని సన్న్యాసి మతమువాని. 323

సీ. అతిసూక్ష్మయోగ శాస్త్రార్థంబు శోధించి
విజ్ఞానసంపద విస్తరించి
కడుఁబ్రపంచము మిథ్య గాఁగ సిద్ధాంతించి
ద్వంద్వమోహంబుల తగులువిడిచి
యేకాంతియై యింద్రియేచ్ఛఁ బోవక యుంట
దృఢముగాఁ జిత్త మాత్మీకరించి
తనువులఁ బులకలు జనియింప నిర్మల
బ్రహ్మతేజోధ్యాన పరతనొంది

తే. యక్షయానంద రససుధ నాని యాని
తాన చిద్రూపమైయుండు తపముతపము
గాక తనకేల సిద్ధించుఁ గమలజునకు
భూమి భ్రమియింపఁ బోయిన పోటితపము. 324

సీ. అర్థార్థములమీఁద నరుచిపుట్టినదాఁక
సంసారమొకపాటి జరుపవలయు
నరుచిపుట్టిన పరుండగుచు నాసంసార
విషయభోగముదిగ విడువ వలయు
విడిచిమనంబు నిక్కడఁజెందు నందాఁక
నుచితసజ్జనగోష్ఠి నుండవలయు
మనసు నిల్చినదాని మఱచి బ్రహ్మముఁగన్న
దాఁకతపంబులఁ దలవవలయు

తే. బ్రహ్మమీక్షించి తపముల భారమెడలి
యవ్యయానందలహరి నింపారవలయుఁ
గాక తమకించి పట్టియాగ్రహముపూని
సేయుతామస తపమెందు సిద్ధిఁబొందు. 325

వ. అని యోగనిరూఢి యెఱింగించి గోవిందశర్మ ధర్మనందనునకు నటమీఁది కథ యిట్లనియె. 326

తే. తనవి చాలక దినదినోత్సాహరతికి
మనసుగొలుపుచు మన్మథోన్మాద వికృతి
మఱచెఁ దనబ్రహ్మయోగ సమాధి బ్రహ్మ
మన్మథ బ్రహ్మయోగ సమాధిఁబొంది. 327

సీ. అంతకంతకు లతాంతాస్త్రరసాంభోధి
    నోలలాడుచుఁ దృప్తి నొందలేక
బహువిధ రతులలోఁ బడి చిక్కి మగ్నుఁడై
    దష్టాధరుండు నిర్దళితనఖుఁడు
గాఢపరీరంభ గంభీరకుచకుంభ
    ఘర్మాంబు కలితవక్షస్స్థలుండు
నగుచుమన్మథ ముద్రలవయవంబులకు నా
    భరణంబులై యుండఁ గరముమెఱసి
తే. ఘనతపోధ్యాన సంధ్యాదికములు విధులు[1]
తనకు రతితంత్రములె కాఁగఁ దలఁపునిలిపి
వేదవిద్యా రహస్య వివేకమెల్ల
దగ్ధమైపోవఁ బ్రాల్మాలితమ్మిచూలి. 328
ఆ. లోలుఁడగుచు నిట్లు నాళీకజాతుండు
నిముసమైనఁ బాసి నిలువకెనయు
గాఢరతులకోర్వఁ గాఁజాలకా మాయ
లలననూరు రూపములు ధరించె. 329

{ మాయాసరస్వతి శతరూపములు ధరించి బ్రహ్మనుమిక్కిలి మోహింపఁ జేయుట. }

సీ. తారహారంబులు ధరియించి వెలిపట్టు
    వలువతో నొకమూర్తి వన్నెమెఱసె
నలినరాగ విభూషణములు ధరించి చెం
    గావితో నొకమూర్తి ఠేవఁజూపె
నవరత్నభూషణోన్నతిఁ జెంది చిత్రాంబ
    రంబుతో నొకమూర్తి రంగుమీఱె
విరులసొమ్ములును దామర నూలిచీరయుఁ
    గైచేసి యొకమూర్తి కరము దనరె.
తే. మృగమదశ్రీల నొకమూర్తి మేళగించె
కుంకుమాదృతి నొకమూర్తి కొమరుమిగిలె
మఱియు వేర్వేఱు విధముల మండనముల
నలరె మాయాసరస్వతి నలువయెదుట. 330
క. ఇందుముఖి నూరురూపులఁ
జెందిమనోజాతకళలఁ జెలఁగినఁ గడునా

1. విధుఁడు.

నందించి బ్రహ్మప్రీతిం
బొంది శతానందుఁడనఁగఁ బొగడొందె నృపా. 331

వ. అట్లు శతరూప విలాసంబులఁ గరంగించిన యమ్మించు దీఁగెబోఁడియందు శతానందుండు ననేక సంవత్సరంబులు సురత సౌఖ్యంబను భవించె. అంత నా రూపంబులన్నియు నుపసంహరించి యెప్పటి రూపంబు నెయ్యంబు చూపుచున్న గారవించి యొక్కనాఁడు సుఖపారవశ్యంబునఁ బట్టంబోయినఁ బట్టుబడక కొలంకుల నొదిగియుఁ బొదరిండ్లు దూరియు నోలంబులడాగియు నెలయించుచు గుహవెడలి తదీయద్వారంబున నిర్గమింప విరహాభారంబున కోర్వక వెను వెంట వెలికివచ్చిన నచ్చట నగ్రభాగంబున నటమున్న యదృచ్ఛాగతుండైన యమ్ముని శ్రేష్ఠుఁడు మునులతోఁ బ్రత్యుత్థానంబు చేసెనప్పుడు. 332

క. వెనువెంట బ్రహ్మదగులఁగ
వనజాసను తగులుపడక వచ్చి తదగ్రం
బున మెఱుఁగు దీఁగె వ్రాలెం
జననాథ యదృశ్యమయ్యె సభ్యులు చూడన్. 333

చ. పొలఁతి యదృశ్యభావమును బొందిన తాపసవర్యు లద్భుతా
కలిత మనస్కులై దిశలు గన్గొని యొండొరుఁ జూచి ముందటన్
వలపుల సోలుచున్ మరుని పోలిక తూపులగండ్లతోడ నా
విలమతినున్న పద్మజవివేకవిహీనునిఁ జూచిరందఱున్. 334

క. ఆదిగులుపాటు కంపము
నాదైన్యము నావిలక్షణాకారము నా
ఖేదము లజ్జయు నజుదుః
ఖోదధి కల్లోలడోల నూచె నరేంద్రా! 335

వ. అంత నంతయు విష్ణుమాయా వికారంబుగా నెఱింగి హరిందలంచి మోహనిద్రాముద్రితుండగు చతుర్ముఖునిఁ బ్రబోధింపసమయంబగుటకు సంతోషించి బ్రహ్మవాదియగు మార్కండేయుండు మునిసంఘంబుతోఁ జేరంబోయి నమస్కరించి యువ్విరించి కిట్లనియె. 336

సీ. దేవ మహాత్మనీ దివ్యావతారంబు
ప్రణుతింపఁ ద్రైలోక్య పావనంబు
సృష్టికిఁ గర్తవు సేవ్యుండవఖిలవే
దాగమవిద్యార హస్యవేది

వరయ నీవిట్టిమ ౯ హానుభావుఁడ వజ్ఞ
నట్ల చింతాక్రాంతి ౯ నలఁగఁదగునె
యమరనంయుమికోటి ౯ కారాధ్యుఁడగు విష్ణు
నాజ్ఞపూనుటకు నీ ౯ కనుచితంబె

తే. నలఁగితివి పెక్కు విధముల ౯ నాన విడిచి
తెలియు మిఁకనైన హరిమాయ ౯ తేఁట పడఁగ
నదిసరస్వతిగాదు మా ౯ యావధూటి
దానికిఁ బరితపింపకు ౯ మానసమున. 387

క. విడువు మహంకారము మదిఁ
బొడమింపుము బోధ సకల ౯ భువనస్తుతమై
యడరెడు సాత్వికగుణమున
నడుపుము హరిఁదలఁపు మనము ౯ నను సేవ్యునిఁగన్. 388

మ. విలసద్బోధ పథంబు సాత్వికగుణా ౯ వేశంబు తద్వృత్తిఁ బు
ష్కలవర్తుల్ చరియించుచో నితర సౌ ౯ ఖ్య శ్రీలు చేకొంద్రు, దు
ర్మలినాహంకృతి నిర్మథించి వినుమా ౯ ర్యస్తుత్య సత్యంబహం
యులు తత్సాత్వికవర్త్యులట్లుగ శుభం ౯ యుల్గారుసూ చూడఁగన్. 389

సీ. హరిమాయ జగములు ౯ హరిమాయ యాకాశ
మరుదగ్నిసలిల భూ ౯ మండలములు
హరిమాయ బ్రహ్మలు ౯ హరిమాయ యింద్రాది
సురకిన్నరోరగా ౯ సురగణంబు
హరిమాయ సూర్యుండు ౯ హరిమాయ చంద్రతా
రాగ్రహాతపతిమి ౯ రవ్యవస్థ
హరిమాయ గుణములు ౯ హరిమాయ పంచేంద్రి
యస్మరవికృతి కా ౯ మాదికంబు

తే. ప్రాభవోత్సాహ వీర్య శౌ ౯ ర్యములు జయము
భయము రతియు హాని లా ౯ భములు కృపయుఁ
గర్మతంత్రంబు హరిమాయ ౯ నిర్మలాత్మ
సత్యసాత్విక విజ్ఞాన ౯ సరణిఁజూడు. 340

సీ. బ్రహ్మంబు హరిగాఁగ ౯ భావింపు బ్రహ్మాండ
భాండంబు హరిగాఁగ ౯ మతిఁదలంపు
సత్యుండు నిత్యుండు ౯ శాంతుండు వైద్యుండు
చింత్యుండు హరిగాఁగఁ ౯ జిత్తగింపు

ముద్భవస్థితివిల § యోత్పాదన క్రియా
నిర్ణేత హరిగాఁగ § నిశ్చయింపు
వేద వేదాంతాది § విద్యార్థ తత్త్వంబు
హరినిరంజనునిగా § ననుమతింపు

తే. విమల విజ్ఞాన దీపంబు § వెలుఁగఁజేసి
మూఢతాహంక్రియా క్రోధ§ముద్రవిడిచి
యాత్మనాయకు నవ్విభు§నాశ్రయింపు
శాశ్వతైశ్వర్య సౌఖ్యంబు § సంగ్రహింపు. 341

వ. అని సమబుద్ధియగు నవ్వృద్ధముని యుపదేశించిన సత్యవాక్యంబులఁ బ్రబోధితుండై పితామహుండు విజ్ఞాన సుధాధౌత దురహంకార పంకకళంకంబై విమలంబైన హృదయంబున భక్తినిల్పుకొని యశ్రుధారా పూరంబులు దొరఁగు నయనంబుల దైన్యంబుదోఁప నూర్ధ్వబాహుండై ముకుళితహస్తంబులతోఁ గరుణాసాగరుండగుహరి నుద్దేశించి. 342

{ బ్రహ్మకు జ్ఞానోదయమై విష్ణుమూర్తిని స్తోత్రముచేసి యపరాధ క్షమ చేయుమని వేఁడుట. }

ఆ. ఓ యనాథనాథ § యో కరుణోదధి
యో భయాపహారి§యో మహాత్మ
యో జగత్త్రయేశ § యో సురాసుర పూజ్య
కలుషబుద్ధినైతిఁ § గావవయ్య. 343

ఉ. నన్నపరాధిఁగావుము వి§నమ్రుఁడ దీనుఁడ నీచకర్ముఁడన్
సన్నుపుబుద్ధి వాఁడఁగలు§ష క్రియుఁడన్ శరణాగతావ నా
భ్యున్నతమైన నీబిరుదు § భూవినుతంబు మదీయదుష్కృతం
బెన్నకు దివ్యచిత్తమున § నెగ్గులుపెట్టునె తండ్రి పుత్రునై. 344

ఉ. నీ మహనీయమాయను గ§ణింపఁగ నెంతటి వాఁడనేను మా
యా మయదుర్వికారుఁడ న§హంయుఁడ సంయమిభావితాత్మ ది
వ్యామరసేవ్యతావక శు§భాకృతిఁ జూపి కృతార్థుఁజేయవే
స్వామి సహస్రకోటి శిఖి§చంద్ర దివాకరతేజ సత్కృపన్. 345

సీ. సంతాపముడుపవే § జలజాయతేక్షణ
కృపఁజూడవే జగ§ద్వినుత కీర్తి
దీనతమాన్పవే § త్రిభువనాధీశ్వర
యభయ మీవే దేవ§తాగ్రగణ్య

నిర్వేదముడుపవే । నిర్నిరోధానంద
　　యుండగావే సముద్దండశౌర్య
వికలతవారింపవే భక్తవత్సల
　　సన్నిధిగావె ప్రసన్నహృదయ

తే. దివ్యరూపంబు చూపవే । దేవ దేవ
యాశ్వసింపవె సంరక్షితాశ్రితౌఘ
గారవింపవె సుజన మందార భూజ
యాత్మనాయక నామొర । యాలకించి 346

—●●◆ బ్రహ్మేంద్రులకు విష్ణుమూర్తి విరాడ్రూపము కనుపడుట. ◆●●—

క. పరమవిరాడ్రూపంబున
హరి సాక్షాత్కారమొందె । నాదిత్య సహ
స్రరుచిఁ వెలుఁగుచు బ్రహ్మకు
వరదుండై మోహతమము । వారింపంగన్. 347

వ. ఇట్లు పరమపురుషుండగు విష్ణుండు బాలసూర్య ప్రభాపటలచటుల పద్మరాగ మణి మకుట విటంక విలంబమాన పారిజాత ప్రసూన సౌరభ సౌభాగ్యంబు విస్తరించు మస్తక సహస్రంబును, శరచ్చంద్ర చంద్రికా సాంద్ర ప్రభాఖండ పుండరీకదళంబుల వెదచల్లు విలోచన సహస్రంబును, మంత్రకళాధి దైవత మధుకర నికర సంకలిత ఛందోబృందమంజీర మంజరీ రంజితంబైన చరణార విందసహస్రంబును, శంఖ చక్ర కౌమోదకీ శార్ఙ్గనందక ప్రముఖ దివ్యా యుధమయూఖరేఖా సమాశ్రయంబైన దీర్ఘబాహా సహస్రంబును, శోభిల్లఁ గనకమణిఖచిత మకరకుండల హారకేయూర కంకణముద్రికా కాంచీలతాది దివ్యాభరణ భూషితుండును, వక్షస్స్థలస్థిత వైజయంతీ స్రగావరణ మధ్య ప్రభాసిత కౌస్తుభపదక ప్రేంఖోళిత లీలాభినంది తేందిరాసుందరీ మందస్మిత ద్యోతమానగండస్థలీ ముకురబింబిత ముఖమండలుండును దివ్య పీతాంబర ధరుండును, దివ్య గంధానులేప మనోహరుండును, దివ్యసౌందర్య ధుర్యుం డునునై చరణాంగుష్ఠ నిష్ఠ్యూతసురుసరిత్పూరంబుల నఖకిరణ కదంబ కాదం బంబుల నోలలాడించుచు, దివ్యమాణిక్య శృంగసంగతంబై మూర్తివంతంబై తోఁచిన మహామేరువు చందంబున నపరిమిత తేజోరాశియై శృంగార వీర కరుణామృత రసస్వరూపంబగు రూపంబునం బ్రదీపించుచు నిత్యముక్తులైన సనక సనందన సనత్కుమార వామదేవ నారదాది బ్రహ్మయోగీంద్రులు చామరచ్ఛత్రధ్వజాది సేవావిధానంబుల నుభయపక్షంబులం గింకరులై సేవింప నాభివలన నంతరిక్షంబును, ప్రాణంబులవలన పవనంబును, ముఖంబు

వలన బ్రహ్మేశానశేంద్రులును, స్వేదంబువలన నదనదీ సముద్రంబులును, పాదంబులవలన భూమియుఁ, జూపులవలన సూర్యుండును, మనస్సువలనఁ జంద్రుండును, శ్రోత్రంబువలన దిశలును గల్పించి, బ్రహ్మనాదంబున నోంకారంబును, దివ్యభాషణంబుల వేదంబులును, శ్రవణ నాసికారంధ్ర రోమకూపంబులవలన వసురుద్రాదిత్య విశ్వేదేవ యక్షరాక్షససిద్ధ విద్యాధరోప్సరో గణంబులును, చతుర్విధ జంతుసంతానంబును నుద్భవింపంజేయుచు, నవాఙ్మానసగోచర ప్రభావంబైన యాతేజంబుచూడ నశక్యంబని కరుణించి మార్కండేయాది మునీంద్రసంఘంబునకు నార్తుండై ప్రార్థించు నవ్విరించికిని దివ్యదృష్టి ప్రసాదించె నప్పుడు. 348

క. లక్షసూర్యమండలము లొక్కవడువునఁ
గూడియున్న నైనఁ జూడవచ్చుఁ
గానియట్టి దివ్యకమైన తేజముచూడ
నరిదివిసుము పాండవాధి నాథా. 349

క. ఆతేజోమూర్తి నుమీ
భూతలవర నీమరంది పురుషవరేణ్యుం
డాతత కరుణాజలనిధి
యాతురబాంధవుఁడు గృష్ణుఁడరయుము బుద్ధిన్. 350

క. నయవంతులు దృఢయోగ
ప్రయతధ్యానానురూఢి భావములోనన్
నియమించి కాంచుతత్త్వ
దయమా తేజంబు నువ్వొ ధర్మవిధిజ్ఞా. 351

క. ఆముని సంఘము దానును
తామరరాచూలి యద్భుతంబును భయముం
బ్రేమయు భక్తియుఁ బొడమఁగ
భూమింబడి పొరలిపొరలి పొరి బొరి మ్రొక్కెన్. 352

వ. ఇట్లు సాష్టాంగదండ ప్రణామశతంబులు సమర్పించి రప్పుడు పద్మసంభవుండు పరమవిరాడ్రూపంబునం దనవంటి బ్రహ్మలను సురాసురాదిజంతు సంతానంబును బుట్టించుచుఁ, దనచేసిన యంధకారంబు విరియింపుచుండెఁ దేజోరాశియైయున్న యన్నారాయణుని నవలోకించి పులకించి దృగంచలంబుల వెడలున శ్రువులు రెప్పల తుదనప్పళించుచు మోదప్పఁగేలుదోయితో నోంకారపురస్సరంబుగాఁ బురుషసూక్తంబును నారాయణోపనిషత్తును జదివి వేదశాస్త్ర పురాణేతిహాస పర్యాయంబున నిట్లని స్తుతియించె. 353

సీ. జయపరబ్రహ్మ శాశ్వత నిరంజననిర్వి
కల్పనిత్యానంద కవివరేణ్య
జయ త్రిగుణాతీత సత్యస్వరూప ని
ర్మలశాంత పుష్కలారాధ్య చరిత
జయమహాయోగీంద్ర జయసాంద్ర కారుణ్య
జయయగణ్యాకార జయయనంత
... ... ... ...
... ... .. ...
తే. ... ... ... ...
... ... ... ...
... ... ... ...
... ... ... ... 354

సీ. వేదౌఘములు నీవ వేదోపనిష దర్థ
రాద్ధాంత తత్వసారంబు నీవ
ధ్యానంబు నీవ ధ్యేయస్వరూపము నీవ
తత్ఫలారూఢ మోదంబు నీవ
ప్రకటిత బహుతర బ్రహ్మాండ నిర్మాణ
కుశలుండ వీవ తద్గురుఁడ వీవ
జననరక్షాలయాచరణ దక్షుఁడ వీవ
జీవాత్మ పరమాత్మ భావమీవ

తే. పూజ్యపూజక పూజా విభూతివీవ
పంచతత్వాశ్రయము నీవ పరమపురుష
వర్తివీవ చిదానంద మూర్తివీవ
త్రిభువనోదార చారిత్ర శ్రీకళత్ర. 355

సీ. బ్రహ్మాండ కోటులు ప్రభవించు నీమహా
మాయఁ దద్బ్రహ్మాండ మండలముల
కధిపతులైన బ్రహ్మలనేకు లఖిల చ
రాచర విధసృష్టి యాచరించు
వారు తత్సదృశులుదార తేజులు బ్రహ్మ
మను మహేంద్రాదులు మఱియుఁ గలరు
పరికింప లోకాధిపత్యమాత్రము బ్రహ్మ
గాని సామర్థ్యంబు కలిమినంత

తే. కంటెరయోగీంద్ర దివ్యసంశ్రఘంబు గలదు
తలఁప నిటువంటి దగుసృష్టి కలనలోన
నొకఁడ రాజస దురహంక్రియోద్ధతుండ
నీకనీతత్వ మెఱుఁగ నే నెంతవాఁడ. 356

క. నీపాద సేవకులలో
నేపారఁగ నొకనిగాఁగ నెఱపుము కరుణా
రూపమున బ్రహ్మపదవీ
వ్యాపారము చాలునాకు నఖిలాధిపతీ. 357

చ. ఘనుఁడు మృకండు పుత్రుఁడు జగద్వినుతుం డతఁడేమి చెప్పచె
ప్పిన హితభాషణంబులవి బేలతనంబునఁ జేయనైతి నాఁ
డనుమతిఁజేసి మత్సర మహార్ణవ మగ్నుఁడనై చలంబునన్
జనక తదీయ దోషము మనంబునఁ బెట్టక ప్రోవవేదయన్. 358

క. నీతత్వ నిశ్చయస్థితి
నాతరమె యొనర్పలోకనాయకవిద్యో
పేతులు యోగీంద్ర వరులు
నాతురమానసులుగాఁగ నవ్యయపురుషా. 359

వ. అని విన్నవించిన విరించి ననుగ్రహించి క్రమ్మర బ్రహ్మాధిపత్యంబును విజ్ఞానో
దయంబును గరుణించి చతుర్దశ భువనంబులకుం బ్రమదంబొనర్చి సకల
సురా సురార్చితుండై మార్కండేయుని వీడుకొల్పి తనుగూర్చి మాయా
జయంబునకై తపంబుసేయు నమ్మందర గిరివాసులగు మునీంద్రులకు దివ్య
సాయుజ్యంబు ప్రసాదించి యంతర్హితుండయ్యె నప్పుడు. 360

బ్రహ్మ యథాప్రకారంబు బ్రహ్మాధిపత్యంబు సేయుట.

తే. బ్రహ్మ తేజంబు తొంటి పగిది బ్రహ్మ
బ్రహ్మసింహాసనాగ్ర విభాసియగుచు
భువనములు నడ్పుచుండె విభూతి మెఱసి
బ్రహ్మముని దేవదానవ ప్రతతిగొలువ. 361

ఈ కథయొక్క ఫలస్తుతి.

క. బ్రహ్మస్వరూపమగు హరి
బ్రహ్మకుఁ దనకేళిచూపి పరగినపరమ
బ్రహ్మోపదేశ చరితము
బ్రహ్మానందము నొసంగుఁ బార్థివచంద్రా. 362

వ. అని గోవిందశర్మ ధర్మనందనునకుం జెప్పెననిన విని పరీక్షిత్తట మీఁదటి కథాప్రసంగం బెట్లుండెనని శుకబ్రహ్మ నడుగుటయును. 363

శా. గంగా సంగపదాంబుజ ద్వయయశో శ్రీ గంగాతరంగావళీ
రంగత్పద్మ భవాండకుండలికులేంద్ర ప్రౌఢ పర్యంక సా
రంగాంకా భరణాద్భుత ప్రకృతకర్మ స్ఫారసంసార ఘో
రాంగారార్త సుధాపయోధర జగద్వ్యాకీర్ణ పుణ్యోదయా. 364

క. శుకసనక సనందన శౌ
నక భీష్మవ్యాసవిదుర శ్రీ నారద పవమా
నకుమార ప్రహ్లాద బ
లికిరీటి వసిష్ఠముఖ ఫలిత సురభూజా. 365

తే. చతుర్వేదవేద్యా శ్రీ చతుర్వక్త్ర చోద్యా[1]
చతురుక్తి దాతా శ్రీ సతీయుక్తపతీ
సతీవామపతీ శ్రీ సతీమాతృపాదా
... ... ... ... 366

ఇది శ్రీ మదనగోపాల చరణకమల సేవాధురీణ సత్కళాపారీణకృష్ణ
భట్టారకపౌత్ర చింతలపూడికామయప్రభుపుత్ర సుకవి
వర్యరాధామాధవయల్లనార్య ప్రణీతంబైన
విష్ణుమాయానాటకంబునందు
తృతీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

---

1. బోధ్యా.

శ్రీ ర స్తు.

# విష్ణుమాయానాటకము.

## ఆశ్వాసము. ౪.

క. శ్రీరాధా మదవద్వ
క్షోరుహమకరీకలాపశోభనముద్రా
ప్రారంభ జృంభి[1]సునిశిత
ధారానఖజాల నవమదన గోపాలా. 1

తే. అవధరింపుము దేవ సంయమివరుండు
సకల వేదాంత విద్యా విశారదుండు
శుకమహాయోగి పలికె నుత్సుకతమరియు
నింపుగా నాపరీక్షిన్నరేంద్రుతోడ. 2

వ. ఇవ్విధంబున శతానందుని కథ చెప్పి గోవిందశర్మ ధర్మనందనునకు విష్ణుమాయవలన శివుండు మోసపోయిన తెఱంగు విశదంబుగా నెఱిఁగింప సమకట్టె.

మ. విను విశ్వక్షితిపాల మౌళివలభీ విస్ఫారరత్న ప్రభా
కనదుద్దామ పదారవింద త్రిజగత్కల్యాణచారిత్ర పాం
డు నరేంద్రోత్తమపుత్ర యీమునిగరిష్ఠుల్ నీవునుంగూడి యెం
దునకుం జిత్తముఁ బోవనీక హరియందు న్నిల్పి సంప్రీతితోఁ. 4

వ. అని కొలువు సావధానంబు గావించి. 5

### సముద్ర మథనప్రశంస.

సీ. ఆదికాలమున మాయావక్రియగు చక్రి
యనుమతి నమృతార్థ మమరగణము
నమరారిగణము దుగ్ధాంభోధి మందర
మంథానదండ సమగ్రశక్తి
నహిరాజ దామకంబడరించి మథియింపఁ
బుట్టె నుగ్రానలస్ఫూర్తిఁ దొలుతఁ
గాలకూటము దానిగతి కోర్వఁగాలేక
దేవదానవులార్తిఁ దిరుగుపడఁగ

1. అ. పా. జృంభ.

తే. వారికిఁ బ్రియముగవారికి ఽ నభయమిచ్చి
యావిషజ్వాల ఫాలాక్షుఁ ఽ డా హరించి
కాలకూటాశనుండనా ఽ ఖ్యాతివడసి
తారగిరి కూటమున కేగె ఽ ధర్మతనయ. 6

సీ. కల్పపాదప పింఛ ఽ కము నప్సరస్త్రీలు
కామధేనువును జిం ఽ తామణియును
నుచ్చైశ్శ్రవంబు మ ఽ దోత్కటంబగు చతు
ర్దంతియు జనియించెఁ ఽ దరువఁ దరువ
నవి యింద్రయోగ్యంబు ఽ లయ్యె వెండియు లక్ష్మి
యును దులసియు జనిం ఽ చిన విరించి
జనకుండు విష్ణుండు ఽ సంప్రీతిఁ గైకొనెఁ
గ్రమ్మఱ నమృతకుం ఽ భమ్ముతోడ

తే. సకలలోకైకరతుని వి ఽ శాలబుద్ధి
యంత ధన్వంతరియు నుద ఽ యంబునొందె
మహితమందర మంథాన ఽ మథ్యమాన
మానితాంభోనిధానంబు ఽ మధ్యవీధి. 7

క. కుముదముద జృంభితంబగు
హిమకర బింబంబుపోలె ఽ హృదయోత్సవమై
విమలస్ఫటిక ఘటంబున
నమృతము పరిపూర్ణరుచుల ఽ నమరెన్ జూడన్. 8

ఉ. అయ్యమృతంబుచూచి యమ ఽ రాసుర సంఘములబ్ధిఁ ద్రచ్చుటన్
సయ్యనమానిరంత బలి ఽ శాసనమూఁది సురారులుద్ధతిన్
గొయ్యతనంబుతో నమృత ఽ కుంభముఁ గ్రక్కున నాక్రమించి మా
కయ్యెరివేఱ యొక్కయెడ ఽ నందఱుఁ బాలిడ సోహటింపు[1]చున్. 9

క. వెలవెలఁ బాఱిరి వేల్పులు
తలచెదరి సుధాఘటంబు ఽ దైత్యులు గొనినన్
బలవంతులు గొనునర్థము
బలహీనులు దిరుగ[2]ఁ గొనుట ఽ భారముగాదే. 10

క. పాలిక యమృతకలశం
బాలీల సురారికోటి ఽ హరియించినదే
వాలి యుపాయవిహీనత
నాలం బొనరింపసేన ఽ నడరించుటయున్. 11

1. అ. పా. "పగాన్." 2. అ. పా. మగుడ.

తే. భూత భావిభవత్కాలముల విశేష
గతులుదెలిసిన యమ్మహా కార్యవేది
శౌరి యిదివేళగాదని సంజ్ఞఁజేసి
జంభమర్దన సైన్యసంరంభముడిపె. 12

చ. హరిహయుఁ డబ్జలోచనుని యాజ్ఞ బలంబుల గుస్తరించి సం
గరమొడలించి తియ్యమొనఁగ న్నయవాక్యవిశేష చాతురీ
గరిమను బాలువెట్టుఁడు సగంబమృతంబని చేరి పల్కుచున్
వెరవున రాక్షసేశ్వరుల వేడుచునుండఁగ నంతనవ్వలన్. 13

విష్ణువు మోహినీకాంత యగుట

మ. త్రిజగన్మోహన మూర్తియైన హరినారీ రత్నరూపంబునన్
గజయానంబున నందియల్మొరయ వీక్షాపుండరీక చ్ఛద
వ్రజముల్ సల్లుచు మందహాసమొసఁగ న్వక్షోజముక్తావళీ
భజనన్ వే చనుదెంచెఁ గామకలనా పాథోధికల్లో[1]లయై. 14

తే. అలసయానంబుతో వచ్చి యమరదైత్య
బలము నడుమ విలాసంబు పరిఢవింప
మోహమాయాంధకారంబు ముంచుకొనఁగ
నిలిచె శృంగారమూర్తి నా నీలవేణి. 15

ఉ. వెండియు దుగ్ధసాగరము వెల్వడివచ్చెనొ లక్ష్మినామరు
న్మండలము న్మరుద్విమత మండలమున్ మదనార్తిఁబొంది యొం
డొండ సమాకులం బగుచు నుల్లసిలన్ దరహాస చంద్రికా
మండిత దృక్సుధాలహరి మానినిముంచె సమస్తలోకముల్. 16

మ. తరళత్వంబు విలోచనంబులకుఁ జేతఃపంకజ శ్రేణికా
తురభావంబు నిదాఘమంగములకున్ దోడ్తోన పాటిల్లఁగా
సరసీజానన పుష్పసాయక సహస్ర శ్రీకశృంగార సా
గరమూర్తిం జనుదెంచినిల్చిన దివౌకః పూర్వదేవాళికిన్. 17

సీ. తరుణారుణాంఘ్రి పద్మద్వయీ లాక్షాప్ర
భాస్ఫూర్తులింద్ర గోపములుగాఁగ
నవరత్న ఖచితమం[2]డన బహుచ్ఛాయా క
దంబంబు శక్రచాపంబుగాఁగ

---

1. ఆ. పా. కలోలి. 2. ఆ. పా. నవరత్నమండనోన్నత భవచ్ఛాయాక.

కుచకుంభచిత్రిత గోరోచనాపత్ర
లతలు సౌదామినీలతలుగాఁగ
గమన లీలోచ్చల త్కచభార విచికిల
సూనముల్ వడగండ్లు సొంపుగాఁగ

తే. కాంచి ఘంటా నినాదంబు గర్జగాఁగ
లలనకందర్ప పర్జన్య లక్ష్మి వ్రాలె
దివిజదైతేయ చాతకోత్సవముగాఁగ
వాలు జూపుల నమృతంపు వానఁగురిసె. 18

సీ. ఆత్మసంజాత రోషానలచ్ఛట వెంపు
విరహసద్దావాగ్ని బురుపుకొనియె
వైరిబాణోన్ముఖత్వంబు నేత్రాపాంగ
వైశాత శరపరంపరలఁ దొడరె
నన్యోన్యలక్ష్మీసమాహరణప్రీతి
యౌవన సంపత్తి నావహించె
సమరభూ జయసముజ్జ్వలకీర్తి సంప్రాప్తి
వికచహాసేందు చంద్రికలఁగలిసె

తే. నమృతకుంభంబు పైనున్న యాశఁరుచుల
మించు కుచకుంభయుగళంబు మీఁద నిలిచె
నేమిచెప్పుదు నింద్రాసురేంద్ర ముఖుల
రాజగన్మోహనాంగి ప్రశత్యత్తమైన. 19

సీ. అభినవలీలా సితాంభోరుహంబని
కమనీయ ధవళశంఖంబనియును
శృంగారముగ నిండు చెంగల్వకచ్ఛని
ప్రభమించు కౌస్తుభాభరణమనియుఁ
బసపు కుంకుమచాయ పట్టు పుట్టంబని
సిరిమించు కనకకౌశేయ మనియుఁ
గ్రొత్తహత్తించిన లత్తుక రసమని
కమలరజోమిళ ద్గంగయనియుఁ

తే. గామవళ వళయైయున్న కామినియని
విష్ణుకితవవిలాసి నీవేషమనియుఁ
దలఁచు నమరాసురర్షి సంతతి పొలంతి
యైన దైత్యారిమేని చిహ్నములఁ జూచి. 20

—◆— మోహినీకాంతనుజూచి సురాసురులు మోహపడుట. —◆—

తే. అటుల నమ్మోహినీదేవి ఽ యమరగణము
నసురగణమును నీక్షింప ఽ నసమబాణ
కల్పలతవోలె మదనాగ్ని ఽ కళికవోలె
సంతసంబును దాపంబు ఽ సంభవించె. 21

శా. మాయానిర్మిత విశ్వలోకుఁడగు శ్రీఽమద్వాసుదేవుండు తా
మాయామానినియై విలాసకలనా ఽ మాధుర్యముం జూపఁగా
నాయింద్రాసుర రాజసైన్యము లెయ్యేఽలా! మోహవిభ్రాంతులై
శ్రేయస్సిద్ధ మునీంద్రులైన మదనాఽర్చిష్మచ్ఛిఖం గ్రాఁగరే. 22

శా. ఆలీలావతి సర్వమోహన కళాఽహంకార రేఖాస్థితిన్
లీలాలంకరణాభి రామయగుచున్ ఽ లేఖాసురశ్రేణితో
మేలంబాడుచు రాఁగ నింద్రబలులున్ ఽ మీనాక్షివేడాసి ర
ట్లాలోకింపఁగఁ గర్మయుగ్మక మవిఽద్యం జెందు చందంబునన్. 23

వ. అప్పుడు. 24

చ. ఇది తన యిచ్ఛనుండెడి దో ఽ యెవ్వనికైన నధీనయైనదో
మదననిధాన దేవతకు ఽ మాఱటయై విలసిల్లుచున్నదీ
మదవతి యెవ్వతేనియును ఽ మానకపట్టెద నేననేన యి
య్యదనుననంచు నందఱుఁ బ్రఽయత్నము నొందిరి రెండుసేనలన్. 25

క. ఆమాయా మోహినియును
నామై దరహాసచంద్రిఽకామృతవీచీ
దామముల వాని వానికిఁ
గామించిన యట్లుమేలు ఽ గైకొల్పెన్నృపా. 26

వ. అవ్విధంబున నాదేవేంద్ర బలిదానవేంద్రులు సాంద్రానురాగంబున దగ్గరిన మొగ్గరంబులువిరిసి సకలసైన్యంబులు నొక్కపెట్టునఁ జెలియలికట్ట నతిక్రమించి వచ్చు సమయసముద్రతరంగ సంఘంబులభంగిఁ జుట్టుకొని యాలతాంగి యంగలావణ్య సరోవరంబున నోలలాడుచూపులును, వానికి మున్నాడి యయ్యిందువదన దరహాస చంద్రికామృతపూరం బాస్వాదింపం దివురు నాలుకయును, దానిందలకడచి యాపద్మగంధి బంధురశారీర సౌరభం బాఘ్రాణింపందలంచు నాసికయును దానింద్రోచి యాశుకవాణి వీణామధుర భాషణ మకరందబిందు శైత్యంబునం బరిణమింపఁ దలపెట్టు చెవులును, వాని నతిక్రమించి యాయువతి యౌవనమదోద్వృత్తపయోధరకుంభపరిరంభణంబునకు నభిముఖంబులై గరుపారు చేతులునునై, పంచేంద్రియంబులు నిస్తం

ద్రంబులై హృదయంబును బోధింపం జూచుచుండె నయ్యవసరంబున నా
బింబాధరకు దేవరాజ దనుజరాజు లిట్లనిరి. 27

ఉ. ఎక్కడనుండివచ్చితివి ఽ యెయ్యవి నీశుభనామ వర్ణముల్
నిక్కము చెప్పి వీనులకు ఽ నెయ్యమొనర్పుము స్వేచ్ఛదానవ్రా
యొక్కని యాలవ్రానురనరోరగ ముఖ్యులలోన నీక్రమం
బక్కజమయ్యెడిన్ సరసిజానన చూడము నిన్ను నెన్నడున్. 28

క. మాయంతఃకరణంబులు
నీయెడ ననురాగ లీల ఽ నిలిచినవి యన
న్యాయత్తములై చిత్త భ
వాయుధకృత్తంబులై సురాసురపూజ్యా. 29

వ. అని పలికిన నాకలికిచిగురాకుఁబోఁడి వాడిదేరిన నిడువాలుచూపుల సేన పయిం గలువరేకులవాన గురియుచు మందహాస మధురంబులైన మృదు వాక్యంబుల నిట్లనియె. 30

శా. ఏనిచ్ఛావతినై చరింతుఁ బతిలేఁడెవ్వాఁడు నాకొక్కరుం
డేనాఁడుంగను దృష్టిపెట్టె మదిలో ఽ నెవ్వాఁడు నేవాని బ్ర
హ్మానందంబునఁ దేల్తు వేతెఱఁగుచో ఽ నాసక్తుఁడెవ్వాఁడు దా
వానిం గైకొన, తాపదగ్ధుఁ డయిపోవం జేతు నాపోకలన్. 31

సీ. నానెఱిఁజూచిన ఽ ననుపారి యతులైనఁ
దలఁపొందు దిక్కులఁ ఽ దగులనీరు
నా నామవర్ణముల్ ఽ వీనులఁ బడనేని
విజితేంద్రియులకైన ఽ వేడ్కనిలుచు
నాదృష్టిసోకిన ఽ మోదించి నిర్వాణ
మతులైన నాయొద్ద ఽ మరగియుంద్రు
పొందుగా నామైత్రిఁ ఽ జెందిన బ్రహ్మ యో
గీంద్రులకైనను ఽ నింపుబుట్టు
తే. చూచిచూడఁగ లేరునా ఽ సొబగు జనులు
మేలుగలచోట వర్తింతుఁ ఽ గేళిగతుల
నెవ్వరేలాగు ననుఁగూడ ఽ నిచ్ఛగింతు
రట్లనేనును వారల ఽ ననుసరింతు. 32

వ. ఇది యస్మదీయ ప్రవర్తనంబు మీరలు దుగ్ధజలనిధిమథించి యమృతంబు సంపాదించి సహృదయంబునం బంచుకొననేరక విరసించి పోరఁదలంచితిరని గగనవాణివలన విని మీయిరువాగునకుం బోరులేకుండ నమృతంబు పంచి పెట్టెదనని వచ్చితి. మీ రెండు తెఱంగులవారికి సమ్మతంబగునేని యొక్క

పత్రంబున నానేర్చినట్లు పంచిపెట్టెద కాదేని యెందేనియుం బోయెదనని యను
రాగంబునెఱపి తగవుదోఁపఁబలికిన నందఱు నేకవాక్యంబున నిట్లనిరి. 33

ఉ. వీనులు సంతసిల్లె నరవింద దళేక్షణ తావకీనవా
చానయమాధురిన్ సకల సమ్మతమయ్యె భవత్ప్రయోజనం
బీనిపుణత్వ మీజగతి నెవ్వరికున్నది మమ్ము మన్మథా
ధీనుల నీసురాసురుల నేలుము పుణ్యకటాక్ష దృష్టులన్. 34

క. అమృతము మాకేటికి నీ
యమృతోత్కృష్టంబులైన యాలాపములున్
మమకారంబును జాలదె
రమణీ నీయాజ్ఞమా శిరంబుల నిలిచెన్. 35

క. నీమాట కడుగు దాఁటము
నేమెవ్వరమిందు మాకు నియమముగానీ
కోమల చరణాబ్జంబులు
భామిని ముట్టుదుమె నీకుఁ బ్రత్యయమొందన్. 36

వ. అని సమయంబుచేసి రప్పుడు. 37

మ. అమృతం బేటికిఁ బ్రాణమేఁమిటికి రాజ్యంబేల యన్యాభి లా
షములం జెందు సుఖంబులేల మదనోత్సాహోద్భవైతద్వధూ
కమనీయాధర పానసంజనిత సౌఖ్యంబబ్బినం జాలునం
చమృతం బిచ్చిరి దానవుల్ హరికి మాయామోహినీమూర్తికిన్. 38

ఆ. అమృతకుంభమిచ్చి రంభోజపత్రాక్షి
కాత్మజీవరక్ష యనక యసుర
లేణలోచనలకు నీరానివస్తువు
గలదె యెట్టిదైనఁ గాముకులకు. 39

వ. అట్లు పలికి ప్రముఖులైన రాక్షసులు దయాధర్మ విహీనులు గావునఁజేతి
కందినఫలం బనుభవింపనేరక యయ్యమృతంబు మాయావినైన హరిచేతి
కిచ్చి యొక్క బంతిఁగూర్చుండి రప్పుడు పురందర ప్రముఖ బృందారకులును
దారొక్కవంకయైకూర్చుండి రిట్లు రెండు దెఱంగులవారును రెండుబంతులై
యుయ్యెంతి తమకమృతంబు వడ్డింపంగుడుచు వేడుకనుండి రంత. 40

చ. అమృతముహస్త పంకజమునందు వహించి మురారి దేవతా
సమితికి నైజరూపము ప్రసన్నము సేయుచుఁ జూపెఁజేతి య
య్యమృతము, దానవాళికిఁక నాడుదనంబె ప్రకాశమానమై
యమరగఁజేసి చూపె దరహాసరసామృత మాదరంబునన్. 41

క. కనకాంబర పల్లవయును
కనకాభరణ ప్రసూన కళికయునై యా
వనఫల భరమున నొప్పెఁ
వనమాలిని దనుజకల్ప వల్లికపోలెఁ. 42

వ. ఇవ్విధంబున దేవతలు తూర్పుమొగంబునుం బూర్వదేవతలు పడమటిమొగంబునునై ముందటం గనకమణి పాత్రంబులు వెలుంగం గూర్చుండిన నవ్వధూరత్నంబు ప్రయత్నంబున నమృతకుంభంబును నెత్తుగా వామ హస్తపంకజంబున ధరించి కనకదర్వీకలిత దక్షిణకరారవిందయై యుత్తరముఖంబై నిలిచి రెండు బంతులుగలయ నాలోకించి మొదలిబంతి నగ్రస్థానంబున నున్న దేవతాచార్యునకు బృహస్పతికి వడ్డించి తదనంతరంబ యంతరాంతర విశేషంబులు దెలిసి యాగంబులం బ్రథమహవిర్భాగ యోగ్యుండైన యింద్రుండును జతుర్విధాహారంబులును దనజిహ్వాముఖంబులం బరిపాకంబుచేసి తొలుతఁ జవిగొన నర్హుండైన వైశ్వానరుండును, సకల ధర్మంబులకు నాధారభూతుండైన ధర్మరాజును, బుణ్యతపో విభవంబున దేవభావంబు వహించిన పుణ్యజనుండును, షడ్రసాధిపతియై యమృతజనకుండునైన వరుణుండును, జగత్ప్రాణుండైన పవమానుండును, నవనిధానాధీశ్వరుండైన పౌలస్త్యుండును, నిఖిలైశ్వర్య ధుర్యుండైన యీశానుండును మొదలుగాఁగల వసురుద్రాశ్వినేయ ప్రముఖులకు వడ్డించుచు నప్పటప్పటికిం దనయొయ్యారంబు చూపుచు, 43

సీ. అమృతకుంభము త్రెడ్డు నలవ్రాక నొకచేతఁ
బట్టి పయ్యెదకొంగు బాగుపఱచు,
నలవున నిలిచి యొయ్యనమేని చెమటలు
మందానిలమునకు విందుపెట్టు
ఫాలభాగంబునఁ బలుమాఱు చెరలాడఁ
గొనగోళ్ల ముంగురుల్ గూడదువ్వ
నవనతియై లీల నమృతంబు వెట్టుచు
నందెలు మొరయించు మందగతుల

తే. దొడ్డపిరుదున వేగంబు దొట్రుపడఁగ
వ్రేఁగుజన్నుల సందునఁ దూఁగలేక
మరుఁడు సహచరుఁడై తోడు మలయుచుండ
నమరకోటికి వడ్డించు నమృతరసము. 44

ఆ. అత్తతలవి చేతులంగడియవికన్ను
లనెడుజాడఁ జూపె నబ్జవదన

యమృత మమరకోటి కలవక వడ్డించు
దివిజవరులమీఁద దృష్టిఁగఱపి. 45

సీ. తనకుచంబులుచూడఁ గనువెట్టువానికి
సన్నపయ్యెదకొంగు జాఱవిడుచుఁ
దనయాసమాటలు వినఁదలంచినవానిఁ
దగిలియొయ్యనజాణ తనములాడుఁ
దనమనోభావంబు నెనయఁగోరినవాని
కలఁతిమై దరహాస కలనఁజేయుఁ
దన మన్మథోత్సుకత్వంబు నారయువానిఁ
గనుసన్నలోనన యనుమతించు

తే. నమృతమునకంటెఁ దీపుమై నాత్మలోన
నుభయసైన్యంబులకు లోచనోత్సవముగ
నాఁడువారల వెడబూమె లాడుఁగొంత
యమర కార్యాభిలాషి నారాయణుండు. 46

క. మాయా విలసనలీలల
నాయువతి సురారికోటి నట్టుభ్రమయించెన్
దోయజనేత్రుల వలపులు
మాయలుగాకవియునిజమె మహినూహింపన్. 47

తే. అమృతపూరంబుఁ గ్రోలఁన య్యమరతతికి
నాత్మకింపైన తృప్తి లేదాయె నపుడు
రమణిమందస్మితామృత రసముఁగ్రోలు
నసుర సంఘంబునకుఁబోలె నవనినాథ. 48

వ. ఇట్లు వడ్డించుచు వచ్చివచ్చి కడపటిబంతియందుఁ దనకీర్తిప్రతాపంబులుబోలె వెలుఁగారు చంద్ర సూర్యులకు నమృతంబొసంగి తనరాక కెదురుచూచుచు వేగిరపడుచున్న క్రవ్యాదులు చెదరకుండ నభిముఖుండై మదనవికారలీలలు చూపుచుఁ బరాకునఁ దొడిబడం దత్సమీపముననున్న సింహికాసూనునకు మాయాదేవ భావకలితుండగుటఁ దలంపక యమృతంబు వెట్టిన, వాఁడమృతం బుపయోగించు సమయంబున నా చంద్ర సూర్యులు వీఁడమరారి రాహువని చక్రధరుని కెఱింగించి రప్పుడు. 49

చ. సరిగమురారి రాహువును జంద్రుఁడు సూర్యుఁడు బల్కుకంటెమున్
హరియునెఱింగి వీనిఁదెగటార్పుదు నన్నతలంపులోనెతా
నరసినసహస్రభానుస దృశారసహస్ర సుదర్శనంబు భీ
కరగతివచ్చి వానితలఁ గ్రక్కునఁద్రుంచె నిమేషమాత్రలోన్. 50

క. రాహువు తలఁ ద్రుంచి మహో
త్సాహంబున భ్రమరితిరిగి చక్రమవార్యం
బై హరి నిలయమునకు జగ
దాహాకారైకలీల నరిగెన్నింటన్. 51

క. కమలాక్షు దత్తమగునా
యమృతము సోకుటయు నమృతకమై రాహువు మ
స్తము వెలిఁగె నాటనుండియు
నమృత కరార్కులకు వైరకమై యది యుండెన్. 52

ఆ. మాయనైన నెట్టి మతమునైన నే
మరలునైనఁ బగరకమునికిఁ జెఱిచి
ధర్మపరులఁ బ్రోవఁ దగు మహాత్ములకు
సాక్షి యానొకండొ చక్రధరుఁడు. 53

క. బృందారకులకు నమృతం
బందఱకు నొసంగి యపుడు హరి దనుజకదా
నందకర పురుషరూపము
నందుఁ బ్రకాశించె దివ్యకమగు రూపముతోన్. 54

వ. వెండియు దేవకార్య నిర్వాహకుండై నారాయణుండు తదవశేష సుధా కలశంబు సంరక్షింపుమని దేవేంద్రుని చేతికిచ్చి కౌస్తుభాభరణ భాసితుండును, శ్రీతులసీ విలసితుండును లక్ష్మీసమేతుండునునై విష్వక్సేనాదులు గొలువ గరుడవాహియై వైకుంఠపురంబునకు విజయంబు చేసెనప్పుడు. 55

ఉ. అంతయుఁ జూచి నివ్వెఱగునందు బలిప్రముఖుల్ నిశాచరుల్
కంతునిరిమ్మవాసి మదికంపము నొందుచుఁ గాలహీనులై
చింతయు వంతయుంగనలు జిక్కురు వక్కురు సేయ లేచి దు
ర్దాంత సముద్రఘోషమునఁ దాకిరి వాసవదివ్య ముఖ్యులన్. 56

దేవతలకు రాక్షసులకుఁ గలహమవుట. దేవతలు జయమును బొందుట.

మ. అమరేంద్రుండును నుగ్రుఁడై శిఖియమాకద్యాశాధిప శ్రేణితో
సమరోత్సాహ రసప్రసన్నముఖుఁ[1]డై సైన్యంబు మున్నాడి దు
ర్దమదోర్మండిత మండలాలి[2]ఘన కోదండాస్త్ర సన్నాహసం
భ్రమమొప్పన్ దరుమంగ వీగఁ బోడిచెన్ రాత్రించరవ్యూహమున్. 57

1. ప్రా. పా. 'లై.' 2. లాలఘన.

క. కార్యంబు చెడినకతమున
వీర్యాధికులయ్యుదనుజ వీరులు మదిలో
... ... ... ...
... ... ... ... 58

శా. ... ... ... ...
... ... ... ...
గారామార సుధాఘటంబుఁగొని లోకంబుల్ ప్రశంసింపఁగా
ధీరుండై యమరావతీపురికి నర్థింబోయెఁ జౌదంతిపై. 59

మ. దురహంకార మహానలార్చియగు నా దుర్వాసుశాపంబునన్
శరధింబడ్డ సురేంద్రలక్ష్మిఁదిరుగన్ సాధించి దైత్యేంద్రుల
న్నరలంబెట్టి సుధాఘటంబుఁ గొనియెన్ రక్షించె దేవావళిన్
సరిలేరింక నిజాశ్రితావన సుహృత్సంరక్షకుల్ దైవముల్. 60

వ. అని జగంబులు గొనియాడుచుండె నా వృత్తాంతంబంతయు నెఱింగి కలహప్రియుండగు నారదమహామునీంద్రుండు తత్ప్రకారంబు శంభునకు విన్నవించి వెఱగుపఱతునని గగన ఘంటాపదంబునంజని. 61

విష్ణుని మోహినీ రూపకథను శివునితోఁ నారదుఁడు చెప్పఁబోవుట.

ఉ. కాంచన గర్భనందనుఁడు గాంచె విలంబపయోదగర్జితో
దంచిత రత్నశృంగ కృత తాండవమత్త శిఖండి సాంద్రమున్
చంచలగాంగ భంగ పరిషంగపయోధి నిషంగదేహ రు
గ్వంచిత పూర్ణచంద్రము నకల్మష తారధరాధరేంద్రమున్. 62

సీ. పార్వతీ శంభుదంపతుల కేళీ సౌధ
మమర కన్యకల క్రీడాచలంబు
కనకనగస్వామి కెనయైన చెలికాఁడు
భూకామినీ శిరోభూషణుండు
జలజ జాండాధార సంభృతస్తంభంబు
దశకంధరునిచేతి తమ్మిబంతి
గగన గంగా పతాకామణి దండంబు
పుష్కరశ్రీదేవి పువ్వుగద్దె

తే. కీర్తనలు సేయఁదగు భాస్వవర్తమాన
మందపవమాన చలగరున్మధుప లీన
వినుత కల్పద్రుమవితాన వికచసూన
వాసనా శ్రీధరంబు కైలాస ధరము. 63

ఉ. రావణబాహు దండముల ఽ వ్రయ్యాలువాసినరాలు రేకుల[1]
ల్లై విలసిల్లఁగోణముల ఽ యందు వెలింగెడు నింద్రనీ[2]లరే
ఖా విభవంబు తుమ్మెదలుఽగా రజతాచల రాజమొప్పు ధా
త్రీవనితాలలామ కరఽదీపితకేళి సితాంబుజచ్ఛవిన్. 64

చ. భుజబలలీల నారజ తఽభూధరకూటము లన్మృగేంద్రముల్
గజములఁ బట్టఁగొన్ని భయఽకంపమునన్ వడిఁగాలుజారి య
క్కజముగ గండశైలముల ఽ కైవడి డొల్లఁగ వానిఁ బట్టివా
యుజవముతోడఁ దూలు శరఽభోత్కరముల్ గగనాంగణంబునన్. 65

మ. కటకాగ్రంబులఁ గేసరుల్ కరులవీఽకం బట్టుచోఁ బుట్టు త
త్పటుగర్జల్ దిశలన్ బ్రతిధ్వనులు చూఽపం దారశైలంబు దు
ర్ఘట నిర్ఘోషమునొందు నుగ్రముఖ జాఽగ్రన్నార సింహోదయో
త్కటహుంకార హిరణ్యదానవ సభాఽస్తంభంబు చందంబునన్. 66

చ. ఘులఘులఁ బాఱు నభ్రనది ఽ కాలువ లున్నతచంద్రమశ్శిలా
తలమునఁ బడ్డఁ బెల్లెగయు ఽ తత్కణమండలి మింటదట్టమై
యలవడు వెండికొండఁ గొలుఽవై వసియించిన చంద్రమౌళికిన్
జెలువలరంగమీఁద విరఽచించిన ముత్తెపు మేలుకట్టనన్. 67

సీ. కుండలీకృత భోగఽమండి తోన్నతఫణో
దారమైయున్న శేఽషాహివరుఁడో
ప్రతికృష్ణపక్ష విఽభ్రష్టేందు కళలు ప
ద్మాసనుండొక ప్రోవుఽజేసినాఁడో
అసమాక్షులావణ్య ఽ రసము జాఱుచునున్న
యుర్వీధరం బగుఽచున్నయదియొ
యల్లనాఁడురులింగఽమై మిన్నుగాడిన
శాంభవప్రోజ్వల రుచిఽస్తంభమిదియొ
తే. యనుచు శతకోటిచంద్ర చంఽద్రాతపంబు
తళుకు నిగనిగలాశలఁ ఽ దగులుకొనఁగఁ
జూడ నొప్పారు నమ్మహాఽక్షోణిధరముఁ
బద్మసంభవ భవుఁడెక్కఁ ఽ బ్రమద మెసఁగ. 68

వ. ఇట్లు గన్నులపండువైన యవ్వెండికొండ నధిరోహించి తదగ్రరత్నశిఖరాభోగంబునఁ గనకమణిమయ ప్రాకార గోపుర సౌధవీధికాబద్ధ తోరణ వైజయంతీ విరాజితంబును, సతతవికసిత సురభి సురతరుకుసుమ విసరవిస్పృమర పరిమళ మిళిత తరుపవన సహచరముఖర మధుకర నికర మృదునినద హృద

---

1. రేకులిల్లై, రేకువిల్లై. 2. నింద్రజాల.

యంగమంబును, బ్రతిగృహ గర్భనిర్భర ప్రతిశబ్ద బద్ధానద్ధ ఘుమఘుమ ధ్వానమానితంబును, బలిసమయ సమాందోళిత కనకఘంటా ఘణత్కార మనోహరంబును, బ్రాసాదగోపుర పురోభాగ ప్రతిష్ఠిత వృషభధ్వజంబును, కనకకలధౌత దండమండితా ఖండమాణిక్య దీపమాలికా ప్రకాశితాంతర్గేహంబును, బంచాక్షరీప్రముఖ పాశుపతజపధ్యాన పారాయణంబును, బ్రమథగణ మహితముక్తి మంటప సహస్రంబును, నందికేశ్వర దండనాయక సభాసీన పురందర ప్రభృతి నిఖిలదేవతాముని మండల మండితంబును, బ్రతిద్వార ద్వారపాలకరకలిత కనకవేత్రలతాశత దురవలోకితంబును, నై జగదేక పూజ్యంబైన శివాలయంబు ప్రవేశించి తదభ్యంతరంబున. 69

సీ. గంగాకణాకీర్ణ ఘనమాళితోడఁ బు
స్ఫిత కల్పకములీల బెరయువానిఁ
గంఠహాలాహల కచ్ఛురచ్ఛవితోడ
నుదితపూర్ణమృగాంకు నొరయువాని
సొమ్మైన శేషాహి చూడామణిశ్రీల
తోడ సహస్రాంశు దొరయువానిఁ
గరుణార సోర్మికా గాంభీర్యములతోడ
నుదధిరాయని భంగి నున్నవానిఁ
తే. గామకళ యూర్ధ్వదిక్కునఁ గడలుకొనఁగ
బ్రహ్మతేజంబు కుడివంకఁ బ్రజ్వరిల్ల
యోగసింహాసనంబున నున్నవాని
శివునిదర్శించె మునికుల శ్రేష్ఠుఁడపుడు. 70

వ. ఇట్లు దర్శించి జయజయోక్తివచన పురస్సరంబుగాఁ బ్రదక్షిణంబుచేసి బహుప్రకారంబులం బ్రస్తుతించినం గరుణించి కాలకూట హరణానంతర సముద్రమథనకథా ప్రసంగంబు వినఁ జిత్తగించి విరించిసంభవునకు శ్రీకంఠుం డిట్లనియె. 71

తే. ఉదధి మథియించువేళ నీ వున్నవాఁడ
వే కదా కాలకూటంబు వెనుకనందు
సంయమీశ్వర యేమేమి సంభవించె
నెవ్వరేమేమి గైకొని రెఱుఁగఁ జెపుమ. 72

క. అని విషకంధరుఁ డడిగిన
వినిహర్షావేశ మొదవ వినయాంజలియై
మునివిన్నవించె నప్పుడు
తనచూచిన యంతవట్టుఁ దత్పరమతితోన్. 73

చ. గగనముమోచి బాడబశిఖానిచయంబుఁ దృణీకరించి క్రొం
బొగలు దిశావకాశములఁ బొంగ నభంగవిషాగ్నియుగ్రమై
జగములు మ్రింగఁజూచినఁ బ్రసన్నుఁడవై యుపసంహరించి దే
వగణముఁగాచి దేవరవు వచ్చినపిమ్మట నాపయోనిధిన్. 74

మ. తరువంద[1]ర్వఁగఁ బుట్టె కౌస్తుభము చింతారత్నముల్ గల్పభూ
మిరుహైరావత లేఖవాజులును లక్ష్మీనాకవేశ్యా సుధా
కరబృందావనముల్ సుధారసము లోకఖ్యాతిగా వాని శ్రీ
హరిదాఁ గొన్నిహరించి తక్కినవి దివ్యశ్రేణికిచ్చెన్ గృపన్. 75

శా. ఆకర్ణింపుము దేవయొక్కటి త్రిలోకాశ్చర్య కృత్యంబు నా
కాకోద్వేషులు మున్ సుధాఘటము గర్వోద్రిక్తులై బల్మిఁ దా
రే కైకొన్నసురాళి విన్ననయి యూహింపంగఁ గంజాక్షియై
యాకంజాక్షుఁడు గమ్మరం గొనియె దైత్యశ్రేణిచే లీలమై. 76

క. కౌనితన త్రిభువన మోహన
వనితాలీలావిలాస వైఖరిచేతన్
దనుజులకు నిడకయమృతం
బనిమిషులకు నొసఁగెఁ జువ్వె యార్యా రమణా. 77

క. ఆహరిలీలా మాయా
మోహినినై మరులుగొలుప ముల్లోకములున్
మోహించె నసురవీరుల
మోహాంధులఁ జెప్పనేల మురజిన్మిత్రా. 78

సీ. అప్సరస్త్రీలు వ్రీడానమ్రములై తమ
మించు విభ్రమము నిందించుకొనిరి
యండజనాయల్ల కార్తులఁ గావించు
వెడవిలుకాఁడును వెఱ్ఱియయ్యె
నూర్ధ్వరేతస్కులై యుండు తాపసులకు
నధర రేతస్కందమయ్యె నపుడు
తనువెత్తి పంచభూతంబులు సైతము
విరహభా[2]వంబున విహ్వలించె

తే. పద్మసంభవముఖులు విభ్రాంతులైరి
మొదల నసురాధిపతులతి మూఢజనులఁ
జెప్పఁగా నేలలోకముల్ చిక్కువడియె
విష్ణుమాయావిలాసినీ విలసనమున. 79

1. రువ 2. ప్రా. పా. 'భాగంబున'

క. ఎన్నఁడు విన్నది కన్నది
యెన్నిన యదిగాదు నువ్వె యేయుగములన
వ్వెన్నుని మాయాస్త్రీత్వము
పన్నగధర పొగడఁదరమె బ్రహ్మాదులకున్. 80

వ. అని సర్వమోహనాకృతంబైన విష్ణుమాయాచరితంబు విన్నవించిన విని
శివుండు వెఱగుపడి నారదు మొగంబుచూచి చిరునవ్వునవ్వి నాసికావిన్యస్త
హస్తాంగుళి పల్లవుండై తలయూఁచి యెంత మృషఁబలికె నీమునీశ్వరుండనుచుఁ
బ్రియకాంత నవలోకించి. 81

క. హరియీ భువనత్రయమును
దరుణీలీలా మనోజ్ఞతలఁ గడు మోహా
తురముగఁ జేసెనటే యా
సరసత వేఁ జూడకేల సమ్మతి పడుదున్. 82

క. వైకుంఠంబునకుం జని
శ్రీకాంతుని కపటసుందరీ విలసనమా
లోకించి వత్తునిపుడయ
నాకులమతి తోడనుండు మంబుజనేత్రీ. 83

వ. అని ముక్కంటి పలికిన మందస్మితం బొనరించి యంబికా మహాదేవి
యిట్లనియె. 84

పార్వతి శివుని నివారించుట.

క. దేవరవు మిక్కిలియుఁగాం
తావివశాత్ముఁడవు మనసు ధైర్యము చలనం
బై వచ్చునేని మఱతువు
భావింపఁగ సర్వభూతప్రపంచంబెల్లన్. 85

చ. జగములుమూఁడు నాతని వశంబుసనున్నవి మాయఁజిక్కి యీ
జగతి ప్రధానదైత్య సురసంయములుం గమలాసనుండు నా
దిగఁగలవారలెల్ల వికృతిం బడుచుంద్రు తదీయలీలనే
మగునొసుమీ మహాత్మ జలజాక్షుని చేత భవత్ప్రతాపమున్. 86

తే. తలఁపు ధైర్యంబు పదిలంబు గలిగెనేని
గట్టిగాఁగామునకు బొమ్మగట్టితేని
నమ్మిపొమ్మని నగుచు నానగజ పలికె
హరుఁడు నప్పుడు నాయింతి కనియె మఱియు. 87

తే. సర్వమోహాంధమైన యీ జగముఁజక్రి
మాయఁగొల్పుట యిది యెంత మహిమ చెపుమ

భూమి శిశువుల భ్రమియించు ꣳ బూమెకాండ్ల
చేత నార్యుఁడు భ్రమయునే ꣳ చిత్తవీధి. 88

ఉ. నాయవియింద్రియంబులు ; మకీనం బెటుపోయిన దానిసంగతిర్
బోయెదు వాఁడఁగాను నినుꣳబోటుల లోకవిహారలీలకై
పాయక యుంటగాక మరుꣳబారికి లోఁబడి యే ! మృగాక్షి ! నేఁ
డియ్యెడ నాజితేంద్రియత ꣳ యెల్లను జూచెదు నిశ్చయంబుగర్. 89

వ. అని పలికిన హరుని యుద్యోగంబు నిశ్చయంబుసేయంగోరి నారదుం డిట్లనియె. 90

శివుని నారదుఁడు తిరిగి పురికొల్పి రోషమెక్కించుట.

తే. ఆ మనోహరకామినీ ꣳ హావభావ
విలసనంబును జూచిన ꣳ వెఱ్ఱియెత్తి
దేవ భ్రమసి తిరుగుదువు ꣳ దీనవృత్తి
నింక పదివేలమాటల ꣳ నేల చెప్ప. 91

వ. అనినం గనలి యతనివచనంబు నిరాకరించి తన మహానుభావత్వంబు ప్రకటించి యీశ్వరుండు ప్రమథగణములతో నిట్లనియె. 92

శివుడు మిక్కిలి రోషము చే విష్ణుమాయకు లోఁబడనని పంతమాడుట.

ఉ. సిద్ధమతిర్ జితేంద్రియతꣳ ꣳ జెందితి దుర్విషయాభిలాషసం
బద్ధుఁడఁగాక దుష్కృతిని ꣳ భావజుఁ గెల్చినవాఁడ సత్తపో
వృద్ధ మనోవికాస మొదꣳవించు చిదంశమ, నిట్టినాకు దు
ర్బుద్ధులకామినీజనుల ꣳ పోకలచిత్తము సంభ్రమించునే. 93

క. నావుడుఁ దద్వచనంబులు
భావించి విరించి సుతుని ꣳ భాషణములు సం
భావింపక ప్రమథులు గిరి
జావల్లభుతోడననిరి ꣳ సందడిపడుచుర్. 94

ఉ. దేవరముందటం గపటꣳధీయుతుఁడైన సరోజనేత్రు మా
యావికృతుల్ సురాసురులꣳయందు బలెం బ్రసరింప నేర్చునే
భూవలయంబు దిక్కులు నꣳభోగతియుం గబళించు నంధకా
రావృతులేమియాఁ జెపుమ ꣳ యర్కుని ముందర నిందుశేఖరా. 95

క. మిము నెక్కడ భ్రమయించెదు
మము భ్రమయించిననెచాలు ꣳ మాయాతరుణీ

1. ప్రా. పాఠ్రలి. అని వెడనవునవ్వి యవ్వేలండికి నిందుశేఖరుం డిట్లనిరియె.

క్రమదుర్వికారముల నా
కమలాక్షుఁడు వెక్క- పలుకఁగా నేమిటికిన్. 96

వ. అనిన మందహాసంబెసంగు సుందరాస్యంబుతో వారి నవలోకించి. 97

క. ఇప్పుడు మనకీపంతము
చెప్పఁగ నేమిటికి నతని చేడియరూపం
బొప్పరఁ జూచి భ్రమయని
యప్పుడుగా యనుచు లేచె నభవుండంతన్. 98

క. హరుఁడా వైకుంఠమునకు
నరిగెడు సంభ్రమము హృద్యమై నారదునిన్
బరితుష్టాత్మునిఁ జేసెను
సురదుందుభి నినదమెసఁగ సురపథవీథిన్. 99

సీ. ధర్మసూత్రంబునఁ బదిలంబుగాఁగ ఘ
నవ్యాఘ్ర నాగాజినములుగట్టి
మంత్రపవిత్ర నిర్మలభూతి సర్వాంగ
కముల సాంద్రంబుగాఁ గలయ నలఁది
తరళజిహ్వా[1]భీల దర్వీకరస్వామి
నలవ్రేక పేరుగా నలవరించి
పటుజటా జూటాగ్రభాగంబుపైఁ జంద్ర
ఖండంబు వెడపువ్వుగాఁగ దోపి
తే. దర్పకునిఁ దిన్నదహన నేత్రంపు దీప్తు
లిరియఁగప్పిన రెప్పలయెడల నిగుడ
దివ్య యోగీంద్రమూర్తియై దివ్యతేజ
మెసఁగ రూపంబు గైకొనె నీశ్వరుండు. 100

క. ఆపాద ఫాలభస్మో
ద్దీపితుఁడై నిర్వికల్ప తేజోమహిమన్
బ్రాపించి యోగవిద్యా
రూపంబిదియనఁగ నపుడు రుద్రుఁడు పొలిచెన్. 101

వ. ఇట్లు నిర్వికారంబగు రూపంబు దాల్చి నిజపంచాక్షరీ మంత్ర విద్యాబలంబున దుర్విషయ కలుషేంద్రియ మహాభుజంగంబులకు వాకట్టుగట్టి పంచబాణుని బిరుదు పెండేరంబు వెట్టి చిత్తంబు నుత్తమయోగంబునకుఁ దగులువెట్టి దృఢ నిశ్చయంబున. 102

1. ప్రా. జిహ్వాభిల.

క. హిమగిరిజా సహితుండై
హిమకరశేఖరుఁడు చనియె వృషభేంద్రమహో
ద్యమలీలాగతి విచల
ద్విమలశ్రుతికుండలాంశు విభ్రమరేఖన్. 103

క. ప్రేరకుఁడై ముందరనా
నారదముని వల్లభుండు నడువఁగఁ బ్రమథుల్
చేరి యిరుగడల సేవా
పారీణతఁ జనిరి విజిత భావముతోడన్. 104

శా. చూడం బోయిరి పావకేందు రవితేజుల్ బ్రహ్మవిద్యాధికుల్
వ్రీడాశూన్యకటీరమండలులు నిర్విఘ్నాత్మసంయోగుల్ పరి
వ్రాడీశుల్ విజితేంద్రియుల్ శివునిభాస్వత్స్థైర్యముల్ వైష్ణవ
క్రీడామాయయు నెట్టులయ్యెడినొ తర్కింపంగ నంచున్వడిన్. 105

క. హరిమాయా చాతుర్యము
హరుఁడే క్రియఁ దెలియఁగలఁడొ యరయుదమనుచున్
సురలున్ నలుగడ నడచిరి
హరిఁ బోరి వైకుంఠ నగరమునకుం బ్రీతిన్. 106

వ. ఇట్లు చనుచునందు గొందఱు దివ్యపురుషులు విష్ణుమాయా పరీక్షేచ్ఛుండై
యేగువిరూపాక్షుని యక్షీణతేజోరూపంబు గనుంగొని తమలోన. 107

శా. కుంఠీభూత దురింద్రియాగ్రహుఁడు చక్షుఃపీత పుష్పాయుధో
త్కంఠుం డుగ్రవిలోచనుండు ఘనయోగధ్యాన చిన్మూర్తి శ్రీ
కంఠుండట్టి మహాత్మునిం భ్రమలఁ జిక్కంబెట్టు నెట్టిన వై
కుంఠుం డెవ్వరి మోసపుచ్చఁడొకొ తద్దైవకమాయాగతిన్. 108

వ. అని వితర్కించిరంత నమ్మొందట. 109

శా. భేరీశంఖ మృదంగనాదములు ప్రస్ఫీతాంబరాభాగ భా
గ్ధీరోద్యద్విహగేంద్రకేతనము ప్రీతిన్ జేసి చక్షుఃశ్రవో
హారశ్రోత్ర విలోకనంబులకు లోకానందకందైకల
క్ష్మీరమ్యాచ్యుత రాజధాని కెదుటం జేరంగరా దవ్వులన్. 110

ఉ. మేలిమి ధూపధూపములు మించి మధువ్రతలీలఁ గ్రాల ను
త్తాల సుపర్ణకేతన వితానదళంబులఁ [1]దెల్లదీవిపైఁ
బోలఁగ మెట్టి చెంగలువపోల్కి ముదంబునఁ దేల్చె రత్నరే
ఖాలలితాంశు గోపురము కంజదళాక్షు పురంబు శంభునిన్. 111

---

1 పా. ప్రతి. తెల్లదీపమై.

క. ఆతత పుణ్యోపేతము
శ్వేతద్వీపము తదగ్రసీమఁ బరిఢీ
భూతాబ్ధిపురము లోక
ఖ్యాతంబది వేఱె పొగడఁగా నేమిటికిన్. 112

తే. నెఱిఁ జతుర్విధ పురుషార్థ నిధులు మిన్ను
ముట్టియున్నట్టు లొప్పు నప్పట్టణమున
గుఱుతుమీఱఁ జతుర్ద్వార గోపురములు
వికచమణిమయ వైజయంతికలతోడ. 113

చ. అమలిన హారిహాటకమయంబును నగ్రసరోజ రాగకుం
భములును నై నమేడలఁ బ్రభాకరబింబము దోఁచి తన్మహో
ద్యమరుచి పుంజముల్ మెఱుఁగుతండము లీనఁగ భానుకోటి తే
జమున వెలుంగునప్పుర మజస్రము ఖేచరదుర్నిరీక్ష్యమై. 114

చ. స్ఫటికమణి ప్రభాపటల భాసురగోపుర శృంగకోటి సం
ఘటనగ నేడు కోటలును గాక పదంపడి విశ్వకర్మ యు
త్కటమతిఁ బెట్టుకోటయనఁగాఁ గనుపండువు సేయు రాకలం
జటుల సుధాబ్ధిభంగము లసంఖ్యము లాపురిచుట్టుఁ దూలుచున్. 115

చ. వలయిత రత్నవప్రము సువర్ణశిరోగృహ రాజసంచయో
జ్వలితమునైన యప్పురము సాగరమధ్య తటంబునందు ని
ర్మల పరివేష చక్రరుచి మండన మండిత చంద్రభాను మం
డల[1] ప్రతిబింబమోయనఁగ నంగడు నొప్పుఁ ద్రిలోకపర్వమై. 116

ఉ. సింగపు మోములుంగలుగు చిత్తరురూపము లప్పురోత్తమో
త్తుంగ సువర్ణ హర్మ్యములఁ దోరములై యటవేల్పుటేటి నీ
టంగడు బింబితంబులగుటన్ గని నీళ్లకుఁ దెచ్చి యభ్రమా
తంగము భీతిమాన్పుదురు తచ్చలితాచలితప్రవాహులై. 117

చ. వననిధి వీచికోచ్ఛలిత వారికణంబులు నా పురంబులో
ఘనతరహర్మ్య కేతువుల గాడ్పులఁ దూలుచు రాలు నభ్రవా
హిని జలబిందువుల్ చదలనింపగు దన్మిధునోత్సవంబునన్
జనసురగామరాంగనలు చేల్లెడుసేసలనంగ వెన్నెలన్. 118

చ. హరియెదుటన్ బురందర నటాంగనయై యలరించు మస్త[2]భా
సురకనకాగ్ర దండపరిశోభిత పూర్ణఘటాలివ్రాలెఁ ద
ద్గురు గృహరాజసౌధమణి కుంభపథంబున నూర్ధ్వలోకముల్
గరము వెలుంగు దిక్కులఁబొలఁగత్తకునెక్కి విచిత్రవైఖరిన్. 119

1. డలి. 2. మస్తుభా.

మ. హరినీలేందు శిలాభిరామమగుచున్ హర్మ్యంబొకండగ్రభా
స్వరమాణిక్యఘటంబుఁ గేతనపటీ సంపత్తియుంగల్గి యు
ప్పరి వామాంగముఁ దామ్రజూటము మహాభోగంబు హారంబునుం
గర మొప్పారెడు నాసదాశివుని రేఖన్ బొల్చునత్యున్నతిన్. 120

చ. నవ నలినప్రియోర్ధ్వకిరణ ప్రతతుల్ పురి వెండి మేడలం
బ్రవిమలరాగ పల్లవవిభాసినులై లతలట్లు సాగఁగాఁ
బవడఁపుఁదీఁగె లెక్కడికిఁ బ్రాకెడునంచుఁ దదగ్రసంచర
ద్యువతులుబట్టి చేఁదగులకుండఁగ నవ్వుదు రద్భుతంబునన్. 121

చ. త్రిపథగయే చతుష్పథగ దేవతరంగిణి చూడుఁడంచు రే
యిపురిఁజతుష్పథాగ్రమున నిందుఁడు నిల్చిన నాల్గువీధులుం
జపలతరస్ఫురత్కనక సౌధ పరంపరలన్ సుధాకరా
తపరసపూరముల్ నిగుడఁ దద్దయుఁజూతురు పౌరబాలికల్. 122

మ. హరిసౌధాగ్ర సుదర్శనార కలితంబై చిత్రవర్ణాకృతిన్
[1]సురుఁగన్ బ్రేలుచుఁ గేతనాంబరము వ్రేల్చున్నాఁడు రాహుగ్రహో
ద్ధురమూర్ధం బటఁద్రుంచి వైచు నెడ నెంతొదుంబోక రక్తాంకమై
పరిభాసిల్లు తదీయభోగలతయన్ భావంబునం దత్పురిన్. 123

చ. బహుకుసుమోపహారములఁ బ్రస్ఫుటమౌక్తిక రంగవల్లులన్
బ్రహిత విచిత్రతోరణ పరంపరలన్ శశికాంత వేదులన్
రహిఁబచరించు నప్పురవరంబు పథంబులు శ్రీకరంబులై
సహజమె శ్రీనివాసములు సంతతమున్ సదలం క్రియాస్థితుల్. 124

శా. కేళీసౌధము కేళిడోలికయునుం గేళీవనశ్రేణియుం
గేళీశైలము కేళిదీర్ఘికయునుం గేళీమరాళంబులున్
బోలన్ లేని గృహంబులే దొకటియుం బూఁబోండ్లు ప్రాణేశులన్
శ్రీలక్ష్మీ హరిమూర్తిభేదములు వర్ణింపంగ నింకేటికిన్. 125

మ. బలభిన్నీలమణి ప్రతానకృత సోపానంబునం బద్మరా
గలసత్కంధర మందిరంబులు గళత్కల్పద్రు పుష్పావళీ
కలితస్వర్గ విశాలసానువులునై కన్పట్టు క్రీడాద్రులన్
లలనల్ మేఘవియుక్త చంచలలలీలం బొల్తురవ్వీటిలోన్. 126

ఉ. రాకొమరుండు మన్మథుఁడు రాజసమొప్పఁగ నప్పురంబులో
నేక ధనుర్ధరుం డగుచు నెమ్మొలుచూపు గుణీకృతాళి లీ
లాకల ఝంకృతుల్ సుదతులం బతులంగడు నొంచు నమ్మహా
భీకరమాని వైరికతి భీకరభంగి చెలంగఁ జేయుచున్. 127

1. మూలపాఠము—శరధిన్.

మ. హరినాభీనవ పుండరీకమకరందాసారముల్ గ్రోలి త
ద్వరకర్పూర మహోరు సౌధసుమనో వాతాయన ద్వారసం
చరణక్రీడ లొనర్చుచుం దిగుచు నిచ్ఛాభంగ సంగీతను
స్వరభంగీతతి మందమారుతము పజ్జంగ్రు[1]మ్మరున్ దత్పురిన్. 128

సీ. పాలమున్నీటి లోపల నెంత దవ్వైన
  జానుదఘ్నంబుగా సంచరించుఁ
దివుటఁ దొండము సాచి దిక్కరిణీ శ్రేణి
  చరమాంస దేశముల్ సంస్పృశించుఁ
కైలాస మేరు శృంగముల వప్రక్రీడఁ
  గొమ్ముల నలవ్రాకఁ గూలఁద్రోచు,
సమదఘీంకారని స్వనములఁ జక్రవా
  ళాచల గుహాల సింహములఁ గలఁచు
తే. సమదరక్షోధినాథ వక్షఃకవాట
పాటనోద్దండ తరచండ బలభరమునఁ
బ్రకటకట దానపాన సంభ్రమ దళీంద్ర
గానముల నొప్పునప్పురి కరివరములు. 129

ఉ. రూపముతోడి గాడ్పులు గరుత్తులు లేని ఖగంబు లశ్వలీ
లాపరినర్తనోల్లసిత లాసిక వర్గము శౌర్యవార్ధి వీ
చీపటలంబు నాఁగవిల సిల్లుచునుండు మనోజవంబుతోఁ
నాపురివాజిరాజి హరిదశ్వుని యశ్వములన్న నవ్వుచున్. 130

ఉ. భూరిబలోగ్ర హేమకశిపు ప్రముఖాసురులం జయించి య
వ్వీరులబొమ్మ వెండెమున వ్రేలఁగ నంఘ్రుల దిగ్వలీన ని
స్సార విరోధులై సుభటసంజ్ఞకు మోహన చక్రలాంఛనో
దారభుజా క[2]లాపులయి తత్పురిఁ గాల్వురు వ్రేల్తు రిమ్ములన్. 131

చ. పరభృతచంచు సంచలిత పల్లవముల్ మధులోల బంభరో
త్కరగత సూనముల్ శుకముఖ ప్రవిభిన్న ఫలంబుఁ గేలిసం
చరదబలా ప్రియప్రసవ సద్మములై స[3]కలర్తుయుక్తమై
పురివన వైభవంబలరు భూరిమనోహర సౌరభస్థితిన్. 132

చ. రసికవధూవరుల్ కనకరత్న విభూషణ విభ్రమంబులై
విసికిపరిత్యజించి వెడవిల్తుని కన్నులపండువైన సొం
వెసఁగఁగఁ బువ్వుసొమ్ము ధరియించి పరస్పరరూప దర్శనో
ల్లసిత పునఃపునస్సురతలం పటులై సుఖియింతు రాపురిన్. 133

1. అ. పా. పజ్జంగ్రమ్మరం దత్పురిన్. 2. సుధీనులయి. 3. సకరార్తు.

చ. నిరతము నిర్మలామృతము నిండితలంకు కొలంకులంతరాం
తరములనుండ వేల్పుగను దమ్ములకుం బ్రియమాచరించుచుఙ్
బరిఘుదనర్చుఁ దన్నగర పంకజవాసకటీస్థలంబునం
దరము వెలుంగు వజ్రఫలకంబుల మేఖలలీలఁ గ్రాలుచుఙ్. 134

మ. పరమబ్రహ్మము విష్ణుఁడీజగము లుత్పాదించి తద్రక్షకై
పురుషాకారముఁ దాల్చునాఁడు సిరితోభోగింప నీదుగ్ధసా
గరమధ్యంబున సర్వమోహనముగాఁ గల్పించినాఁ డమ్మహా
పురివైకుంఠము దానియొప్పు పొగడఙ్ భోగీంద్రుఁడుఙ్ జాలునే. 135

వ. ఇవ్విధంబున నపరిమితైశ్వర్య రేఖాలంకృతంబైన యావైకుంఠ దివ్యనగరం బట్లు త్రిలోచనుండు లోచన పర్వంబుగాఁ జూచి సంతసంబునం బ్రవేశించి రాజమార్గంబునం జనునప్పుడు. 136

శివుఁడు వైకుంఠములోఁ బ్రవేశించుట.

తే. తోరణాంభోజమకరంద ధారనర్ఘ్య
మొసఁగి మధుకర[1] మధురర వోక్తిఁగుశల
మడిగిబాంధవ సంభావ నానుకూల
యయ్యెఁబురలక్ష్మి పార్వతీహారుల కపుడు. 137

తే. హారుని తనుదీప్తిచే నీలహార్మ్య చంద్ర
కాంత పాషాణముల జలకణములురుల
నాడెఁ బ్రోదినెమళ్లుకేకారవములఁ
గనకనూపుర ఘళఘళాత్కార మొసఁగ. 138

సీ. మృగమదాలేపము మెఱయు వేదికనద్రి
కూలభాగంబని కొమ్ముఁజిమ్ము
మరకత సౌధకోమల రుచులకుఁ దృణ
ప్రీతిమైనందంద మూతిఁజాచు
నాపణరత్న దివ్యచ్ఛాయ నిర్ఝరా
కృతియైన నుఱికలంఘింపఁ జూచుఁ
దనసీడ మణిభిత్తిఁ గని ప్రతీపకకుద్మ
దాశంకఁగనలి[2] ఘుల్లనుచుఁ దిరుగు

తే. వెండిత[3]గడున నిలిచిన వీధులందు
తాండవము చూపునూపుర ధ్వనులతోడఁ

---

1. ఆ. పా. మొసగి మధుకర మధురోక్తిఁ గుశలమడిగి, బాంధవాయత్త సంభావనాను కూలమయ్యె. ప్రా. పా. మధుకర మధుకరవ్యోక్తి 2. ఆ. పా. గుర్రనుచు 3. ప్రా. పా. తెగ ఢునన్నిలిచిన ఆ. పా, తగటునని నిలిచిన.

పసిఁడి మువ్వలపేరు జొంపంబు మెఱయ
నందికేశ్వరుఁ డీశ్వరానందలీల. 139

సీ. ముత్తెపుఁ జెఱఁగుల చిత్తంబు నిండించుఁ
గనకాంశుకంబుల గట్టుదనరఁ
బసపు కుంకుమచాయ నెసఁగు కుచంబుల
మందార పుష్పదామములు వ్రేల
నెలవంక తిరుణాము గలనెన్నుదుళ్లఁ గెం
పులచుక్క బొట్టులు చెలువు మీఱఁ
దాటంకవజ్రాంశుధాళధళ్యంబుతోఁ
జెక్కులచిఱునవ్వు చెంగలింప
తే. శంఖచక్రాంక భుజలతల్ చారుముఖులు
పురపురంధ్రులు సంభ్రమంబునను వచ్చి
నిలయచత్వర వేదుల నిలిచి చూచి
రద్రిజాశంకరులను నెయ్యంబు తోడ. 140

సీ. శుకముఖోదితముక్తి సూచకభాగవ
తవిధేయులైన భాగవతవరులు
నుపనిషచ్ఛాస్త్ర సముత్కృష్ట గీతార్థ
గరిమ శోధించు భాగవతవరులు
ధృతివిశిష్టాద్వైతమత వైష్ణవాచార
గతి నివేదించు భాగవతవరులు
సావర్ణిముక్తి లక్షణము వచించు నా
గమయుక్తి మెచ్చు భాగవతవరులు
తే. నింటిముంగిళ్ల నగరుల నెనసి యున్న
యాసనంబులపై లేచి యచటనచటఁ
దమకు సముచిత సంభావనములు సేయ
నద్రిజయు నీశ్వరుండును నరిగియరిగి. 141

వ. అంతఁగొంతదవ్వునం బురమధ్యంబున ననేకకోటి సూర్యబింబ ప్రతిబింబకంబు లనం బ్రతిభాసిల్లు పద్మరాగమణిఖండంబు లెడయెడలంగలిగి కనకరుచినిచయచకచకవ్యాకీర్ణంబై యగ్రభాగంబునఁ గృత్రిమమరాళ ద్వంద్వమధ్యంబులం గెందామరపువ్వుల మవ్వంబున నివ్వటిల్లు పసిండి కుండలచాలు శోభిల్ల నాకాశంబొరయు ప్రాకారంబుతోడంగూడి ప్రత్యగ్రవిద్రుమద్వార స్తంభసముజ్జ్వల వజ్రకవాట ఘటితంబును, ధళధళాయమాన నవరత్నకీలితం

బును, బుష్పతోరణాభిరామంబును, బహిరంతర్వికచ చంద్రోపలవితర్దికా శోభితంబును, దౌవారిక సహస్రదురవలోకితంబును నగు ప్రథమగోపుర ద్వారంబు ప్రవేశించి వెండియునుం గుంకుమపంకాను లేపంబున నిగనిగలు వారుచు నకాల సంధ్యారాగంబు సంపాదించుచు వివిధకుసుమకోరక నికరవిరచిత రంగవల్లీసముల్లసితంబులగు ననేక ద్వారగోపుర ప్రాంగణంబులు చూచుచునయ్యె ద్వారపాలక కృతావధానంబుల నభినందించుచుం బోయి ముందట. 142

—◆ శివుఁడు నారాయణమూర్తి హజారమునొద్దకుఁ బోవుట. ◆—

సీ. శతధనుర్విస్తార ♦ చత్వరరత్నకు
ట్టిమభూమి మెఱుఁగు తంకెడపములనీన
మండిత నవపుష్ప ♦ మాలికా సంకీర్ణ
భృంగసంగీత ప్రసంగ మడర
బహుపద్మరాగకుంభములు బాలాదిత్య
పాటలాంశువులపైఁ ♦ బ్రబ్బికొనఁగ[1]
నవరత్న చిత్రిత ♦ ప్రవిమలోల్లోలకాం
తులు క్రిందఁబెక్కువన్నెలు రచింప
తే. పసిడికంబాలు వేయింట ♦ బాగుమీఱి
మరకతోపల సోపాన ♦ మార్గమిడిన
పెద్దమొగసాల మేడసం ♦ ప్రీతిగాంచి
వాహనమడిగ్గె శివుఁడు పార్వతియుఁదాను. 143

వ. ఇవ్విధంబున శంభుండు ప్రమథగణ పరివృతుండై ప్రియకాంతయుం దానును వచ్చి పెద్ద కొలువుకూటంబుముందర వాహనావతరణంబు చేసియుండుట వేత్రపాలురవలన విని నారాయణుండు. 144

—◆ నారాయణమూర్తి శివపార్వతుల కెదురుగావచ్చినప్పటి విధము. ◆—

క. తనమాయా[2]శ్రీలీలలు
వినిక్రమ్మరఁ జూడవచ్చు ♦ విధమిదియనిన
మ్మనమునవవ్వుచు నెదుఁగుగఁ
జను దెంచెన్ లోననుండి ♦ సంప్రీతిదగన్. 145

మ. హరి యంతఃపురినుండి వచ్చుటయు నన్యోన్యసేవార్థై యున్నవా
రు రువేగంబున వామదేవ శుకముఖ్యుల్ చేరి కాళాంజలియు

1. ఆ. పా. ప్రజ్వరిల్ల. 2. ఆ. పా. విభ్రమములు.

క్కరుఁడొక్కం డడపంబొకండు నిజఖడ్గంబు వహింపంగ నొ
క్కరుఁ డొప్పారఁగఁబట్టెను జ్వలితమౌక్తికచ్ఛత్ర మగ్రంబునన్. 146

వ. వెండియు విష్వక్సేనుండు కైదండ యొసంగం గనక వేత్రపాణులగుచుఁ జండ ప్రచండ జయవిజయకుముద కుముదాక్షులు ముందట ని[1]తయితో మహాదేవ యను నాలోకశబ్దంబులు బలుకం బసిఁడిగొడుగు పావాలుగిలుకులకుం దోడై శ్రీపాదపద్మంబుల నిగమాంత నూపుర ఝుళంఝుళ ధ్వానంబులు చెలంగఁ దరంగరేఖాభంగి నపాంగంబులం గరుణారసంబు దొలంకఁ బంకజలోచనా సహస్రంబులు ధవళచామరంబులు వీవఁ గనకపీతాంబర మయూఖరేఖాలంకృతుండై, మూర్తిమంతంబులై శంఖ చక్రంబు లిరువంకలంజనుదేర ననంత విలాసవైభవంబున శుద్ధాంత కేళీభవనంబులు వెలువడి గంభీరయానంబునఁ జనుదెంచి యాదంపతుల నవలోకించి. 147

క. శ్రీరమణీ గురుకుచ కా
శ్మీర[2]ద్రవసిక్తమగుచు § మెఱయు నురమునన్
వారిజ నాభుండప్పుడు
గారవమునఁ బ్రమథనాథుఁ గౌఁగిటఁ జేర్చెన్. 148

వ. ఇట్లు కౌఁగిలించి యన్యోన్య మధురాలోకన జనిత కౌతుకంబునం బొదలి యద్రిజఁ గుశలంబడిగి పద్మనాభుండు సబహుమానంబుగా నయ్యిద్దఱఁ దోడ్కొని కొలువుకూటంబునకు విజయంచేసి వారికి నొక్క భద్రపీఠంబు చూపి నిజసింహాసనాగ్రంబు నలంకరించె, నంతఁ గ్రమక్రమంబునఁ బితామహప్రముఖ దేవగణంబులు గంధర్వాప్సరస్సిద్ధ విద్యాధర వ్రాతంబు నరుగుదెంచి యద్దేవదేవునకుం బొడసూపి యుచితస్థానంబులం గొలిచియుండి రాసమయంబున. 149

క. అవధాన తత్పరంబై
యవనీశ్వర చూడనొప్పె § హరికొలువపుడా
శివపద్మోద్భవ వాసవ
దివిజర్షి ప్రమథపూజ్య § దివ్యవిభూతిన్. 150

### లక్ష్మీ పార్వతులు కలుసుకొనుట.

తే. గారివచ్చుట యెఱిఁగి శ్రీ§కాంతదివ్య
కామినులు గొల్వ శుద్ధాంత § సీమనుండి
కౌతుకస్మేర వక్త్ర§పంకజముతోడ
వచ్చెఁగొలువెల్ల సంతోష§వార్ధిఁ దేల. 151

---

1 నిశాంత్తాయుతో మహాదేవ. 2. ప్రా. పా. ద్రవ.

తే. కలిమిచూపుల నెత్తమ్మి — కంటికెదురు
గాఁగవచ్చిన నగజాతఁ — గాఁగిలించి
తగినపూజలఁదనిపి సం—తసముతోడ
నేక పీఠస్థయయ్యె న—య్యింతితోడ. 152

నారదుఁడు విష్ణుమాయాగానము సేయుట.

క. ఆవేళ నారదుఁడు వీ
ణావాదన కేళిఁదేల్చె — నారాయణు నా
నావిధ తన్నిజమాయా
వ్యావృత్తుల గీతసరణి — నమరులు మెచ్చన్. 153

వ. వెండియుఁ బర్యాయంబున గంధర్వ యక్షకిన్నర కింపురుష సిద్ధవిద్యాధరాదులయ్యై విద్యల వైశారద్యంబులు చూపిరి. తదనంతరంబ సముచితగోష్ఠి సలిపి తన వచ్చినరాక ముఖావలోకనంబునం బ్రమథులకు నెఱుకపఱచి యలతి నవ్వు నివ్వటిల్ల శివుండు పుండరీకాక్షునకు నిట్లనియె. 154

విష్ణుమూర్తియొక్క మాయామోహినీరూపము చూడవలెనని సాంబమూర్తి కోరుట.

చ. [1]తరలకవార్ధిఁద్రచ్చి యమృ — తం బొడఁగూర్చి బలాఢ్యులై నిశా
చరులుహరించినం గపట—చంచలలోచనవై [2]హరించి నీ
వెరవునఁబుచ్చి దివ్యులకు — విందులుపెట్టి త్రిలోకపర్వమై
తిరిగిన నీ వినోదము మ—దిం బ్రియమయ్యెడుఁజూడ నచ్యుతా. 155

క. నారదుఁడుచెప్పె మదనో
దారభవత్కామినీ వి—హారవిలాస
శ్రీరామణీయకంబును
నారాయణ నామనంబు—నకుఁ బండువుగాన్. 156

ఉ. ఏమెయినింతరూపము వ—హించితొ యెంత విలాససంపదన్
గాముని నాక్రమించితివొ — కౌతుకమొప్పఁగనే క్రమంబునన్
బూమెలఁదేల్చితో దనుజ—పుంగవ దేవమునీంద్ర వర్యులన్
దామరసాక్ష నాకుఁ బ్రమ—దంబునఁ జూపుము తద్వినోదముల్. 157

తే. హరివధూలీల మోహించె — నఖిలజగము
నావిలాసంబు చూచిన — నభవ నీవు
నంగజభ్రాంతిఁ జరియింతు — వనుచు నన్నుఁ
బంతముగనాడె నారద — హారికాంతుఁ. 158

---

1. ఆ. పా. తడయక. 2. ఆ. పా. కరంచి నీవెరవున.

క. దేవాసురమును లట్లన
నీవును మోహింతువనిన । నీచోక్తులకున్
భావమునఁ గనలి వచ్చితిఁ
గావింపుము మాయనిప్రకల్పితఁ జూతున్. 159

ఉ. దానవదేవ సిద్ధముని । తామరసాసన ముఖ్యులందఱున్
నీనలినేక్షణాంగ రమ । ణీయగుణంబుల మోహితాత్మలై
దీనతనొంది క్రుమ్మరుట । తెల్లమి వారలు వీరివీరిలో
నానెరియుం భవత్కపట । నాటకమున్ విభజింతు మిద్యోడన్. 160

ఉ. నామది నిర్వికారమును । నావిజితేంద్రియతా నిరూఢియుం
నీమహనీయ మాయయును । నేఁడమరుల్ గనిమెత్తురందఱుం
దామరసాక్షచూపు వెడి । దంబుగ నీకలమాయ యెల్లనా
దీమన మెల్లఁ జూపెద న । తిస్థిరయోగ నిరూఢిపెంపునన్. 161

వ. అని మహాయోగిపుంగవుండైన యనంగదమనుండు తనయొద్దమున్న విష్ణుమాయం బ్రకటించి సకలంబును హరిమాయామగ్నంబనియును పరమసాత్త్విక జ్ఞానవంతులగు హరిభక్తులకుం దక్కఁ దక్కిన వారెవ్వరికి నమ్మాయ గడప రాదనియును మఱియంతటం బోక సామాన్యదేవదానవులం బలెనే మహానుభావుండగు దన్నుం బరిగణింపక నీవైననమ్మాయవలనఁ దరింపలేవనియును దిరస్కారగర్భంబుగాఁ బలికిన కలహప్రియు నప్పటికిఁ గోపింపక సైరించి కార్యానంతరంబున వారించువాఁడై మచ్చరంబునవచ్చి చిత్తక్షోభంబుతోడ వనజనాభుతోనంతఃకోపతా[1]మసుఁడై పలుకునవ్విరూపాక్షుని రూక్షవచనంబులకు ననుగుణంబుగాఁ బ్రమథశ్రేష్ఠులు క్రోధపరుషభాషణంబులం గడకన్నులం గెంపుదోఁప నిట్లనిరి. 162

ప్రమథులు నదే ప్రకారమహంకరించి పలుకుట.

తే. కూపమండూకమును బోలెఁ । గొంచెమైన
నీదు వెడమా[2]ట దామున్న । నీచబుద్ధి
యధికగుణగణ్యుఁడైన యీ । యభవునాడె
నితరులను బోలె నీమాని । యెఱుకమాలి. 163

ఉ. [3]మాయలముంచు నిన్నయిన । మచ్చరికించిన విష్ణుఁడంచు నుం
బాయక రుద్రునింబలికెఁ । బల్కినయప్పుడె పండ్లు డుల్లఁగా
వ్రేయుదు మీవెడంగు ముని । వేగిరమేలని భర్త మాన్పఁగాఁ
బోయెను గాక యీపనులు । పోయినపిమ్మటఁ జెప్పనేటికిన్. 164

1. ప్రా. కోపతాపసుండై. 2. వెడమాయదాముని నీచబుద్ధి 3. మాయలు ముంచు, నిన్ననిన మచ్చరకించునో విష్ణుడంచు.

ఉ. ఆతనికల్ల నేమిటికి ‡ నాతఁడు పల్కినయట్లు నీవు నీ
గాతలెపల్కి మాయలఁ బ్రగల్భతఁ జూపినఁ జూచిరోసియ
శ్శాతభవాది దివ్యముని ‡ సంఘము ముందటఁ బొల్లువుచ్చి వి
ఖ్యాతిగఁ గమ్మఱంజనుట ‡ కార్యముగాక తలంచి చూచినన్. 165

క. నీమాయకోలఁది యీముని
యేమైమున్నెఱిఁగి నాఁడొ ‡ యెఱుఁగకయున్నన్
దామెఱిసి పంతమాడునె
భూమింగల చోట్లనెల్ల ‡ బూమెలు గాఁగన్. 166

చ. మొదల నిశాచరాధముల ‡ మూఢులదుర్విషయాభిలాషులన్
మదనవికారతత్పరుల ‡ మాయలఁబెట్టుట చెప్పనేల య
య్యదనునసిద్ధ సంయమి మహావిజితేంద్రియులు న్మనోభవ
ప్రదరవిభిన్నులై రనుచుఁ ‡ బల్కె మునీంద్రుఁడు నీవధూక్రియన్. 167

ఉ. నీతరుణీ విలాసమున ‡ నెమ్మదిఁదాల్మినిఁదూలి యమ్మనో
జాతనిశాతబాణములఁ ‡ జంచలులైన మునీంద్రు లెవ్వరో
చూతము వీరు వారనుచుఁ ‡ జూపిన నీసభలోనె లే[1] రెకాం
తా తరళాత్ములున్ననులె ‡ తాపసులే విజితేంద్రియాత్ములే. 168

వ. అని ప్రమథులు పతిహితంబుగాఁ బెక్కుభంగుల నారదుని భర్జించి హరిని ధిక్కరించి బీరంబులు పలుకుచుండి రాసమయంబున. 169

అందుకు విష్ణుమూర్తి యోచన సేయుట.

చ. ప్రమథగణంబులాడు బహుభాషలు శంకరుఁ డీగసంబునన్
దమకముతోడవచ్చిన విధంబును నారదు నిశ్చయంపు భా
వముగని మందహాస మొదవన్ వదనాననుఁడై నిమేషమా
త్రము హరియూరకుండె నుచితక్రమమారయుచున్ మనంబునన్. 170

వ. అప్పుడు. 171

సీ. మాఱుత్తరములేక ‡ మాధవుం డున్నవాఁ
డది యేమొకోయని ‡ యరయువారు
మనబోంట్లఁగాక యీమాయలు సోకునే
దర్పకాంతకునని ‡ తలఁచువారు
నేఁడేని యిద్దఱి ‡ నెఱతనంబులుగాన
నయ్యెడుమని మదినరయువారు
హరునేవిధంబున ‡ నైన యీ హరి మాయ
నెలయించునని నిశ్చయించువారు

1. వేరె.

తే. నైరిసురమునిముఖులు తత్తదవసరమున
నాప్రతిజ్ఞాప్రతిష్ఠ యొకిసర్వమన్న
భావమిదియని విభుఁడున్న భావమెల్ల
నారదుఁడు తన్మనః ప్రసన్నత నెఱింగె. 172

క. అందఱునయ్యో విధఘూల
నందకధరచిత్తవృత్తి నాటినతలఁపె
ల్లన్ దమతమ మతముల కొలఁ
దందరయుచు నుండిరమరు లాసమయమునన్. 173

వ. సర్వాంతర్యామి యగు నయ్యనంతుండు తన యంతర్గతంబున నమృతార్థంబు దుష్టదానవ వంచనంబునకై పూనినమదీయ మానినీరూపవిలసనంబు చూచిన వాఁడై నారదుండు [1]వార్త్తావాహుండు గావున సకలలోకంబుల బహుప్రకారంబులఁ బ్రకటించుచు వచ్చివచ్చి తన మ్రోలవినోదంబుగాఁ బ్రసంగించినఁ బ్రమథులుం దానును నేమని యాక్షేపించినాఁడో, దానికై కథాను కథనంబున దేవరవైనం జూచిన మోహింతువని యత్యాశ్చర్యంబుగాఁ బ్రస్తుతించిన నదితన్మందిరస్కారంబు సేయుటగాఁ దలంచి యభిమానించి క్రమ్మఱ నాకపటసుందరీ సౌందర్యంబుచూచి మోహింపక నిర్వికారంబునం బోవువాఁడనని సంకల్పించుకొని వచ్చినవాఁడు, సాంత్వవచనంబులం బోవువాఁడు కాఁడు, దీనికేమిసేయువాఁడ, నమ్మహాత్మునిచిత్తంబు సంక్షోభింపం జేయవలసె, నీతని తమకంబు కొలందిగాదు, ప్రమథులు నిర్వాణత్వంబు చూపి బీరంబులు పలుకుచున్నవారు, వీరినెవ్విధంబుననైన నీ వేళకుం ద్రోచి పంపితినేని నారదునకుఁ దలయెత్తుకొనరాదు, నేఁడు వీరిని మోసపుచ్చి సిగ్గుపఱపకుంటినేని గంటుసంబాడి నవ్వుదురని నానావిధంబుల నూహించి మాధవుండు కొండొకప్రొద్దునకు మాయామందస్మిత సుందరంబగు వదనారవిందం బల్లనయెత్తి భూతభర్త కిట్లనియె. 174

{ మోహినీరూప మేలచూడవలె నీపంతము మానుమని శివునితో విష్ణువు చెప్పుట. }

క. అమృతార్థంబమరులకై
కమలేక్షణ నైవికార కలనన్ మాయా
భ్రమలంబెట్టితిఁగాక
ట్లమరున యోగీశ్వరుండ వగు నీయెదుటన్. 175

ఉ. నీవు మహానుభావుఁడవు నిర్మలయోగ నిరూఢమాని సం
భావిత దివ్యమూర్తివి ప్రభావసమగ్రుఁడ విట్టినీకు చే

1. ప్రా. ప్ర. వార్త్తార్థుండుగావున. ఆ. పా. వార్త్తావాహుండు.

తోఁ వికృతి ప్రపంచములు దోఁచునె యింతుల దుర్వికార మా
యావిషమ ప్రకారముల నన్యులకుంబలె భూతనాయకా. 176

మ. మమునసఖ్యంబునఁ జూడవచ్చి హితసన్మానంబులం బూజలం
బ్రమదంబందక యల్పకార్యమునకై భావంబు వేఱొక్క చం
దము గావించుచు నీగుణంబు గడుఁజిత్తక్షోభముం జెంది దు
ర్దమవాఙ్నిష్ఠుర వృత్తిఁజూపుటకు నాచిత్తంబు మెచ్చది[1] ధూర్జటీ. 177

క. కనకాస్యాదులకై చూ
పిననావని[2]తా విలాస పేశలగుణముల్
మునుదెలియవె యా భంగినె
దనుజులకుం జూపినాఁడ దర్పకదమనా. 178

చ. అదియును నీకుఁజూడఁ బ్రియమైన నొకానొక కార్యవేళఁ జూ
పెద నిపుడేల యింద్రియ వికారభేదముఁబొంది మనంబు తాల్మిబి
ట్టదరఁగఁజేసి యోగక మహాత్ముల నిశ్చయదివ్యయోగ సం
పదఁగుదియింప నీసుజన మండలియందు నవేందుశేఖరా. 179

ఉ. నావుడు శంభుఁడిట్లనియె నారదు పంతము నిల్చుటొండె నే
భావజునేఁడుగెల్చి కృతిభంగిఁ బ్రసిద్ధికి నెక్కుటొండె గా
కీ వెడమాటలం జనుదునే మురమర్దననేఁడు నువ్వె కా
ర్యావసరంబు నీకును మదర్థము మాయల పెంపుచూపఁగన్. 180

క. నామీఁదయానసుమ్మీ
తామరసదళాక్షయన్యథా చిత్తుఁడవై
నీమాయా స్త్రీరూపము
నాముందటఁ జూపకున్న నమ్మన్ గ్రీడన్. 181

క. అని రుద్రుఁడు వాలాయము
తనునొత్తిలి పలుకఁబలుకఁ దగనిట్లనియెన్.
వనజాక్షుఁడు బ్రహ్మామర
మునులకుఁ గర్ణోత్సవముగ ముగ్ధేందు ధరున్. 182

చ. పలుమఱు మాన్యుఁడంచు నినుభంగమొనర్పక సఖ్యమూఁది నీ
యలుకకునోర్చి నీప్రమథులాడెడు కర్ణకఠోరభాషలన్
దలఁకక నీకునేఁ బ్రియము తద్దయుఁ జెప్పిన నియ్యకొనక నా
పొలఁతుక రూపుచూచుటకె పొంగెదు చూచెదుగాక యేమనన్. 183

---

1. మెచ్చితి ధూర్జటీ. 2. ఆ. పా. మాయావిలాస.

వ. అని భ క్తవచన ప్రతిపాలకుండును జగన్నాటక సూత్రధారుండును [1]సకలగుణ సంపన్నుండునునగు వెన్నుండు చిన్నినగవు మొగంబునం జిగురుకొల్పి నారదుని ప్రతిజ్ఞ నిల్పువాఁడై యతని నవలోకించి. 184

క. ఫాలవిలోచన వహ్ని
జ్వాలల మరు నేర్చినాఁడు ॥ సర్వజ్ఞుఁడు కాం
తాలీలల మోహించునె
యేలాపంతంబు పలికి ॥ తీహరుతోడన్. 185

వ. అనినఁ గరంబులు ముకుళించి విరించిసూనుండు కలహాభోజనుండు గావున నయ్యిద్దఱకు వివాదంబగుటకు సంతసించుచు హరియభిప్రాయం బెఱింగి యిట్లనియె. 186

నారదుఁడు విష్ణుమూర్తిని, నాతనిమాయను నుత్కర్ష చేయుట.

శా. దేవా దేవర దివ్యతత్త్వము మహాధీరుల్ పరబ్రహ్మవి
ద్యావేదుల్ నిజసాత్వికోత్తములు, సత్యజ్ఞానవంతుల్ మదిన్
భావింపంగలరేమొ కాక యితరుల్ ॥ భావింపఁగా శక్తులే
యీవాణీశ శివామరుల్ దెలియరే ॥ యీ యర్థమాత్మేశ్వరా. 187

క. డెందంబునకును వాక్కున
కందఁగరాకున్న నీ చిదాకృతి విద్యా
మందు లెఱుంగరు విజ్ఞా
నేందుజ్యోత్స్నా ప్రసన్న ॥ హృదయులు దక్కన్. 188

తే. అట్లు బ్రహ్మైకతేజమై ॥ యలరునీవు
భూరిమాయా బలంబున ॥ భువనచయము
బహుచరాచరకోటి సంపదలనించి
ప్రభుఁడవై యుంట యిది వేదభాషితంబు. 189

క. ఇటువంటి నీవు మాయా
నటనకళా ప్రౌఢిచూపి ॥ నన్భ్రమయుక యెం
తటివారు యోగవిద్యా
పటుబుద్ధివహించి నిల్వఁబడువా రుర్విన్. 190

మ. అదియేమేల యెఱుంగరే మునులునీ ॥ యంభోజజాతుండు నీ
మదవత్యుత్కటరూప విభ్రమమునన్ ॥ మానంబు వేతూలినన్
మదమాద్యన్మదనాస్త్ర నిర్దళిత మర్మస్థానులై పోక బ
ల్లిదులై యెవ్వరు నిర్వికారమునఁ దాల్మిన్ జెంద లేకుండుటల్. 191

1. సత్యసంపన్నుండు

వ. దేవగవట్లు సముద్రమథన సంభవంబైన యమృతకుంభంబు హరియించిన యసురుల మోసపుచ్చి యమృతంబు గొనుటకై కపటకామినీ రూపంబుఁ దాల్చి యానక్తంచరులు మున్నుగా సకల లోకంబులను మోహింపఁ జేయుట జగంబులం బ్రసంగించుచుఁ బోయిపోయి కైలాసంబునఁ బ్రమథగణ పరివృతుండైన యిమ్మహాదేవుని సన్నిధానంబున స్తుతియించిన మిథ్యాలాపంబులని నన్ను నపహసించి తన నిర్వికారత్వంబు ప్రకటించుకొని యహంకరించిన. 192

శా. పంతంబాడితిఁ ఫాలలోచనునితో బ్రహ్మాదులుం బోలెనా
వంతైనన్ గడువంగలేక హరిమాయామోహచక్రంబునన్
భ్రాంతిం బొందుదు వా జగత్పతివధూ రత్నోల్లసత్క్రీడలన్
జెంతన్నిల్చిన నీవునంచుఁ ద్రిజగత్సిద్ధంబుగాఁ దత్సభన్. 193

క. ఇది యపరాధంబని మీ
మదిఁ జూడక భక్తవరద మనమునకింపై
నదియాచరింపు మనుచుం
దుదిఁ దోపం బలికె నారదుఁడు సకలంబున్. 194

ఉ. అంతయు దివ్యచిత్తమున నారసి మాయలు సంఘటించి శ్రీ
కాంతుఁడు తత్సభాసదులఁ గాలగళుం బ్రియమారఁ జూచె వ
క్త్రాంతర సుప్రసాద దరహాసరసామృతవీచిదోఁపఁగా
నంతట నేమి చెప్పుదు ధరాధిప వల్లభ యద్భుతంబుగన్. 195

{ విష్ణుమాయా ప్రభావముచేత ముందుగానే శివునికి మన్మథ వికారములు పుట్టుట. }

క. ఆయంగజగురు నగవున
నాయంగజవైరి యంగజానందకళా
శ్రీయుక్తుఁడయ్యె వెన్నెల
సోయగమునఁ గైరవ ప్రసూనము పోలెన్. 196

సీ. అవయవంబులు గరుపారె నానందాశ్రు
కణములు దొరఁగె మై కంపమడరె
జడతవాటిల్లె వైస్వర్యంబు జనియించెఁ
బులకాంకురంబులు పొడమెఁ గలయ
మోములు వైవర్ణ్యమునఁ బొందెనందంద
శ్రమవారి పూరంబు జాలువాఱె
నుల్లాసమునఁ బొందె నుల్లంబు నంగజో
త్సాహాను రాగముల్ సందడించె

తే. భావివైష్ణవ మాయాసతీవిలాస
జాతపరితాప భారసూచకముగాఁగ
నప్పుడేమని చెప్పుదు నవనినాథ
కొలువు వారికి నెల్లఁ గోర్కులు దలిర్ప. 197

మాయామోహిని యవతరించి వచ్చుట.

క. హరి యోగమాయనుదినం
స్మరియించిన మాత్రనపుడె మనుజేశ్వరయా
పురహర ముఖులముఖంబులఁ
గరమరుదుగ మదనకాంతి కళ దైవారెన్. 198

చ. కలకలనవ్వు నెమ్మొగము కాటుకరేఖల సోయగంపు చూ
పులు నెలవంక నెన్నుదురు భ్రూలతికావలసంబు మన్మథా
కులహృదయంబుఁ గల్గి కుచ కుంభభరానత మధ్యవల్లితోఁ
జెలఁగుచువచ్చె నొక్కనుదతి సింధురయాన సభాగ్రసీమకున్. 199

సీ. నాసాపుటముల కానంద సంపదియై
పచరించె నొకవింత పరిమళంబు
చెవులకుఁ బండువై చిత్తంబు ఝల్లనఁ
గెరలెనపూర్వ భృంగీస్వనంబు
కనుగొనల్ మిఱుమిట్లు గొనఁదళుక్కనఁ బర్వె
గుఱుతు సేయఁగరాని మెఱుఁగు దీఁగె
యంగంబులుప్పొంగ హర్మ్యరత్నశ్రేణి
మోహనపుత్రికా మూర్తిదోఁచె
తే. నతివ చనుదేర ముందఱ నంతనంత
నవ్యతనుగంధమును నూపురారవంబు
నంగదీప్తియు సతిరూపునయ్యెఁ బిదపఁ
జోద్యమందుచు సభవారు చూడఁజూడ. 200

ఆమోహినీ కాంతనుజూచి సకలమైనవారు మెచ్చుకొనుట.

చ. మదననిధాన దేవతయొ మానినియై తిలకింపవచ్చు స
మ్మదరసపూరమో సురత మంత్రనియంత్రిత యంత్రమూర్తియో
సదమల దివ్యయోగిజన సంఘముపాలిటి విష్ణుశక్తియో
యదియని యువ్విలాసవతి నందఱుఁజూచిరి యుత్సవంబునన్. 201

శా. మందాందోళిత కుండలద్వయముతో మందస్మిత శ్రీలతో
మందార ప్రసవాంచితాలకమిళ న్మత్తాళిగానంబుతోఁ

గందర్పకేళి పాలగంధ గజరాడ్గంభీర యానంబుతో
సౌందర్యాకలమైన యాంపాలఁతి యాస్థానంబు వే జాసినన్. 202

చ. కొలువున నున్నయచ్చరలు గుందిరి హైమందవ చంద్రికారుచిన్
నలినులభంగి సిగ్గునఁ బొసంగిరి శ్రీనగజావధూమణుల్
వెలవెలఁబాఱెఁ దద్భవన విస్ఫుటకృత్రిమ రత్నపుత్రికా
విలసన మవ్విలాసవతి విభ్రమకాంతులు మింటఁదోఁచినన్. 203

మోహినీకాంతా విలాస వర్ణనము.

సీ. వేయుమన్మథుల పూవింటికోలల బారు
పరుసున దృక్స్వరం పరలు నిగుడ
లక్షపద్మముల యుల్లాసంబు పొది గొన్న
కరణి నెమ్మోము వికాస మడరఁ
గోటిచంద్ర ద్యుతుల్ కొనసాగుచున్న రూ
పంబునఁ దనుదీప్తి ప్రజ్వరిల్ల
శతకోటి రతివధూ సౌభాగ్యమెసలారు
పగిదిలావణ్య సంపద దనర్ప
తే. నఖలదివ్యాంగనా సమభ్యర్చితాంగ
విభ్రమాసక్తి మరుఁడు వెన్నంటరాఁగఁ
జొచ్చె నాస్థానసదనంబు శోభనాంగి
చంద్రకౌముదిఁ గుముదపుష్పంబు వోలె. 204

వ. ఇట్లు మదనకామధేనువు చందంబున ననంగ మంగళాధిదేవత తెఱంగున, సంకల్పభవ కల్పలతికలాగునఁ గామసముద్ర కల్లోలిక విధంబునం గుసుమశర వర్షాగమ తటిద్వల్లి మురిపెంబున నిక్షుకోదండవీర లక్ష్మిలక్షణంబున సాక్షాత్కరించిన, లత్తుకరసంబు జొత్తిల్లుచుం బ్రణయాపరాధనాయక వక్షస్తాడన ప్రసాదదాన శౌండంబులై వందనీయంబులైన యడుగు కెందమ్ములును, ప్రసూనతూణీర లావణ్యంబు గణింపక భుజంగ భయంకరంబులై మరుని మువ్వల కోలలుపోలె రవ్వళింజూపు రవలయందియలుగల జంఘాకాండంబులును, నునుపసిండి నిగనిగ లలరారుచు వల్లభ భద్రదంతావళంబుల బంధించి కట్టుగంబంబులైన మెఱుంగుఁ దొడలును, ననంగ మంగళ గృహోప కంఠ నాభీ సరోవరకనక సైకతంబై విటరాజహంస విహారణపదంబైన నితంబ బింబంబును, మందపవన కంపితంబగు లేఁదీఁగెబాగున జలదరింపుచు యువ శ్రేష్ఠులకు నస్తినాస్తి వివాదసందేహ హేతువైన తనుమధ్యంబును, రతిరాజ పట్టాభిషేకసమయ సమభ్యర్చిత కనక కలశంబుల విలాసంబుల నవకుంకుమ స్థాసక పుష్పమాల్యా లంకృతంబులై రసికకాముక గాఢాలింగనబంధ

భ్రమానుబంధ బంధురంబులైన గురుకుచ కోరకంబులును, బంకజనాళ కంకా కరంబులై వియుక్తదయిత మోహపాశంబు లనుటకుందగిన శాతనఖాగ్రంబు లైన హస్తంబులును, త్రిరేఖా విలసితంబై వల్లభ రతిరాజ్యప్రవేశసమయ విజయ శంఖంబైన గళంబును, బ్రణయరంహానునయపరికర గ్రాహ్యంబై కోమలతాలీ శలాటుబీజ విరాజితంబైన చుబుకంబును, బున్నమనిండు చందురుని చందంబునం బ్రసన్నంబై పాంథజన మనస్సంతాపహరణ కారణ సుధారస రసికమందస్మిత సుందరంబైన నెమ్మొగంబును పరిపక్వబింబికా ఫలరూపంబున, రసమయంబై ప్రాణేశ్వరతృష్ణపిపాసా ప్రశమన సమర్థంబగు నమృతం బాస్వాదింప నింపైన యరుణాధరంబును, మనోహర సౌరభ సౌభాగ్య నిశ్వాసమారుతంబునం బ్రియులముఖ కమలంబులు వాసించు నాసికాచంప కంబును, శ్రీకారసదృశంబులై వియోగిదురభిమాన లతోచ్ఛేదనరత మదన నిశాత చక్రంబులనం బజ్వరిల్లు వజ్రతాటంక చక్రంబులుగల శ్రవణం బులును, మందస్మిత స్మేరంబులై మనోరమణ రమణీయముఖావలోకనము ఖరబింబంబులై విడంబించు మృదుకపోల పాలికలును, ముత్తియంపు చిప్పల రొప్పిదంబున విప్పారి, హృదయకమలసముద్భూతమదనానురాగ మకరం దంబుచిందుచు వెక్కసంబైన వెన్నెల రసంబు పుక్కిలించు చకోరంబు లన నలరు దరహసిత విలోచనంబులును, పారిజాత ప్రసూనగర్భ నిర్భరంబులై విరహి మర్మభవనంబులై వెంజీకటి సిరులనించు నింద్రనీలఖండ ఖచితమ యూర పింఛసమానంబైన సాలక కేశపాశంబులును, దనకు సహజాలంకా రంబులై పొలుపార సముచిత దివ్యాంబరాభరణ భూషితయై మదాలసత్వం బును, మనోహరలీలా మధురిమంబును, వ్రీడానమ్రభావంబును, వీక్షావిలసనం బును, నంతర్హాసంబును, ననంగ లౌల్యంబును క్షణక్షణ సాత్వికోదయంబును, బుట్టింపంజాలు మెలజవ్వనంపుసిరులు దైవాఱ సర్వమోహినియై సంసార సుఖసారంబైన మన్మథ బ్రహ్మవిద్యాతత్వంబే ప్రమాణంబని చిదానంద కళలు తనయందకాని లేవను నుద్యోగంబుగలిగి యక్కలువకంటి పురోభాగంబున నిలిచిన. 205

{ మోహినీకాంతను జూడఁగానే శివునికిని బ్రహ్మర్షులు మొదలైన వారికిని సాత్వికోదయమగుట చిత్తవైకల్యము పుట్టుట. }

మ. కలఁగెంజిత్తముగుండె ఝల్లుమని యొంగంపించె దేహంబు క
న్నులఁ గెన్నెక్కెఁ జలించె ధాతువులు వేన్నుండట్లు మాయాసతీ
కలనన్ గామకళా సహస్రరసికోత్కంఠన్ విజృంభించినన్
వలరాచంటని యోగినంచు విరతిన్ బ్రవర్తించునాశూలికిన్. 206

తే. బ్రహ్మ యోగీంద్రదేవ దిక్పాలవరులు
మ్రానుపడి చూచుచుండిరి మగువచెలువు
ప్రముఖులన్యోన్య పరిరంభ బద్ధులైరి
వికలితేంద్రియులై వెడవిలుతు చేత. 207

ఉ. ఎంతటివారు ధైర్యము వహింపఁగ నెంతటివారు మోహ వి
భ్రాంతులుగాక యీజగతిపై నిఁక రుద్రునికంటె యౌవనా
నంత విలాసరేఖఁ దరళాక్షి రతోత్సవ సంభ్రమంబునం
జింతవహించి లేనగవుఁ జిల్కుచు మన్మథుఁ బ్రోదిచేసినన్. 208

సీ. నిశ్చలితధ్యాన నియమంబు లలితాంగి
తోరంపు రూపంబు దోఁచుదాఁక
మహనీయ జపనిష్ఠ మత్తేభగామినీ
శోభనాగమనంబు చూచుదాఁక
నిజకులాచారంబు నీరేజపత్రాక్షి
కడకంటి చూపుపైఁ బడినదాఁక
నుగ్రతపోవృత్తి యువతీ శిరోమణి
యౌవన సౌభాగ్య మబ్బుదాఁక
తే. సంతతేంద్రియ నిర్బంధ శక్తియబల
యలతిసిగ్గున సొబగు మే నదురుదాఁక
గాక యామీఁద సాగునే కంతుచేతఁ
గాళగళుఁడైన బ్రహ్మర్షి గణములైన. 209

ఉ. ఏమనిచెప్పుదుం గురుకులేశ్వర వైష్ణవమాయ కొల్వునం
దామర సాక్షుఁ డెప్పటి విధంబున నున్నటులుండఁగానె బ్ర
హ్మామరమౌని కోటులకు నచ్చెరువై పరమాత్మయోగ వి
ద్యామణియైన శంభుహృదయంబు ముదంబునఁ దేల్చె నాక్రియన్. 210

మోహినీకాంతనుజూచి శివుఁడు మెచ్చుకొని వర్ణించుట.

తే. ఇవ్విధంబునఁ గొలువెల్ల నిందువదన
భువనమోహనలీల నుప్పొంగ నపుడు
పూర్ణిమా చంద్ర చంద్రికాస్ఫూర్తిచేతఁ
బాలకడలియుఁబోలె భూపాలచంద్ర. 211

క. కొలువెల్లఁ దనవశంబై
తిలకింపఁగఁ జేసి మదవతీ రత్నము ని
ర్మలచంద్ర దేవతాకృతిఁ
జెలువారఁగఁ జూచి శివుఁడు చిత్తములోనన్. 212

క. భళిరే! సతిగ్గొపుట్టిన
వలదా యిటువంటిరూప వైఖరి లీలా
విలసనముఁజూపి పురుషుల
తలఁపులు భేదించి వలపు దలకొలుపంగన్. 213

శా. వందారుప్రియ ఫాలభాగమున నవ్యాజప్రసాదంబుతో
నందంబైన యలంక్రియా సరణిలాత్తాంకంబు సోఁకించుచున్
గొందమ్ముల్ దనయన్నసమ్ములయి రాగిల్లన్మనఃప్రీతిఁబెం
పొందుందాని పదద్వయంబు సరికెక్కొల్లొప్పున్ జిగుళ్లెన్నఁగన్. 214

శా. బంగారంపు మెఱుంగులం దనరి రంభాభూజముల్ తొల్లి యే
భంగిన్ బంకజసంభవుందగ భజింపంజాలెనో నిష్ఠమై
రంగన్మన్మథడోలికాస్థిత సువర్ణ స్తంభయుగ్మంబు లీ
లంగన్పట్టెడు దీనియూరువులఁ బోల్పంగల్గె భాగ్యంబిలన్. 215

చ. కనకపు నిగ్గులుంగలిగి కాఁగిటికిం గడువెక్కసంబులై
నునుజిగి మీఱు గోరికొన నొక్కుల [1]జీగియవాటి యున్నమ
ద్ఘనవన జాతకోరక యుగంబుక్రియన్ గొనవాఁడులైన యీ
వనితపయోధరంబులకు వారణకుంభము లీడువచ్చునే. 216

చ. సితకరబింబ మేతపము చేసెనొ పంకజ సూన మేమి స
ద్వ్రతము సమాచరించెనొ సుధారసకాంతియు సౌరభంబు పూ
ర్ణతయు వికాసముంగలిగి నాఁడెముగా నొకవేళయైన యీ
యతివ మొగంబుఁ బోల్పఁదగినట్టి పదార్థము తౌటకున్ భువిన్. 217

చ. అమృతము చల్లు[2]భారు తుహినాంశు మరీచుల యల్లిబిల్లి ము
త్తెముల ప్రచారమబ్జవన దేశముకుందు మెఱుంగునేఁగ తం
డము మొగసారి యీసతి కడంగు కనుంగవచూపు లు[3]త్కటా
సమశరమోహనాస్త్రముల సంగతి మూర్ఛల పాలుసేయవే. 218

సీ. విజితేంద్రియుల మనో విరతి శాబ[4]ములకు
గండకత్తెర దీని కలికిచూపు
సిద్ధయోగీంద్రుల చిరయోగ వారాశి
కౌర్వానలము దీని యలఁతినవ్వు

---

1. నునుజిగి మీరగోరికొన నొక్కులకున్ బిగియారియున్న మధ్యన వనజాత. 2. ప్రా. పా. చల్లభారు. 3. ఆ. పా. లక్కటానును ప్రా. రసజాత. 4. శం(ఖ)బములకు ఆ. పా. వీరశంఖములకు.

పటుతపోధనుల తపఃపర్వతములకుఁ
గులిశాయుధము దీని కౌమరువయసు
బ్రహ్మవేత్తల బ్రహ్మ పరిబోధ చంద్రిక
కరుణోదయము దీని పరిచయంబు
తే. సకలనిష్ఠలు నీపూర్ణ చంద్రవదనఁ
జేరి బిగియారు కౌఁగిటఁ జేర్చుదాఁక
కాక యామీఁద ఫలమేమి కలదుచూడ
ననుచుఁ దర్కించె శివుఁడు మోహాంధుఁడగుచు. 219
వ. అప్పుడు. 220
క. కొలువెల్లఁ దన్నుఁ జూడఁగ
దళదరవిందాక్షి చూచెఁ దరళకటాక్షం
చలములఁ బ్రేమయుఁ దమకము
నెలనగవును నంకురింప నిందుకిరీటున్. 221
చ. అసితపయోజ పత్రముల యంచుల మించులువాఱు చంద్రికా
రసకణరాజి చెందమున రాజిలు రాజనిభాస్యకజ్జల
ప్రసరలసత్కటాక్షములఁ బర్వెడులే నగవుల్ గఱంచె న
య్యసమశరారి డెంద మనలాంకురముల్ నవనీతముంబలెన్. 222
క. తన చూపుకంటె మిక్కిలి
వనితామణి మేలుచూపు వాంఛాలతలఁ
పెనిచిన శంభుఁడు మదనుని
సునిశిత బాణాగ్ని శిఖల సోఁకునఁ[1] బ్రేలెన్. 228

శివుఁడు వివేకశూన్యత చేత మోహినియందు లోలుఁడౌట.

సీ. నారదమౌని పంతము చిత్తగింపక
నలినాసనాదులు నగుదురనక
ప్రమథులనెఱవాది పలుకులు దలఁపక
గిరిజయీరసమునఁ గెరలుననక
హరిమాయయోయని యాత్మ శంకింపక
తన దృఢయోగ వర్తనముఁగనక
సర్వజ్ఞతాశక్తి సడలుట యెఱుఁగక
చిత్త సంక్షోభంబు చెందుననక
తే. మించి కామాంధకారంబు ముంచిముంచి
మనసుఁగప్పిన సకలంబు మఱచి శివుఁడు

1. అ. పా. 'శిఖలసోఁకున వచ్చెనూ'

బాలలీలావిలాస విభ్రమపయోధి
లోలకల్లోలములలోనె యోలలాడె. 224

తే. చూచు సతిరూపువెండియు సొంపుమీఱఁ
బడతి ప్రేమంబుచూపు[1]నఁ బరిణమించు
నిట్లు నన్యోన్య దృష్టులునేకమైన
భావమాహ్లాద మొనరింప భావజారి. 225

ఆ. లేచిపోయి పట్టఁజూచుఁ గ్రమ్మఱమాను
నవసరంబు గామి కాత్మఁగలఁగుఁ
దరుణిఁజూచుఁ గొలువుపరికించి పరికించి
వెచ్చనూర్చుమిగుల విహ్వలించు. 226

తే. ఎట్టకేలకు ధైర్యంబు మట్టుకొలిపి
వేళగామికి నమ్మహావేగముడిగి
కొలువుపీఠ్యాని దీనినే బలిమినెత్తు
కొనిరయంబునఁ బోయెదననితలంచి. 227

ఆ. ఒక్కభంగిధైర్యమూఁది త్రొక్కడలఁ
దగిలియున్నచూడ్కి[2] మగుడఁదిగిచి
పీడుకొలువడయు వినయంబు సంధించి
శూలికొలువువంకఁ జూచునపుడు. 228

క. హరియును సిరియును మొదలుగ
సరసిజగర్భాది దివిజ సంయములచటన్
ధరణీశ లేకతక్కరి
హరుచూడ్కికి నేమిచెప్ప నచ్చెరువొందున్. 229

క. హరియును వేల్పులు నెయ్యెడ
కరిగిరొకొయనుచుఁ బార్శ్వమవలోకింపన్
గిరిరాజ[4]సుతయుఁ బ్రమథులు
పరిజనములు లేరయచటఁ బరికింపంగన్. 230

{ శివుఁడు చూచుచుండగానే యా సభామందిరము మాయమై యాస్థలము శృంగారవనమగుట. }

వ. వెండియు విస్మితుండై కామఘస్మరుండు నలుదిక్కులుగలయ నాలోకించు నప్పుడు కొలువుకూటంబు మొదలుగాఁగల కనకకలధౌతచంద్ర శాలాద్వార కవాట గోపుర ప్రాకారాది గృహసన్నాహంబులేక యాప్రదేశంబు చూత

1. చూపునం బరిణమిచ్చు. ఆ. పా. 2. జూడ్కి. 3. ప్రా. పా. వందన్. 4. ప్రా. పా. తనయ.

పనసరంభా ఖర్జూరజంబు జంబీర నారికేళ కురవకాశోకవకుళ కరవీర పారిజాత సింధువారాది పాదపప్రతానంబును, నేలాలవంగలుంగ మాతులుంగ తక్కోల ద్రాక్షామాధవీయూథికామల్లీమతల్లికా ప్రముఖ లతామంటప కుసుమిత నికుంజ పుంజంబులును, వికచకమలకైరవప్రోత్పలమండ మండిత సరోవర దీర్ఘికాసముదయంబులును, మణిమయ దరీగృహద్వారవేదికా శిలాఫలక కలితకేళీశైలంబును, పుష్పతరుశాఖా సమాందోళిత సువర్ణడోలా తల్పం బును, పల్లవోల్లసిత కుసుమరస ఫలరసధారా ప్రవాహంబులును, మంద మారుత పరిపూరిత దిశావకాశ బహువిధ మోదభారంబును, గోకిలారవ కోలాహలంబును, శుకనికర కలాలాపంబులును, చంచరీక ఝుంకారంబులును, హరిణమిథున సంచారంబులును, మయూర నృత్తావధానంబులును, కలహంస లసదలస క్రేంకార నాదంబులునుంగలిగి యొక్క యభినవోద్యానంబై యుండెనంత. 231

క. అది సహజోద్యానంబై
మదికిం బొనరింపఁదాను మగువయుఁ దక్కన్
వెదక మఱియొరులు లేమికి
మదనారియుఁ బ్రమద మగ్న మానసుఁడయ్యెన్. 232

క. తనరాకయు హరికొలువున
నునికియు నాస్థానభూమి యుద్యానంబై
తనరుటయు మఱచె శంభుఁడు
కనియును హరియింద్రజాల కౌతుకలీలన్. 233

శా. ఆచందంబున నిర్జనంబయిన యుద్యానంబుఁ బ్రాణేశ్వరిం
జూచెంగోర్కి ఫలించెనంచు హరుఁడచ్చో దైత్యకపుష్పాస్త్ర నా
రాచశ్రేణులతోడఁగూడి పికకీరవ్రాత భృంగీరవ
ప్రాచుర్యంబు గలంచె నవ్విభుని శుంభద్ధైర్య సారాంశమున్. 234

వ. అంత. 235

శివుఁడు మోహినీకాంతను బట్టఁదలఁచి లేఁగాగా మోహిని మాయమగుట.

తే. ఏకతముననున్న యింతిఁబట్టెడు వేడ్క
నాసనంబు డిగ్గియరిగె హరుఁడు
సతియునొక్క తీఁగెచాటున వడిడాఁగి
పోయె నవలఁద్రోచి బొమ్మవోలె. 236

క. డాఁగిన యాలతమాటున
నేగి లలాటాక్షుఁడచట నిందునిభాస్యన్

దాఁగానక తల్లడపడి
వేఁగడుఁజిత్తమును మేను విరవిరబోవన్. 237

ఉ. ఇక్కడ నన్ను డాయ నెలకొయించిన దీలత మాటులోనె నీ
టక్కరికత్తె యేవలన డాఁగెనొ నవ్వులకంచుఁ బొంచి నల్
దిక్కులు చూచునప్పుడెల కీఁకెలుగప్పిన పొన్ననీడను
న్నెక్కిన రత్నవేది నొక యిక్కువఁ గెంపెసలార వేడుకన్. 238

సీ. పయ్యెదదిగజాఱఁ బసిఁడి చాయలుదేరు
చనుదోయి ముత్యాల సరము వెలుఁగ
బహులతాడ నాయాస భారజాతస్వేద
కణములు గండ భాగములనురల
ననుగత దృష్టి సంహాతితోడ సౌరభా
గతమత్త మధుపసంఘములు చెలఁగ
గ్రహణమోచనవేళ ఘుళఘుళత్కార పద్మ
మణికాచకంకణ రణనమెసఁగఁ
తే. కంపితోత్కట కటిభార కల్పభూజ
పుష్పములు రాలి దిశలఁ బుప్పాళ్లు చెదరఁ
గ్రీడమై తానె పూబంతి యాడుచున్న
యవ్విలాసినిఁ గనియె చంద్రార్ధమౌళి. 239

శివుఁడు మోహినిని మరలపట్టఁ జూచుట

క. కని పేద పెన్నిధానముఁ
గనిన ట్లుల్లంబు పరమ కౌతుకలీలన్
గొనసాగ నల్లనల్లన
చనిపట్టెద నని తలంచి సరసప్రౌఢిన్. 240

మ. చరణాబ్జంబులు భూమిభాగమున నిశ్శబ్దంబుగా మోపుచున్
దరుషండంబుల దండనండ గొనుచున్ దత్కౌతుకోల్లాస సుం
దరసంక్రీడల నేమరించి యమితోత్సాహంబుతో బిట్టు త
త్వరతం జేరువఁ బొన్నమాటు గొసియు ద్యద్వేగ సంరంభుఁడై. 241

ఆ. మ్రానుచాటు విడిచి మగువయున్నెడకు లం
ఘించిప్రేమఁ గౌఁగిలించి నపుడె
పడఁతి లేక బట్టబయలయ్యెఁ గలవోలె
[1]లేమిఁబట్టి కౌఁగిలించుటయ్యె. 242

1. అ. పా. గలలోన లేమబట్టి కౌఁగిలించుటయ్యె.

శా. అస్తంయాత వివేకుఁడై యపుడు చంద్రాపీడుఁ డుల్లంబునన్
హస్తప్రాప్తధనంబు పోయినటు లత్యంతంబుఁ జింతించి వి
ధ్వస్తేందీవరలోచనా ప్రియతమ వ్యాపారలీలా పరి
ప్రస్తాంగంబులతోడ దైన్య[1]మడరన్ సంతాపముం బొందుచున్. 243

వ. కొండొక తడవెద్దియుం బరికింపంగానక నిర్వేదించి. 244

క. నిక్కముగఁ గాఁగిలించితి
గ్రక్కుననిది లేకపోయెఁ గాఁగిటిలోనన్
జక్కెర విల్తుఁడు పన్నిన
వెక్కసమగు నింద్రజాల విద్యయపోలెన్. 245

క. ఇప్పువ్వుఁబొదలలోపలఁ
జొప్పడఁచెనొ చూతమనుచుఁ జూపులు దిశలన్
విప్పారఁజెక్కు. నెలవులు
తప్పక పరికించి మోహదశ ప్రాపింపన్. 246

శివుఁడు విభ్రాంతుఁడై వనమందుఁ దిరుగుట.

సీ. మదశిఖావళియొక్క పొదలోనఁ దోఁగినఁ
దొయ్యలి యనిపోయి తొంగిచూచుఁ
గలకంఠనాద మెక్కడనైన వినఁబడ్డఁ
జెలువ భాషణమని చిత్తగించు
నెలదేఁటితండ మెయ్యెడ మ్రోలఁబొలసినఁ
బడతుక నెఱులని పట్టఁదివురుఁ
గాడ్పునఁబై ప్రాలుకలికిమై దీఁగె నం
గనవచ్చెనని పట్టి కౌఁగిలించుఁ
తే. జెదరిపూఁదేనె వాతెఱఁ జెందనిందు
వదన యధరామృతంబని వలసిగ్రోలుఁ
జేతనాచేతన జ్ఞాన శిథిల హృదయుఁ
డగుచు మదనారి మిథ్యావనాంతరమున. 247

వ. ఇట్లుపరిభ్రమించుచుం బోయిపోయి యొక సంఫుల్లమల్లికా మంటపంబున.

---

1. అ. పా. ధైర్యమడరన్ సంతాపము, బొందుచున్. ప్రా. పా. సంతోషము బొందుచున్.

శివుఁడు తిరిగి మోహినీకాంతను దూఁగుటుయ్యాలపైఁ జూచుట.

సీ. జిగిగుబ్బపాలిండ్లఁ జేలాంచలంబును
దొడలపై ముంగొంగు దొలఁగి యాడ
ధరమెట్టియూఁగు నుద్ధతిఘల్లుమని బిట్టు
రమణీయమణి నూపురములు మ్రోయఁ
బువ్వుఁదీఁగెలఁ గరంబులఁబట్టి నిగుడెడు
తీవ్రత మైచాయ తీఁగెసాగ
రాకపోకల త్రోవ నాకాశలక్ష్మికిఁ
జరణాంబుజముల యర్చనలుగాఁగ
తే. నెలమి వనదేవతలకు నెనఁగ నసను
శరునిఁ బాడుచు మందహాసంబుతోడఁ
గేలిడోలా మహోత్సవ క్రీలఁ దేలు
బాలఁ గ్రమ్మఱఁ గనియె నా శూలపాణి. 249

క. ఏణాంకధరుఁడు పోయిన
ప్రాణకళయుఁబోలె మగుడఁ బ్రాపించిన యా
ప్రాణేశ్వరిఁ గనుఁగొనియె
క్షోణీశ్వర రెప్పకప్పు సుడియని చూడ్కిన్. 250

వ. ఇవ్విధంబున నిందుముఖి సందర్శనానంద పారవశ్యంబునం బొంది యప్పటి యట్ల వంచించి కానకుండం బట్టుకొనువాఁడై పశ్చాద్భాగంబునఁ బొదల మాటున నొదిగి యొదిగి యాయుయ్యాల డాసి పట్టనుంకించిన. 251

క. ఇందుధరుగమన మారసి
ముందటికై యూఁగియచట ముద్దియ యుటికే
గందువ మణినూపురములు
నందంబున ఘల్లుఘల్లుమని మ్రోయంగన్. 252

మోహిని తిరిగి యదృశ్య యగుట.

శా. డోలాతల్పము డిగ్గదాఁటి మదనాటోపంబు దీపింపఁగా
బాలారత్నము స్రస్తబంధకబరీ భారంబునం బుష్పముల్
రాలన్ లంఘన చాతురిం జకిత సారంగాంగనాథంగి నా-
శూలిన్ గిక్కురుపెట్టిపోయె లతికాస్తోమాంతరాళంబులన్. 253

మ. తనువంచించి విహంగియై యెగసి చేతంబిక్కకల్లోగినన్
గని నిశ్చేష్టిత లోచనాంబుజ దళోద్యగ్ర బాష్పాంబువుల్
తనుకంపంబునరాల గద్గదికతో దైవంబు నిందించి వే
చని నిట్టూర్పులతోడ డాకొనియె నా చంద్రాస్యడోలాలతన్. 254

వ. ఇట్లు డాసి తదీయ మనోహరాంగ శోభనాంగరాగసత్వంబు[1] గలిగి తద్వి
హరణ లీలాయోగ్యంబైన యాతూఁగుటుయ్యెల తీఁగఁ గాఁగిలించి. 255

క. ఏ పుణ్యంబులు చేసెనొ
యీపువ్వుఁదీఁగె బోటి ఽ నెప్పుడు డోలా
రూపమున ననఁగి పెనఁగెడు
నీ పరితోషంబు గనియె ఽ నివ్వన భూమిన్. 256

వ. అని యభినందించి యమ్మోహనాంగి దిగఁబోఁడి యుఱికిపోయిన కడకుంబోయి.

క. కచబంధంబున జాఱిన
విచికిలదామంబు ప్రణయ ఽ వివశతఁ గొనియా
రుచిరాంగిఁబోలెఁ గాఁగిట
నచలనుతావరుఁడు సేర్చి ఽ యానందించెన్. 258

క. తరుణీకుచనిపతిత ని
ర్భర పరిమళగంధసార ఽ పంకదళంబుల్
హరుఁడెత్తిఁగి మదనరతిః
పరిరక్షాతిలక మిడియె ఽ ఫాలాగ్రమునన్. 259

వ. వెండియు నమ్మోహనాంగి నిందువదన పదారవిందంబులు గనుంగొని. 260

ఉ. చారుశిరీష కోమలము ఽ సారసపత్ర మనోహరంబు వి
స్ఫారిత భాగ్యవర్ణము విశోభానురకుంకుమ పంకిలంబునై
కోరికమించు నీ సమదశుంజర యాన పదద్వయంబు సొం
పారఁగనన్నదీయ నిటలాగ్రము సోకుట యెప్పుడో సుమీ. 261

క. అని సురభి కుసుమముల న
వ్వనితామణి దివ్యపాద ఽ వారిజములు స
ద్వినయంబున నర్చించుచుఁ
జనియా శివుఁడొక్క కేళి ఽ శైలముదండన్. 262

క. అరవిందేందీవర బం
ధుర కేళీ హంసగణ మనోహర పద్మా
కరకల్లోల పరంపర
నతుదారఁగఁదాను నొక్క ఽ హంసియుఁ బోలెన్. 263

—●●◆ మోహిని జలక్రీడలాడుచు శివునకుఁ గనఁబడుట. ◆●●—

సీ. గురుతరోన్నత కుచకుంభ యుగ్మముఁదాఁకి
వీచీ పరంపరల్ ఽ విఱిగిపడగ
జలమునఁనొందు సుశోత్సవకేళిఁగనిత ద
ళ్యానవశంబులై ఽ యంచేలలర

1. సత్వంబు.

కమలముల్ దొఱఁగి యు✽త్కట సౌరభముఁ జల్లు
మోమున నెలదేఁటి ✽ మొత్తమాడ
వలరాజు కేతన ✽ జలచరార్థము వైచు
పువ్వులు వ్రాలె చూ✽పులు దనర్ప
తే. మృదులపవమాన వీజన ✽ మేనుఁ జెంది
కంజకింజల్క మధురజః ✽ కాండమలర
వేడ్క జలకేళి సలుపు న✽వ్వెలఁదిఁ జూచి
యిందుశేఖరుఁ డద్భుతా ✽ నందలీల. 264

వ. చూచి యానో కాదో యను సంశయంబున. 265

క. అరవిందవదన మోమో
యరవిందమొ నీలవేణి ✽ యలకలో తేంట్లో
తరళాక్షి చూపులో జల
చరములో గుబ్బెత కుచములో ✽ చక్రద్వయమో. 266

వ. అని భావించి. 267

ఉ. చేరి తదీయలీల తన✽చిత్తమునం గలశాంబురాశి వీ
చీరుచిరప్రవాళలత ✽ చెల్వున నింపెసలారుచున్న వి
స్ఫారతలోచనాబ్జముల ✽ సంతసమారఁగఁ జూచి యిట్లునే
ర్పారఁగఁ బట్టువేడుక ప్ర✽యత్నమునన్ సడిదాకి నెమ్మదిన్. 268

ఉ. ఏగతిఁ బట్టువాఁడ నొకొ ✽ యెప్పుడు మున్నొనరించి పట్టును
[1]ద్యోగములెల్ల నిష్ఫలత ✽ నొందఁ బదంపడి కంటిభాగ్యరే
ఖాగరిమన్ దటాకమునఁ ✽ గం[2]జని వాసినిఁ బోలె నంబుకే
ళీగత దివ్యచిత్తమున ✽ లేమ చరించెడు నూర్మిపంక్తులన్. 269

శివుఁడు తిరిగి మోహినీకాంతను బట్టఁబోవుట.

క. జలకేళీ మహితోత్సవ
కలనానందమున నొరులఁ✽గానక హంసా
వళిలోనఁ దేలుచున్నది
వెలఁదిం బట్టంగ నిదియె ✽ వేళ యటంచున్. 270

క. చరమప్రదేశమున నా
సరసిరుహాకరముఁ జొచ్చె ✽ సర్వజ్ఞుఁడు త
ద్విరహాగ్ని తప్తదేహము
బొరయుదు, నుడుకెత్తి నీరు✽బుగ్గలు వొడమన్. 271

1. ద్యోగము. 2. ప్రా. తటాకమున (క)నబ్జ.

మ. హరజూటా హరిణాంక ఖండరుచి నెయ్యంబారఁగాఁ గైరవ ప్రా
త్కరముల్లాసముఁ బొందెఁ గుండె జలజాత శ్రేణిహంసావళీ
గరుదోఘంబున మించె సోయగము చక్రద్వంద్వమున్మన్మథా
తురవృత్తిం గవ విచ్చి పోఁదొడఁగెఁ దోడ్తోఁ దత్తటాకంబునన్. 272

మోహిని తప్పించుకొని శివున కగపడక పోవుట.

వ. ఇట్లు రభసంబున నం బట్టవచ్చు కామాతురత్వంబుఁ గనుంగొని యంతర్హా సంబున నయ్యింతి వెడసిగ్గుతో విలీనయై వివస్త్రయై యున్నదాన రాకురాకు మని నివారించి నీరు వెడలి తీరంబుచేరి చీరఁగట్టుకొని. 273

క. బెడఁగారు పువ్వుసొమ్ములు
వెడవెడ నొకకొన్ని దొడిగి వెలిదామర పు
ప్పొడి మేన నలఁదివేఱొక
యెడనవ్వనికుంజ సమసమీరాహితశయ్యన్. 274

శా. పూవుం గ్రోవులఁదమ్మి మొగ్గలను సంపూర్ణంబుగా నిచ్చనె
త్తావుల్ గ్రమ్మమరందపూరము ప్రమోదం బారఁగాఁ గ్రోలుచున్
భావోద్భూత ప్రదీప్రమత్తయగుచున్[1] బాలిండ్లు ముక్తాంబర
శ్రీవిన్యాసము నొందనుండె సురత క్రీడోన్ముఖ స్వాంతయై. 275

వ. అంత నమ్మహాదేవుం డిట్లు నివారితుండై కొండొక నిలిచి యచ్చపల లోచన మోమాట మోటకు సంతసించి. 276

మ. పలికెం దేనియలొల్క నవ్వెఁ బ్రియమొప్పంజూచె నా బాలతా
వళులన్ జక్కన డెందమున్ గనియె నిర్వ్యామోహియంచుం బ్రియం
బలరం దమ్మికొలంకు వెల్వడి సరోజాక్షీ శిరోరత్నమె
వ్వలి పంకన్ మనునిల్చె నచ్చటికిఁబోపం దత్ప్రదేశంబునన్. 277

శివుఁడు చింత సేయుట.

మ. సతిలేకున్నఁ గలంగి గుండె చెదరన్ శంభుండు నిర్విణ్ణుఁడై
ప్రతి దిగ్భావితనేత్రపంకజగళద్బాష్పాంబువుల్ మీటుచున్
శతపత్రాకర సైకతోర్మిగత హంసశ్రేణులం గ్రమ్మఱన్
జతనం బారఁగఁ జూచి యాత్మకృతదోషంబున్ బ్రశంసించుచున్. 278

ఆ. అపుడుపట్టనైతి నణకించి పోయె నీ
మాయలాడి మగువ మరులుకొల్పి
యకటమోసపోతి నరయంగ లేనైతి
తలఁపు కొలఁదిగాక తప్పిపోయె. 279

1. మత్తమగుచున్.

ఆ. విగతవస్త్రయైన § వెలఁదిగాక సవస్త్ర
యేలకాముకునకు § నెఱుఁగనైతి
సతివివస్త్ర నన్ను § జడిసితిఁ బట్టక
భాగ్యహీనుఁడేల § ఫలము నొందు. 280

వ. అని వగచి తదీయ లీలాగుణంబులు దలంచి. 281

సీ. ఆమహాగంభీర § యానంబు మఱిపెమా
బలుపిఱుందునఁ గ్రమ్మె § పసిఁడిసిగ్గు
లాగుబ్బపాలిండ్ల § పై గబ్బిచందమా
చిగురాకు మోవిపై § చిన్నినగవు
లాముద్దు మోమున § నడరు సంతోషమా
నిడువాలు చూపుల § నిశితధార
లాలలాటాంత కాం§తాలక శ్రేణి యా
చరణావతంసక § జలరుహంబు
తే. లాతతోత్సవ లీలావి§హారరసిక
మానవస్వేద భంగి నా § మానసమున
మఱువరాకున్న యవి నన్ను § మరులుకొల్పె
నింక నేలాగు బ్రాపించు § నిందువదన. 282

క. వేడుకనిది యలయించెడు
జాడయొ మాయామృగంబు § సఖియొ కపట
క్రీడల భ్రమయించి తుదిఁ
గూడక నను మొఱఁగిపోవు § గుత్సిత గతియో. 283

వ. మెఱుఁగుందీఁగె తెఱంగునందోఁచియు, మృగతృష్ణికారూపంబునం బట్టు పన లేకయు, నింద్రజాలంబు చందంబున నిజంబుకాకయు, స్వప్నావస్థలాగున భ్రమయించియు, దర్పణచ్ఛాయయుంబోలె దురవగాహ్యయయ్యును, దగులు బడక పోవుచున్నది. దీనికేమిసేయువాఁడనని విరహోన్మాద వికలచేతస్కుండై యచటనుండం గొలుపక వెండియు నన్వేషించుచు నక్కలువ కంటి యున్న పువ్వింటికిం బోయి. 284

క. తనుఁజూచి సిగ్గు ప్రేమయుఁ
బెనఁగొనఁబూఁ బాన్పుడిగ్గి § బిసరుహదళలో
చన నగవు దొలఁక నెడగల
సి నిలిచినం గోర్కులడర § శివుఁడిట్లనియెన్. 285

ఉ. పానుపుడిగ్గ నేమిటికిఁ § బంకజలోచన నన్ను మన్మథా
ధీనవియోగతాపశిఖి § హేతినిపీడితుఁ గౌఁగిలించి యిం

వున నహిమాంబు శీతలపయోధరచందన సార్ద్ర దేహునిం
గా నొనరింపవే రతుల కెందువఁజెంది కృపాతరంగిణీ. 286

క. అని విరహాభార విహ్వల
ఘనమదనోన్మాదవికృతిఁ గానక దీనా
ననుఁడగుచుఁ బెక్కుమాటలు
పనియేమని యశ్రుజలము పయిపయిఁ దొరఁగన్. 287

ఉ. చిక్కితి దుర్వియోగమునఁ జిక్కితిఁ జక్కెర వింటి వాని చేఁ
జిక్కితి మోహబంధమున శీతకరానన కౌఁగిలింపవే
మ్రొక్కెదనంచు హస్తములు మోడ్చుచు శంభుఁడు డాయఁబోయి యా
చక్కని మాయలాడి బిగి చన్నుల పయ్యెదఁ బట్టె నుద్ధతిన్. 288

ఆ. ఫాలలోచనుండు పయ్యెదఁబట్టినఁ
బట్టుబడకపోయెఁ బద్మనేత్రి
పట్టుబడునెయెన్ని పాటులు బడ్డ నా
విష్ణుమాయ శివుఁడు వెఱ్ఱిగాక. 289

క. ఆతఱి నిలువక గ్రక్కున
చేతోభవకేళి లేక శివునకుఁ బెలుచన్
రేతఃపూరము గంగా
స్రోతో రూపమునఁ దొరఁగెఁ జోద్యంబడరన్. 290

క. అయ్యింద్రియ రసమంతయు
నయ్యెడ రజతంబుశుద్ధ హాటకమును నై
నెయ్యమున నొప్పెఁగనుఁగొన
నయ్యాస్థానంబు వారి కచ్చెరువగుచున్. 291

శివునకు పరబ్రహ్మజ్ఞాన ముదయించుట.

క. రాజీవాక్షుం డాక్రియఁ
దేజము పొలిజెఱపి, మాయ తెరఁదిగిచిన నా
రాజార్ధశేఖరున క
వ్యాజ పరబ్రహ్మబోధ మడరెన్ బుద్ధిన్. 292

శా. మారారాతి, విముక్త మోహుఁడయినన్ మాయావనక్రీడలుం
నారీమోహనలీలలుం దొఱఁగి నానాదేవతాశ్రేణితోఁ
దోరంబై మునుబోలెఁ గొల్వుదనరెన్ దుర్వార తేజంబుతో
ధీరుండై మణిభద్రపీఠిఁ జెలువొందెన్ విష్ణుఁడున్ నవ్వుచున్. 293

క. కురిసెన్ బువ్వులవానలు
హరిపై నానందలీల నమరులు మెచ్చన్

బరిపరి విధముల ముందట
నరనాయక ! జడలుదూల ♦ నారదుఁ డాడెన్. 294

సీ. మ్రొక్కిరి సురముని ♦ మూర్ధాభిషిక్తులు
మోడ్పుచేతులు మస్తకముల ఘటించి
పొగడిరి శేషాది ♦ భుజగాధినాథులు
బిరుద ప్రబంధ గంభీరయుక్తి
పాడిరి గంధర్వ ♦ పతులు వీణావేణు
కలనాదములతోడి ♦ గానసరణి
నాడి రచ్చర లేమ ♦ లభినవ నృత్యంబు
లభినయవిన్యస్త ♦ హస్తలీల
తే. బ్రహ్మ ప్రాంజలియై వేదభాషణముల
బ్రహ్మతేజో విలాసంబుఁ ♦ బ్రస్తుతించెఁ
బ్రమథ గణనాయకుని మ్రోల ♦ బహువిధముల
నాది విష్ణునిగూర్చి యభ్యవసరమున. 295

శివుఁడు కైలాసమునకుఁ బోవుట.

క. హరిమాయా విభ్రమమునఁ
బరమ బ్రహ్మైకచిత్ర ♦ భావము నత్యా
దరమున వర్ణించుచుఁ ద
త్పరిరంభణ కేళిఁదేలి ♦ ప్రమదంబెసఁగన్. 296

క. ప్రమథులు కొలువఁగ నార్యా
రమణీ మణిఁగూడి చనియెఁ ♦ రజతాద్రికి నా
యమృతాంశు శేఖరుఁడు చి
త్తమునం దద్విష్ణుమాయఁ ♦ దలఁచుచు వేడ్కన్. 297

ఫలస్తుతి.

క. నారాయణమాయా భా
మారూపముఁ జూచి శివుఁడు ♦ మఱచిన కథయిం
పారఁగ విను ధీరుఁడు సం
సారమహామాయఁబాసి ♦ సంతస మొందున్. 298

వ. అని గోవిందశర్మ ధర్మనందనునకుం జెప్పెనని విని, పరీక్షిత్తట మీఁదటి కథా
ప్రసంగంబెట్లుండెనని శుకబ్రహ్మ నడుగుటయును. 299

మ. కలశాంభోనిధి కన్యకాకు చతటీ ♦ కస్తూరికాపంక సం
కిలసుస్నిగ్ధవినీల నీలగళయోగిగ్రామణీ మోహనో

జ్జ్వలమాయా మహిళావినోద, ధరణీ సంశ్లేష సంభావనా
విలసచ్ఛ్వేత వరాహభావితమహా వేదాంత తత్త్వోదయా. 300

క. నారదవీణా మధురగ
భీరధ్వని ముదితహృదయ బిసరుహాళుక స
త్కారసమాశ్రిత నిజతే
జోరూపఫలప్రపూర్ణ సురతరురాజా. 301

తోటకవృత్తము. చతురానన దివ్యలసన్మకుటాం
చితరత్నమరీచి విశోభిపదా
శ్రుతరాగ తరంగ విశుద్ధజగ
త్త్రితయ శ్రితలోక విధేయగుణా. 302

ఇది శ్రీ మదనగోపాల చరణకమల సేవాధురీణ సత్కళాపారీణకృష్ణ
భట్టారకపౌత్ర చింతలపూడికామయప్రభునుపుత్ర సుకవి
వర్యరాధామాధవయల్లనార్య ప్రణీతంబైన
విష్ణుమాయానాటకంబునందు
చతుర్థాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీ ర స్తు.

# వి ష్ణు మా యా నా ట క ము.

## ఆ శ్వా స ము. ౫.

క. శ్రీకర రాధాకైరవ
రాకాసితకిరణ మునివిశ్రాజితచేతో
వైకుంఠనిలయ గుణర
త్నాకరకల్లోల నవమదనగోపాలా ! 1

తే. అవధరింపుము దేవసంశయమివరుండు
సకల వేదాంత విద్యావిశారదుండు
శుకమహాయోగి పలికెనుత్సుకతమరియు
నింపుగా నాపరీక్షిన్నరేంద్రునకును. 2

వ. అవ్విధంబున సదాశివుని కథఁజెప్పి గోవిందశర్మ ధర్మనందనునకు విష్ణుమాయ
వలన నారదుండు మోసపోయిన తెఱంగుచెప్ప నుపక్రమించి. 3

మ. వినువిశ్వక్షితిపాల మౌళివలభీ విస్ఫారరత్నప్రభా
కనదుద్దామ పదారవింద త్రిజగత్కల్యాణచారిత్ర పాం
డున రేంద్రోత్తమపుత్ర యీమునిగరిష్ఠుల్ నీవునుం గూడి యెం
దునకుం జిత్తము పోవనీకహరియందమ్మిల్పి సంప్రీతితోన్. 4

### విష్ణు ప్రభావ వర్ణనము.

క. పరమాత్ముఁడు పరమేశుఁడు
పరమ బ్రహ్మైకమూర్తి ప్రకృతి పురుష నుం
దరుఁడు తదీశుఁడు ననిమదిఁ
బరికింపుము విష్ణునిం బ్రభావ చరిష్ణున్. 5

క. తేజముల కెల్లనుత్కట
తేజంబై తమముఁ జెఱచుఁ దీవ్రాంశు క్రియన్
దేజోనిధి యగుహరినిజ
తేజమునఁ బ్రపన్న మోహతిమిరముఁ జెఱచున్. 6

వ. అని హరి సామర్థ్యంబు సూచించి తదనురూప కథాప్రాయంబున నిట్లనియె.

క. సకలబ్రహ్మాండకదం
బకఘటనాచతురలీల | వాయని మదితో
నొకనాఁడు సనకశుకముఖు
లకునుం బోరామి వేళ | లలితక్రీడన్, 8

శ్వేతద్వీపమున విష్ణుమూర్తికొలువై యుండ మాయాకాంత వచ్చుట.

శా. శ్వేతద్వీపమునందు సాగరతటోత్కర్ష పారిజాతావనీ
జాతచ్ఛాయ సువర్ణపీఠమునఁ గంజాతాలయాకామినీ
భూతన్వీ సముపాశ్రితుండగుచు సంభోజాయతాక్షుండు సం
ప్రీతిన్ దివ్య సతీమణుల్ గొలువఁగాఁ | బేరోలగంబున్నెడన్. 9

క. విదిత ప్రకృత్యా[1] విద్యలు
మొదలుగఁ బేరైన నామ | ములుగల మాయా
మదిరాక్షియైన వైష్ణవి
ముదమునఁ జనుదెంచి శౌరి | ముందట నిల్చెన్. 10

సీ. నెత్తమ్మిరేకుల | నెఱిమించు నడుగులఁ
గనకమంజీర భృం | గములు మొఱయఁ
గా[2]రువకందువ | గలమేను దీఁగెపైఁ
గుంకుమ తటిదంశు | వంకురింపఁ
జక్కవ మురిపెంబు | స[3]రివచ్చు చనుదోయి
మౌక్తికబిసఖండ | మాల్యమహర
నిండుజందురుని వన్నియసొంపు మోమున
మందస్మిత జ్యోత్స్న | మాఱుమలయ

తే. నట్లుమోహనమూర్తియై | యరుగుదెంచి
కంకణక్రేంక్రియాశ్రీలఁ | బొంక మెసఁగ
హరికిఁ గరములు మొగుచు నయ్యతివఁ జూచి
సతులకొలువెల్ల | వేడ్కలు సందడింప. 11

క. కరములు మొగిచిన మాయా
తరుణిం గరుణాప్రసన్నతను జూచె మహా
పురుషుండు విష్ణుదేవుఁడు
సిరికై నంగలదె యట్టి | చెలిమి విభునితోన్. 12

తే. అపుడు శ్రీహరి సుప్రసన్నాభిముఖత
వినుత బహుమాన గణకమై | వేడ్కఁ జేయఁ

---

1. ఆ. పా. ప్రకృష్ట. 2. ఆ. పా. కారుకందువశిరిగల మేనుదీగె. 3. ఆ. పా. సవ.

దత్రిపయస్త్రీల కుబుసుబోఁ దగినయింద్ర
జాలవిద్యా విశేషముల్ సంఘటించి. 13

వ. తత్ప్రకారంబు చూప నుద్యోగించు సమయంబున సకలలోక సంచారియగు
నారదమునీంద్రుండు పరమ భాగవతోత్తముండు గావున భగవత్సేవాతత్ప
రుండై వైకుంఠదివ్యభువనంబున కరుగుదెంచువాఁడు, పురాకృత ఫలవిశే
షంబున నట్టికోలువై యున్న దేవదేవునిం గనుంగొని మేనుగరుపాఱ గగనంబు
డిగ్గి నారాయణ నామోచ్చారణ పారాయణ మధుర వీణా నాదంబుతో
జయజయపురస్సరంబుగా ననేక ప్రణామ స్తోత్ర సహస్రంబులు సమర్పించి
తదాదరణంబు వడసి కూర్చుండె నంత నయ్యింతి తన యుపక్రమంబున. 14

క. పురుషుఁడు ప్రకృతియు జగదు
త్కరమును గాలంబునైన కర్తకు నాత్మే
శ్వరునకుఁ దేజోరాశికి
హరికి నమస్కృతియొనర్చి యద్భుతలీలన్. 15

మాయాకాంత బహువిధంబులుగా నింద్రజాల విద్యలాడుట.

సీ. బుద్బుదంబునుబోలెఁ బొడమించు హరియించు
బ్రహ్మాండజాలంబు పరికరంబు
నింద్రుల మనువుల నెలయించుఁ బొలియించు
జంత్రంపు బొమ్మల సరవిమీఱఁ
బొలఁతులఁ బురుషులఁ బుట్టించు గిట్టించు
వెడబూమె రూపుల విధముగాఁగ
భూరిసంపత్కళల్ పొందించు విరియించు
ఘన నిదాఘమరీచి కలతెఱఁగునఁ

తే. బంచభూత విలాసముల్ నించుఁ బెంచు
సముచిత స్వప్నదృష్ట ప్రచార మొదవ
దుఃఖసుఖములు సమకూర్చుఁ దోలఁగఁ ద్రోచుఁ
గాలసరణులఁ జక్రయుగ్మంబు[1] జాడ. 16

సీ. బహుమతంబుల వారిఁ బ్రభవింపఁగాఁ జేసి
మూఢవాదంబుల మొనయఁ జేయుఁ
బెక్కువేల్పుల భూమిఁ బెంపారఁగాఁ జేసి
యల్పులఁ దత్సేవ కలరఁ జేయు

1. జాడ.

వర్ణాశ్రమంబుల వారల నమకట్టి
కర్మానుగతబుద్ధిఁ గడలు కొలుపు
విద్యావయోధన విభవముల్ గల్పించి
గర్వకోపోద్రేక గతులఁ బెనుచు,
తే. గజతురంగాంగనా రత్న కలనఁజూపి
రాజ్యభోగాను రాగాభి రతియొనర్చి
తామసుల రాజసులఁగాఁగఁ దగులువెట్టు
సహజ మోహాంధకారంబు సంఘటించి. 17

క. కూలంకషాపగాంబుధి
కేళీవనగిరుల మేలు గిరికొల్పి లస
న్నాళీకోత్పల ఫలమణి
[illegible]గ్యలక్ష్మి సమకొనఁ జేయున్. 18

క. చంద్రార్క వహ్నివలభీ
సాంద్రతఁ బొలుపారఁజేయు జలధరవిద్యు
ద్బృంద నవరత్న రుచిర మ
హేంద్ర ధనుర్లీలఁ జెదల నేయుంజేయున్. 19

క. అరిషడ్వర్గాతురులై
పరిబోధములేక నరులు బహువిధకర్మా
చరణమున మెలఁగఁజేయుచుఁ
బొరిపొరి జననాది దుఃఖములఁ బడఁజేయున్. 20

క. నరనాయకులై కొందఱు
పరిజనులై కొంద ఱుచితపథరాజ్యమునో
హరులై దుర్నయ వర్తనఁ
గొరలుచు దుష్కర్మవార్ధిఁ గూలఁగఁ జేయున్. 21

క. అతులిత సాత్త్వికయోగ
ప్రతిపాదిత భక్తిఁ బరమభాగవతుల నం
చిత సేవాంజలితో స
న్నతినెడయెడఁ బొగడ విభుని మన్ననవడయున్. 22

{ మాయాకాంతపన్నిన యింద్రజాలమును నారదుఁడు తిరస్కరించి పలుకుటయుఁ దన ప్రభావమును బొగడుకొనుటయు. }

వ. ఇవ్విధంబున ననేక విద్యావైశారద్యంబుచూపి కౌతుకంబు నెఱపిన నవ్విభుండును నయ్యిందిరా ప్రముఖ సుందరీ సహస్రంబును బహుప్రకారంబులం

ప్రస్తుతించి సముచిత రత్నపారితోషికంబు లిచ్చి రప్పుడీ మహాత్ముండు నార
దుండు తదీయ మాయారహస్యాది తిరస్కార గర్భంబుగా నలంతి నవ్వునవ్వి
తన తపో[2]విద్య నిర్వాహకంబై ప్రేరేపహారికిఁ బ్రాంజలియై యిట్లనియె. 23

తే. ఈ మహాదేవు లెఱుఁగరే యిటకుమున్ను
నీదుమాయల కొలఁదులు నీరజాక్ష
యింతభ్రమయుచునున్న వారింతలోనె
యతివలబలలు ముగ్ధలు ననుట నిజము. 24

క. మున్ను పలుచోట్లఁ జూచిన
యున్నేరుపు ప్రకృతివిద్య లివివింతలొకో
పన్నుగ నేతన్మాయో
త్పన్నములగు కృత్యములకు భ్రమయం జనునే. 25

క. ఏనొకడఁ జిక్కనీమా
యానిర్మాణమునఁ జిక్కి నఖిలము విమల
జ్ఞానము చాలనికతమున
నీనెలఁతల భ్రాంతిచెప్ప నేమిటికింకన్. 26

తే. బ్రహ్మరుద్రాది దివ్యుల భ్రమయఁ జేయు
నపుడు నినుఁజూచుచుండు దు నరిది పడక
యెఱుఁగుదువు నా మనోజ్ఞాన మెల్లకడల
నేను భ్రమయుట గల్గనే యెన్నఁడైన. 27

నారదుని వంచింపవలెనని విష్ణుమూర్తి తలఁచుట.

వ. అని యమ్మహాప్రభుకృత్యంబునకు మోహమాయా వ్యాపారంబు ననన్యంబ
భేద్యం బగోచరం బపరిమిత క్రీడా సమర్థంబని తలంపనేరక, 'యతి పరిచ
యాదవజ్ఞా' యను వాక్యంబునం[3] గల యర్థంబున, హరియనుగ్రహించి చేరం
దిగిచిన మందెమేలంబునఁ బ్రవర్తింప బ్రహ్మ రుద్రాదులఁ దిరస్కరించి
తన్మాయగణింపక యిట్లు పలికిన యావెడంగు మునింగనుంగొని మనంబున
రోసి యతనికిం బురాకృత కర్మశేషంబు ననుభవింపం గారణంబు గలదని
దివ్యచిత్తంబున నెఱుంగ నవధరించి, మాయా మందస్మితం బడర నయ్యర
విందలోచనుండు గారవించి, నీవట్టివాఁడవ యాదువని ప్రకటించి యుదరువేచి
యొక్క సమయంబున మోసపుచ్చువాఁడై యతని వీడుకొలిపి. 28

క. అంతర్వాణి శ్రేష్ఠున
మంతఃకరణ ప్రకాశి[4]తాత్ముఁడు విష్ణుం

1. పరితోషంబు. 2. ప్రా. పా. విద్యా. 3. వాక్యంబునుం గల యర్థంబు.
4. ఆ. పా. తాంగుడు.

డంతర్ధి నొందె నీతఁడు
నంత సహా[1]మ్నతి సమేతుఁడై మెఱవడితోన్. 29

నారదుఁడు బ్రహ్మాదులతో విష్ణుమాయ తనను సోఁకదని చెప్పుట.

సీ. అటవాసి తాఁ దనంతటివాఁడు లేఁడుగా
యనుబుద్ధి నజుఁడున్న యచటి కేగి
వైకుంఠపతి యొద్దివార్తలు పచరించి
తనమోహ నిర్ముక్తి తగవచించి
తద్బ్రహ్మమాన వాగ్ధన్యతఁ బొగడొంది
కైలాసమున కేగి శూలపాణి
దండ వైష్ణవమాయ తను సోఁకదని పల్కి
యమ్మహాత్ముని యద్భుతాభినుతికిఁ
తే. బాత్రమై యింద్రముఖ దిశా పతులకడకు
యక్షసిద్ధ గంధర్వ సంఘములకడకు
నరిగితన విష్ణుమాయా జయంబుఁజెప్పి
[2]తోన తద్వందనాది సంస్తుతులఁ గాంచి. 30
తే. పాడు హరిమాయ వీణెలోఁ బ్రస్తుతించి
తన్ను సోఁకదటంచు సంతసము నొందుఁ
దన్మహామాయఁ బడువారిఁ దలఁచి నవ్వు
జగ మవిద్యామయంబని తెగడునాత్మ. 31
క. ఇతఁ డొకఁడు విష్ణుమాయా
ప్రతిపన్నుఁడుగాక మోహ పాథోధిసమం
చిత బోధనౌక దాటిన
కృతకృత్యుఁడనంగ వెలసె గీర్వాణులలోన్. 32
వ. ఇట్లు మోహమగ్నంబైన బ్రహ్మాండంబులలోనఁ దానొక్కరుండును గులాల కీటకంబునుంబోలె భవపంకంబునం బొరయక గొంతకాలంబు ప్రవర్తించి, యంత ననంత మాయాప్రేరితుండై మహీమండలంబున ననేక తపోవనదివ్య పుణ్యక్షేత్రంబులు చూచుచుండ నట్టియెడ. 33
సీ. అబ్జభవాండ సహస్ర సంఖ్యలకు ని
ధానమై తత్ప్రభుత్వమునఁ బొల్చి
ధాత్రి రుద్రాది మూర్తతనొంది తద్వ్యతి
రిక్తతేజమునఁ జరింపనేర్చి

1. అ. పా. నంత్తన మహతీ సమేతుడై. 2. అ. పా. యొలితద్వందనాది సన్నుతి వహించి. ప్రా. పా. కృత్యములు.

అణుమహాద్వ్యాపారకమై నిర్వికల్పత
నద్దివ్య పరశ_క్తి యందు వెలిగి
సత్తాభిధానుఁడై సాత్త్వికబ్రహ్మయో
గీంద్రఖోధాబ్ధి పూర్ణేందుఁడనఁగఁ
తే. బ్రకృతి పురుషాధి నాథుండు పద్మనేత్రుఁ
డితని వెడఁగు తనంబు మాయించి పూర్వ
కర్మశేషంబుతో నహంకార మడఁచి
యాత్మవిజ్ఞాన మడరింతు ననితలంచి. 34

{నారదుని మోసపుచ్చుటకు విష్ణుమూర్తి సర్వవరమనే స్థలమునందుఁ గృత్రిమ తపస్సు చేయుట.}

క. చిత్రంబుగ శేషాహిప
విత్రతపోనిష్ఠమున్న వెలసినము_క్తి
క్షేత్రము సర్వవరము త
ద్ధాత్రీస్థలియందుఁ గపట తాపసమూ_ర్తిన్. 35

క. వేల్పులకు నద్భుతంబుగఁ
గల్పించె మాయ వెంపు గడుదీపింపన్
గల్పానోకహ సదృశా
నల్పకుసుమ ఫలభరితవ నాశ్రమముచటన్. 36

క. అందు నొకనిండు కొలనర
విందేందీవర పరాగవి సృమర విచల
త్సుందర తరంగ డోలా
నందిత కలహంసమై తకనర నిర్మించెన్. 37

వ. అట్లు పుణ్యాశ్రమ సరోవరంబు లుత్పాదించి త_త్తదభియోగాభిరతుండై
యనేక మునిసహస్రంబులు సేవింపఁ దపోనియతి నుండెనందు. 38

క. [1]నేదిష్ఠ దక్షిణాశా
ప్రాదుర్భూతార్హతుల్య భాగా జలజా
మోద భరభరిత మారుత
మాద్రై_త్యారాతి హృదయ మలరఁగఁ జేసెన్. 39

క. [1]సవిధప్రాచీన మహా
లవణజలధి ఘుమఘుమిత కకలధ్వని కెనయై

1. ఆ. పా. లో నీరెండు కందపద్యములు లేవు.

సవనాస్త్రశౌషణ్ముఖ
వివిధరవంబా వనమున వీనులఁదనిపెన్. 40

క. అతినిబిడ జలదమాలా
ప్రతిమానక్రతుసముద్ధ బంధురధూమ
ప్రతతుల గగనం బాచ్ఛా
దితమయ్యెం దద్వనమున దివిజులు పొగడన్. 41

సీ. [1]కాశీ గయా ప్రయాగములకంటెను నైమి
శారణ్య ముఖ్యపుణ్యాశ్రమముల
కంటెను బాండురంగంబున కంటెను
సరయూతట ప్రభాసముల కంటె
ద్వారావతీ హరిద్వార భూములకంటెఁ
జారు బృందావన స్థలముకంటె
శ్రీపురుషోత్తమ సింహాచలాభళ
స్థానాది దివ్యదేశములకంటె

తే. వర్ణ్యమై పుణ్యమై చతుర్వర్గఫలద
మై కరంబు జగత్సేవ్యమయ్యె నాది
విష్ణుఁడచ్చోట యోగియై వెలసియున్న
సన్నుతక్షేత్రరాజ మాసర్వవరము. 42

వ. ఇవ్విధంబున ద్రిభువనైక పాత్రంబైన పుణ్యాశ్రమంబునఁ బరమమాయా తపశ్చరణంబు సేయుచు నయ్యచ్యుతుం డొక్కనాఁడు, స్వకల్పిత సరసీతీర పిప్పల తరులేఖా మధ్యంబునఁ గృష్ణమృగాజిన కృతా[2]స్తరణుండై ప్రబుద్ధ ముని వృద్ధులం గూడుకొని బ్రహ్మఘోషరహస్య గ్రంథావలోకనంబు సేయుచున్న సమయంబున నీ హిరణ్యగర్భనందనుండు తదీయ మాయాప్రేరితుండై యట్లదిరుగుచు వచ్చివచ్చి యయ్యాశ్రమంబు ప్రవేశించి. 43

మహాస్రగ్ధర. కనియెందీరావనీ జోత్కట కుసుమరజః కాండ ధారాళవాత్యా
ఘనవేగా[3] వ్యగ్రభృంగీ గణచరణ పతత్క్రమ పుష్పోపహార
స్వనదంభో భంగరంగజ్జల ఖగపరిషచ్చారు సంచారలీలా
జనితోల్లాసాచ్యుతర్షీశ్వరవర సుమనస్సారసంబుఁ సరంబున్. 44

చ. సురుచిరకుట్మలస్తబకశోభిత[4]శాఖల గుంపుసొంపునఁ
[5]బురువగు పొన్నలీకమల భూసుతు నింపులఁదేల్చె షట్పద

---

1. అ. పా. కాసిగయాప్రయాగలకంటె శ్రీరంగ, నైమిశారణ్య పుణ్యాశ్రమములు.
2. తాసనుండై. ప్రా. పా. తాళనుండై. 3. అ. పా. వేగవ్యగ్ర. 4. శాలల.
5. మురువగు.

స్వరములతో రతిక్రమసుశబ్ద పదాంగదనాదమేదుర
స్మరనృప సార్వభౌమ నవమౌక్తికహర్మ్యములట్ల దత్తటిన్. 45

మ. అకలంకాత్ముఁడు చూచె నీముని తటాకా[1]భ్రంలిహా నోకహ
ప్రకరస్కంధ గభీర కోటరకుటీ పర్యంతశాఖా మిళ
చ్ఛుక యుగ్మంబులు మన్మథోత్సవ వచస్స్ఫూర్తుల్ ప్రవర్తించి వే
డుకఁ గ్రీడించెడు సంభ్రమంబు కడుఁజోద్యుల్ వేడ్కలం దేలఁగన్. 46

మ. కలపుంస్కోకిలముల్ రసాలదళముల్ ఖండించి చంచూపుటం
బుల నల్లల్లన వల్లభాంగనల కింపుల్ చూపుచున్ మేటిక్రొ
వ్వుల మవ్వంబున రెట్టియైన మరుచెయ్యుల్ నివ్వటిల్లంగఁ గొ
మ్మలపైఁ జారుకుహూరవంబు లడరింపం జూచెఁ దీరంబునన్. 47

ఉ. మందమరుచ్చలాచలిత మంజుల మం[2]జరి సుందరామిళ
త్సుందరవల్లియొక్క యెడఁజూడఁగ నొప్పెలతాంగియై శతా
నంద సుతుండు జవ్వనమునన్ విఱవీఁగు కుచద్వయంబుతో
నందముచూపు నిట్లయని యాక్రియఁజూపి నటించు కైవడిన్. 48

చ. కుటిలలతా ప్రభావమునఁ గోమల చూతలతాంతశాఖి యొ
క్కటి యొకయింతసాగి యొకకందువనొప్పె మరుండు నారదుం
డటఁ జనుదెంచి రూకొలన నంగనయైనను బిట్టు [3]నాటనే
యుటకయి వింటి పువ్వునకు నోలినమర్చిన బాణమోయనన్. 49

సరోవర వర్ణనము.

ఉ. నారదు పుంస్త్వమీ సరసునం బరిముక్తము సేసియుంగనా
కారముసేయ మాయ సమకట్టిన వస్తుచయంబ నాఁగ సొం
పారుచుఁ జూడనొప్పె చరణాది శుభావయవాభిరామముల్
సారస సైకతోర్మి పటుచక్ర నవోత్పల భృంగసంఘముల్. 50

చ. సరసిజ గర్భనందనుని సాత్వికబోధముఁ గప్పియున్న ని
ర్భరతర రాజస ప్రకృతిఁ బాయని కామకృతాది దుర్గుణో
త్కర చరణప్రచారముల కైవడిఁ జూడఁగనొప్పె నాసరో
వరవిమలోదక స్ఫురిత వారిజరేణు తరంగ సంఘముల్. 51

మ. భ్రమర ద్వంద్వము లంబుజాతములపైఁ బైఁదన్మరందా [4]సవ
భ్రమ విభ్రాంతము లౌచుఁగూడుటలు చెప్పంజూపఁగా నొప్పు నీ

1. ప్రా. పా. “ కాభ్రం విహంగోత్కట. 2. మంజుల వంజుల మంజరిమిళ
3. పా. దూర. 4. ఆ. పా. పైవేమరం దస్రవ భ్రమ.

కమలోద్భూత సుతుండు కాంతయయి వేడ్కన్ భర్తతోఁ బుప్ప చా
పమనో ద్రిక్తతఁ గేలి నుల్లసిలుత ద్భావి క్రియల్ దెల్పుచున్. 52

వ. వెండియుం గనకగర్భాండభవుని విమల హృదయంబు పొదువంగల భవిష్య న్మోహాతమోవికారం బభినయించుచుఁ బుండరీక షండంబుల నాక్రమించు చంచరీకజాలంబును, విధాతృపుత్రునిభావి భావజకేళి సుఖపారవశ్యంబు సూచించుచు బిసరసాస్వాదలహరింజొక్కు చక్రవాకంబులును, శతానంద నందనునకు ముందటం బ్రాపించు సామ్రాజ్యలక్ష్మీ మనోహర హర్మ్య వీధీ విహరణంబు లెఱింగించుచు సమున్నత సైకతవేదికలం గ్రీడించు రాయంచ కొదమలును, స్వయంభు తనూజుని యంతఃకరణంబు దహింప నడరు మీఁదటి మాయాసంసార భర్తృపుత్ర మిత్రాద్యపాయజనిత శోకానలస్ఫులింగ కరాళంబుఁ దెలుపుచుఁ గంజకింజల్క పుంజంబు వెదచల్లుచుం దిరుగు నభినవ ప్రభంజనంబును, చతురానన సుతునకుఁ బునఃప్రసాద దానంబొనరుగు బిసరు హాక్షుని కరుణాకటాక్ష వీక్షాసుధారసబిందు బృందంబుల విస్తారంబు ప్రశ స్తంబు చేసియు ముక్తాఫలానుకార శీకర నికరంబు లెగయించు జలచర పరంపరలును, గన్నులకు నింపు సొంపు సంపాదించె నప్పుడు. 53

చ. అనుపమ కౌతుకంబడర నాకమలాకర వైభవంబు ని[1]
మ్మునివరు డర్థిఁజూచె నతి మోహనమూర్తిఁ దటాకలక్ష్మి యుక్
మన మలరన్నరాళగతి మంజులతాగతిఁ దేర్చె నాదరం
బునఁ దనకుం దనూజయయి పుట్టఁగలండని వత్సలక్రియన్. 54

క. జలజాకరంబు బహువిధ
ములఁ బొగడుచుఁ గమలగంధ ముదితభ్రమరీ
లలిత శ్రుతులకు మారుత
చలతంత్రి విపంచి మొరయ సమ్మదలీలన్. 55

— నారదుఁడు మాయామునియైన విష్ణువునుజూచి వర్ణించుట. —

క. అల్లల్లనఁ జనిముందట
నుల్లమునకు నేత్రములకు నుత్కటమై శో
భిల్లెడు తేజోనిధిముని
వల్లభు హరిఁగనియె నభినవశ్రీమూర్తిన్. 56

తే. బ్రహ్మముని పారిషద మధ్య భాసియగుచు
గ్రహగణాశ్రితుఁడైన భాస్కరుఁడు వోలె
బ్రహ్మతత్వంబు తానయై ప్రతిఫలించు
హరి నపూర్వర్షివరుఁ జూచి యరుదునొంది. 57

1. నన్ముని.

ఉ. ఎన్నఁడుఁజూడ నీమునికులేశ్వరు నీమహితాశ్రమాధ్వ నా
కన్నులకెంత యెక్కుడయి కానఁగనయ్యెడు నేతదీయ ది
వ్యోన్నతిఁ జిద్విలాసమి[1]గుఁ గొత్తెడు నీఘనుఁజూచి బ్రహ్మ ప
క్ష్యన్నిట లాదులైన పరమార్థము వేఁడుదురేమి చెప్పుదున్. 58

తే. లలిత పద్మాక్షమాలికా లంకృతుండు
గోపిచందన తిలక ప్రదీపితుండు
నగుచు నిమ్ముని విష్ణుమూర్త్యాత్మకం[2]బు
కరణి నున్నాఁడు సాత్వికా కారమహిమ. 59

శా. ఈ దివ్యాశ్రమభూమి మోక్షపదమై యింపొందు వైకుంఠమో
యీ దివ్యర్షి వరుండు బ్రహ్మమయుఁడై యేపారు పద్మాక్షుఁడో
భేదింపన్ మతిదూరకున్న దనుచుం బెల్లుబ్బునుల్లంబుతో
నాదైత్యాంతకుఁ జేరఁబోయి తగ నియ్యార్యుండు సమ్రక్రియన్. 60

వ. అట్లనన్యముని సామాన్యప్రభావ భావిత తపోధనుండగు నమ్మహాముని నంతరాత్మఁ బ్రశంసించుచుఁ దనకు మహామునులు ప్రత్యుత్థానం బొనర్ప మాయా మునివేషధారియగు హరిడాయంబోయి యథోచితాన్యోన్య సంభావనా ప్రేమరసుండై[3] యుండునంత. 61

నారదుని సంభావించి మాయాముని సంభాషించుట.

తే. యతితనూభవు లాసనార్ఘ్యాది విధులు
సలిపి పూజించి రంభోజ జాతనుతుని
హరియుఁ గుశలోపచార వాక్యములఁ బ్రీతిఁ
జేసి వెండియు ననియె విశేషఫణితి. 62

సీ. అస్మత్తపోవనంబతి విశ్రుతంబయ్యె
భవదీయ తేజఃప్రభావకలన
నేతన్మదీయ మునీంద్రవ్రతము ఫలి
తంబయ్యె యుష్మత్సుదర్శనమున
మన్మనోనిహిత సమాధి మూర్తంబయ్యె
నతిదుర్లభత్వదాగతి నెపమున
మామకోత్కృష్టాభిమతము సిద్ధించుట
గాదె భవాదృశాగమనలీల

1. ఆ. పా. ఉపసముగాఁ గొత్తరుని ఘనుఁజూచి. 2. ఆ. పా. విష్ణుమర్త్యాకారతంబు
కరణి. 3. ప్రశమనుండై.

తే. అంతరరుల జయించి మోహంబడంచి
పాప సంసారతాపంబు పరిహరించి
బ్రహ్మ నిర్వాణ నిర్వృతి పదవి వడసి
యున్నవాఁడవు నీవ కాకొరుఁడు గలఁడె. 63

క. మాయామోహ విముక్తము
శ్రేయస్సుఖపదము బోధ శిశిరమయూఖ
ప్రాయమును నీదు రూపము
ధీయుతనినుఁ బొగడఁదరమె దివ్యులకైనన్. 64

ఆ. ఈతపఃప్రయాస మెల్లను గడతేఱె
నీసమాగమమున నేఁడు మాకు
నింకమాతలంపు లెల్లను ఫలియించుఁ
ద్రిభువనైక కీర్తి విభవమొసఁగ. 65

క. అంబుజ గర్భేంద్రాది ప
దంబులు నీకాటపట్లు తగనంతర్లో
కంబులఁగలిగిన వృత్తాం
తంబెల్లను నీక తెలును తాపసవర్యా. 66

క. వ్యామోహా గాధవిష్ణు మ
హామాయాచక్ర విక్రియా పన్నుఁడు గా
కే మహితాత్ముఁడు లోకము
లో ముక్తుండయ్యె దివ్యలోకము పొగడన్. 67

క. అని మునివేషధరుండగు
వనరుహదళనేత్రుఁ డడుగ వారిజభవనం
దనుఁడనియె బ్రహ్మవిద్యా
జనితప్రాభవము వాక్య సంపద వెలయన్. 68

ఉ. ఓమునినాథ నీవెఱుఁగకుండుటగల్గునె వేదశాస్త్ర వి
ద్యామహితార్థ నిశ్చిత రహస్యపదంబులమేలు వర్తమా
నామరనంయ మీశ్వరులయందలి వృత్తము శంకరస్వయం
భూమఘవన్నరేంద్ర సురముఖ్యులలోక విశేషవార్తలున్. 69

విష్ణుమాయకు లోఁబడనివాఁడను నేనేయని నారదుఁడు చెప్పుట.

వ. తక్కిన లోకవార్తల వలన నేమి విశేషంబు, చెప్పనున్నదియు మూఁడులోకంబుల దేవదానవ మునీంద్రాదులలో విష్ణుమాయంబడక ముక్తుండై చిదానంద కందళంబై యదృచ్ఛం జరించువాఁ డెవ్వండని యడిగితి రట్టి కృతార్థుండనేన కాఁదలంపుం డది యెట్లంటేని. 70

క. ఒకనాఁడే వైకుంఠము
నకుఁబోయితి నచట పద్మనాభుఁడు శ్రీభూ
శుకవాణీ ముఖకాంతా
ప్రకరముతో నొక వివిక్త పదమున లీలన్. 71

చ. కొలువొనరించియున్న తఱిఁ గూరిమి వైష్ణవమాయ యింతియై
నిలిచి తదగ్రభాగమున నేరుపుతో వివిధేంద్రజాల వి
ద్యలుపచరించి పంకజ భవాండ చరాచర సృష్టిమార్గముల్
వెలయఁగఁజూపె నాసతులు విస్మయమందుచు వేడ్కఁజూడఁగన్. 72

చ. అదియొక కొండ చేసికొని యవ్విభుఁడుం దనమాయచేత న
మ్మదితలఁగన్నుఁ బ్రాముతఱి మోమున లేనగవంకురింపఁగా
నిదియొక వింతగాఁ దలఁచి యీసతులేటికి విస్మయంబు నొం
దెదరని పద్మలోచనుని దిక్కు మొగంబయియుంటి నేనొగిన్. 73

క. నీమాయచేత భ్రమయరె
యీముగ్ధలు బ్రహ్మశంకరేంద్ర మునీంద్ర
స్తోమములు భ్రమయుచోఁ బ్రతి
భామహిమన్నేన కాక భ్రమయని వాఁడన్. 74

వ. అని పలికిన నామొగంబుచూచి మాయావిహారియగు నారాయణుండు సిగ్గుపడిన వాడునుంబోలెఁ గొండొకతడ వెద్దియుంబలుకక యూరకుండి నా విజ్ఞానంబునకు మెచ్చి శిరఃకంపంబుచేసి నన్నుం బ్రశంసించి నామాయం జిక్కుపడక తిరుగు మహాయోగి పుంగవుండవు నీవొక్కరుండవని సంభావించి వీడుకొలిపె నట్ల యేనును తన్మాయారహస్యంబులన్నియుం గరతలామలకంబు చేసికొని గతరజస్తమో మోహుండనై బ్రహ్మముని సేవ్యమానుండనై విహరించుచున్నవాఁడనననిన, మందస్మిత పూర్వకంబుగా సభ్యుల వినుండని పలికి యా తపోధనుండగు వనజలోచనుం డిట్లనియె. 75

అందుకు మాయాముని ప్రత్యుత్తరమిచ్చుట.

క. మాతలఁచి నట్లచెప్పితి
వీతత్వజ్ఞానసిద్ధి యేరికిఁ గల ద
త్యాతత వైష్ణవమాయల
చేతం బడకునికి నీకె చెల్లు మహాత్మా. 76

వ. అని పలుక గయుంబున నత్యాశ్చర్యంబుగా నొక్క వెడనవ్వునవ్వి గగనవాణి నారదు నుద్దేశించి యిట్లనియె. 77

ఆకాశవాణి నారదునిఁ దిరస్కరించి యొకకథ చెప్పుట.

క. నీవెంతవాఁడవైతివి
యావిష్ణునిమాయఁబడిన ✽ యార్యులలోనన్
భావింప బ్రహ్మమునిరా
జీవాసన రుద్రదివిజ ✽ సిద్ధులలోనన్. 78

ఉ. ఏమనిపల్కితీ మునులకెట్టులు సమ్మతమయ్యె మాయ నీ
వేమయిగెల్చి లోకములనెల్లను ముక్తుఁడవైతి విష్ణుమా
యా మహితాబ్ధినీకుఁ దరియించి తరింపఁగ నిన్నుఁ బోలరే
యీమునులున్ సురోత్తములు ✽ నిట్లనిపల్కిరె గర్వసంపదన్. 79

తే. పలికిపోయితిగాక యీ ✽ పలికినట్ల
మాయఁబడకుండ వచ్చునే ✽ మౌనినాథ
నీవువలెనె ప్రతిజ్ఞలు ✽ నెఱపిపలికి
సిగ్గుపడిన మునీంద్రులఁ ✽ జెప్పవినవె. 80

చండదమునుని కథ.

వ. ఒక్కకథఁ జెప్పెదవినుము. తొల్లి చండదమనుండను ముని వరేణ్యుం డయోధ్యానగరంబునకుఁబోయి మాంధాతచేత నర్చితుండై యతని నగరంబున కరితురగస్యందన సుభటసన్నాహ సామగ్రియుఁ గనకపీఠ శయ్యాందోళికాచ్ఛత్ర చామరవ్యజనంబులును మణిమయాభరణాంబర పరిమళద్రవ్య సంపదయును, రూపయౌవన లావణ్య గుణగణ్యంబగు విలాసినీవర్గంబును గలయనాలోకించి దేవేంద్రలక్ష్మికిం బ్రతినిధియైన యన్నరేంద్రుని యైశ్వర్యంబునకు నిచ్చమెచ్చి యివ్విధంబున రాజ్యసుఖం బనుభవింపవలయునని కోరి మరలి నిజాశ్రమంబునకువచ్చి గంగాతీరంబున సంకల్ప పూర్వకంబుగాఁ బద్మాసనముంగూర్చి సమర్చిత పంచాగ్ని మధ్యంబున నుగ్రతపంబు సేయుచుండె నతని తపోవహ్నిజ్వాలా కరాళ ధూమావళి ద్యావాపృథివ్యంతరాళంబునం దంభోళి విద్యుజ్జలధారాడంబరంబు గావింప నిలింపులు భయభ్రాంతులగుచుండిరట్టి సమయంబున నొక్కనాఁడు సనత్కుమారుండువచ్చి యమ్మహాతపోధనునిచేతం బూజితుండై యిట్లనియె. 81

ఆ. ఓమహాత్మ యింత ✽ యుగ్రతపోనిష్ఠ
యేమికాంక్షనయ్యె ✽ నెఱుఁగవలయు
ననుడుఁజండదమునుఁడా బ్రహ్మసుతునకు
ననియె మనసుకోర్కె ✽ కొనలు సాగ. 82

ఆ. ఒక్కనాఁడు నే నయోధ్యకుఁబోయి మాం
ధాతృధరణి నాథుచేతఁ బూజి

తుండనై తదీయ సామ్రాజ్య
విలసనంబు లెల్ల వేడ్కఁ గంటి. 83

సీ. సూర్యవాజుల కంటె సొబగైన యుత్తమ
హయములఁ గంటి వాహ్యాళి భూమి
దిక్కరీంద్రములను దెగడు మత్తద్విప
చయముల ద్వారదేశములఁ గంటిఁ
జామరచ్ఛత్ర వీజన దీపికాందోళి
కాదులాస్థాన హర్మ్యములఁ గంటి
బహువిధ పరిమళాంబర భూషణశ్రేణిఁ
బ్రకటిత భర్మపేటికలఁ గంటిఁ

తే. పుష్పతల్పంబులును బువ్వుఁబోండ్ల యొఱపు
చంద్రశాలాగ్రవేదులఁ జాలఁ గంటిఁ
గంటి మాంధాత రాజ్యసుఖంబు లెల్ల
నింద్ర సామ్రాజ్య విభవంబు నేలఁ జాలు. 84

చ. మృగమదచందన ద్రవము మెత్తిన బిత్తరి గుబ్బచన్నులున్
నగవుదలంకు మోములు ననంగ నిశాత శిలీముఖంబులున్
దెగడు కటాక్షకోణములు దేటలమాటలు గల్గుకామినుల్
తగవుల నమ్మహీధవుని దండఁ జరింపఁగఁ గంటి వేడుకన్. 85

క. ఆలీలా సామ్రాజ్య
శ్రీలాత్మకు నింపుఁ జేసెఁ జేసిన నాభూ
పాలుని క్రియ సామ్రాజ్య
శ్రీలన్ విహరింపఁ దపము సేసెద ననఘా. 86

వ. అనిన విని యతని దుర్విషయాభిలాషంబునకు వగచి యిట్లనియె. 87

సనత్కుమారుండు నిషేధించుట.

క. హరిమాయా [1]మోహాంబుధిఁ
దరంగ సంఘంబులైన ధరణీ రాజ్యాం
బరపరిమళ భూషా స్త్రీ
వరవాంఛలమునుఁగకుండు వాఁడుం గలఁడే. 88

సీ. పటుధైర్య బాడబాకోట వహ్నికీలయు
నాశాపయోధి పెల్లణఁప లేదు[2]
పరమ[3]శాంతి త్విషాంపతి మహారశ్మియు
[4]నీహారతమము విరియింప లేదు

1. మాయమోహాబుద్ధిఁ. 2. లణపలేయు. 3. కాంతి. 4. నీహారతమము విరింపలేదు.

రూఢసమాధి గారుడమంత్ర కళయును
దృష్టాహి విషమూర్ఛఁ దెలుపలేదు
ఘనతర విజ్ఞాన కలితదంభోళియు
దృఢకామనగము భేదింపలేదు
తే. లేదు సంసారవిషయ కేళీవిరక్తి
బ్రహ్మరుద్రాదులకునైనఁ బద్మనాభు
చరణసేవాసుధారసా స్వాదజనిత
చిత్సుఖానంద సంధాన సిద్ధిలేక. 89

వ. అని వెండియుఁ జండదమనునకి ట్లనియె. 90

ఉ. ఓడక శీతవాత దహనోష్ణ భరంబులనాఁడు నాఁటికిన్
వాడి కృశించి యీగతి నవారణఁజేయు తపంబు వ్యర్థమై
బూడిదెలోని హోమమయి పోయెఁగదా యిటులైన నక్కటా
చూడవె యోగమార్గ పరిశుద్ధమునీంద్ర తపఃప్రకారముల్. 91

తే. తగిలి బ్రహ్మంబు ముట్టంగఁ దపము చేసి
బ్రహ్మపద సౌఖ్యసంసిద్ధిఁ బాదుకొనక[1]
పాపసంకర జనిత భూపాలరాజ్య
పదసుఖంబులుగోరు తపస్వి గలఁడె. 92

శా. ఈజాడం దపమాచరించి తుది నెంతేమూర్ఖు చేందంబునన్
రాజత్వంబున నల్పభోగములు చేరంగోరునే హాని ని
ర్వ్యాజ బ్రహ్మపదైక సౌఖ్యములు పోవంద్రోచి, నీ వెన్నఁడున్
'రాజాంతే నరకం వ్రజే' త్తనెడు శాస్త్రంబుల్ పరీక్షింపవే. 93

క. ఆరూఢ పాతకాఘము
దూరీకృతసత్య మనృత దుర్లోభదురా
చారాదికితవ కృత్యముఁ
గోరుదురే రాజ్యసుఖముఁ గోవిద వర్యుల్. 94

క. సురుచిర సాత్త్వికమార్గా
చరణంబునఁ దపముచేసి సమధిగతానం
దరసాబ్ధిఁ దేలుచుండెడు
విరజస్తములైన మునుల వినవే ధాత్రిన్. 95

తే. ధన్యసాత్త్వికయోగంబు దక్క నితర
విపుల కర్మానుభవములు విష్ణుమాయ

1. కొనగ.

విష్ణుమాయకు వెలిదైన ♦ విరతి విరతి
మాయఁగడచినముక్తి సకలమాధిఁగనును. 96

వ. అనిచెప్పి సనత్కుమారుండు సత్యలోకంబునకుం జనియెఁ దదనంతరంబా బ్రహ్మసుతుని బ్రహ్మబోధసుధాధారం గడుగంబడి మోహకళంక నిర్ముక్తంబైన మనంబున భూలోకసామ్రాజ్య సుఖంబులు దుఃఖభాజనంబులుగాఁ దలంచి సంసార సుఖానుభవసారంబైన విష్ణుమాయా వికారంబునం బారయక ముక్తిపడయుట యిది యెంత పెద్దయని యవ్విష్ణుమాయం దిరస్కరించి రాజ్యకాంక్షయుడిగి మోక్షాపేక్ష సక్షయతపోనియతినున్నం గొన్నాళ్లకు నలువసన్నిధిగ్రైమై వరంబు వేఁడుమనినఁ బ్రాంజలియై యిట్లనియె. 97

బ్రహ్మను మోక్షమడుగుట అయన చేతఁ గాశపోవుట.

క. అత్యంత విష్ణుమాయా
కృత్యములగు సుఖములెల్లఁ ♦ గీడ్పఱచి నను
సత్యమగు మోక్షపదవికి
నిత్యునిగాఁ జేయు[1]మయ్య ♦ నీరజగర్భా. 98

వ. అనివేఁడిన నవ్వరంబీరామియెఱింగి మునీంద్రా యేమిగోరి యీయుగ్రతపంబు చేసితివి యేమియడిగెదు ప్రకృతంబున ననుభవింపఁదగిన విష్ణుమాయావిలసనంబైన సంసారంబు దానికిందోడు రాజ్యసుఖం బనుభవింపఁగోరి తపంబు సేసిన నీకు నది యనుభవింపక మోక్షం బేచందంబునం బడయవచ్చు, నదిమున్ను నీవనుభవించి తదనంతరంబు నిర్విషయాభిలాషంబునగు మనంబున శుద్ధసాత్త్వికజ్ఞానం బవలంబించి విష్ణుభక్తివలన మోక్షంబు వడసెదవుం గాని యిప్పుడీ రాజ్యసుఖంబు కోరినట్లు యిచ్చెదం గొనుమనిన నిర్వేదించి నీవిచ్చు వరంబు నేనొల్లహమ్మనిన నతం డంతర్హితుండయ్యెఁ బ్రగ్మజి విరూపాక్షునింగూర్చి తపంబు సేసిన. 99

క. సరసిజగర్భుని యట్లనె
హరుఁడును బ్రత్యక్షమైన ♦ నమ్మునియడిగెన్
హరిమాయా విలసన సం
సరణము వెలిదైన మోక్షసంపద వెలయన్. 100

క. అడిగిన నవ్వరమీరా
దుడుగుము నీకోరినట్ల ♦ యుర్వీరాజ్యం
బడుగుమన నొల్లకుండిన
మృడుఁడును దన యిచ్చనరిగె ♦ మిన్నకయుంతన్. 101

1. మూలపాఠము, జేయవయ్య.

క. అమ్ముని నాథుండుడుగక
నెమ్మనమున నచ్చలంబు | నిగుడుచునుండఁ
గ్రమ్మఱ రవిఁగూర్చితపం
బిమ్ములఁగావించుచుండె | నిలచలియింపన్. 102

క. కొనగొని తపమేభంగుల
నొనరించిన పూర్వకర్మ | ముడుగును తన చే
సిన యంతపట్టు గుడువక
వనజాసన దివ్యముఖ్య | వర్యులకైనన్. 103

వ. అంతఁ గొంతకాలంబునకు సూర్యనారాయణుండును సన్నిధియై మోక్షంబడి
గినరాదు నీవు మున్ను చేసిన తపంబున సంభూతంబులైన రాజ్యవైభవంబులు
తరతరంబ నిన్నుఁ జుట్టిముట్టికొనంగాచి, కాలంబు వేచియున్నయవి, కైకొని
తద్భోగంబులఁ బరితుష్టినొంది మఱి సాత్త్విక తపోనియమంబున హరినారా
ధించి తత్ప్రసాదంబున మోక్షంబు వడయు మనిన నమ్ముని యిట్లనియె. 104

క. అవియెల్ల విష్ణుమాయలు
వివరింపఁగ వాని ననుభ | వింపుమనిన నా
తివిరిన పూనిక దప్పదె
యవిగైకొన నమృతపదవి | నందఁగవలయున్. 105

క. నేనొల్లరాజ్యసంపద
నానిశ్చయ మిదియ వినుము | నలిన ప్రియ నా
పూనికఁ దప్పింపఁగలం
డే నీరజనాభుఁడైన | నిఁకనెట్టైనన్. 106

వ. అనిన నమ్మహాప్రతినఁ దప్పింపలేక కర్మసాక్షియుం బోయె నప్పారికాంక్షి
మత్సరంబు పెచ్చు పెరుగు మనంబున నెవ్వరింగోరక యేకావధాన పరమ
యోగాధీన మానసుండై విష్ణుమాయంబడక ముక్తివడసి హరిహర బ్రహ్మా
దుల సిగ్గుపఱచి నిరుపమానందంబున విహరింతునని యున్న యతని ఘోర
ప్రతిజ్ఞాతపంబునకు నద్భుతంబంది నిఖిల బృందారక మునీంద్రబృందంబులు
విష్ణుఁడితని సేవదంబున నొల్లని సామ్రాజ్యపదంబునకుందార్చి తదనురాగ
భోగ మగ్నునిఁ జేయునొకోయని వితర్కించుచుండు నంత హరి తన యంతర్గ
తంబున. 107

{చండదమనునిఁ దనమాయలోఁ బడవేయుదుఁగాకయని విష్ణుమూర్తి మచ్చేరించుట.}

ఆ. నిష్కళంక దివ్య | నిర్వికల్పబ్రహ్మ
తేజమైన యస్మ | దీయమూర్తిఁ

దలఁచి చిన్మదమునఁ దనియు ధన్యుఁడు గాక
ముక్తుఁడగునె యితర మూఢజనుఁడు. 108

క. మునిదనయభిమత వరమున
నొనరిన సామ్రాజ్యలక్ష్మి నొల్లనటన్నన్
జనునే భూపాస్రక్ష్యం
దనవనితా ద్యనుభవములఁ దనియక యెట్లున్. 109

ఆ. ఒల్లనన్నయితని యుల్లంబు రాజ్యసం
పదల వెల్లిగొలిపి ముదమొనర్చి
యవల మోక్షమిత్తు నని దివ్య చిత్తంబు 110
నందుఁ దలఁచెఁ దలఁచి నంతలోన.

క. ఏమని చెప్పుదు హరిమా
యామహిమఁ దదాశ్రమంబు హాటకరత్నో
ద్దామగృహసౌధలసదభి
రామంబగు నొక్కపురవరంబై యొప్పెన్. 111

సీ. మదమత్తవేదండ మండల గ్రైవేయ
ఘంటికాఘణఘణత్కారరవము
ననోన్యసముపాశ్రితావిర్భవత్పటు
జవనోత్తమాశ్వహేషారవంబు
కేళిసంచారవికీర్ణ కాంచన పుష్ప
రథవిభ్రమచ్చక్ర రాజిరవము
నుద్దామ దర్పభాసురోత్కటభటబిరు
దప్రశంసాలాప తరళరవము

తే. పటహభేరీ మృదంగ శంఖభద్రవంబు
సాధవీధీవిపంచికా చారురవము
కామినీపాదమంజీర కలరవంబు
ప్రమద మొనరించె నమ్మహాపట్టణమున. 112

క. కేళీసరోవరంబులు
కేళీవనవాటికలును గేళీగిరులుం
జాలఁగఁ గన్నులకింపై
యాలీలా పట్టణమున నలరెఁ జూడన్. 113

చ. సురుచిర కేళిశైల మణి సుందరకందర కేళిలోల కి
న్నరకలగాన మేదుర నినాదము లంగజుఁ బ్రోదిసేయఁగాఁ

గొరలుచుఁ గూర్మి దంపతులు ౹ క్రీడలొనర్తురు పుష్పడోలికో
త్కర రమణీయహర్మ్యతల ౹ కాంచన వేదుల నప్పురంబునన్. 114

క. అగరు ఘనసారకుంకుమ
మృగమద గోరోచనాది ౹ మేళనమునమే
లగుపువ్వుల నెత్తావుల
నగరాపణవీధు లింపొ ౹ నర్చుఁ బ్రజకున్. 115

రాజమందిర వర్ణనము.

వ. ఇవ్విధంబున నమరావతికిం బ్రతినైయతికంఠపాశంబను పేరనొప్పు నప్పుర మధ్యంబునఁ గనక ప్రాకార గోపుర సౌధచంద్రశాలామంటప మణికుట్టిమ మార్గతోరణ మంగళ రంగవల్లీ సముల్లసితంబును, గుల్యాసరోవర కేళి దీర్ఘికా తరంగ చక్రవాక కలహంససారస క్రౌంచసంచయ క్రేంకార సంకుల[1]ంబును, సవిధోద్యానవాటికాశాకోణకుటజ చూతపనసరంభా ఖర్జూరనారికేళ కురువకాశోక మాధవీ యూథికాజాతి లతాదిపల్లవసుమనఃఫలరసోల్లసిత కలకంఠ మధురశుకనికర కలకలంబును, కనక[2]మణిమయ ద్వారకవాట దేహళీ జాజ్వల్యమానంబును, దౌవారిక వేత్రదండతాడన నిరుద్ధసకలసామంత భూకాంతసమ్మర్ద దుర్గమద్వార దేశంబును, ప్రధానదండనాయక దుర్గాధ్యక్ష వీరభట సహస్ర సంశ్రితాస్థాన మంటప సామ్రాజ్య లక్ష్మీవిలాసంబును, గంధ గజతురంగ శతాంగ సువర్ణాందోళికా పర్యంకచ్ఛత్రచామర సింహాసనోప శోభితంబును, గర్పూరశిలాకాజాతా[3]యాత మందమారుత చలాచలీ కృత వితాన పుష్పమాల్యా లంకృతంబును, సంగీతతాళవాద్య హృద్యానవద్య నాట్యశాలా ప్రవర్తిత నర్తకీ కింకిణీ కంకణ ఝణఝణత్కార మనోహరంబును, గురుకుచనితంబభారాలస విలాసినీసహస్రసంచార శుద్ధాంత మందిరంబును నగురాజభవనంబున నొక్క పుష్ప సౌధాగ్రమంటపంబున. 116

క. కనకమణి పీఠికఁ దనుఁ
దనప్రియ కామినులు గొలువ ౹ ధరణీ పతియై
మునియుండెఁ గనకభూషణ
కనదుజ్జ్వలమూర్తితోడఁ ౹ గౌతుకలీలన్. 117

క. ఏకాగ్రనిష్ఠతోడని
రాకులమతిఁదపము సేయు ౹ నమ్మునిచెందం
బేకై వడి నడఁగెనో నాఁ
డాకస్మికమేమి చెప్ప ౹ నాహరిమాయన్. 118

1. సంచయంబును 2. ఆ. పా, ననేకమ. 3. జాతయాత.

క. అలదండకమండలు వ
ల్కలజపమాలాజినములు ఖడ్గక్రీడా
జలరుహ చీనాంబరమణి
వలయ కనకకంబళముల వైఖరి నొప్పెన్. 119

తే. మఱచెఁ దన బ్రహ్మయోగంబు మౌనివరుఁడు
కపటసామ్రాజ్యమదిరా వికాసలీల
నమృతవిజ్ఞాన సరసి నోలాడు తలఁపు
మోహసంసార జలరాశి మునిఁగె నపుడు. 120

ఆ. మోక్షలక్ష్మికోర్కి ముడివడిచిత్తంబు
రాజ్యలక్ష్మిపై విరాళిఁబడియె
యోగిననెడు బుద్ధి యుడిగి యాతపసికి
భూవరుండ ననెడు బుద్ధివొడమె. 121

సీ. అవధారు దేవ చక్రాద్రి పర్యంత భూ
పతిశిరోమకుటప్రూజితపదాబ్జ
జయమహారాజ యష్టాదశద్వీప సం
స్థాపితశాసన స్తంభయూప
విన్నపంబిశ గర్విత శత్రురాజన్య
దర్పాంధకార మార్తాండబింబ
జోహారు సర్వజ్ఞ సుస్నిగ్ధ శివజటా
జూటగంగాభ యశోవిహార

తే. యనుచుఁ బ్రాంజలులై వేత్ర హస్తవరులు
కదిసి యర్హోపచార వాక్యములు పలుక
మహిమఁ గొలువుండె నాస్థాన మంటపమునఁ
జండదమనావనీనాథ చక్రవర్తి. 122

క. శరణాగతులగు రాజుల
నరుదుగ గజవాజి భూషణాంబరగంధో
త్కరములు కానుకలొసఁగెడు
నరనాథులఁజూచి మునిజన ప్రభుఁడోలిన్. 123

క. అరిషడ్వర్గము మనమున
నురురాజసవిభవములకు నుబ్బొనరింపఁ
బరమ దయాసత్యోక్తుల
పరిచయమది యుడిగి పరుష భాషలు నేర్చెన్. 124

క. కొందఱికి నలుగు మఱియొక
కొందఱఁ గృపనాదరించుఁ గొందఱఁ బ్రోచున్
గొందఱఁ జెఱచుఁ బ్రభుత్వము
నంది నిజాజ్ఞాబలమున నవనీజనులన్. 125

సీ. దివ్యవిమానంబు తెఱఁగునఁ దేరెక్కి
తిరుగుచునుండు నా దిత్యభంగి
మదగర్వరేఖతో మత్తవేదండంబు
నెక్కు భూలోకదే వేంద్రుఁడనఁగఁ
బసిఁడిపుత్తెళ్లసొం పెసలారు రత్నాల
పాలకి నెక్కుఁ బ్రాభవము మీఱ
హయరత్నములనెక్కి యాడించు నంగళ్ల
నంగనామణులకాహ్లాదమెసఁగఁ

తే. కేళిగిరికందరంబులఁ గ్రీడసలుపు
నుపవనంబులఁ జరియించు నుత్సవమున
నాట్యశాలలనుండు నా నందమొదవఁ
దనకునింపైన విధమున ధరణివిభుఁడు. 126

సీ. కలకంఠియొక్కతె కర్పూర తాళవృం
తముఁ ద్రిప్పఁగలికి నెత్తావు లీనఁ
దరళాక్షి యొక్కతె తాంబూలఖండోత్క
రం బిచ్చుమందస్మితంబుతోడ
నలివేణి యొకతె పదాబ్జముల్ వట్టు కం
కణకాచ ఘళఘళాత్కార మలర
మగువయొక్కతె దండమణి పీఠముననుండి
మదనోన్ముఖములైన మాటలాడుఁ

తే. కేళిగృహమున నవపుష్పడోలికాగ్ర
శాయియైయున్న యమ్మహీ నాయకునకు
నింపు సొంపారనను రాగ మి[1]గురుకొల్పి
చారులీలల శుద్ధాంత చంద్రముఖులు. 127

క. సమధిక రాజ్యాంభోజ
ప్రమదాక్రీడా మరందపాన సుఖశ్రీ
రమణీయ మధుకరంబై
ప్రమదమ్మున నమ్మునీంద్ర [2]పార్థివుఁడలరెన్. 128

1. అ. పా. రాగమిరవుకొల్పి. 2. ప్రా. పా. పార్థివుడందెన్.

క. వలసిన తొడవులు తొడుగుచు
వలసిన గంధములఁ బూయు । వలసినపుష్పం
బులు ముడుచు నింపు సొంపులు
వలసినకాంతల రమించు । వలసినవేళన్. 129

క. తాపములకెల్ల నిల్లగు
భూపత్వము కాముకత్వ।మును బెట్టిదమై
యేపారఁ నతని యోగము
ప్రోపఱెఁ బోఁకొత్తులోని । పోకయుఁబోలెన్. 130

క. హరిమాయా మారుతమునఁ
దిరమగునే బ్రహ్మబోధ । దీపకళిక త
చ్చరణధ్యాన ఘటంబున
వెరవునఁ దానిలుపకున్న । వెడఁగుమునులకున్. 131

క. తనపూనికయును దనతప
మును దనదుమహామునిత్వ।మును బ్రహ్మసుతుం
డొనరించిన మార్గము మఱ
చిన యాతనిఁజూచి జగము । చిత్రమునొందెన్. 132

క. హరిమాయ గడువరాదని
పరమాశ్చర్యంబునొంది । బ్రహ్మయు శివుఁడున్
సరసిజ వనబాంధవుఁడును
గరమభివర్ణించి రధిక । కౌతుకలీలన్. 133

### సనత్కుమారుండు తిరిగివచ్చుట, చండదమనుని బోధించుట.

వ. అంత. 134

ఆ. మఱియు నా సనత్కు।మారుండు చండద
మను విధమ్ముచూత । మనుచువచ్చి
రాజ్యమహిమతోడి । రాజసంబున నెదు
రేగుదెంచి పూజ।లిచ్చుటయును. 135

ఆ. రాచబూమెనున్న । వాచంయమిశ్రేష్ఠుఁ
జూచిచూచి మిగులఁ । జోద్యమంది
విష్ణుమాయపెంపు । వినుతించి వినుతించి
యనియె బ్రహ్మసుతుఁడు । నతనితోడ. 136

ఉ. ఏమి మహానుభావ నిను।నించుకనైన నెఱుంగనేర్తువే
నీమునుపంటి యాపమది । నీహృదయంబునఁ దోఁచుచున్నదే

భూమిపతిత్వ రాజ్యసుఖకేముల్ కరమిష్టము దోఁచుచున్నవే
నీమనసెట్టులున్న యది ॥ నిక్కము నాకెఱిఁగింపు నావుడున్. 137

వ. విని వెఱఁగుపడి యేమొకో నన్ను నేనెఱుంగకునికి యెట్లు, నామునుపటి రూపం బెయ్యది, నాకుభూపతిత్వరాజ్య సుఖంబులు కరం బిష్టంబులు గాకుండుట యెట్లు దీనికిఁ బ్రత్యుత్తరం బేమనియిచ్చువాఁడ నిమ్మహాత్ముని వచనంబు లత్యద్భుతంబులై తోఁచుచున్నవి యని భయంపడి ప్రాంజలియై రాజిట్లనియె.

క. దేవమునీశ్వర యిది యే
భావంబున నన్ను నిట్ల ॥ పలికితి నాకే
భావంబును దోఁపదు నీ
భావంబుననున్న యట్ల ॥ పలుకు మహాత్మా. 139

వ. ఏనురాజనగుటయు నీరూపంబునకు మఱియొండు రూపంబు లేకుండుటయు నెల్లరాజులకుం బలెనే భూపతిత్వరాజ్యసుఖంబులు కరంబిష్టంబులగుట నెఱుఁగుదు నింకనెద్దియు నెఱుంగ, మీచిత్తంబుసంగతి తెలియఁగు నాకాన తిచ్చి నామనఃకళంకంబుఁ బాయంజేయు మనవుడునవ్వి యవ్విరించినందనుం డిట్లనియె. 140

తే. చండదమన మహామునీశ్వరుఁడవీవు
రాజ్యకాంతఁ దపంబొనకర్పంగ నిన్ను
మాన్చిపోవుట మఱచితే ॥ మానసమున
నాతపఃఫల లీలలు ॥ నవునొకావె. 141

క. హరిమాయ నిల్లెఱుంగక
నిరసించి విరించి ముఖుల ॥ నెఱిఁగూర్చి తప
స్స్ఫురణమున మెలఁగఁదగునే
దురహంకారమునఁ జేయుకేదురె తపమనఘా. 142

వ. పరమేష్ఠి పశుపతి పద్మబాంధవుల యానతిఁగైకొని సాత్వికజ్ఞానంబున మోక్షప్రదాయకు నారాయణు నారాధించుచు నతండే కొలంది కర్మబంధంబు లనుభవింపజేసె నట్ల యనుభవించుచు నప్పరమపురుషునకుం బ్రపన్నుండవైన నింతమూఢుండవై నిస్సారసంసార పంకమగ్నుండవై యుండుదువే యింకనయిన నిష్కళంక హృదయుండవై యీ సామ్రాజ్య వికారంబులు హరిమాయా కల్పితంబులుగా నెఱింగి హరిందలంచి కృతార్థుండవగు మని సనత్కుమారుం డొనర్చిన బ్రహ్మోపదేశంబున. 143

క. జ్ఞానోదయమగుటయు న
మ్మానీంద్రుఁడు చంచలించి ॥ మనమున భక్తా

దీనుఁడగు హరిఁదలంచి కృ
తానతియై భక్తిపులకితాలంకారింపన్. 144

క. కరుణాసముద్ర ముద్రిత
దురితోదయ యుభయ కర్మదూర మునీంద్రో
త్కరవాంఛాఫలద మహా
పురుష పరబ్రహ్మమయ విభుత్వమహాత్మా. 145

మ. గతదుష్కర్ములు సంగవర్జితులు రాగద్వేషదూరుల్ మహా
మతులాత్మీయతపోధిదైవముగ సన్మానించి నిన్నాత్మసం
స్థితుఁ గావించి భజించి మోక్షపదముం జేకొంద్రుగా కిట్లు దు
ర్మతికి న్నాకెట్టులబ్బు నాతరమె నీ మర్మంబెఱుంగన్ హరీ. 146

క. అగణిత దుఃఖనిదానం
బగు సంసారమున శోపకలజడిపడు నా
వగలుడిపి కావవే నను
జగదేక శరణ్య కృష్ణ జలరుహనేత్రా. 147

క. అని భక్తిపరవశుండై
కనుఁగవనశ్రువులు దొరుగఁ గాఁ దనువినుతిం
చిన భక్తవత్సలుఁడు హరి
యనుకంపాయుక్త చిత్తుఁడై యావేళన్. 148

సీ. పుష్పవృష్టియుఁ దనభువన రక్షాదక్ష
కారుణ్యదృష్టియుఁ గడలుకొనఁగ
నప్సరోనాట్య విన్యాసంబు తనవన
మాలావిలాసంబు లీలమెఱయ
ననుకూల గంధవాహంబును దనసహ
జాంగగంధ ప్రవాహంబు నొలయ
సహచర సురమునీశ్వర తరళత్వంబు
తనభక్తవత్స లత్వంబు నొరయ

తే. వినుత గంధర్వగానంబు తనమనోజ్ఞ
భూషణస్వనమును వేడ్కఁ బొదలఁజేయ
దివ్యమంగళమూర్తియై దివ్యతేజ
మలరఁ బ్రత్యక్షమయ్యె నారాయణుఁడు. 149

తే. అబ్జనేత్రుండు ప్రత్యక్షమైనఁ దెలివి
గలిగి తొల్లింటి యట్లను గాంచె మౌని

పురనరేంద్రత్వ సామ్రాజ్య పరికరములు
వనమునీంద్రత్వ పరములై వరలుచునికి. 150

క. సాక్షాత్కరించిన సరో
జాక్షుని శ్రీపాదములకు నానతుఁడగుచుఁ
లతువిధంబులఁ బొగడెను
జక్షుస్స్రవదంబుబిందుసందోహముతోన్. 151

క. హరియును నప్పుడుమానీ
శ్వరుతామసభావముడిపి సాత్వికవిజ్ఞా
నరతిఁ మతిఁగూర్చి తపః
శ్చరణమునకు నియ్యకొలిపె సద్గతికొఱకున్. 152

క. అంత ప్రతిజ్ఞావంతుని
పంతము వారించి కర్మఫలముఁ గుడిపి య
త్యంతజ్ఞానంబొసఁగి య
నంతుఁడు సురవరులు గొలువనరిగె నిజేచ్ఛన్. 153

క. ఈవృత్తాంతము విను స
ద్భావవిధేయులకుఁగలుగు బ్రహ్మజ్ఞాన
ప్రావీణ్యంబును హరిమా
యావరణ విముక్తియునుఁ గృతార్థత్వంబున్. 154

మ. అనియయ్యంబరవాణి పల్కుటకు నత్యాశ్చర్యముం బొంది ర
మ్మునను లీనారదుఁడేమి చెప్పదు మహామోహాంధకారంబునన్
దనచిత్తంబు భ్రమింపగాఁ దెలివిఁజెందన్ లేక దుర్మాన సం
జనితక్రోధమునన్ హసించిపలికెన్ సర్వంసహాధీశ్వరా. 155

తే. పట్టఁబసలేని యీబట్టబయటిమాట
కకటభ్రమసితిరో కదా యలఘులార
యామునీంద్రునివంటి మోహాతురుఁడనె
యేను, సాదృశ్య మెఱుఁగక యనెనుగాక. 156

క. నన్నెఱుఁగు విష్ణుఁడావిభు
వన్నికలే నెఱుఁగుదుం బ్రపంచవికార
క్లిన్నతనాకుం గలదే
యిన్నిచదువులే మీరె యెఱిఁగెదరు తుదిన్. 157

వ. అని హరిమాయ నెన్నక గగనవాణి నసత్యవాదిగా దూషించి, తనవిజ్ఞాన మహిమ యెఱుంగుటకు నిమ్మునులెంతవారని నిరాకరించి, వీరిముందట

పంతంబు పలుకనేలయని తనలోనఁ దన్నుఁదానే ప్రశంసించుకొనుచు, వీఁడు కొనిపోవ నుద్యోగించు నతనితలంపుగని మాయామునివేషధారియగు నవ్వెన్నుండు చిన్నినగవు దొలంక బలువలం జిక్కిన మెకంబయ్యెంగాక తానింక నెక్కడికిం బోవంగలవాఁడని యతని చిందిలిపాటు మందలించి, కొలంది యెఱుంగక యభ్రవాణి పలికెంగాక, చండదమనుండు భవత్సమానుండేని యంతబుద్ధిమంతుండు మాయంబడునే యదియట్లుండనిమ్ము, మమ్ము బహుమానంబుసేసి యీవేళ మా యాశ్రమంబున భిక్షసేయ వలయునని ప్రార్థించిన నెట్టకేల కియ్యకొని. 158

మాయామునియైన విష్ణుమూర్తి నారదుని మోసపుచ్చుట.

క. తనచేతి యక్షమాలయుఁ
గనకకమండలు విపంచి ఽ కయుఁ గుంచెయు న
ల్లన నచటి రావిఁదగిలిచి
మునితీర్థంబాడు నియమ ఽ మునఁ జనుదెంచెన్. 159

క. తన విజ్ఞానము తనతప
మునుదన విరతియును దన య ఽ మోహిత్వంబున్
దనురక్షింపఁగ నోపున
వనజాక్షుని కరుణదప్పి ఽ వచ్చినవేళన్. 160

సీ. నారాయణోచ్చారణ ఽ శ్రావ్య దివ్య నా
దమువీణెయందయుం ఽ దర్భవించెఁ
జిదమలానంద సం ఽ పదనాదు నాట్య వి
హారంబు కుంచియ ఽ నాశ్రయించెఁ
దత్వవిజ్ఞాన సు ఽ ధారసపూరంబు
దొలఁకియాడుట కమం ఽ డలువుఁ జెందె
బీజాక్షరన్యాస ఽ పృథులాబ్జ దృఙ్మంత్ర
కల యక్షమాలికఁ ఽ గడలుకొనియె

తే. నారదుని చిత్తమున నహం ఽ కారజనిత
నిబిడ మోహాంధకారంబు ఽ నిండుకొనియె
విష్ణుమాయా ప్రభంజన ఽ విహతిచేవి
వేక దీపంబు మలుగుట ఽ వేనరేంద్ర. 161

వ. అట్లు కొలనికి డిగ్గిదాని చెలువు ప్రకటించుచు నాచమనపూర్వకంబుగా జలంబు ప్రవేశించి నాభిదఘ్నపయఃపూరంబున నిలిచి మహాకాళరాత్రిసమయాంధతమసంబున మునుంగు చంద్రసూర్యాదిజ్యోతిర్మండలంబునుం బోలెఁ దన

విజ్ఞాన ప్రకారంబు విష్ణుమాయా పటలంబున మునుంగ సంసార సముద్రం
బున మునుంగుటకు నీళ్లమునింగె నప్పుడు. 162

క. జననాథ యరిదినుమి్నా
వనజాక్షుని మాయవెంపు వర్ణింప నిలిం
పనికాయ కాయజాంతక
వనజాసన దివ్యమౌని వరులకు నైనన్. 163

నారదుఁడు కొలనిలోమునింగి స్త్రీయగుట.

ఆ. నీరుపాపయయ్యె నృపవర తొల్లింటి
తపము కలిమియెల్లఁ దక్షిణంబ
మునిఁగిలేచి భువనమోహనమూర్తితో
నలిననేత్రియయ్యె నారదుండు. 164

ఆ. ఆమునీంద్రవేష మాబ్రహ్మవర్చసం
బామహత్వమామహావివేక
మెల్లనణఁగె శౌరి యింద్రజాలంబున
వినుము ధర్మతనయ విస్మితంబు. 165

క. పాలకడలి నుదయించిన
శ్రీలక్ష్మియుఁబోలెఁ గళలఁ జెలువారుచులీ
లాలసగతిఁ గొలను వెడలె
నాలీలావతి పసిండి యంచయుఁబోలెన్. 166

వ. మఱియు జలాశయంబున నీరుగ్రోలి వ్రాలిన జలధర ఖండంబు లన నొప్పు
వెన్నెరుల కప్పును, నీలజలధర ఖండంబుదండఁ గన్నుల పండువునంగు చంద్ర
రేఖయన మీఱునెన్నుదురును, జంద్రరేఖ చెలువునఁ జెలువారు నీలోత్పలము
లనఁ జెన్నారు నిండువాలుకన్నులదోయి, నీలోత్పలంబుల వలనం దొరఁగు
మకరందపూరంబన విలసిల్లుదివ్య కెమ్మోవియు మకరందపూరంబు పూరింప
నిడిన కనక కలశంబులన నుల్లసిల్లు గురుకుచకుంభంబులును, గనక కలశం
బులు మాయందెచ్చిన పసిండిమూకళ్లనం దనరువృదుల బాహుమూలంబు
లును, బసిండిమూకుళుల నిగుడు మెఱుంగు దీఁగెలన మెఱయుచేతులును,
మెఱుంగు దీఁగెలతళుక్కునఁ బ్రదీపించు గగనంబనందోచు చిన్ని నెన్నడుమును,
గగనంబునం దొలంకియాడు వేల్పుటేటి కలికితరంగంబుల తాఁకునంబొంకం
బైన సువర్ణసైకతంబన వెలయు జఘనంబును, సువర్ణసైకతంబు కెలంకున
మొలచిన పసిండియనంటి కొదమలనం బొదలు నును దొడలును, బసిండి
యనంటి కొదమల ప్రాపునఁ జెఱుకు విలుకాని పువ్వుటంపపొదులన ముదం

బొనర్చు చిఱుదోడలును బువ్వుటంపదోనల నలంకరించిన ముక్తాఫలంబు
లనం దేజరిల్లు పదనఖంబులును, గ్రమక్రమంబునం గనఁబడ నప్పుడంతి గట్టున
వచ్చి నిలిచెనప్పుడు. 167

క. జలకేళి సలిపివచ్చిన
పొలుపున వేఱొక్కపట్టు ౹ పుట్టముఁ గై చే
సిలతాంగి యంగకంబుల
నలరుల సొమ్ములు ధరించి ౹ యలరెఁ జూడన్. 168

క. వనజాకరలక్ష్మియొ య
వ్వనలక్ష్మియొ మరుని నెడసి ౹ వచ్చినరతియో
యన నవయౌవనలీలల
వనిత సరస్తీరపుష్ప ౹ వాటిక నొప్పెన్. 169

సీ. ఒకమాఱుతనచరణోద్గత ద్యుతులచేఁ
బరమసంధ్యాచ్ఛాయ ౹ ధరణిముంచు
నొకమాఱు తన మేని ౹ యుజ్జ్వలప్రభలచేఁ
దీఁగెమెఱుంగుల ౹ దిశలుముంచు
నొకమాఱు తనముద్దు ౹ లొలుకునవ్వులచేత
వెన్నెలఁ గాయించు ౹ విపినవాటి
నొకమాఱు తనమంచి ౹ యొరపుఁజూపులచేతఁ
గలువ తోరణములు ౹ గట్టు నెదుట
తే. పాదుఁబూజొంపముల మీఁద ౹ నాడుగండు
తుమ్మెదలమ్రోఁత శ్రుతిగాఁగఁ ౹ దోయజాక్షి
కలికిజవ్వనమునకలం౹కారమగుచు
మదనలీలా విశార సం౹పదదనర్చ. 170

{ ఆకొలని యొద్దకు చంద్రకేతుఁడను రాజువచ్చి యా స్త్రీని వీక్షించి మోహించుట. }

క. ఆకొలని కెలన నాక్రియ
నాకలికి చకోరనేత్రి ౹ యంగజలీలా
శ్రీకిఁ గరాళింపుచుఁ దన
లోకంబై పువ్వుదోఁట౹లో విహరింపన్. 171

సీ. చంద్రకేతుండను ౹ జగతీతలేంద్ర కు
మారుండు మదనావ ౹ తారమూర్తి
వీరరత్నము జగ౹ద్విఖ్యాతమైనట్టి
బిరుదాంకపుర మేలు ౹ బిరుదురాజు

చతురంగబలమహాసన్నాహసంపద
వేడ్కమైఁ జనుదెంచి వికటదుష్ట
మృగబాధలణఁగించి మగుడి య వ్వనమున
విడిసి తరుచ్ఛాయ విశ్రమించి

తే. కేళిమైఁగొడ్డుపావల గిలుకలడర
నొక్కబాలుండు కైదండ యొసఁగవచ్చి
యలరు దీఁగవిధంబున నలరుచున్న
యలరుఁబోఁడి విలోకించెఁ గొలనిదరిని. 172

క. కనిబిట్టుకట్టెదురనా
జననాథసుతుండు నిండు జవ్వనమునకున్
దనసౌందర్యంబున కును
దనలో నాశ్చర్యమంది తలయూఁచియనున్. 173

శా. ఔరాచెన్నులచెన్ను కన్నుఁగవతీ రాహా భళీ వేణికా
భారశ్రీ ముఖచంద్రబింబరుచి చెప్పన్ వచ్చునే చిన్నికా
నేరీతిన్ సృజియించె బ్రహ్మ కటి సొంపెట్లుండెఁ జారూరు శృం
గారం బెవ్వఁడు మెచ్చనేర్చు నిదె బోకంజాక్షి యంటే భువిన్. 174

క. కలికి నునుసోగ వెన్నెల
తళుకు గులుకు నవ్వు నును సుధారసధారన్
జిలుకు నునుబలుకు పూములు
కులకలికలు దీని కన్నుగొన లగ్గలికల్. 175

ఉ. కొండలఁబోలు జక్కవలకున్ సరి మారెడుబండ్లజోడు వే
దండపకుంభ తుల్యము లుదంచితహేమ ఘటాభముల్ సము
ద్దండపయోజకోరక విధస్ఫుటముల్ శకటాంగమూర్తులీ
ఖండ శశాంకఫాల కుచకాంచనచంపక పుష్పగుచ్ఛముల్. 176

తే. ఇంచువిలుకాని కేళియంచకొదమ
కాదు మరుఁ డెక్కఁబట్టిన కలికి చిలుక
కాదు వన్నెలబొమ్మ కొక్కట విరించి
జీవకళనిచ్చి నిలిపిన చిలువ చెలువ. 177

ఆ. లలిత నీలమణి శిలాకయానూఁగారు
నిలిపెఁగాక నలువ నిలుపకున్న
గురునితంబబింబ కుచకుంభ భరమున
వెలఁదియసదు నడుము విఱుగకున్నె. 178

తే. మానసీరాకరోన్మాథి మందరంబు
ధైర్యకంద నిశాత కుద్దాలధార
మర్మకంచుకకర్తరీ మహిమ బోధ
వనజచంద్రిక యాయింతి వాలుఁజూపు. 179

సీ. అమృతాంశుఁడెంత దానము తానొనర్చెనో
పోలఁతినెమ్మోముతోఁ బోల్పఁబడియె
నళులెట్టి పుణ్యాటవుల నిష్ఠమెలఁగెనో
యింతిపెన్నెరులకు నీడువడసెఁ
దమ్ము లెన్నెన్ని తీర్థంబులఁ దోఁగెనో
సతిక్రాలుగన్నుల సాటినొందె
గజము లేక్షేత్ర మార్గముల వర్తించెనో
చెలువ నడకకు సరి చెప్పవలసెఁ

తే. గాంచనము భూమి నేమేమి కర్మములకు
వచ్చెనో చానమైచాయ వన్నెకెక్కెఁ
జిలుక లేసత్యవాక్యముల్ పలికినవియొ
యబలమధురోక్తులకు సమ్మతమ్యెనిపుడు. 180

వ. అని బహుప్రకారంబుల దాని యభినవ సౌందర్య యౌవన విలాసంబులు చూచిచూచి చూపానిననేచి ధైర్యంబు తొలంగంద్రోచి యాచంచలాక్షిని డాయంబోయి, తన చక్కఁదనంబునకుఁ జిక్కిన తలంపు చూపుగని యనురాగంబు నెరయ నెఱజాణతనంబుగల తగవుమాటల నోడంబఱచి కైకొని తనపురంబునకుఁ గొనిపోయి యభిమత రతిక్రీడలం దేలుచుండె. 181

క. కొడుకుల నూర్వురఁగనె న
ప్పడఁతుక సౌందర్య నిధుల బాహాబలులన్
గడిమిగలవారి వారుం
గడఁగిరి వివిధాస్త్ర శస్త్ర కౌశలలీలన్. 182

క. పతిమేలు సుతులకలిమియు
సతులిత సామ్రాజ్యవైభవాభ్యుదయంబున్
సతిమైన నారదునకున్
బ్రతిదిన సంతోషసిద్ధి పరగఁగఁజేసెన్. 183

క. కంసారి రచితమాయా
సంసారపయోధి మునిఁగి సన్ముని భూపో

త్రంప వినునీమరందిఁ బ్ర
శంసింపఁగఁ దరమె పద్మశిజాతునకైనన్. 184

వ. ఇవ్విధంబున నపరిమితైశ్వర్య ఫలసితంబులగు సామ్రాజ్య వైభవంబులును, మన్మథావతారుండగు ప్రాణేశ్వరుండును, సుగుణవంతులగు కొమాళ్లు నూర్వురు ననుఁగుంగోడండ్రు ననుకూలదాసదాసీజనంబులును, మణిమయకనకవిభూషణాంబర ప్రక్చందనతాంబూల చంద్రశాలావిహార పుష్పశయ్యాదులంగలిగి తనయభినవసౌందర్యంబునకుందగిన వైభవంబున నే వెలితియులేని సంసారంబు సేయుచుం గొంతకాలంబు ప్రవర్తించు చుండెనంత. 185

ఆ చంద్రకేతుని మీఁదికి జ్ఞాతి దండెత్తి వచ్చుట.

మ. వినఁజిత్రంబగు చంద్రకేతుని భుజాశౌర్యంబు నైశ్వర్యముం
గానసాఁగం గని యోర్వఁజాలకమదిం గోపించి తజ్ఞాతి నం
దనుఁడొక్కండు ఫణీంద్రకేతుఁడను భూనాథుండు దండెత్తి వ
చ్చె ననేకోద్భట విక్రమక్రమనటత్సేనాసహస్రంబుతోన్. 186

ఉ. వచ్చినఁ జంద్రకేతుఁడు నవార్యబలంబులఁగూర్చి పేర్చి కా
ర్చిచ్చు మిణుంగురుల్ సుతులు చిందరలేఁగి రథాధిరూఢులై
చెచ్చెర సంభ్రమించుటకుఁ జిత్తమునస్వీకసింప మెచ్చుచుం
వచ్చెపురంబు వెల్వడి ప్రశవల్గదనర్గళ ధైర్యసంపదన్. 187

క. పతిఁబాయలేదు సతియుం
సతిఁబాయఁగ లేఁడు పతియు సమమమకార
స్థితిగావునఁ బతిఁబాయక
సతియును జనుదెంచె సమర[1] సంపదలీలన్. 188

వ. ఇట్లు ప్రాణేశ్వరీసమేతుండై యుభయపార్శ్వంబులఁ బ్రతాపదీపితులగు కొడుకులు ప్రచండకోదండ భుజాదండులై సంపూర్ణతూణీరంబులతో రత్నకవచ శిరస్త్రాణంబులు వెలుంగారం దేరులెక్కి యొక్క తలంపున నుక్కు మీఱి యేతేర [2]ననేకరథకదంబంబులును బహుకోటిఘోటక వ్రాతంబులును మదాంధగంధసింధుర బృందంబులు నేలయీనినట్లు వెల్లివిరిసిన కాలుబలంబు నొడతెగక నడువం బుడమి గంపింపవచ్చి మచ్చరంబునం దనపై నెత్తివచ్చిన ఫణీంద్రకేతుండును దానుసమయంబుచేసికొని సర్వవరక్షేత్రంబున నాగీరూపంబున మున్ను నారదుం డుదయించినకొలంకు కెలంకున విడిసి రప్పుడు.

ఉ. సేనలు రెండు నిట్లు రథసింధుర సైంధవసద్భటోద్భట
ధ్వానము దిక్కటాహములు వ్రక్కలుసేయ నుదగ్రహేతి సం

---

1. అ. పా. సైన్యసంపద జూడన్. 2. అ. పా కనకరథ. 3. నెడనెడ నడువం.

తానరుచుల్ వెలుంగ [1]గగనంబునఁ గేతనపంక్తులాడఁగాఁ
బూనికెనిల్చె మోహరము ౹ భూరిభయంకరలీలఁ గ్రాలఁగాన్. 190

ఉ. [2]భేరులు మ్రోఁతయుఁ సుభటభీకరహుంకృతులుఁ గరీంద్ర ఘీం
కారతురంగహేషలున ౹ ఖండరథోత్కట నేమిరావముల్
ఘోరుకలంగ దిగ్గజములఁ గబళించె ధరాపరాగము
ప్పొరుగనంగ నచ్చెరువు౹పుట్టె వియచ్చరకోటి కత్తఱిన్. 191

వ. ఇట్లు రెండుబలంబులు మెఱసి చలంబునం బోరుచుండ నభోమండలంబున నప్సరాంగనలు నిలిచి కన్నులపండువుగాఁజూచి వలసిన వీరపురుషుని వరియింపం దివురుచుండి రప్పుడు. 192

ఉ. కొండలు వజ్రపాతమునఁ ౹ గూలుక్రియ న్రథికాళిచేత వే
దండము లబ్ధిభంగముల ౹ తాఁకున నోడలువ్రాలెఁ దేరు లు
చ్చండమదేభ దంతచయ౹చండ హతిన్ బడఁ[3] దండతండమై
పాండుకులేశ యశ్వముల ౹ పాటనఁగాల్వుర చావు కేమనన్. 193

క. కొండలవలెనే వచ్చు న
ఖండగతిన్నంచు వలెన ౹ కడపల విచ్చుఁ
రెండుబలంబులు దమ వే
దండ తురంగమ సుభట రథప్రకరముతోన్. 194

వ. అట్టి సంకుల సమయంబున సమానశౌర్య దోర్వీర్యంబుల నెదిరి యొదిరి బలంబులందఱిమి ప్రతివీరయోధ సముద్దామదారుణ బాణహతంబులఁ గొడుకులు నూర్వురు నొక్కపెట్టునంబడినఁ గనుంగొని పుత్రశోకంబునం దజ్జనని రథంబుపైఁబడి మూర్ఛిల్లిన నెట్టకేలకు మూర్ఛఁదేర్చి కార్చిచ్చు నిదాఘసమయంబునఁగాఱడవులదహించు చందంబునఁ జంద్రకేతుండు ఫణీంద్రకేతుని మొగ్గరంబు నుగ్గునూచ గావించిన. 195

తే. ఆడెనట్టులు పెక్కు రక్తాంబునదులు
పాఱె భూతంబు లార్చె నభస్థ్సలమున

1. ఆ పా. విలుంగవారిదధ్వని గప్పె రథాపరాగముల్, మానవనాథ ఆ సమరమండలి మెండయిలోచె చూడ్కికిన్.

2. ఆ. పా. శా. భేరిధ్వానము లంబరంబున మహాభీమద్విపేంద్రాదిఘీం
కారంబుల్ తురగోగ్రహేషలు నదల్పన్ సింజినీరావముల్
ఘోరుకలంగదిగ్గజములుఁ గబళించె ధరాపరాగముల్
పోరుగనంగ నచ్చెరువుపుట్టె వియచ్చరకోటి కత్తఱిన్.

3 బడి.

కెరలెఁ బెంధూళి యుర్వీశ ǂ నేమిచెప్ప
భువన సంక్షోభకరమయి ǂ పోల్చెరణము. 196

చ. కొడుకులు నూర్వురుం బడినఁ ǂ గోపము దుఃఖము నంకురింపఁ బె
ల్లడరుచు నాత్మసైన్య నివǂహంబుల నొంచెడు చంద్రకేతునిన్
దొడరి లయాంతకాకృతి నెǂదుర్కొని పేర్చి ఫణీంద్రకేతుఁ డా
యొడఁ దునుమాడెఁ దద్బలముǂనెల్ల నొకండును జిక్కకుండఁగన్. 197

క. బలమెల్ల నడఁచి యాతని
బలమెల్ల నడంచి సురలు ǂ ప్రస్తుతిసేయన్
దలఁద్రుంచె నప్సరసలా
తలపూవులు చల్లి సెల్లు ǂ తాండవమాడన్. 198

వ. ఇట్లు ఫణీంద్రకేతుండు చంద్రకేతు నింద్రనికేతనంబున కనిచి విజయ
శంఖంబు పూరించి చతురంగబల సహస్రంబులుగొలువ మహాసన్నాహంబునం
జని యతని సామ్రాజ్యంబు గైకొని యేలుచుండెఁ దదనంతరంబు. 199

క. రణమండల హతగతదా
రుణవీరవ్యూహదేహ ǂ రుధిరాసారో
[1]ల్బణతఁ దను దీర్ఘమాడన
రుణుఁడు జనియె ననఁగ్రుంకెఁ ǂ బ్రొద్దపరాబ్ధిన్. 200

ఆ. ప్రొద్దుగ్రుంకకమున్న ǂ పురుషుండు వడుటయె
ప్రొద్దు గ్రుంకినట్లు ǂ పొగులుసతికిఁ
గదిరె భీకరాంధǂకారంబు దృష్టి శో
కాంధకార మాత్మǂయందుఁ బొడమె. 201

యుద్ధభూవర్ణనము.

సీ. కఠినభీకర భీరుǂకంక భూత[2]వ్రాత
కలహ పరస్పరǂకలకలంబు
భగ్నరథాయుధǂప్రకర కేతన వేణు
వీణా శకలచూర్ణǂవిషమతలము
రక్తప్రవాహ సంǂసిక్త శిరఃకబం
ధకరాంఘ్రితనుఖండǂదారుణంబు
కంఠగత ప్రాణǂకరటిఘోటకభట
చటులపూత్కార నిǂశ్వాసభరము.

1. ప్రా. పా. ల్బణతనుత దీర్ఘమాడన, ఆ. పా. ల్బణతీర్థంబాడగ నరుణుడు చనెననగ గ్రుంకెనొగి నపరాద్రిన్. 2. గృధ్రవ్రాత.

తే. నయిన రణమండలమున న § య్యబ్జవదన
కన్న § కొడుకులపై నిజ § కాంతుపైఁ బ్ర
భూత దుఃఖార్తయై పడి § పొరలి పొరలి
వేలుపులఁ దిట్టుచును బల § వింపఁ దొడఁగె. 202

ఆ. ఎన్నిపాట్లఁబడియె § నీనారదుఁడు పద్మ
నేత్రు మహిమఁ గనక § నీరసించి
ఘనుఁ దిరస్కరించు § కలుషచిత్తుఁడు పుణ్య
ఫలముఁ బొలిసి యెన్ని § పాట్లఁ బడఁడు. 203

క. హరిమాయలోనె సకలము
పరిమగ్నంబైనయట్లు § బంధురతిమిర
స్ఫురణమున నడఁగె నఖిలము
హరిభక్తులు ప్రాలెతార § లడరుచునుండన్. 204

చంద్రోదయము.

క. నారదముని యజ్ఞానము
దూరంబై పోవఁ దెలివి § దూఁకొనుమదిలో
నీరీతి ననెడు పగిది న
పారతమంబడఁగ నమృత § భానుఁడు పొడిచెన్. 205

ఉ. నారదమానికిన్ నలిన § నాభుఁడు సన్నిధియైనఁ బైపయిన్
భూరికృపాసుధారసము § పొంగెడు కైవడిఁ బొంగెఁ జంద్రికా
సారము తత్ప్రమోదమున § సంయమికోటి చెలంగునట్ల చా
కోరకముల్ చెలంగె మది § కోరిక లుల్లసిలంగ నెల్లెడన్. 206

సూర్యోదయము.

వ. అంత. 207

చ. నలినవిలోచనుండు కరు § ణానిధి క్రమ్మఱ సుప్రసన్నుఁడై
నలినభవాంగజాతునిఘ § నంబగు తొల్లిఁటి బ్రహ్మవర్చసం
బలఘుతమం బడంచి ద[1]య § నంతయుఁగూడఁగఁ జేసి తెచ్చెనా
నలినహితుండుదోఁచె నలి § నప్రకరోల్లసనంబు మీఱఁగన్. 208

వ. ఇట్లు సూర్యోదయంబయ్యె నయ్యరుణకిరణ పరంపరల రక్తపంక పంకిలంబగు మహామండలంబు తేరిచూడ భయంకరంబై యుండె, నెండదాకిన విర విరం బోవుచు వాడఁబాఱు మైదీఁగెయు ధారాకారంబున నెడ తెగక చన్నులపయిం దొరఁగు కన్నీరును, విరిసి కన్నీళ్లఁదడిసి ముసుంగుపడిన పెన్నెరులును, గ్రొవ్వాడి నిట్టూర్పులం గ్రందిన కెందలిరాకుమోవియును, జేరుగడలేక యేకాకియై

1. యదనంతయు జూచియ జేసి.

కుందుడెందంబును, దైన్యంబు వెంపునఁ గంపించుచుఁ దోడులేమి నెద్దియుం జేయనేరక పలవించుచుండి చండమరీచి మండలంబు గగనమండలంబున కుప్పరంబెగసి నిప్పులుమియం జెప్పరాని దప్పియు నాకలియు నుప్పతిల్ల నోర్వక యక్కలువకంటి నలుదిక్కులుంగలయ నాలోకించి. 209

క. ఆ చేరువ హరికృప మా
యాచూతంబొకటి దట్టకాయ సొంపారఁ
జూచి బ్రతుకాస విడువక
యాచల్లని నీడకేగి యాతరు శాఖన్. 210

క. చేరువ ఫలమొకటుండఁగఁ
గోరికతోఁ జేయిసాచి కోయదు ననుచుం
జేరి యది యంద కించుక
దూరంబై యున్న యబల దుఃఖితయయ్యెన్. 211

వ. వెండియుఁ జెయిసాచి పండుగోయ నుంకించుచు నేవిధంబునం గోయఁదునని తిరిగి తిరిగిచూచుచుఁ జెట్టెక్కి కోయనేరక యాకటి చిచ్చార్పంజాలక చచ్చిన కొడుకులలో నొకని నీడ్చుకొనివచ్చి యచ్చటవైచి దానిపై నెక్కి కోయం బోయి యందక బ్రేలెడు గడమయైన, మఱియు నొక్కనిఁ దిగుచుకొనివచ్చి వానిపై వైచి యెక్కి కోయంబోయిన నెప్పటియట్ల యందకున్న మానక యాక్రమంబున నూర్వురు కొడుకులం దెచ్చి దెట్టిగాఁ జేర్చి యందఱిపై మగని వైచి మగనిరొమ్మెక్కి కోయంబోయి యెప్పటియట్ల యందక యమ్మాయ చూతఫలంబు దూరఫలంబైన నచ్చేరువంది కుందుచున్న సమయంబున, నొక్కవృద్ధబ్రాహ్మణుండై నారాయణుండు, నారాయణ కృష్ణ కృష్ణ యనుచుఁ జెమట దొరఁగనలసిన వాఁడునుంబోలె వచ్చి యాచెట్టునీడ నిలిచి, క్రొన్నెత్తురుల జొత్తురులోకంబైన కోకతో నేకతంబ శవనివహంబు నెక్కి మృత్యుదేవతయుం బోలెనున్న యన్నీలవేణింజూచి తలయూఁచి యాశ్చర్యంబునం బొందుచు దానితో నిట్లనియె. 212

క. ఇది యెక్కడి శవనివహం
బిదియేటికిఁ గూడఁబెట్టి యెక్కితివిఁక న
య్యాదియాచరింపఁ దలఁచెదు
సుదతీ నినుఁజూడ భయము సోద్యమునయ్యెన్. 213

ఆ బ్రాహ్మణునితో స్త్రీ తన వృత్తాంతము చెప్పుట.

తే. అనుచుఁ బలికిన నపుడు బ్రాహ్మణునిపలుకు
చెవులుసోఁకిన నొకకొంత సేదఁదేఱి

చెప్పె వృత్తాంతమెల్ల నాతఁడు గుఱుఁబోణి
దైన్యసంభూత బాష్పంబు ధారదొరఁగ. 214

క. విని నవ్వి ధర్మనందన
వనరుహదళలోచనుండు వనరుహదళసం
జనితమరందము చాడ్పున
కనుఁగొనలం గరుణ దొరఁగఁగా నిట్లనియెన్. 215

వ. అబలా నీకు నీకర్మంబు పురాకృత కర్మంబునఁ బ్రాపించినయది యింక దీనికి వగవంబని లేదు. పోరికలన నిట్టి పుత్రరత్నంబులును మనోవల్లభుండును బుణ్యలోకంబునకుఁబోవుట కన్నులారంజూచియు నెవ్వరింజూచి ప్రాణంబులు నిలుపుకొనఁ గ్రమ్మఱ బ్రతుక నాసపడితివి. పండు దిననోరికెట్లు చవియయ్యె. విడువుమీదురాశ, యిది శేషాహితపావనం బీవనంబునఁ ఫలంబశుచులగు వారికంటరాదు. తత్ఫలాపేక్షయుడిగి వీరలకుం బరలోక సంస్కారంబులొనర్చి యాత్మేశ్వరునికై దహనముఖంబున నీదేహంబు విసర్జించి భువనంబులు నుతింప దివ్యమూర్తివగు మీచేరువ నొక్కకొలను చూపెదఁ దీర్థంబాడివత్తువుగాని రమ్మన సమ్మతించి యమ్మగువ శవనివహంబుడిగ్గి డగ్గరి డగ్గుత్తికతోఁ బ్రాంజలియై యిట్లనియె. 216

తే. విప్రపుంగవ ప్రత్యక్షవిష్ణునట్ల
నన్నుఁగృపఁ బ్రోవవచ్చితి నాదుపూర్వ
పుణ్యమును నేఁడు ఫలియించెఁ బోయెదుఃఖ
మనఘ నినుఁజూచి నపుడ శ్రీహరియసాక్షి. 217

తే. మానవిభుఁడైన పెనిమిటి మానధనులఁ
గొడుకులను గోలుపోయితిఁ బడితినిడుము
సరిగదా యాదుజన్మంబు చాలునాదు
జన్మమేనొల్ల నేఁడేడు జన్మములకు. 218

సీ. సకల సంపదలతో సామ్రాజ్య మేలితి
మనసార మగనితో మదనకేళి
సౌఖ్యంబులెల్లను సలిపితిఁ గొడుకులఁ
గంటిఁబెంచితిఁ గడుగారవమునఁ
గనుసన్నఁగోడండ్రు పనిసేయఁ దాస దా
సీజనంబులు పనిసేయుచుండ
రాజసంబున నుంటిఁ గ్రమ్మఱ నిటువంటి
సంసార మరనిముసంబులోన

తే. సమసెఁ గలగన్నమతి నింద్ర జాలమట్లు
వేసరితి నింక నీయాజ్ఞ చేసి కడకఁ
[1]దీర్ఘమాశాత్మ విభునకీ దేహమిచ్చి
దివ్యరూపంబు గైకొందు దివిజులలర. 219

క. మోహమువిడిచితి[2]విను మీ
దేహముపై నాసవిడిచితిని నీసత్య
వ్యాహారామృత పానో
త్సాహంబునఁ బరమధర్మ తత్వజ్ఞమణీ. 220

వ. అనిపలికిన నమ్మహీసురేంద్రుండు తన వగలుడుపుచుఁ దోకొనివచ్చి సరో
వరంబుచూపిన. 221

క. వారిజలోచన గనియెన్
వారిజకల్హారకైరవ శ్రీకరమున్
వారిరుహాకరము న్నవ
వారిరుహామోదగంధ వాహోత్కరమున్. 222

క. దేవనదీ ముఖ్యమహా
పావనతటినీ సరః ప్రభావంబెల్లన్
బోవిడిచిన వాఁడునుమీ
యావనజాకరము గాఁగనచ్యుతుఁడధిపా. 223

ఉ. చల్లని మందమారుతము చల్ల నిజాంగము చల్లనైన ను
త్ఫుల్లమనోంబు జాతయయి పూర్వకృతోత్కట దుష్కృతంబు ల
ల్లల్లన జాఱనీళ్లదరి కల్లలనామణి చేరెఁబోయి శ్రీ
వల్లభుఁడయ్యెడన్ విహగవల్లభునెక్కెఁ బ్రసన్నుఁ డౌటకున్. 224

చ. వనరుహ గర్భుఁడున్ శివుఁడు వారిజబంధుఁడు దేవబృందమున్
సనకసనందన ప్రముఖ సంయములున్ జనుదెంచి పద్మలో
చనుని భజించుచుండిరి బిసప్రసవాకర తీరభూమి మా
నిని యయియున్న నారదమునినింగని యవ్విభు మాయమెచ్చుచున్. 225

తే. చిత్రతర కపటనాటక సూత్రధారి
శౌరినాఁడా కొలంకునఁ జానఁజేసి
మగుడనేఁడీ కొలంకున మానిఁజేయు
టతని మాయకు నిదియెంత యద్భుతంబు. 226

1. ఈ పద్యము మూడో చరణములో కుసంధి. 2. సుమీయా.

వ. వెండియు నాపుణ్య సరోవరంబునఁ బూర్వకర్మ నిర్ముక్తియొనర్చి దుఃఖమాలిన్య స్వరూపంబగు నాడురూపంబుమాన్పి తొల్లింటియట్ల నారదునిఁ బరమ యోగీంద్రునింజేసి యతనికి సాత్వికబ్రహ్మోపదేశం బొసంగి కరుణించు నారాయణుని భక్తవత్సలత్వంబు చూడవలయునని గరుడగంధర్వ సిద్ధవిద్యాధరాదులు నంతరిక్షంబున శంఖకాహళ మృదంగ వేణువీణాది వాద్యంబుల నాయితంబు చేసికొనివచ్చి పొడసూపి నిలిచిన నప్సరస్త్రీస్త్రీలు లీలా పుష్పకాధిరూఢలై తత్పార్శ్వంబులఁ బసిండి పళ్లెరంబుల నిడుకొనితెచ్చిన మందార పుష్పమంజరులు సమయంబెఱిఁగి చల్లనుండి రట్టియెడ నప్పంకజాక్షి కొలంకుఁ జొచ్చి కన్నీళ్లు దుడిచికొని పుక్కిలించియుమిసి కట్టినచీరవదలిచి కలయం దడుపుకొని క్రమ్మఱఁగట్టుకొని కుచకుంభ ప్రమాణ పయఃపూరంబున నిలిచి నారాయణ నారాయణేతి వచనపూర్వకంబుగా మునింగిన. 227

క. హరిమాయ యేమిచెప్పదుఁ
దరుణీమణి నీళ్లమునిఁగి ♦ తత్క్షణమాత్రన్
సురలచ్చెరుపడ లేచెన్
నరనాయక దివ్యమౌని ♦ నారదుఁడంతన్. 228

క. నారదుఁడా సరసిమునుఁగ
వారిజదళనేత్రి వెడలె ♦ వడి నీ సరసిన్
వారిజనేత్రి మునుంగఁగ
నారదుఁడై వెడలెనిట్టి ♦ నైపుణిగలదే. 229

క. ఆకొలను పొలఁతిఁజేసెను
నీకొలనుం బురుషుఁజేసె ♦ నిరుగొలఁకులు లో
కైకాశ్చర్య కరంబులు
శ్రీకరములు వాంఛితార్థ ♦ సిద్ధికరంబుల్. 230

క. పాండు కులేశ్వర వినుమ
య్యండజపతిగమనుచేత ♦ నా సర్పపురీ
మండలిఁ దనరెం నారద
కుండిక యొకటొక్కటి ముక్తి ♦ కుండిక యనఁగన్. 231

వ. అప్పుడు. 232

ఉ. మాయయెడల్చి దివ్యముని ♦ మండలముల్ దనుఁజేరి కొల్వఁగాఁ
దోయదముక్తమైన దివిఁదోఁచు సతారక చంద్రు నట్ల నా
రాయణుఁ డార్త రక్షణ పరాయణచిత్తుఁడు దోఁచె ధారుణీ
నాయక దివ్యయోగియగు ♦ నారదమౌనికి సుప్రసన్నుఁడై. 233

నారదునకు నారాయణమూర్తి ప్రసన్నుఁడౌట.

చ. కురిసిరి పుష్పవర్షములు § గుంపులు గుంపులు గట్టి దేవతా
తరుణులు శంఖకాహళ మృ§దంగ ముఖధ్వను లుల్లసిల్ల నం
బరమునఁ దత్సరోవర స§ముంచిత కాంచన పద్మగంధ బం
ధుర మృదులోర్మిశీతల మ§నోహర వాయువు వీచె నింపుగన్. 234

క. పాడిరి గంధర్వాధిపు
లాడిరి రంభాదు లంబు § జాసనసుతునిం
జేడియ రూపుడిపి పరి
వ్రాడీశ్వరుఁ జేసినట్టి § వనజాక్షుకడన్. 235

శా. జేజే యంచు సురల్ భజింపఁగ ముని§శ్రేష్ఠుల్ నుదుళ్లంగరాం
భోజాతంబులు చేర్చుచుం బొగడనం § భోజాన నేశాన పం
కేజాప్తుల్ పరమాత్ముఁడంచు మది ద§ర్శింపంగ నాస్వామియా
తేజోరాశి మురారి కోటిరవిదీ§ప్తింబొల్చె భూవల్లభా. 236

సీ. పావనశ్రీపాద § పంకజంబున మరం
దస్యందమై సుర§తటిని దొరుఁగ
నిర్మలతర దేహ § నీలమేఘంబునఁ
గ్రొమ్మెఱుంగై సిరి § యెమ్మెచూప
ముఖచంద్ర మండలం§బునఁ జంద్రికాసమం
బై సుధా సుమధుర§హాసమెసఁగ
పటుశిరః పూర్వాద్రి § పద్మాప్తబింబమై
పాటల రత్నకి§రీట మొప్ప

తే. శంఖచక్ర గదాఖడ్గ § శార్ఙ్గముఖ్య
వివిధ దివ్యాయుధములు బా§హువుల వెలుఁగ
చారుభూషణ దీప్తిపుం§జంబు దనరఁ
దేజరిల్లెడు హరిఁగాంచె § దివ్యమౌని. 237

క. ఆనిండు గొలను వెలువడి
యానారదుఁ డేగుదెంచి § హరిఁగాంచి సుధాం
భోనిధి నుదయించు సుధా
భానునిక్రియ సురచకోర § పంక్తులు చెలఁగన్. 238

సీ. నారాయణేతి ని § నాదామృతము జల్లు
మణివీణె భుజముపై § మనసుగఱప
నానంద రసవీచి§కాకృతిఁ గుంచియ
మఱియొక్క భుజమున § మరులుకొలుప

మోతులక్ష్మహారములఁ బోనిపటికంపు
జపమాల కర్ణదేశమున వెలుఁగ
బ్రహ్మవిద్యా సుధాపరిపూర్ణ కలశంబు
నాఁగరంబునఁ గమండలువు దనర

తే. సమ్మహామాయ మెచ్చుచు నదిరిపడుచుఁ
దన్నుదా నవ్వుకొనుచు సంతసముతోడ
నారదుఁడు వచ్చివేవేల నతులొనర్చె
గరుడవాహనుఁడైన శ్రీకాంతునకును. 239

ఉ. వేయువిధంబులం బొగడు వీణియ మీటినటించుఁ బాడు జే
జేయను నవ్వు నద్భుతముజెందుచు నౌదలయూచుఁ జూచు న
మ్మాయన దల్చి దేవముని మండలి గొల్వఁగనున్నయాదినా
రాయణదేవు మోము దరహాసరసామృత సుప్రసన్నమున్. 240

వ. ఇట్లు తద్దర్శనానంద సుధాసరసితరంగంబుల నోలలాడుచు నభివందన సహస్రంబు లాచరించుచుఁ బ్రాంజలులై బ్రహ్మాది దేవముఖ్యులు దత్తకర్ణావధానులై వినన ద్దేవదేవు నుద్దేశించి. 241

ఉ. మూఢులు నీచవాదముల ముందఱ వెన్కయుఁ దోఁపకున్నదు
ర్గాఢతమోహితాత్ములయి కానరు కానరు, బ్రహ్మయోగవ
త్ప్రౌఢులుశాస్త్ర దృక్కులయి బ్రహ్మమయుం నినుఁగానరన్నచో
వ్రీడయులేదు నాకిఁక ధరిత్రి నినుంగనలేమి నచ్యుతా. 242

ఉ. జాతియు రూపు నామములు సంభవనాశనముల్ సుఖార్తిసం
భూత వికృత్యవస్థలును బొందక యెందును లేక యుంటయున్
నేతృత గల్గియుండుటయు నిత్యత బాయఁగలేక యొప్పు నిన్
జూతు రవిద్యఁ బాసిన విశుద్ధమతుల్ నిరతంబు నచ్యుతా. 243

చ. సమతభజింపనేర్చి విరజస్తములై నిజసాత్వికత్వమున్
శమమునుగల్గి నిత్యమును సత్యమనంతము జ్ఞానమాత్మత
త్వమునని వేదశాస్త్ర విదితంబగు నీవిభు సుప్రసన్నతే
జముఁగని చిత్సుఖామృత రసజ్ఞతఁగాంతురు ధీరులచ్యుతా. 244

సీ. పద్మయు విధియు నీప్రకృతి పంకజరజః
పటలంబునను బ్రుంగి భ్రమసినారు
మృత్యుంజయుండును మితిలేని నీమహా
మాయాతమోరాశి మగ్నుఁడయ్యె

సంయముల్ నీయింద్రజాల దుర్గాటవి
జాడయెఱుంగక జాల్ములైరి
వేదవేత్తలు నీయవిద్యావిహాయసం
గతికి నేమేరయుఁ గానలేరు

తే. మతవివాదులుత్వన్మహా హాతులు నిన్ను
నెఱుఁగువా రెవ్వరో యింక నెఱుఁగవారి
ఘనుఁడు నీభక్తవర్యుఁడొక్కరుఁడు దక్క
తామరసనేత్ర దివ్యతేజో మహాత్మ. 245

{ నారాయణమూర్తి నారదునకు దివ్యదృష్టి దయచేసి శ్వేత ద్వీపమునకుఁ బోవుట. }

చ. అని తనుఁ బ్రస్తుతింపఁగ దయానిధియై నిజదివ్యరూపముం
గనియెడు దివ్యదృష్టి యిడి కంజదళాక్షుఁడు దేవకోటితోఁ
జనియె సుపర్వకామినులు చల్లెడు పువ్వుల సోనతోన యా
మునియును గొల్చిరా భువనమోహన భూ[1]మికి తెల్లదీవికిన్. 246

క. నావిని నారదుఁడిట్లను
భూవర యింతయు నిజంబు భువనము లెఱుఁగన్
గోవింద శర్మసాటి
ద్గోవిందుం డితనిఁబొగడఁ గొలఁదియె మనకున్. 247

మ. హరికిన్ బ్రాణసఖుండు తత్ప్రియపయోజాక్షీమణుల్ వేడ్కతో
వరుసన్ బూజలొనర్చు దైవము జగద్వంద్యుండు వేదాగమాం
తరతత్త్వజ్ఞుఁడు పూజసేయు మితనిన్ ధాత్రీశ యీసంయమీ
శ్వర సాహస్రముపంపున న్మది సరోజాతాక్షుఁగాఁ జూచుచున్. 248

ఆ. ఇతనిఁ బూజసేయుటిందిరా నాథునిఁ
బూజసేసినట్లు బుద్ధిఁదలఁపు
కువలయేశ వినుము గోవిందశర్మచే
నేఁడుధన్యమయ్యె నీగృహంబు. 249

వ. అని పలికిన నమ్మహాముని పలుకు లంగీకరించి సభాసదులగు బ్రహ్మమునుల యనుమతంబున ననేక మణిమయాభరణాదులర్పించి పూజించిన ధర్మనందను నభినందించి జగద్వంద్యుండును జగదేకనాథుండును, జగదేకశరణ్యుండును, జతుర్విధ ముక్తిదాయకుండును, జతుర్వేదవేద్యుండును నిగ్రహానుగ్రహ సమర్థుండును, భక్తవత్సలుండును నగు నీముద్దుమరఁది కృష్ణుండె స్వయంప్రకాశ

1. ప్రా. పా. 'భావికి'

పరబ్రహ్మవస్తు విలసనంబుగాభావించి కృతార్థుండవు గమ్మని బ్రహ్మోపదేశంబుసేసిన, ధర్మనందనుండు, పరమవిజ్ఞానంబుతో నానందరసమయంబగు మనంబున మాయామానుషవేషధారియగు శ్రీకృష్ణుని జగన్మోహన మదనగోపాల శ్రీరాధికా మాధురీలోలలీలారూపంబు పరబ్రహ్మస్వరూపంబై తోఁచిన రోమాంచకంచుకిత దేహుండై మోడ్పుంగేలు దోయితో నిట్లని స్తుతించె. 250

దండకము. జయజయ నవకామ గోపాల
శ్రీరాధికామాధురీలోల లీలా జ
గన్మోహనాకార, కారుణ్యపుణ్యోద
యాధార, దూరీకృతాత్మీయ సద్భక్త
నిస్సార సంసారసంతృష్ణ[1] శ్రీకృష్ణ,
శ్రీదేవకీపుత్ర లోకత్రయానంద
కందంబునందబునై యొప్పుబృందావ
నీ వీధిగోవర్ధనా నింద్రవేదండ
గండస్థలీ నిస్సరద్దానధారాక
ళిందాత్మజాసింధు తీరంబునం దత్త
రంగావళీజాత మందానిలవ్రాత
లోలప్రఫుల్ల ప్రసూనభ్రమద్భృంగ
సంగీతలీలా లసత్పారిజాతావ
నీజాతమూలో జ్వలచ్చారు చింతామ
ణీ వేదికామధ్య సంశోభిత స్వర్ణ
పద్మంబునం బద్మరాగోన్న మత్పాదు
కాగ్రంబునన్నిల్చి వ్యత్యస్త పాదార
విందంబులోడం ద్రిమూర్త్యాత్మకంబైన
ముప్వంకతో మూఁడు వేదంబులు స్నీవ
మై మూఁడులోకంబులం గల్గు మేలెల్ల
నుం జూపులం బుండరీకచ్ఛందంబుల్ వె
దల్ చల్లుచుం బాలసూర్యాది దేహప్ర
భల్ రత్న[2]మంజీరకాంచీలతా ముద్రి
కాకంకణ వ్యక్తముక్తావళీ కాస్తు

1. సంక్లిష్ట 2. మాంజీర.

భ స్వర్ణకర్ణావతంసారవిందద్వయీకుం[1]డ
లస్థూలనాసాగ్ర ముక్తాఫలోద్యత్క
లీలాది నానాపరిష్కారకాంతిచ్ఛ
టాశ్రీలతోమేళవింపంగ రంగత్కి

రీటాగ్ర మాణిక్యకోణంబులన్ సాంద్ర
తేజోమిళచ్చంద్రకంబుల్ చలింపంగ
సొంపారఁగా నౌదలంజుట్టుకొన్నట్టి
మాయూరపింఛంబు క్రొమ్మించు దళ్కుల్ పి

సాళింప సర్వాంగ సంసక్త కాశ్మీర
కర్పూర కస్తూరికాగంధ సారాంగ
రాగంబు సౌరభ్యముల్ గుప్పతిల్లన్ ల
సత్ఫాల భాగంబునం జిత్రజాతార్ధ

చంద్రాస్త్రముంబోని కప్రంపు దిర్ణామ
ముంగ్రాల నొయ్యారమై వన్నెమీఱం బ
దార్వన్నె బంగారు కెంబట్టు కట్టాణి
ముత్యాల ముంగొంగురింగుల్ కటిన్ జౌక

ళింపంగ, సంపెంగలున్ బైఁడిగేదంగు
లున్ మేలిచంగల్వలున్ సజ్జికంబైన
గొజ్జంగులున్ జాజులున్ మున్నుగాఁగల్గు
పూగుత్తులన్ గ్రొత్తవన్నెల్ పచారింపు

చున్ శ్రీతులస్యాయత స్రగ్వితానంబు
తోఁగూడఁ జూడాంఘ్రి పర్యంతసౌందర్య
ధుర్యామరద్రూప మానోల్లసద్వైజ
యంతీవిలాసంబు శోభిల్లనుత్ఫుల్ల

వక్త్రాబ్జమందస్మిత శ్రీసుధాసార
సారస్యముప్పొంగ శృంగార వారాన్ని
ధీ, దేవదేవేంద్ర ముఖ్యామరానీక
సేవ్యంబుభవ్యంబు నవ్యంబుదివ్యంబు

నై యొప్పునీయొప్పు కందర్పసౌందర్య
దర్పంబు గుప్పించి విప్పారు నీదివ్య

1. ప్రా. పా. ఖండ.

తేజోలవం బబ్జమిత్రుండు నీదీప్తి
లేశంబు సప్తార్చి నీమందహాసాంకు
రంబిందు బింబంబుగా భవదభి నవరూప
లావణ్యలీలా సరోహంసినైమె కామ
కేళీరిరంసారతిక్రీడ నీతోడఁ
[1]గూడున్న రాధావధూటీ లలామంబు
రాకాసుధాకార బింబంబునం జంద్రి
కారేఖ రేఖావ నీజంబునం జిన్ని
పూఁదీగె మేఘంబునన్ లేమెఱుంగంబు
జాతంబునం దేఁటి నా మిక్కిలిం జిక్క
నై కోర్కులం దేల నాలింగనప్రేమ
మై వామదోఃకంజ మంసప్రదేశంబు
నం జాచి మేలారు వాలారు కెంజాయ
కుందావికిం జిందులాడంగఁ గ్రీడాప
రోజాత మాడింపుచుం గెంపునింపుల్ప్ర
చారింప నింపారు నీచిన్ని మోవిన్ సు
ధాబిందు నిష్యందముల్ జిందఁగా వేణు
నాళంబు పొందించి కెందమ్మి జోడౌక
చో నీడుగాఁ గూడఁగాఁ బట్టి సద్రత్న
వన్మద్రికాజాల లోలాంశువుల్ మోము
నం దాండవింపంగ లీలాంగుళీపల్ల
వన్యాసవైచిత్రి సద్రంధ్రమార్గంబు
లన్ మంద్రముఖ్య స్వరోదార మానంబు
లన్ హ త్తి సప్తశ్రుతుల్ మేళవింపంగ
నింపారవాయించ నీవేణు నాదంబు
పుట్టించు నుత్కంఠచేఁ గంఠనాదాభి
నందత్ప్రికల్ గోపికల్ పార్శ్వభాగంబు
లంజోకగామక్కువన్ జొక్కుచున్ సోలు
చున్ వ్రాలుచుండంగ నొండొండ నీకేళి
గోపాలకుల్ మించి వాయించు నీపిల్ల

1, ఇచ్చట విసంధి.

గోష్ఠీరుప్ప లేర్పాటు గావించు నాదాను
మోదంబునం గ్రీడమై నాడునాగంబు
నుంబోలె పూర్ణానురాగంబునం జంచ
లత్పించరించోళికా శ్రీవెలర్పంద
లల్ ద్రిప్పుచుఁ దత్ప్రకారంబుఁ దారభ్య
సింపంగ నన్యోన్య చిత్తాభిలాష క్రి
యల్ చెప్పుకొంచుండఁ బశ్చాత్ప్రదేశంబు
నఁ డాసి రోమంథముల్ మాని ప్రేమాను
బంధోత్కటత్కర్ణమై స్వర్ణభూషా వి
శద్బింబికాశ్రుంగ కోణాగ్రమైదివ్య
మాణిక్యపుష్పస్రగాబద్ధమై కామధుగ్ధేను
బృదంబు గానామృతస్యంద మానంద
ముంబొందుచుఁ గ్రోల నుర్వీ మహాశైల
పాషాణ మాణిక్య జాలంబులంజాలు
వాఱంగఁ దాఁ బొడుటల్ దక్కనిక్కంపుఁ
బ్రేమంబునందొట్టి పెన్నీటి సీకైము
దంబంది కాళింది మందానిలాందోళ
నోత్తుంగ రంగత్తరంగైకహస్తంబు
లంద్వాత్పదాం భోజముల్ కౌఁగిలింప న్మృ
గంబుల్ ఖగంబుల్ నిజగ్రాస కాంతున్వి
సర్జించి మోదంబు వైరాగ్య చిత్తాదృ
తశ్రీ వనశ్రీ చలత్పల్లవోష్ఠంబు
నంగోర కోల్లాసహాసంబు భాసిల్లఁ
బూగుత్తి పాలిండ్లపైఁ దత్పరాగోత్త
రీయంబుజాఱఁ భ్రమద్భృంగ దృగ్జాల
కంబుల్ నివాళింపగా, నవనవమణికాంతి
మత్పుష్పకారూఢ లింద్రాదిదిక్పాల
నాళీకనేత్రల్ సురస్త్రీలు గంధర్వ
కాంతామణుల్ నాగకన్యల్ మ
హాసిద్ధ విద్యాధరాబ్జాననల్ దేవవారాంగనల్ వేణు
వీణాంమృదంగాది వాద్యధ్వనుల్ తాళ
మానంబులఁ మ్రోయఁగాఁ దావకీనస్ఫు

రద్వ్యంశ సంపూర్ణ సంగీత జాతస్మరస్ఫీత
చేతో వికారంబులన్ బాడుచున్ మేఘ
పం_క్తిన్ దటిద్వల్లికల్ వ్రాలెఁ జెల్లాడు
చున్నేగగుర్పాటు ప్రాన్పాటు వాటిల్ల
గా నుబ్బునాగుబ్బుగాఁ బుష్కలాంభోద
మామోదవత్పుష్పవృష్టుల్ ప్రవర్షింప
హర్షంబునం బంచభూతంబులుం బొంగ
నాకాశగంగానదీ పంకజాతాక్షి

దానంతరిక్షంబునం జక్షురుత్సాహ
మేపారఁ బ్రత్యక్షమైనిల్చి యందంద
బంగారు కెందమ్మి పుష్పాళ్లపైఁ జల్లఁ
గాఁజల్లనై మెల్లనై గందవుం గొండ
మందా నిలాంకూరముల్ మీఁదఁ బాఱాడ
నల్లాడు పూదండలు న్వేణుదండంబు
నన్ ద్రేలుపూఁగుచ్చులు న్మెచ్చుపుట్టింప
సొంపారు నీయాకృతి శ్రీసముద్దామ
సీమంత సిందూరరంజ త్పదాంభోజ
మందాకినీసన్మరందావగాహను
ల బ్రహ్మయోగీశ్వ రేందిందిరవ్రాత
సంప్రీతి యాదివ్య తేజోమయఖ్యాతి
యాసంతతానందలీలా సుధాంభోధి
సంరంభ కృద్వక్త్ర చంద్రోదయంబామ
హానిత్య సత్యాకృతి శ్రీనయంబాజ
గద్రక్షణోత్ఫుల్ల వేల్లత్కృపాదృష్టి
యావేణుదండ స్ఫుటోష్ఠస్రవన్మాధు
రీవృష్టి యాయావనారంభ మావిభ్ర
మాడంబరం బామహారాజసం బార
సజ్జత్వ మాభవ్య మాయామనుష్యావ
తార క్రియాలీల లాలించినన్ లోన
గిలించిన న్వాంఛితార్థంబుసిద్ధించు నంచుంద
గన్వేద వేదాంత వేదుల్ పరబ్రహ్మ
విద్యావివాదుల్ ఘనుల్ సరసిజ భవరుద్ర

దేవేంద్రముఖ్యుల్ సుఖప్రాప్తికై నీకు
వాక్పుష్ప పూజల్ సమర్పించి నీవే ప
రబ్రహ్మయోగీంద్ర హృద్ధ్యేయచిద్వస్తు
విస్తారమంచుం బ్రశంసింతురంచుఁ శ్రు
తుల్ చెప్పఁగావిందు గోవింద నీకేళి
బృందావనక్రీడ త్రైలోక్యసామ్రాజ్య
లక్ష్మీకళా ప్రాప్తికింజాడ నీవేణు
నాదంబు బ్రహ్మైకనాదంబు నీభద్మ
కందర్ప గోపాలరూపంబు సద్భక్త
హృచ్చంద్రశాలా ప్రదీపంబు నీరూప
లావణ్య లీలావిలాసంబు నీమంద
హాసంబు నీవక్త్రచంద్ర ప్రసాదంబు
నీయాశ్రితాయత్తచిత్త ప్రమోదంబు
నీవేణు విద్యావిశేషంబు గోపాల
నారీమనోహారివేషంబు నీచొప్పు
నీయొప్పు డెందంబులందోఁచు వారే క
దా నీవునే నీవుగానట్లు నాకోరి
కల్ చేరికల్ సేయ లీలావ
నీదేవునింగూర్చి లోకైక సంపత్క
ళా భోగభాగ్యంబులఁ శ్రీశుకబ్రహ్మ
యోగీంద్రు నాత్మం బ్రకాశ ప్రమోదంబు
ప్రేమంబుతోనిల్చి యూహించునంకించుఁ
గావించు నిన్నాత్మభావించు నీవారి
కెవ్వారి కేమేమి నీవీవు, నీవంటి
కారుణ్య దాక్షిణ్య సంపాది నీవంటి
వాత్సల్య సమ్మోది నీవంటి భక్తావ
నాయత్తచిత్తుండు నీవంటి యిష్టార్థ
దానప్రవర్తుండు నీవంటి నిత్యుండు
నీవంటి సంసారతాపత్రయాఖిల
రుగ్దివ్యవైద్యుండు నీవంటివేదాంత
వేద్యుండు నీవంటి మాయాజగన్నాట
కప్రక్రియా సూత్రధారుండు నీవంటి

విశ్వైకదృజ్ఞోన్మహానాకారరేఖా వి
హారుండు, వేదాదిమధ్యాంత పర్యాయ
కాలంబులం గాలముంగాల చక్రక్రి
యాకృన్మహా పూరుషుండున్మహామాయ
యున్ సృష్టియుం నీవనీయింద్ర జాలంబు
విశ్వప్రపంచంబు పంచాస్త్రగోపాల
కృష్ణా నమస్త్రోవు మీ భక్తిము క్తిప్రదా మాధ
వారాధికామాధవా దేవదేవా
నమస్తే నమస్తే నమస్తే నమః. 251

వ. అని సన్నుతించిన నమ్మహాముని మండలమధ్యమంబున నున్న యప్పుండరీ
కాక్షుం డక్షిగోచరంబైన యట్లనయందఱు జయజయధ్వానంబు లొనర్చిరి.
దివిజపుష్పవర్షంబులు గురిసెనతనియందుల భక్తికభినందించి గోవిందశర్మ
వీడ్కొలిపినద్వారకా నగరంబునకుంబోయి శార్ఙ్గపాణియాలింగనాది సంభావ
నలు గైకొనియుండె, నారదాది యోగీంద్రులును, నమ్మహామునీంద్రులును
ధర్మనందను దీవించి యాతనికి గోవిందశర్మ యుపదేశించిన బ్రహ్మోపదే
శంబు తమకతమక యుపదేశించుటగాఁ దలంచి హరిని సంస్మరింపుచుఁ దమ
తమనెలవులకుం బోయిరి. ధర్మపుత్రుండును సహోదరబంధుమిత్ర వ్రాతం
బుతో హరినారాధించుచు సమస్తసామ్రాజ్య లక్ష్మీవిభవంబు లనుభవిం
చుచు సుఖంబుననుండెనని పరీక్షిన్నరేంద్రునకు శుకబ్రహ్మ చెప్పుటయును. 252

మ. నలినో[1]ద్భూతసుతోల్ల సత్కనకవీణా బ్రహ్మనాదామృతో
చ్ఛలవీచీప్రకర ప్రఫుల్లహృదయా జ్ఞాత ప్రవత్సత్కృ పా
కలనాచారు మరందపోషిత మిళత్కౌతూహలభ్రాంతిచే
వలనొప్పం నినుగొల్చి భక్తజనులు వర్ణింత్రు నిన్నెప్పుడున్. 253

స్రగ్విణి. సా[2]మజప్రస్తుతా సన్మునీంద్రార్చితా
హైమపీతాంబరా స్వాంఘ్రి పీతాంబరా
కామలీలాకృతీ కౌస్తుభాలంకృతీ
కోమలాంఘ్ర్యంబుజా కుందదంతప్రభా. 254

---

1. నలినోదయుతనులోల్ల సత్కరుణ. 2. సామగాన ప్రియాజంభభిద్వందితా భీమ
దైత్యాంతకాభేద్య మోక్షప్రదా.

క. వేదాంత తత్త్వనిశ్చయ
వేదిమనోవేద్య మదన శ్రీ విద్యాలీలా
మోదిత రాధాముఖకమ
లోదరతాంబూల రసనసముత్సుక హృదయా. 255

ఇది శ్రీమదన గోపాలచరణకమల సేవాధురీణ సత్కళాపారీణ
కృష్ణభట్టారకపౌత్ర చింతలపూడి కామయప్రభుసుపుత్ర
సుకవివర్యరాధామాధవ యల్లనార్య ప్రణీతంబైన
విష్ణుమాయానాటకంబునందు సర్వంబును
పంచమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



Printed at Ananda Press, Madras.

# తప్పొప్పుల పట్టి.



| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 8 | బల్మేరు | బల్మేఱు. |
| 2 | 10 | నిరూఢింని | నిరూఢిన్ని. |
| ,, | 10 | ప్రభుర్త | ప్రభుర్ద. |
| 5 | 11 | శ్వముజ | శ్వముచ. |
| ,, | 28 | త్థంబని | త్థమ్మని. |
| 6 | 6 | గ్రిణి | గ్రణి. |
| ,, | 14 | చాలంగ | ఁజాలంగ. |
| 7 | 13 | తోజ్వల | తోజ్జ్వల. |
| ,, | 27 | పటలి | పటలిఁ. |
| 9 | 14 | శయత్వము | శయము. |
| 11 | 23 | మంహేంద్ర | మాహేంద్ర. |
| 12 | 6 | గఁగ్ర | గగ్ర. |
| ,, | 27 | దానితన | దానిం దన. |
| 15 | 21 | నాచెవి | ఁగాచెవి |
| 16 | 6 | చిదమలా | ఁజిదమలా. |
| 17 | 22 | క్రమ్మరర్ | క్రమ్మఱర్. |
| ,, | ,, | గతిం | గతిర్. |
| 20 | 27 | క్రియా | ఁగ్రియా. |
| ,, | 29 | నంనుండు | నందనుండు. |
| 21 | 22 | బిరుదర్ | బిఱుఁదర్. |
| 22 | 19 | దక్కుత | దక్కుఁద. |
| 29 | 5 | బంపి | పంపి. |
| ,, | 7 | లివ్విరు | ల్లివ్విరు. |
| ,, | 18 | అనిన | అని నన. |
| 31 | 14 | తములు | తముల. |
| 33 | 11 | మ్మెచ్చ | మ్మెచ్చె. |
| 34 | 27 | కనుబడ | కనఁబడ. |
| 35 | 19 | సపత్ని | సపత్నీ. |

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 36 | 15 | ఇచ్చెత | ఇచ్చెంద. |
| 37 | 2 | త్తుండట | తుండట. |
| 39 | 25 | రత్న | రతన. |
| 43 | 15 | త్రైలోక్య | త్రైలోక్య. |
| 47 | 2 | కరుణా | కరుణ. |
| 55 | 13 | యదె | యది. |
| 56 | 21 | ధ్యానాంత | ధ్యానానంత. |
| ,, | 31 | మహోవ | మహావ. |
| 57 | 6 | లెవ్వీమీరు | లెవ్వీమీను. |
| 60 | 17 | బోలెం | బోలెన్. |
| 62 | 11 | భ్రమసి | బ్రమసి. |
| 63 | 7 | తక్షు | తత్‌క్షు. |
| ,, | 31 | చ్చెయీ | చ్చెనీ. |
| ,, | 23 | బెట్టిరా | పెట్టిరా. |
| 66 | 18 | వెలోక | వేలోక. |
| 72 | 20 | మనసిజ | మనసిజు. |
| 76 | 11 | ధ్యాన | ద్ధ్యాన. |
| 77 | 12 | బోలె | పోలె. |
| 78 | 6 | తేజాం | తేజోం. |
| ,, | 24 | గాచక్ర | గాంజక్ర. |
| 79 | 26 | చుక్కైలా | చుంగ్గైలా. |
| 85 | 7 | పాద | బాద. |
| ,, | 8 | ప్రాభ | బ్రాభ. |
| 87 | 18 | బుట్ట | పుట్ట. |
| 91 | 26 | తుల్సు | సుతుల్. |
| 92 | 16 | భము | భవము. |
| 94 | 2 | కృస్సి | క్రుసి. |
| 95 | 31 | భవ | యబ్జభవ. |
| 96 | 23 | మ | శా. |
| ,, | 27 | మ | శా. |
| 103 | 32 | పాత | బ్రాత. |
| 100 | 16 | జాల | చాల |
| 107 | 14 | రుణా | బుణా. |

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 109 | 9 | ఇట్లు | అట్లు. |
| 112 | 30 | తృప్టి | తృష్టి. |
| 113 | 8 | ధృవుఁ | ధ్రువుఁ. |
| 120 | 1 | నివ్వ | నీయ. |
| 124 | 29 | గత్రయ | గత్రియ. |
| 197 | 27 | జాలక | చాలక. |
| 128 | 5 | శృతి | శ్రుతి. |
| 129 | 18 | మేఘు | మేఖ. |
| 131 | 22 | దలప | దలంప. |
| 132 | 16 | నూరు | నూఱు. |
| ,, | 29 | వేశ్యే | వేశ్యే. |
| 133 | 7 | కొలంకు | కొలంకుకెలంకు. |
| 137 | 40 | క | అ. |
| ,, | 13 | నాథా | నాథ. |
| 139 | 27 | స్తుతి | శ్రుతి. |
| 142 | 5 | స్త్రీలు | స్త్రీలు. |
| 146 | 25 | బుట్టు | పుట్టు. |
| 150 | 10 | మరలు | మరుల. |
| 151 | 15 | పద | పథ. |
| 165 | 27 | కలుసు | కలిసి. |
| 166 | 18 | ఔట్టి | పెట్టి. |
| 167 | 6 | నలిణే | నలినే. |
| 171 | 11 | చేయుట | తోవర్ణించుట. |
| 172 | 8 | భాల | భాల. |
| 174 | 2 | కుల | లయ. |
| 183 | 6 | నిగుడె | నిగిడె. |
| 185 | 29 | హారక | హాక. |
| 189 | 24 | స్తుతి | శ్రుతి. |
| ,, | 29 | నని | నన. |
| 194 | 28 | యెడ | నెడ. |
| 196 | 3 | తనను | తన్ను. |
| ,, | 22 | పొమ్మ | బొమ్మ. |
| 216 | 31 | వాది | వాదిని. |

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 224 | 17 | జనియె | సనియె. |
| 225 | 12 | తార | (దార. |
| 227 | 22 | నిడుము | నిడుమ. |
| ,, | 27 | సలిపి | జలిపి. |
| 230 | 11 | భోజాన | భోజాస. |
| ,, | 12 | దర్శిం | దర్శ్రిం. |
| 233 | 13 | నందబు | నందంబు. |
| ,, | 27 | చ్ఛందం | చ్ఛదం. |
| 235 | 3 | భవ...రూప | దేభవద్రూప. |
| 236 | 12 | బృదంబు | బృందంబు. |
| ,, | 10 | శ్రుంగ | శృంగ. |
| ,, | 26 | నవనవ | నూత్న. |
| 237 | 32 | ఘ...ద్ర | సరోజాతభూరుద్ర. |
| 238 | 28 | వర్తుండు | వృత్తుండు. |